# ఉషఃకిరణాలు

## 19వ శతాబ్ది తెనుగుసాహిత్యచరిత్ర



శ్రీ చింతలపాటి [illegible] సుబ్బా[illegible] గారిచే
[illegible]రింప బడినది.

[1959 - 60లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి
రెండు వేలరూపాయల బహుమతినందుకొన్న గ్రంథము.]

తొలిముద్రణ: వెయ్యిప్రతులు
ఆగష్టు 1960 - శార్వరి శ్రావణపూర్ణిమ



ప్రకాశకులు
ఉత్తమసాహితి
మాణిక్యభవన్ : రామచంద్రపురము
పున్నమ్మతోట, విజయవాడ.

ముద్రణ
విక్టరీప్రెస్, విజయవాడ

వెల : ఆరురూపాయలు

ప్రతులకు
ఆదర్శ గ్రంథమండలి : విజయవాడ

తొలిముద్రణ: వెయ్యి ప్రతులు
ఆగష్టు 1960 - శార్వరి శ్రావణపూర్ణిమ



ప్రకాశకులు
ఉత్తమసాహితి
మాణిక్యభవన్ : రామచంద్రపురము
పున్నమ్మతోట, విజయవాడ.

ముద్రణ
విక్టరీప్రెస్, విజయవాడ

వెల : ఆరురూపాయలు

ప్రతులకు
ఆదర్శ గ్రంథమండలి : విజయవాడ

# కృతజ్ఞత

ఈ గ్రంథము రచించుటలో తోడ్పడిన మిత్రులకు, అనుక్షణము ప్రోత్సహించిన సహధర్మచారిణికి, పూర్తిఅయినపిదప కొన్ని సూచనలు చేసిన పరీక్షకులకు, ఇందు తమవ్యాసభాగములు ప్రకటించుటకు అనుమతియిచ్చిన గ్రంథకర్తకులకు ప్రకాశకులకు, దీనికి నామకరణముచేసిన కేశవపంతుల నరసింహశాస్త్రి గారికి, దీనికి బహుమతియిచ్చి యెన్నికచేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి, గడువులో ముద్రించి అందముగా దిద్దితీర్చిన విక్టరీప్రెస్సువారికి, ఇది ఈవిధముగా రూపొందుటకు ప్రధాన కారకులయిన ఆదర్శగ్రంథమండలి నిర్వాహకులు శ్రీ గద్దెలింగయ్య గారికి, తొలిపలుకు వ్రాసియిచ్చిన ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారికి నాకృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

—గ్రంథకర్త

# తొలిపలుకు

ఏ గ్రంథానికైనా తొలిపలుకు వ్రాయడం రెండు ప్రయోజనాలను ఆశించి. ఒకటి గ్రంథకర్త సాహిత్యరంగంలో నూత్న ప్రవేశంచేసేవాడయితే అతనిని లోకానికి పరిచయంచేయటం. రెండవది...గ్రంథములోని విషయం సర్వజనామోదము పొందవలెననేకోరికతో పాఠకులకు ప్రరోచనం కలిపించటం.

నా యీ పీఠికకు ఈ రెండుప్రయోజనాలూ లేవు. గ్రంథకర్త యండమూరి సత్యనారాయణరావుగారు - కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిన రచయిత. విమర్శకుడుగా వ్యాసరచయితగా ఆంధ్రదేశంలో ఆయనను ఎరుగని అక్షరాస్యుడు లేడు. మరి యీగ్రంథం ఆంధ్రప్రదేశ సాహిత్య పరిషత్తువారు నిర్దేశించిన విషయాన్ని పురస్కరించుకొని వ్రాయబడి సాటిగ్రంథములలో ఉత్తమముగా నిరూపింపబడి బహూకృతమైనది. పాఠకులకు ఈ గ్రంథమును నేడు ప్రరోచన కల్పించుటకు పరిషత్సమ్మానమనే ఈ యొక్క అంశమే చాలును.

అయితే ప్రయోజనము లేని పీఠికను నేను వ్రాయుటకు కారణము - స్నేహానుబోధము.

ఇది పందొమ్మిదవ శతాబ్దియందలి ఆంధ్రసారస్వత చరిత్ర. చరిత్రశబ్దము ఒకప్పుడు పరిమితార్థములోవాడబడింది. ఇటీవలప్రపంచమున దానిని అతివిపులమైన అర్థమున వాడుతున్నారు. తదర్థానుగుణంగా చరిత్రలు వ్రాయవలసివస్తున్నది. పూర్వం దేశచరిత్ర, సారస్వతచరిత్ర, సాంఘికచరిత్ర, మతచరిత్ర మొదలైనవి ఏకజాతినిష్ఠమైనవి వేరువేరుగా ఉండేవి. నిజానికి ఈ భిన్నభిన్నచరిత్రలు

జాతి దేహబంధములో భిన్నభిన్న అవయవములేగాని స్వతంత్ర ములు కావు. వీటికి అన్యోన్యాశ్రయత్వమే కాకుండా కార్యకారణ నిబంధమూ కార్య ప్రతికార్య సంబంధమూ కూడా ఉన్నది. ఒండొంటితో అంత నిబిడముగా అల్లుకొని వున్న యీ యేక దేశము లను పూర్తిగా విడదీయుట పొసగదని గ్రహించి ఇటీవల చరిత్ర కారులు జాతిచరిత్రను అవయవిగా చిత్రిస్తూ దేశచరిత్రాదులకు అంగ ప్రత్యంగభావము కుదురునట్లు పొత్తుకల్పిస్తున్నారు. సమగ్ర మైన అట్టిచరిత్రలు మన సారస్వతంలో ఇంకా వెలువడలేదు. అట్టి దృక్పథముగల చరిత్రకారులుకూడా చాలా కొలదిమంది ఉన్నారు.

ఈ గ్రంథకర్త శ్రీ సత్యనారాయణరావుగారు అట్టి దృక్ప థము అలవచ్చుకొన్నవారగుట మెచ్చుకోదగ్గ విషయము.

మరి ఈయనకు ఆంధ్రమేకాక దేశభాషలలో హిందీ... బెంగాలీ, ఒరియా, అరవం మొదలైన నాలుగైదు ఇతర భాషలు కూడాఅలవడినాయి. ఆయా భాషల పూర్వ సారస్వత పరిణామమును అర్వాచీన సాహిత్య పరిస్థితిని అవగాహన చేసికొని తదపేక్షయా మన సారస్వత పరిస్థితులనూ తులనాత్మకంగా పరీక్షించే అధికారం కూడా లభ్యమైంది. సారస్వతచరిత్ర రచయితకు ఇంతకుమించిన సామాగ్రి యుండదు. ఈ సామాగ్రి సంపదంతా యీ గ్రంథంలో యథావస్థంగా ఎడనెడ వ్యక్తమవుతూ వుంటుంది. ఆయాస్థలములు పాఠకులే గ్రహింపగలరు. మన శాస్త్రగ్రంథములలో పరమత నిరస నము స్వమత స్థాపనము అని ఒక సంప్రదాయమున్నది. అంటే ఒక శాస్త్రకారుడు తన సిద్ధాంతాన్ని చెప్పటానికిముందు ఆ విషయంమీద తనకు పూర్వం ఇతరులు చేసిన సిద్ధాంతాన్ని ఖండి స్తాడు. ఆ ఖండనను సోపపత్తికంగా నిర్వహించిన మీదటనే తన మతాన్ని ప్రతిపాదిస్తాడు. ఈ గ్రంథంలో పెక్కుచోట్ల యీ సంప్ర దాయం అనుసరింపబడ్డది. శ్రీ సత్యనారాయణరావుగారి ఖండనకు

గురియైన సిద్ధాంతములలో నావికూడా కొన్నియున్నవి. నామతము నకుగల ఉపపత్తులను ఇక్కడ పునరుద్ఘాటించి ప్రతివాదము సేయుటకు ఇది అదనుకాదు; నాకు సమ్మతమునుకాదు. అదీకాక అపవాదము లేని సూత్రము, పూర్వపక్షములేని సిద్ధాంతము, భాషా విషయములో ఉండవు.

శ్రీ సత్యనారాయణరావుగారు బాగా కృషిచేసి సంపూర్ణ ఆంధ్రజాతిచరిత్రను వ్రాస్తే చూడవలెనని నాకోరిక; ఇది నెరవేరుగాక...

పింగళి లక్ష్మీకాంతం.

విజయవాడ

12 ఆగష్టు 1960

—(౦)—

# విషయసూచిక

అధ్యాయములు

# 1. ఉపక్రమణిక

కాలప్రవాహమువంటి జీవత్సాహిత్యవికాసము తెనుగుభాష పుట్టినప్పటినుండియును సాగుచున్నది. ఈ కాలమునకు సంవత్సరములు శతాబ్దులు శకములు అవధులు నిర్ణయింపలేవు. ఆదిమధ్యాంతరహితమైన యీ సాహిత్యస్రవంతి ప్రవహించిన తెన్నులనుబట్టి కొండగుర్తులుగా కొన్నికాలావధులను మన మేర్పరచుకొన్నాము. వాని ప్రకారము యుగవిభజనములను శకములను శతాబ్దులను సంవత్సరములను నిర్ణయించుకొన్నాము. అట్లు నిర్ణయించిన శతాబ్దులలో 19 వ శతాబ్ది యొకటి. ఈ శతాబ్దిలో తెనుగువాఙ్మయ పరిశీలనమే యీ గ్రంథ లక్ష్యము.

ఆంధ్రులు పాటించినది శకసంవత్సరము. ఆంధ్రదేశమునకు చెందిన శాలివాహనుని యుగపురుషునిగా గుర్తించి ఆతని శకమునే తెనుగువారు లెక్కించుకొనుచున్నారు. అంతేకాదు, తెనుగువారు అనుసరించునది చాంద్రమానము. తెనుగుసంవత్సరము చాంద్రమానమున చైత్ర శుద్ధ పాడ్యమితో ప్రారంభించి ఫాల్గుణ బహుళ అమావాస్యతో అంతమగుచున్నది. దానితోనే శకవత్సరాదియును. మన శాసనములును, పూర్వగ్రంథములును, ఇతర చారిత్రికాధారములును ఈ శకమునే గుర్తించినవి. తిరిగి ఈ స్వతంత్రభారతిలో విశాలాంధ్ర ప్రదేశ మేర్పడిన పిదప యిదే శకమును యావత్ భారత కాలమానముగా గుర్తించుట ముదావహము.

అయినను మూడు నాలుగు వందల సంవత్సరములపాటు బ్రిటిష్‌వారితో మనకు గల సంపర్కమువలన క్రీస్తుశకమే యీ

కాలపువారికి పరిపాటి అయినది. చరిత్రగ్రంథములన్నియును క్రీస్తు శకమునే సూచించుచున్నవి. భారతీయ చరిత్ర వ్రాసినను తెనుగు దేశచరిత్ర వ్రాసినను క్రీస్తుశకమునే గైకొని ఆ సంవత్సరములలోనే వివిధ చారిత్రకాంశములను వెల్లడించిరి. తెనుగువాఙ్మయచరిత్ర వ్రాయువారును అందందు శాలివాహన శక సంవత్సరముల నుల్లేఖించినను క్రీస్తుశకపు సంవత్సరములలోనే పలువిషయములు చర్చించిరి.

ఆంధ్రవాఙ్మయచరిత్ర వ్రాయుటకు అనేకులు ప్రయత్నించిరి. కాని సమగ్రచరిత్ర రాలేదు. "నవ్యసాహిత్యవీధులు" పీఠికలో కీ. శే. కురుగంటి సీతారామయ్యగారీ విషయమే అన్నారు.

"తెనుగు సారస్వతానికి సమగ్ర సాధికార చరిత్ర లేదు. ఎప్పుడది రచింపబడుతుందో చెప్పలేము. పూర్వవాఙ్మయచరిత్ర రచనానికి సామగ్రి సేకరింపబడివుంది. కొందరు ఏదో తమకు తోచినట్లు చరిత్రను వ్రాయసాహసించారు. అట్లా కొన్నిగ్రంథాలు వెలువడ్డవి. వాఙ్మయచరిత్ర అటుంచి – తెనుగుదేశ చరిత్రగూర్చిన గ్రంథాలే యెక్కువ రాలేదు." ఆంధ్రులచరిత్ర రచనకు అంకురార్పణచేసిన కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు దీనినిగూర్చి వ్రాసినమాటలు.*

"భరతఖండములోని యే దేశచరిత్రమయినను వ్రాయుట సులభసాధ్యమగును గాని యాంధ్రదేశముయొక్క పూర్వచరిత్రమును వ్రాయుట బహు కష్టసాధ్యము. ఈ దేశచరిత్రము వ్రాయుటకు గల సాధనము లత్యల్పములు. అవియు బహుగ్రంథ పరిశోధనము చేసినగాని సులభసాధ్యములు గావు. వ్యయ ప్రయాసంబు లధికంబయి మేధస్సునకుం గలిగెడు బాధ మెండు" అని ఆంధ్రదేశ చరిత్రరచనలోగల కష్టములను పేర్కొని పాశ్చాత్యపండితులు మన దేశచరిత్రలోని సత్యమును వెలికితీయుటలో పడిన శ్రమను శ్లాఘించిరి.

---

* ఆంధ్రుల చరిత్ర – పూర్వభాగము – 7వపుట.

"ఈ పాశ్చాత్యపండితులు చరిత్రములు వ్రాయుటలో మన గ్రంథములలోని లోపములను గనిపెట్టి క్రమక్రమముగా వానిని అబద్ధపువ్రాతలని నిరసించివైచి, శాసనములను, పురాతనపు కట్టడములను, మనదేశమునుగూర్చి యన్యదేశస్థులు వ్రాసియుంచిన వ్రాతలను, ప్రసంగాంతరముగల మన గ్రంథవిషయములను, దీనికి సంబంధించియున్నంతవరకు లోకులచే చెప్పుకొనబడు కథలను నాధారముగాగొని యొకవిధముగా దేశచరిత్రమున కనుకూలము లగు విషయములను వ్రాసిరి. వీనినన్నిటిని దొరతనమువారును పాశ్చాత్య పండితసంఘములవారును బ్రకటించియుండిరి. ఈ గ్రంథములనన్నిటిని సేకరించి దొరతనమువారు తమచే స్థాపించబడిన పుస్తకభాండాగారములయందు బెట్టియున్నారు.

ఇట్లు భాండాగారములలో తెనుగు వాఙ్మయచరిత్రమునకు పనికివచ్చు గ్రంథములు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందును, తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయమునందును అధికముగా నున్నవి."

ఈ గ్రంథముల నుపయోగించుకొని దేశచరిత్రము, వాఙ్మయచరిత్రమును వ్రాయుటకు ప్రయత్నములు జరిగినవి. తొలుత తెనుగువాఙ్మయచరిత్రమే యెవ్వరును వ్రాయుటకు ప్రయత్నింపలేదు. 19 వ శతాబ్దిలో గురుజాడ శ్రీరామమూర్తిగారు కవి జీవితములు ప్రకటించియున్నారు. వారి సమకాలికులయిన కందుకూరి వీరేశలింగముగారు కవుల చరిత్రమును వ్రాసి ముందు, పత్రికాముఖముగాను పిమ్మట పుస్తకరూపములోనూ ప్రకటించియున్నారు. తరువాత 20 శతాబ్దిలోనే కీ. శే. వంగూరి సుబ్బారావుగారు ఆంధ్రవాఙ్మయచరిత్ర వ్రాసిరి. ఇందు చిన్నయసూరికి బూర్వ వాఙ్మయమే వీరు చర్చించిరి. ఈ గ్రంథమునకు వ్రాసిన పీఠికలో కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు వాఙ్మయచరిత్రల అభావమును తెలిపియున్నారు.

"కవుల చరిత్రల ననేకులు మహనీయులు వ్రాసియున్నారు, కాని యవి వాఙ్మయచరిత్రలు కావని నా మనవి. కవులచరిత్రముల వ్రాయుటలో శ్రీ వీరేశలింగముగారు అసాధారణ ప్రజ్ఞులు. వారికి మించినవారు లేరు. వారిగ్రంథములయందు చరిత్రశోధన యనగా ముఖ్యముగా కాలశోధనయు, కాలనిర్ణయము వారి ప్రధానోద్దేశము. ఈ రీతి జాతకములు వ్రాయుట అనివార్యమైనను దానికిని చరిత్ర రచనకును వ్యత్యాస మెక్కువ. చరిత్రకారుని వివిధార్థములలో కాల నిర్ణయము ఒక్కటి. అది సమస్తముకాదు, ప్రధానముకాదు. మఱి యే యంశములు ప్రధానము లనగా, పరిణామముయొక్క ధోరణిని వర్ణించుట, దానియందలి ముఖ్యస్థితులకుండు పరస్పర సంబంధములను విశదీకరించుట, వివిధ దశలను నిర్ణయించు హేతువులను వానినుండి ప్రభవిల్లు ఫలములను వివరించుట ప్రకృత విషయము – అనగా భాషాచరిత్రాదులు – ఏ రీతి సాంఘిక ఆర్థిక రాచకీయాది పరిస్థితులచే నిర్ణీతములో దానిని వ్యక్తపరచుట, ఇవి మొదలైనవి. పురోహితునట్లు జన్మనక్షత్రము నిరూపించిన జాలదు: సంఘము యొక్క అంగములయు, వ్యాపారములయు, తద్వికారములయు కారణముల నారసి, మార్పు లన్నియు సహేతుకములనియు, సహజములనియు నిర్ణయించి వ్యష్టి సమష్టులకు గల సంబంధములను జూపి చరిత్రముయొక్క ఐక్యము ప్రకటించుట చారిత్రికుని కర్తవ్యము."

ఈ సమష్టి భాషాచరిత్ర రచనావిధానమును కన్నడ హిందీ బెంగాలీ భాషావాఙ్మయముల చరిత్రలు రచించిన కొందరు పాశ్చాత్య పండితులు కొంతవరకు అనుసరించినారు. తెనుగులో వంగూరి సుబ్బారావుగారును 'కవిత్వవేది'యును యీ పద్ధతిని తమ గ్రంథరచన చేసినారు. అయినను 19 వ శతాబ్దికి చెందిన వాఙ్మయ ప్రసక్తి యిం దంతగా లేదు. కవులచరిత్రలు వ్రాసిన చాగంటి

శేషయ్యగారు, తమ ఆంధ్ర కవితరంగిణిలో పెక్కురు 19 వ శతాబ్ది కవులజీవితములగూర్చి వ్రాసిరి కాని, వాఙ్మయచరిత్ర యొక్కువగా స్పృశింపలేదు. "ఆంధ్ర రచయితలు" అను పేరున శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు రచించిన గ్రంథములో 1800 – 1900 వరకుగల మధ్యకాలములో జన్మించిన వారి కావ్యముల ప్రసక్తి తెచ్చిరికాని, 1800 కు ముందే జన్మించి ఆంధ్ర భాషా సరస్వతికి అమూల్యాలంకారములర్పించిన అనేక కవులను విడిచివేయుట జరిగినది. ఇటీవల వెలువడిన ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహములోను ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహములోను స్థాలీపులాకముగా తప్ప ఈ 19 వ శతాబ్ది చరిత్రను చర్చించలేదు. ఇంకను అనేకులు వ్రాసిన ఇతర చరిత్రలలో కూడ అంతవరకు శ్రద్ధగా వ్రాసిన వాఙ్మయసూచికలో 19 వ శతాబ్ది వచ్చునప్పటికి అలక్ష్యముగా వదలివేయుట జరిగినది.

దానికికారణము, కొందరిమతమున 19 వ శతాబ్ది మొదటి భాగము మొదటిపాదము దక్షిణాంధ్రయుగములో చేరినట్లును, చివరి పాదము ఆధునికయుగములో చేరినట్లును తెలిపి, మధ్య రెండుపాదములును క్షీణయుగమని, అంధయుగమని పేరుపెట్టుటయే కావచ్చును. అంతేకాదు, ఈ యుగవిభజనచేయుటలో పలువురు పలుమార్గములను అనుసరించిరి. కాని ఆంధ్ర విశ్వవిద్యాలయస్థాపననుండి వాఙ్మయచరిత్రను పోస్టుగ్రాడ్యుయేటుతరగతి విద్యార్థులకు చెప్పునపుడు తెలుగుశాఖవారొక ప్రణాళిక ఏర్పరచుకొన్నారు. అదియే ఆంధ్ర విశ్వకళాపరిషత్తు విద్యార్థులకు పాఠ్యప్రణాళిక అయినది. ఇంచుమించు ఇదే పాఠ్యప్రణాళిక, తెనుగు వాఙ్మయచరిత్ర నేర్చుకొను విద్యార్థులందరికిని నేటిదనుక మద్రాసు ఆంధ్ర ఉస్మానియా వేంకటేశ్వరవిశ్వవిద్యాలయాలలో పఠనీయమైనది. ఇది సవరించుటకుగాని, పునర్విమర్శచేయుటకుగాని ప్రయత్నము జరుగలేదు.

ఈ ప్రణాళికలోని యుగవిభజనప్రకారము శకములుగాని శతాబ్దములుగాని పాటించక కొందరు కవులను యుగపురుషులుగా స్థిరపరచి వారి యుగములుగా పేర్కొన్నారు. ఆవిధముగాచేసిన విభజనలో నన్నయ యుగము, అంతకు పూర్వయుగము, తిక్కన యుగము, ఎఱ్ఱాప్రగడ యుగము, శ్రీనాథ యుగము, శ్రీకృష్ణ దేవరాయల యుగము వచ్చి అక్కడనుండి పద్ధతి మారి వ్యక్తులనుండి సాహిత్య స్వరూపములోనికి ప్రదేశములలోనికి గుణములలోనికి విభజన వచ్చినది. దక్షిణాంధ్రయుగము, క్షీణయుగము, ఆధునికయుగము అని. ఇది క్రమవిరుద్ధమైనపద్ధతి. వ్యక్తులను యుగపురుషులుగా నిర్ణయించుకొన్నప్పుడు అన్నియుగము లకును తగినవారిని ఎన్నుకొనవలసినది. 16 వ శతాబ్దివరకు కొందరు యుగపురుషులు దొరికినపుడు 17, 18, 19, 20 శతాబ్దులలో దొరకకపోరు. పూర్తిగా ఈ యుగకర్తలపద్ధతినయినను అనుసరిం చక ఏదో తమకుతోచినరీతి నీ యుగవిభజనచేసినారు. ఇంతకును ఈ యుగకర్తల నిర్ణేతలయిన కవులున్నకాలము వారు జీవించిన సమ యమునకు ఒకశతాబ్ది పరిధిలో విస్తరింప జేసినారు. అట్లుచేయుటవలన ఆ కవికిగాని, ఆ కాలమునకుగాని సరియైనస్వరూప మిచ్చినట్లుకాదు. యుగకర్తను నిర్ణయించినపుడు ఆతని రచనావిశేషము లా యుగకవు లలో ప్రస్ఫుటముగా నుండవలెను. కాని, అట్టి సమానధర్మము లేవియు మన యుగవిభజనలో కానరావు. నన్నయ యుగములో శైవ కవులయిన నన్నెచోడుని, పాల్కురికి సోమనాథుని చేర్చు టలో ఆ యుగధర్మములు లక్షణములు పూర్తిగా సమీక్షించుట లేదు. అట్లనే శ్రీనాథుని యుగమును. శ్రీనాథ కవిసార్వభౌముడు ప్రారంభించిన మహా కావ్య రచనావిధానము, పోతనార్యుని భాగవత గ్రంథములో గోచరించదు. ఇదే యుగమునకు చెందిన గౌరన, జక్కన, అనంతామాత్యుడు, పినవీరన, దుగ్గన, నందిమల్లయ, ఘంటసింగయ మొదలగు కవులు ఎవరికివారే విభిన్నపథముల ననుస

రించి విభిన్న రచనలుచేసిరి. ఈ భిన్నత్వములో ఎంత ప్రయత్నించి నను ఏకత్వము గోచరింపదు.

1600 వరకు యుగములకు యుగపురుషుల పేరులనిచ్చి యీ విభజనకర్తలు అకస్మాత్తుగా ప్రాదేశిక నామముతో తరువాతి యుగమును పేర్కొన్నారు. 1600 - 1785 వరకు దక్షిణాంధ్ర యుగమని పలికి తంజావూరు మధుర నాయకుల పరిపాలనలో వర్ధిల్లిన వాఙ్మయమును వర్ణించియున్నారు. ఆ కాలములో యక్షగానములు వచనకావ్యములు పదకవితలు కలిపి, త్యాగరాజునుకూడ రఘునాథ రాయలు మున్నగువారితో చేర్చివేసినారు. ఆ సమయములో ఉత్తరాదిని తెనుగువాఙ్మయము రాలేదా ? తీరస్థాంధ్రములో, తెలంగాణములో, రాయలసీమలో ప్రవర్తిల్లిన వాఙ్మయాభివృద్ధి యీ యుగ విభజనకు వెలియైయుండిపోయినది. ఇది దక్షిణాంధ్రయుగ మన్నపుడు 1785 లో తంజావూ రాంధ్రనాయకుల పరిపాలనా సమాప్తితో దీనికి భరతవాక్యము పలికిరి. ఈ యుగలక్షణములుగా వచ్చిన యక్షగానములు, ద్విపదలు, శతకములు, పదములు, వచన కావ్యములు, శ్లేషకావ్యములు దండకములు, తరువాత రాలేదని కాదు. ఇందు ప్రకోపించిన శృంగారాతిశయము అష్టాదశవర్ణన భూయిష్ఠమైన ప్రబంధకావ్య పద్ధతి 1785 తరువాత నిలిచిపోలేదు. ఎందుకో అంతటితో వారి యుగమునకు అడ్డకట్టవేసినారు. అంతటితో ఆగక, దానితరువాత వచ్చిన యుగమును క్షీణయుగమని అంధయుగ మని వర్ణించినారు.

వీరి విభజనలో 1875 వరకున్న మధ్యకాలము క్షీణయుగ మని, తరువాత ఆధునిక యుగమని అన్నారు కాని, నిజమునకు ఆధునిక సారస్వతమునకు ఆరంభము 1800 లోనే జరిగినది. దానిని 1875 వరకు త్రోసి ఆలస్యముచేసి బ్రౌన్, చిన్నయసూరి మున్నగు యుగపురుషులను విడిచిపెట్టనక్కరలేదు. 1785 తరువాత ప్రాదేశిక ప్రాతినిధ్యము పోయి, గుణవిభాగము ప్రారంభమైనది. ఇందు అభివృద్ధి పోయి క్షీణత, కాంతి పోయి అంధకారము యుగవిభ

జనలో అవతరించినవి. పోనీ ఈ గుణత్రయ విభాగయోగముకూడ నిలువక చివరికి వచ్చినపుడు కాలానుక్రమమును ననుకరించి ఆధునిక యుగమైనది. ఆంధ్రులచరిత్ర తెనుగులో వ్రాసిన చిలుకూరి వీర భద్రరావుగారు సులువుగా పూర్వయుగము మధ్యయుగము అర్వా చీనయుగము, ఆధునికయుగము అని విభజించిరి. కవి. చరిత్ర కారుడు (కందుకూరి వీరేశలింగము) పూర్వ మధ్య నవీనయుగము లుగా చరిత్ర వ్రాసెను. అట్లు చేసినను ఈ సంశయములకు తావు లేకుండపోయియుండును. ప్రస్తుతము పరిపాటి అయిన విభజనలో 1875 ఒక హద్దుగాపెట్టి ఆ 1875 తరువాత ఆధునికయుగమని చెప్పి, అందు ప్రాచీన ప్రబంధములు వ్రాసినవారిని పురాణములను అనువాదముచేసిన కవులను ఆధునిక యుగకర్తలయిన వీరేశలిం గము, గురుజాడ అప్పారావు మున్నగువారితో చేర్చి వలుకుట యుగలక్షణములను సమన్వయపరచుట కాదు. ఇట్టి యుగవిభజన ఎంతవరకు వస్తునిబద్ధముగాను, కావ్యగుణపరిశీలనాత్మకముగాను, సమష్టి సాహిత్యచరిత్రరచనచేయుటకు తోడ్పడగలదో నిష్పక్షపాత దృష్టితో సాహిత్య అభిమానులు పరిశీలించవలసియున్నది. అవసర మైనచో ఈ పద్ధతిని మార్చుటకు, యుక్తియుక్తము, హేతువాద భూతము, తర్కనిశ్చితమును అయిన విభజనచేయుటకుసిద్ధపడవలెను. అట్టి విభజనచేయుటలో వ్యక్తిగతాభిమానముకాని, గౌరవప్రతి ష్ఠలు కాని అడ్డురాకూడదు. శాస్త్రీయదృక్పథముతో విజ్ఞాన చక్షు వులతో విషయప్రధానమైన చరిత్రవిభాగములు చేసికొనుటయే మన లక్ష్యము కావలెను.

ఇతరదేశ వాఙ్మయచరిత్రలు పరిశీలించినచో యుగకర్తలుగా కవులనుపేర్కొనక రాజ్యపరిపాలనచేసిన పాలకులను చెప్పి వారినే యుగపురుషులుగాఉదాహరించినట్లుగమనించవచ్చును. షేక్స్పియర్ కాలమునుచెప్పినపుడు ఎలిజబెతురాణి యుగమనియే అన్నారు. అలాగే భారతదేశములో వివిధభాషలలోని వాఙ్మయచరిత్రము చూచిన ఆ యా యుగములలో పరిపాలించిన యుగపాలకులనుగాని,

ఆనాటి యుగధర్మములనుగాని పేర్కొనినట్లు చెప్పవచ్చును. అందుకే సాహిత్యములో కాళిదాసుయుగముకాని, భవభూతియుగము కాని లేవు. సాహిత్యప్రక్రియలనుబట్టి యుగవిభజన జరిగినది. మన తెనుగువాఙ్మయములో అది సాధ్యముకాదు. నన్నయనుండి నారాయణదాసు వరకు ప్రాచీనసాహిత్యస్వరూపములయిన పురాణములు, ప్రబంధములు యక్షగానములు, ద్విపదలు, శతకములు, దండకములు మొదలైనవి నాడును నేడును పలువురు రచించుచున్నారు. ఇట్టి సందర్భములో శతాబ్దులనుబట్టి చేయు విభజనయే అన్నింటికిని వీలయిన పద్ధతి. తెనుగు సాహిత్యచరిత్రలో కవుల కాలనిర్ణయము, జన్మతిథి, జన్మస్థలము, కర్తృత్వము, నామకరణము, మొదలయిన వన్నియును వివాదగ్రస్థ విషయములే. అయినను నేడు చాల వివాదములు తీరిపోయినవి. ఎన్నోవిషయములు నిర్ధారణలయినవి. ఇట్టి సందర్భములో సమష్టి సాహిత్యచరిత్ర రచించునపుడు శతాబ్ది విభజనము ననుసరించుటయే అన్నివిధములుగాను సుకరమును, సులక్షణబద్ధమును అయిన పద్ధతి.

సాహిత్యచరిత్ర వ్రాయునపుడు, విమర్శకుని ప్రత్యేక ద్వేషాభిమానములకు తావులేదు. ఆ యా యుగములలోని సాంఘిక, రాజకీయ ఆర్థిక వ్యవస్థలను విశదపరచి వాటి సమష్టి ప్రభావము సాహిత్యముపై నెట్లు పనిచేసినదో హేతువాదముతో నిరూపించి సూత్రీకరించవలెను. అంతేకాని "నా యుద్దేశములో యీ గ్రంథములు గొప్పవి, ఈ కావ్యములు అధమరకమునకు చెందినవి"అనుటకు వీలు లేదు. చరిత్రలోని విలువలుకట్టుట నిష్పక్షపాతముగా నిరభిమానముగా నిరపేక్షగా జరిగిపోవలెనేగాని వ్యక్తిగతాభిప్రాయములతో ఒకరికి యోగ్యతాపత్రమిచ్చుటకాని యొకరిని నిరసించుటగాని కూడదు. ఇచ్చట విషయనిర్ణయము కావలెను గాని విషయలంపటము కాదు.

మన చరిత్రకారులు వాఙ్మయాచార్యులును ఈ విషయ పరిశీలనలో తమ వ్యక్తిగతాభిప్రాయానుసారముగా విభజనచేసిరి.

ఆ కారణముచేతనే 1800 - 1900 వరకున్న శతాబ్దిలోని వాఙ్మయము కొంతభాగము క్షీణయుగ వాఙ్మయముగా, మరికొంత ఆధునిక వాఙ్మయముగా యీ విమర్శకుల దృష్టికి కనిపించినది. ఏ యుగమున కా యుగములో మంచి చెడ్డలు రెండును చేరి యుండును. స్వర్ణయుగమని చెప్పుకొను కృష్ణదేవరాయల కాలము లోను రఘునాధరాయల కాలములోను వెలువడిన సాహిత్యము నందు సైతము అధమరకము కావ్యములు లేకపోలేదు. అంధయుగ మని చెప్పిన అర్వాచీనకాలమునందును అత్యుత్తమ కావ్యము లుండకపోలేదు. అది మనము పరిశీలించు విధానమునుబట్టి మన దృక్పథమునకుపీలుగా మారుచుండును.

1800 - 1900 వరకు తెనుగులో ప్రవర్తిల్లిన వాఙ్మయ మును పరిశీలించుటలో ముందే యొక అనిష్టత (ప్రెజుడిస్) తో ప్రారంభముచేయక ఏ ద్వేషాభిమానములును లేని నిర్మమతతో పరిశీలించవలెనను ప్రయత్నమే యీ గ్రంథములో భవద్విధేయుడు తలపెట్టినది. ఈ గ్రంథమును చదువు పాఠకులుసైతము ఏ ద్వేషము లేని నిరపేక్షభావముతోడనే యీ చరిత్ర పరిశీలించగలరని మా సంకల్పము.

# 2. అంధయుగమా? సంధియుగమా?

**19** వ శతాబ్ది తెనుగు వాఙ్మయమును వర్ణించువారిలో హెచ్చుమంది ఇది యొక క్షీణయుగమో లేక అంధయుగమనియే నుడివియున్నారు. అంతవరకు తెనుగుసాహిత్యములో తీరుతెన్నులు దిద్దుకొన్న ప్రబంధకావ్యములు, పురాణములు, శతకములు, యక్షగానములు మొదలయినవి ఈ కాలములో పరస్పరప్రతిబింబములుగాను ఉపజ్ఞావిహీనములుగాను భావశూన్యములుగాను ఉన్నవని వీరి అభిప్రాయము. ఈ కాలములో బయలువెడలిన సాహిత్యముతో ఏదియును చిరకాలము నిలుచునదికాదని వీరిభావన. కాలము ఎల్లప్పుడును ఒక్కరీతిగా గడవదు. కొంతసేపు చీకటి, కొంతసేపు వెలుగు; ఈ చీకటివెలుగుల ద్వంద్వము తెనుగుసాహిత్యప్రగతికిని పట్టినది. వాఙ్మయాభివృద్ధి ఒక చక్రమువలె సాగిపోవుచున్నది. ఒక్కొక్కసారి ఈ చక్రము ఒక ఆవర్తముచుట్టి తిరిగి వచ్చినచోటునే తాకును. అనగా పైనున్నవి క్రిందికి క్రిందనున్నవి పైకి పోవుచుండును. తెనుగు సాహిత్యచక్రముగూడ ఇట్లేచేసినది. ఒకప్పుడు ఉన్నతస్థితినందుకొన్న ప్రబంధకావ్యాది రచనములు అధమస్థితికి వచ్చినవి. ఒకప్పుడు అధమతరగతికిచెందిన యక్షగానములు, పదకవితలు, గద్యరచనలు యీ 19వ శతాబ్దిలో మహోన్నతస్థితి నందుకొన్నవి. అయినను ఇదొక అంధయుగమనియే పలువురు వాకుృచ్చిరి.

ఇట్లనుటకు హేతువులు గమనించి ఈ యుగలక్షణములను పరిశీలించుదము. ఆంధ్రకవులచరిత్రలో గణపవరపు వేంకటకవిని గూర్చి వ్రాయుచు వీరేశలింగంగారిట్లు పలికిరి. "ప్రబంధములరచన 17వశతాబ్దిలో నంతరింపగా యీవలివారు వసుచరిత్రమును మాతృకనుగా గొని దానికి పాఠాంతరములో యనునట్లు పూర్వోవర్ణనము

లనే తలలుమార్చి ప్రయోగించుచు వెనుకటి ప్రబంధముల ననుకరించి తమ ప్రబంధముల నల్లజొచ్చిరి. చేసినదానినే పేరులుమార్చి మరల జేయుచుండుటచేత నూతనార్థకల్పనలను చేయుట దుష్కరమయినందున నిటీవలివారిలో గొందరు మహాపురుషు లా యర్థలోపమును పటాటోపముతో బూరింప ప్రయత్నించిరి. పూర్వపు వారక్కడక్కడ సముచితముగా శబ్దాలంకారములను జేర్చుచు వచ్చినను భాషావధూటికి ప్రాణమైన యర్థసారమును చెడగొట్టకుండిరి. ఇటీవలివా రర్థసారస్యము నంతగా బాటింపక నిఘంటువుల వెదకి పదము లేరి కూర్చి బంధించి తమ సరస్వతిని హృదయాకర్షకముగా గాకపోయిననూ కర్ణరంజకముగానైనను జేయ పాటుపడిరి. ఇట్టి వారిలో నెన్నికగన్న కొందరు బంధాదుల నతిమాత్రముగా జేర్చి యర్థసారస్యమును బూర్ణముగా జెఱచి యనయవములు విఱచి తమ భాషావధూటిని విరూపిని జేసి శవప్రాయను జేసిరి.”

ఇట్టి ప్రయత్నముల ఫలితముగానే నిరోష్ఠ్య నిర్వచన అచ్చాంధ్రరచనములు గర్భ చిత్ర బంధ శ్లేష కవితలు మొదలైనవి వచ్చినవి. కొందరు ఏకాక్షర నిఘంటువులను వెదకి ఏకాక్షర కంద పద్యముల వ్రాసిరి. దీనినిగూర్చి ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము వ్రాసిన *కవిత్వవేది భవిషద్వాఙ్మయవిమర్శకు లీశతాబ్దమును నవయుగమని యందు రేమోయని ప్రశ్నించి పందొమ్మిదవ శతాబ్దము ఆంగ్లేయ సారస్వతమున నుత్తమ కావ్యయుగమైనది కావున ఆంధ్ర వాఙ్మయమున ఇరువదవ శతాబ్ద మట్టిది కావచ్చునని వ్రాసిరి.

“ప్రస్తుతపు స్థితి యెట్లున్నను పూర్వశతాబ్దముమాత్రము పాశ్చాత్యనాగరికముచే విభ్రాంతమైపోలేదు. విభ్రాంతముకాకుండ నుండలేదు. అనగా ప్రాచీనాధునాతనభావసంఘర్షణము విశేషించి యున్నది. ప్రాత ప్రబంధకవిత్వము సన్నగిల్లుచుండెను కాని, పూర్తిగ బోలేదు. నవయుగారంభసూచనలు గన్పడినవేగాని పరిణతి

* ఆంధ్రవాఙ్మయసంగ్రహము 248 పుట

కలుగలేదు...... ప్రాతది పోవుచు, నవీనము వచ్చుచున్నయీ యుగమును నవయుగమనుట బొసగదు. ఇది సంధికాలమే."

అంధకారయుగమును సంధికాలమనుటకు తగిన కారణములు వెల్లడించియున్నారు. ఈ కాలములో ప్రాత క్రొత్తల మేలుకలయిక కలిగినది. పాశ్చాత్యప్రభావము సాహిత్యముమీద అన్నివైపులను ప్రసరించినది. ముఖ్యముగా వచనరచనలు - నూతన సాహిత్యప్రక్రియల నుత్పత్తిచేయుట కుపకరించినవి. అంతవరకు తలపెట్టని శాస్త్ర గ్రంథప్రకటన ఈకాలములోనే అధికమైనది. నిఘంటువులు వ్యాకరణములు అలంకారశాస్త్రములు సర్వస్వములు మొదలగు ననేక బృహత్ గ్రంథముల నిర్మాణ మీ కాలముననే ప్రారంభమైనది. ఇదిగాక తెనుగులో ముద్రాక్షరయంత్రము వచ్చుట వివిధప్రాంతాలలో గ్రంథభాండాగారములు స్థాపించుట, అనేకసాహిత్యపత్రికలు ప్రకటించుట గ్రంథప్రచురణసంస్థలు బయలుదేరుట జిల్లామండలసభలుసమావేశమగుట, పాశ్చాత్యవిద్వాంసులు చారిత్రక పరిశోధనలుచేయుట, విశ్వవిద్యాలయములు స్థాపించుట, ఆఙ్గ్లవిద్యాప్రచారము బహుళమగుట యీ యుద్యమములన్నియును తత్కాలీన వాఙ్మయముపై తమ ప్రభావము నంతో యింతో అచ్చుగుద్దుకొన్నవి. ఇవి యన్నియును యీ కాలమునం దుదయించిన ఉషోరేఖలను జ్ఞప్తి కెలయించగా అంతవరకు సాహిత్యకాంతారములో నలముకొన్న సాంద్రతమస్సులను నిబిడీకృతముచేసిన జడశక్తులు లేకపోలేదు. ఈ పరిణామము వర్ణించుచు పింగళి లక్ష్మీకాంతముగా రిట్లు వ్రాసిరి.

*"క్షీణయుగమున (1775-1875) చోళ పాండ్య రాజ్యముల పతనముతో సామ్రాజ్యస్థాపకులైన ఆంధ్రులకు సామంతరాష్ట్రములైనను లేకుండపోయినవి. స్వాతంత్ర్య రహితములు ప్రాచీనైశ్వర్యశూన్యములు అయిన జమీలు మిగిలినవి. జాతి ముఖకళ క్షీణించినది. ఆ క్షీణలక్షణమే కవిత్వమునకు పట్టినది.

---

* ఆంధ్ర సర్వస్వము - 298 పుట.

జాతియొక్క దారిద్ర్య పరాధీనతలే కవితలోని భావదాస్య పరాధీన తలకు కారణమైనవి."...అని వ్రాసి మరొక ముఖ్యవిశేషమును గుర్తించినారు.

"సామంతరాజులకాలమునాటికి రాజులకును కవులకును ఐహికమే ప్రధానమై ఒడలు తెలియని భోగలాలసతయే పరమపురుషార్థముగా పరిణమించినది. ఈ ధర్మభ్రంశము కలిగినరోజులలోనే దేశము పాశ్చాత్యుల పాలయ్యెను, ఆంధ్రులు జీవచ్ఛవములైరి. ఆనాటివారి ప్రబంధములును జీవచ్ఛవములే యయ్యెను. జాతిని పునరుద్ధరించి పూర్వప్రతిష్ఠను నెలకొల్పగల వీరుడు లేనట్లే, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరించి క్రొత్తమార్గమున నడపగల మహాకవి-యుగపురుషుడు - కాదగినవాడు లేకపోయెను. అందరును అస్వతంత్రులే, అందరును అనుకరణీయులే. ఏ కవిలో నూత్నత్వము లేదు. జీవములేదు. ఇదియే యీ యుగమునకు క్షీణయుగమని పేరుతెచ్చిన ప్రబలహేతువు." ...అని అన్నారు.

తరువాత వచ్చిన యుగమును ఆధునికయుగముగా పేర్కొని వీరే మరొక నిర్వచనముచేసినారు. ఇది 1875 - 1900 వరకు.

* "పూర్వయుగములయందువలెనే ఈ యుగమునందును ప్రాచీన లక్షణములుగల సాహిత్యము కొంతయు కేవల నవీన లక్షణములుగల సాహిత్యము కొంతయు కలదు. కాని మొత్తముమీద చూచినచో పూర్వరూపమున నున్న దానికంటె నవ్యరూపముననున్న వాఙ్మయమే యెక్కువని చెప్పవలయును. ఇందుచే దీనిని కాలమును బట్టి ఆధునికయుగమన్నను గుణమునుబట్టి నవ్యయుగ మనదగును."

ఈ యభిప్రాయములనే వారి వాదము ననుసరించినవారు బలపరచి యిట్టి భావములతోనే యీ యుగ సాహిత్యసమాలోచనము చేసినారు. కావ్యప్రక్రియాభేదములనుబట్టి యుగవిభజనము చేసిన దివాకర్ల వేంకటావధానిగారు తమ ఆంధ్రవాఙ్మయచరిత్ర

---

*ఆంధ్రసర్వస్వము 300 పుట.

ములో 19 వ శతాబ్దిలోగడ వచ్చినది యక్షగానయుగమనియు ఆధునికయుగమనియు ఖండకావ్యయుగమనియు భావకవితాయుగ మనియును తెలిపియున్నారు.

19 వ శతాబ్దములో వచ్చిన ఆంధ్రకవితారీతులను రెండు ఖండములుగా విభజించి మొదటిభాగము నీరీతిగా విమర్శించిరి.

*"చివరకు క్రీ. శ. 19 వ శతాబ్దినాటికి ఆంధ్రకవిత రస భావములందు కొఱవడి శబ్దార్థాలంకార ప్రధానమై ఔదాత్యమును కోల్పోవుట సంభవించినది. కవులు పలువురు స్వతంత్రప్రక్రియలకు పూనక, పెద్దన రామరాజభూషణాదుల ప్రబంధముల ననుసరించుటే పరిపాటియైనది. ఈ కారణముచే నాంధ్రసరస్వతి యమకశ్లేషాను ప్రాసాద్యలంకార శృంఖలలో తగుల్కొని సహజ స్వచ్ఛంద సంచా రమునకు దూరము కావలసివచ్చినది. సాహిత్యరంగమున చైత న్యము లోపించి అనుకరణయే ఆధిపత్యము వహించుటచూచి ఆంగ్ల భాషానిష్ణాతులగు పండితులును, యువకులును నూతనమార్గముల నన్వేషించి అనుసరించ ప్రయత్నించిరి."

1857 లో వచ్చిన స్వాతంత్ర్యయుద్ధానంతరము నిద్రాణ మైన భారతజాతి మేల్కొని నూతన చైతన్యము పొందినట్లు పలికి తదనంతరము వచ్చిన వికాసమునే ఆధునికయుగముగా వీరు పరిశీ లించినారు. ఇదే వారు మరొక రీతిగా తెలిపిరి. "గాఢనిద్రనుండి మేల్కొంచిన యాంధ్రజాతి యొక్కసారి తన గతచరిత్రపై దృష్టి సారించినది. కవులు కొందరు మహోన్నతములైన తమ ప్రాచీన సాహిత్య సంప్రదాయములను బునరుద్ధరింపవలెనని దీక్షబూనిరి." అని.

ఇంతకంటె మరింత ఆశాజనకముగా 19వ శతాబ్దిలోని తెనుగు వాఙ్మయమును వీక్షించినవారు ఆచార్య ఖండపల్లి లక్ష్మీరంజనము గారు. 1800 వరకు నున్న తెనుగు సాహిత్యమును ఆంధ్రసాహిత్య చరిత్రసంగ్రహములో సింహావలోకనముచేసి ఈ కావ్యమునకు

*ఆంధ్ర వాఙ్మయచరిత్రము—109 పుట—దివాకర్ల వేంకటావధాని.

భరతవాక్యముగాను తాము వ్రాయబోవు 19 వ శతాబ్ది వాఙ్మయ సమీక్షకు నాందిగాను వారు వ్రాసిన మాటలు—"19 వ శతాబ్ది నుండి ఆంధ్రసాహిత్యము నూతనమైన విశాలరంగమున బహు భంగుల విహరింపజొచ్చినది. దీనికి చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగము, కొమర్రాజు లక్ష్మణరావు, తిరుపతి వేంకటకవులు మొదలగు మహనీయులు నాయకులు." నాటినుండి నేటివరకు వచ్చిన సాహిత్యాభివృద్ధిని రెండవభాగములో నివేదించ సంకల్పించిరి. ఆ గ్రంథము ఇంకను వెలువడినట్లు తోచదు.

ఇదే యుగమును గూర్చి వైతాళికులు అను కావ్యసంచయమునకు పీఠికలో శ్రీ ముద్దుకృష్ణ అంధయుగ మని పేర్కొనెను.

*...తంజావూరు నాయకుల రాజ్యాంతంతో దేశకాలపరిస్థితులు ఇంకొక మార్పు చెందినవి. చితికిపోయిన ఆంధ్రసామ్రాజ్య సౌభాగ్యం చిల్లరప్రభువులపాలైనది. ఏనుగు పాడిగా యీయగలిగిన ప్రభువులు కరువైనా కృతిసమర్పణకు అగ్రహార పారితోషికాన్ని ఆశించే కాంక్ష కవులను వొదలలేదు. ఏ ధనవంతుడు యెటువంటి కృతిని మెచ్చుకుంటాడంటే అటువంటి రచనచేసి వాణిని వాణిజ్యానికి దింపారు, తరువాతి కవులు, అంతేకాదు, మెచ్చి యిచ్చెనా చంద్రలేఖా విలాసము, మెచ్చకపొమ్మనెనా చంద్రలేఖా విలాపము ఇటువంటి హేయకవిత్వానికి కూడా కొందరు లోనయ్యారు. ఇది అంధయుగానికి విశిష్టలక్షణం."

నిజమే—అంధయుగ మనగా గ్రుడ్డియుగము. ఈకాలపు ఆరంభంలో, పూర్వప్రబంధములను గ్రుడ్డిగా ననుకరించి తామాశ్రయించిన ప్రభువుల చిత్తవృత్తి ననుసరించి అనేకార్థ కావ్యములు చిత్రకవిత్వములు ఆశుకవిత్వములు చేసి కవితాకన్యకను కృత్రిమాలంకారములతో ముస్తాబుచేసి విపణివీధిని విక్రయించిన వారున్నారు. గర్భ బంధ చిత్ర కవిత్వములతో సాము గరడీలు చేసినవారును, శతావధానము అష్టావధానము, సహస్రావధానము శత

* వైతాళికులు - 4 వ ముద్రణ 4 వ పుట.

ఘంటకవనముచేసి కవితావధూటి చేత గారడీవిద్యచేయించిన కవులును 19 వ శతాబ్దిలోనే వచ్చినారు. కాని ఇంతమంది కవులు ఇన్ని రకముల కావ్యముల రచించుటలోనే ఒక వైవిధ్యము, ఒక భావ సంపన్నత, ఒక ఏకత సాధించినారని ఒప్పుకొనక తప్పదు. ఆ సాధన సాహిత్యచరిత్రలో ఎట్లు ప్రతిఫలించినదియును పునర్విమర్శచేసి చూచుకొనవలసియున్నది. సమకాలిక సమస్యలు సంఘస్థితిగతులు రాజకీయార్థిక పరిణామములును పర్యావలోకనము చేసి అప్పటి పరిస్థితుల ప్రభావముచేత పరిఢవిల్లిన నాటి వాఙ్మయమును తిరిగి సమీక్షించవలసియున్నది. ఇట్టి పరిశీలనలో ఈ ఫలితములు కలిగించిన కార్యకారణముల నేగాక, వీనినుండి వెలువడిన పర్యవసానమును సైతము సమన్వయముచేయవలసినది. ఆ సమన్వయదృష్టిలో సాపేక్షవిమర్శలు కాక నిరపేక్ష నిరహంకార నిర్వికల్ప సమాలోచనలు రావలయును.

19 వ శతాబ్దము తెనుగుసాహిత్యచరిత్రలో అంధకారమే యైనను ఆ యంధకారమునుండి యుషఃకాంతులుకూడ ఈ శతాబ్దములోనే గోచరించినవనుమాట విస్మరించరాదు. ఈ చీకటిలో వెలుగు గమనించుటయే ఈ గ్రంథలక్ష్యము. అందుకే ఈ గ్రంథమునకు ఉషఃకిరణాలు అనే పేరు పెట్టుట.

ఈ శతాబ్ది చివరిపాదము నిట్టి యుషఃకాలముగా పలువురు సమాలోచనకర్తలు గుర్తించినారు. వైతాళికులలోనే మరొక పేరాలో నవయుగమును వర్ణించుచు ముద్దుకృష్ణగారు – అన్న – మాటలు.

*"సంస్కారి, సంఘాభిమాని, స్వార్థరహిత జీవనుడు అయిన వీరేశలింగంపంతులు లక్షీకరించిన నూతనాదర్శాలు అనే తెలి రేకలు సారస్వత విహాయస ప్రాగ్దిశాముఖాన ఎప్పుడుతోచినవో అప్పటితో అంధయుగం విరిసిపోయింది. భావసంచలనం తీవ్రంగాకలిగించి సంఘానికి నూతన లక్ష్యాలను నిర్దేశించి వీరేశలింగంపంతులు యుగకర్త

* వైతాళికులు - 4వపుట - ముద్దుకృష్ణ.

అయినప్పటికీ సారస్వతచరిత్రలో నవయుగస్థాపనాచార్యులుగా ఎన్న దగినవారు రామమూర్తిపండితుడూ, గురుజాడఅప్పరాయకవిన్నీ."

తరువాత ప్రారంభమైన సాహిత్యవిప్లవమునకు మూలవిరాట్టులయిన యీ ముగ్గురు యుగపురుషులును 19వ శతాబ్దిలో జన్మించి తమ యువకదశలో ఉద్యమనాయకులయినవారే! నేటి సాహిత్యరంగములో నూతన ప్రక్రియలయిన అనేక రచనలకును, భావవిప్లవము తెచ్చిన అనేక మహోన్నత లక్ష్యములకును బీజావాపన జరిగిన దీ శతాబ్దిలోని చివరిభాగమందే. అందుచేత ఈ యుగముపాత సాహిత్య ప్రక్రియలకు ఛాందసములకు చరమగీతిగాను రానున్న మహోదయమునకు మేలుకొలుపుగాను భావించవచ్చును. రంగురంగుల రెక్కలతో రంజింపదలచిన తెనుగుకవిత సీతాకోకచిలుకవలె స్వేచ్ఛగా విహరించుటకు ముందుగా తాను నిర్మించుకొన్న బంధములతో గూడుకట్టుకొని కునుకుదీయుచు గాఢనిద్రలో మునిగిపోయిన విశ్రాంతిసమయమని ఈ సంధికాలమును పరిగణింపవచ్చును. అందుచేత ఈ 19వ శతాబ్ది సాహిత్యమును అంధయుగమనియును క్షీణయుగమనియును వర్ణించుటకంటె సంధియుగమనుట సార్థకము కాగలదు.

అంధానుకరణలతోను, అపహరణములతోను, ఆశుకవిత్వ చమత్కారములతోను, అష్టాదశ వర్ణనలతోనుతృప్తినొందిన ఆ కాలములోని కవితాసరస్వతి ఆస్థానములలో ఆదరించిన ప్రభువుల ఆగ్రహానుగ్రహముల కనుగుణముగా వర్తించినది. ఆ యా కవి పండితుల శక్తిసామర్థ్యములను ప్రదర్శించుటకు కవితాప్రదర్శన మొక పరీక్షాపత్రమైనది. ఆ పరీక్షలోని జయాపజయములు తత్కాల కవులకు జీవనభృతికి కారణమైనవి. అందుచేతనే నాటి కవితా వృక్షలతాదులు నిండుసౌరభమునిచ్చు నిభృత లతాంతాలతో తృప్తినొందక విలక్షణపథములు పట్టి వెఱ్ఱితలలు వేసినవి. అయినను నాటి సాహిత్యము సాధించిన కొన్ని సత్ఫలితములు లేకపోలేదు. ఎవరెన్ని రీతుల విమర్శించినను ఎంద రేవిధముగా నిరసించినను 19వ శతాబ్ది

సారస్వతము కొన్ని అద్భుతవిజయములు సాధించిన విషయము అంగీకరించకతప్పదు.

1. అంతవరకు రాజులు సామంతులుమాత్రము ఆదరించుచు వచ్చిన తెనుగుసాహిత్యము దేశమంతటను వ్యాపించి జమీందారులు ధనవంతులు రసికహృదయులయిన పోషకులఆదరణలో వర్ధిల్లినది. అంతమాత్రముచేత కవి తన స్వేచ్ఛ వదలిపెట్టక ఇష్టమువచ్చిన అభిప్రాయములు తన మనోభీష్టప్రకారము వెల్లడించగలిగెను. నూతన భావములను వెదజల్లెను.

2. పండితవేద్యమైన కవిత సర్వజనహృద్యమై షుభాగౌరవములను చూఱగొన్నది. తాటాకుపత్రములనుండి భూర్జపత్రములకు కాగితములకు వ్యాపించినది. ముద్రణాయంత్రసౌకర్యమున అనేక గ్రంథములు అసంఖ్యాకముగా వెలువడినవి. హెచ్చు జనులు చదువుటకు వీలయినది.

3. సంస్కృతమునందు గల గౌరవముతోపాటు తెనుగు గ్రంథములమీాద అభిమానము ప్రబలినది. మెకంజీ, బ్రౌన్‌వంటి పాశ్చాత్యపండితుల కృషివలన ప్రాచీనగ్రంథములనేకములు సేకరించి భద్రపరచుట జరిగినది. అంతవరకు వెలుగుచూడని పురాణములు, కావ్యములు తొలిసారి వెలుగులోనికి వచ్చినవి. గ్రంథాలయములలో సర్వజనసులభముగా అందుబాటులోకి వచ్చినవి.

4. అకారాదిక్రమములో నిఘంటువులు, వ్యాకరణములు అలంకారశాస్త్రములు మొదలైన గ్రంథములు ప్రకటించుట ప్రారంభమై, తొలిసారి తెనుగుసాహిత్యకులదృష్టిని నిర్మాణకార్యక్రమమువైపు మరలించినది.

5. కావ్యములలో దక్షిణాపథమునంతను ఏకపరచు ఒక ప్రామాణికభాష వాడుకలోనికి వచ్చినది. అది కావ్యభాషగాను వ్యావహారికభాషగాను కూడ, ఒకేనది రెండుపాయలుగా చీలినట్లు, ప్రవహించి తెనుగుసాహిత్యక్షేత్రమును సస్యశ్యామలము చేసినది.

విశాలాంధ్రదేశము ఒక్కకంఠముతో మృదుమధురముగా పలికిన కలవాణి తెనుగుసాహిత్యమైనది.

6. దక్షిణాపథమున ఇటు ఉత్కళరాష్ట్రమునుండి అటు కన్యాకుమారివరకు "ఏ దేశ మేగినా ఎందు కాలిడినా పొగడరా నీ భూమి భారతిని" అన్నట్లు తెనుగుభాషలోనే ఎక్కడెక్కడి వారును కావ్యరచన గావించిరి. ఇందు ఉత్కళులు, ఉరుదూకవులు, కన్నడులు, తమిళులు, ఆంగ్లేయులు, ఉత్తరాదివారు దక్షిణాదివారు తీరస్థాంధ్రులు రాయలసీమవారు, తెలంగాణావారు ఇట్లు అన్ని ప్రాంతాలవారును ఉన్నారు. కావ్యక్షేత్రములో ఏకలక్ష్యము, ఏక సమన్వయము సిద్ధించి విశాలాంధ్రపౌరులను ఒక్కదృష్టితో చూచునట్లుగా చేసిన దీ యుగమే.

7. వివిధమతముల ఆదర్శముల ప్రభావము వాని సమన్వయమును సాహిత్యములోనే సిద్ధించినది. సాహిత్య మొక ప్రత్యేక సంస్థగా వర్ధిల్లినది కాని, ఆ యా మతవైషమ్యాలకు తావీయలేదు. ఆ యా మతధర్మాలలోని నిగ్గును సంతరించుకొని ఒక నూత్నశైలిని ఒక నూతన భావాభివ్యక్తిని తన జాతీయములో, తన పలుకుబడిలో తన పదసామాగ్రిలో సేకరించుకొన్నది కాని ఆ యా మతముల ప్రచారములకు సాధన కాలేదు. ఏ మతమును ద్వేషించక విశాల దృష్టితో అన్ని మతధర్మములసారమును తన ఆధ్యాత్మికదృష్టితో లీనము చేసికొన్నది.

8, తొలిసారి భాషనుగూర్చి భాషాచరిత్రనుగూర్చి పరిశోధనలు ప్రారంభమైనవి. బిషప్ కాల్డువెల్, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను మొదలయిన పండితులు దారిచూపగా టి. వి. శేషగిరిశాస్త్రి, వీరేశలింగం, వేంకటరాయశాస్త్రి, శ్రీనివాసయ్యంగారు, గిడుగు రామమూర్తి, గురుజాడ అప్పారావు మొదలయినవారు భాషలో కొత్త ప్రయోగములుచేసిరి. భాషాపరిశోధనలుచేసి ఇరుగుపొరుగు భాషలతో తెనుగునకుగల సంబంధ బాంధవ్యములు తెలిసికొనిరి.

9. మరి ఏ భాషలోను లేని సంగీతరచనలు తెనుగు భాషను పరిపుష్టముచేసిన దీ యుగములోనే. సంగీతసాహిత్యములో యక్షగానములతో, పదకవితలతో ఈ యుగము స్వర్ణయుగమైనది. తెనుగుదేశమునకేగాక కర్ణాటకసంగీతమునకే చిరత్నరత్నము లనదగిన అమూల్యకృతులు రచించిన వాగ్గేయకారు లీ కాలములోనే వర్ధిల్లిరి. కర్ణాటకసంగీత మహాకావ్యజగత్తులో త్రిమూర్తులనదగిన త్యాగరాజు, దీక్షితులు, శ్యామశాస్త్రియేగాక, స్వాతితిరునాళ్, ఉపనిషద్ యోగి, సుబ్బరాయశాస్త్రి, సుబ్రహ్మణ్య అయ్యర్, పల్లవి గోపాలయ్యరు, మేరటూరు వేంకటరామశాస్త్రి, చెంగల్వ రాయశాస్త్రి మున్నగు పదకర్తలును, యక్షగాన కావ్యకర్తలును ఈ యుగములోనే తమ విశిష్ట గేయరచనలతో తెనుగుసాహిత్య సరస్వతికి అమూల్య భూషణలు కైసేసినారు.

10. తెనుగుసాహిత్యములో ఏకాలములోనూ లేని చైత న్యము గద్యరచనా వాఙ్మయములో వచ్చిన దీ యుగములోనే. గద్యరచన కిది ఘనసన్మానముచేసి శతాధిక గ్రంథప్రచురణకు అవ కాశమిచ్చినది. సమాసభూయిష్ఠమైన యమకచమకములతో కూడిన శైలినుండి తేటతెల్లముగా సామాన్యులకు తెలియు జాను తెనుగు రచన వచ్చుట కీ కాలమే పునాది వేసినది.

11. శాస్త్రగ్రంథములను తెనుగులో అనువాదముచేసి పద్యగద్యరచనలలో ప్రకటించవలెనను జిజ్ఞాస ప్రబలి అది కార్య రూపము దాల్చినది. ఈ శాస్త్రగ్రంథములు సంస్కృతమునుండియే కాక ఆంగ్లము, కన్నడము, తమిళము మొదలగు భాషలనుండి కూడ వచ్చినవి. శాస్త్రవిజ్ఞానము వైపు తొలిసారి పాఠకుల దృష్టి మరల్చినకాల మిదియే.

12. విద్యావిధానము సంస్కరించి వీధిబడులనుండి విశ్వ విద్యాలయము వరకు తెనుగుభాషాభ్యసనమునకు గొప్పప్రాధా న్యము నొసంగిన సందర్భములో అనేక పాఠ్యపుస్తకములు కావలసి వచ్చినవి. ఈ పాఠ్యపుస్తకములలో తొలిసారి తెలుగువాచకములు,

బాలశిక్షలు, కథలు, గాథలు విజ్ఞానశాస్త్రములు మొదలయినవి వెలువడినవి. తరగతులవారీగా క్రమవికాసమును పొందిన భాషా పద్ధతిలో గ్రంథరచన సాగినది.

13. పాశ్చాత్యప్రభావమువలన అనేక సాహిత్యప్రక్రియలు తెనుగులో తొలిసారి ప్రవేశపెట్టబడినవి. వానిలో నవలలు, కథానికలు, వ్యాసములు, వ్యాఖ్యలు, నూతనవిమర్శలు పేర్కొనదగినవి. ఈ క్రొత్తప్రక్రియలే రానురాను వింతవింత రీతులలో వికసించి ఆధునికాంధ్రవాఙ్మయమును పరిపుష్టముచేసి బహువిధముల అభివృద్ధిగావించుటకు కారణమైనవి.

14. తెనుగుభాషనుండి యితరభాషలకు, ఇతర దేశీయ భాషలనుండి తెనుగులోకి అనువాదములు చేయుట ఈ కాలములోనే అధికమైనది. ఈవిధమైన ఆదానప్రదానములవలన తెనుగు భాష ఇరుగుపొరుగుభాషలతో సామరస్యము సాన్నిహిత్యము కలుపుకొని సంబంధబాంధవ్యములను పెంచుకొన్నది. ఏ భాషయెడలను ద్వేషముచూపక విశాలదృష్టితో అన్ని భాషల పదజాలమును తెనుగు గైకొని తన పదకోశమును విరివిచేసికొన్నది.

15. ఆంధ్రసాహిత్యములో అధిక ప్రాధాన్యము వహించిన నాటక రచనము, ప్రదర్శనమును ఈ యుగములోనే వృద్ధిపొందినవి. అటు పద్యకావ్యములును, ఇటు గద్యకావ్యములును కలిపి వీటి యుభయ మైత్రితో ఒక నూతన కావ్యసృష్టి నాటకరూపముగా ప్రారంభమైనది. దీనికి సంస్కృతాంగ్ల నాటకములతోపాటు పార్సీనాటకముల ప్రదర్శనకూడ తెనుగువారిపై పనిచేసి గద్యపద్యాత్మకమైన ఒక నూతన నాటకసృష్టికి దోహదము చేసినవి. 1గ వ శతాబ్దిలో యూరపులో మహోన్నతశిఖరాలందుకొన్న గ్రాండ్ ఓపెరా అనే సంగీతనాటకములను జ్ఞప్తికిచేయు ఈ పద్యనాటకములు తెనుగువారి ప్రత్యేకత. ఇటువంటివి ఏ భాషలోను లేవు. ఈ విశిష్టలక్షణముకూడ 19 వ శతాబ్ది ప్రభవించిన మహోన్నత భావమే.

ఈవిధముగా 19వ శతాబ్ది సాధించిన ఉత్తమలక్ష్యాలను ఎన్నైనను పేర్కొనవచ్చును. అంధయుగమని, క్షీణయుగమని విమర్శించు చరిత్రకారులదృష్టిలో ఈ యుత్తమలక్షణములు కనిపించలేదని కాదు; కనిపించినను వానికి తగిన ప్రాధాన్యమిచ్చి యుగలక్షణ సమన్వయముచేయుటకు వారెవ్వరును ప్రయత్నించేయలేదు.

ఇదియే మరొకసారి మననము చేసికొన్నచో ఈ యుగమున అత్యధికసంఖ్యగల గ్రంథములువచ్చినవి. సంఖ్యాధిక్యమేకాక విషయ వైవిధ్యములోకూడ ఈ శతాబ్దిదే పైచేయి. కవులు రచయితలు— ఇంత ఎక్కువమంది మ్మ యే శతాబ్దిలోనూ రాలేదు. గుణదోష విచారణ చేయునపుడు ఎన్నో అంశములు గమనించవలసియుండును. అనుస్యూతముగా వచ్చు భావములతో ద్వేషాభిమానములతో కొందరి నిశ్చితాభిప్రాయములనే నమ్మి వానినే అనుసరించక ఎవరి యింగితమునకు తోచినట్లు వారు పునర్విమర్శ చేసికొనవచ్చును. ఈ కాలములో వచ్చిన కవుల కాలముగూర్చి గాని, కర్తృత్వము గూర్చి గాని జాతకములగూర్చి గాని ఏవిధమైన వివాదములకును తావులేదు. స్థానిక చరిత్రలు లభ్యమగుచున్నవి. ఈ కవులగూర్చి చెప్పిన గ్రంథములున్నవి, లేఖలున్నవి, పీఠికలున్నవి, యాత్రా చరిత్రలున్నవి. అనేక చారిత్రకాధారములున్నవి. జన్మతిథుల జాతకముల చర్చకాక నిజమైన సాహిత్యసింహావలోకనము చేయుటకు వలసినన్ని అనువులన్నియును కలవు. అందుచేత సమగ్రమైన సాధికారమైన వాఙ్మయచరిత్ర వెలువడుటకు ప్రతిబంధకము లేవియును లేవు. అది ఈ యుగవిశేషము.

ఇన్ని లక్షణములు గల ఈ యుగచరిత్రలో వెలువడిన సాహిత్యరూపము లనేకములు. ముందు ముందు అధ్యాయములలో ఆ యా సాహిత్య ప్రక్రియల సలక్షణ సమాలోచనచేయునపుడు వీనినన్నిటిని వివరముగా పేర్కొనగలము. ప్రస్తుత మీ లక్షణము లన్నింటికిని అంతరార్థముగానున్న కొన్ని విశేషములను గమనించినచో ఈ శతాబ్ది అంతగా శాపనార్థములకు గురికావలసిన అవస

రము లేదని గుర్తించవచ్చును. ప్రబంధముల పదబంధములలో బందీకృతమైన కావ్యసరస్వతి క్రమక్రమముగా శృంఖలవిముక్తి పొంది స్వేచ్ఛావాయులు పీల్చిన దీ కాలములోనే. అందుచేత 19వశతాబ్ది వాఙ్మయదశ తెనుగుసాహిత్యచరిత్రలో ఒక నూతన యుగమును ప్రారంభముచేసిన సంధికాలము. రానున్న మహోదయమునకు వైతాళికగీతులు పాడిన ఉషఃకాలము.

రము లేదని గుర్తించవచ్చును. ప్రబంధముల పదబంధములలో బందీకృతమైన కావ్యసరస్వతి క్రమక్రమముగా శృంఖలవిముక్తి పొంది స్వేచ్ఛావాయులు పీల్చిన దీ కాలములోనే. అందుచేత 19వశతాబ్ది వాఙ్మయదశ తెనుగుసాహిత్యచరిత్రలో ఒక నూతన యుగమును ప్రారంభము చేసిన సంధికాలము. రానున్న మహోదయమునకు వైతాళికగీతులు పాడిన ఉషఃకాలము.

రామాయణ రచన - భాస్కరరామాయణాదులకంటె విశేషమేమి? పరవస్తు చిన్నయసూరి - రచనా కౌశలము - నీతిచంద్రిక - బాల వ్యాకరణము.

అద్యతన యుగము - ప్రజాస్వామ్యమున విద్యాసక్తి-ఆంగ్ల విద్యాప్రాబల్యమున నాంధ్రవాఙ్మయమునందు గలిగిన విశేష విషయములు.

సర్వతోముఖ ప్రసారము, వివిధవిషయములందు ప్రాచీనాధు నాతన వాఙ్మయములకుగల భేదము—

ప్రాచీన వాఙ్మయమున రూపకములు మృగ్యములు. తన్ని మిత్తములు— ఉత్తమకోశములు. విమర్శగ్రంథములు—

చరిత్రములు - శాస్త్రములు—

నవలలు - నాటకములు - ప్రహసనములు—

భావికవిత్వము, గ్రంథమండలులు, గ్రంథాలయములు, పత్రికలు, కథలు, ఉపన్యాసములు వ్యాసములు మొదలైనవి.

వీరేశలింగంపంతులు - వివిధాంధ్ర గ్రంథరచన—

గద్య కవితా మార్గదర్శకత్వము.

తిరుపతి వేంకటేశ్వరకవులు - శతఘంటకవనము - శ్రవణా నందము.

[ ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు చెదింన యమ్. ఏ. డిగ్రీకోర్సులో తెనుగు సాహిత్యచరిత్రకు చెందిన పాఠ్యవిభాగము ]

# 3. చరిత్ర, రాజనీతి, సాంఘికస్థితిగతులు

సాహిత్యము సమకాలికజీవితమును ప్రతిఫలింపజేయు అద్దము వంటిదని యందురు. సాహిత్య సమాలోచనముచేయునపుడు, సమకాలికచరిత్రను పరిశీలించుట సమంజసము. 1800 నుండి 1900వరకు గల నూరుసంవత్సరములలో ప్రపంచచరిత్ర, భారతదేశచరిత్ర, ఆంధ్ర దేశచరిత్ర ఎంతగానో మారిపోయినది. ఈ మార్పులఫలితములు సాహిత్యములో అనేకవిధములుగా ప్రతిబింబించకపోలేదు. చరిత్రలో రాజకీయముగా ఎన్నో విప్లవములు వచ్చినవి. ఆ రాజకీయమైన సంఘర్షణల ఫలితములు సంఘమునందును సమకాలీన సమాజజీవనమునందును తమ ప్రభావమును చూపినవి. రాజకీయమైన మార్పులకు తోడు, ఆర్థికముగా ప్రజల జీవనవ్యవస్థ మారినది. భారతదేశములో ఆర్థికజీవనమంతయును వ్యవసాయముపైననే ఆధారపడియున్నను, ఈ శతాబ్దములో కొంతవరకు పారిశ్రామికాభివృద్ధి పొడసూపినది. రైల్వేరహదారులు, తపాలా, తంతి సౌకర్యములు మున్నగువాని సదుపాయములవలన ఆర్థికవ్యవస్థ మార్పుచెందుచు వచ్చినది. అదేవిధముగా విద్యావిధానములో, బోధనాభ్యసనపద్ధతులలో అనేకమగు మార్పులువచ్చినవి; అవికూడ కొంతవరకు మన ప్రజల ఆలోచనలను, భావనావైఖరిని మార్పుచేసినవి.

ఈ శతాబ్దిలో మరొక విశేషము శాస్త్రీయవిజ్ఞానదృష్టి. మానవుడు ప్రకృతిని తనవశముచేసికొనుటకు ప్రారంభించిన పరిశోధనలలో అనేకము ఫలించినవి ఒక్కొక్క నూతన పరిశోధనతో ప్రజల నిత్యజీవనమున కుపకరించు ఒక్కొక్క నూతన సౌకర్యము లభించినది. దీనితో మానవునిదృక్పథమే మారిపోయినది. ఏది

చూచినను హేతువాదముతో తర్కించి అందలి సత్యాసత్యములను ఋజువుచేసికొన్నతరువాతగాని ఏవిషయమును నమ్మకూడదను సిద్ధాంతములోనికి మానవునిబుద్ధి క్రమక్రమముగా వికసించినది. దీనితో కొన్ని ప్రాచీన సంప్రదాయములయెడలగల విశ్వాసములు, నమ్మకములును సడలిపోయినవి. ప్రజలజీవితముపైన ప్రబలశక్తిగా పనిచేసిన మతము, ధార్మికచింత ఎన్నో రాటుపోటులకు గురియైనది. అనేక మతప్రచారకుల అభిప్రాయములు, ఉపదేశములును ప్రజల ఆధ్యాత్మికచింతనపైన పనిచేసినవి. క్రైస్తవమతము, బ్రహ్మసమాజము, దివ్యజ్ఞానసమాజము ఆర్యసమాజము, మున్నగు అనేక మతముల ప్రవర్తకులు యథేచ్ఛగా తమతమ మతములలోని విశేషముల గూర్చి ప్రచారముచేయుటకు ప్రారంభించిరి. కొందరు ఈ ప్రచారములకు ఆకర్షణముపొంది మతము మార్చుకొనిరి. ఇట్టి మతప్రబోధమునకు, ఆ యా సిద్ధాంతముల ప్రచారమునకు సాహిత్యము శక్తివంతమైన సాధనగా నుపకరించినది. పరిపాలనావిధానము కుంపిణీకాలమునుండి, విక్టోరియా మహారాణికాలమువరకు భారతదేశములో చాల మార్పులను పొందినది. 1857 లో జరిగిన భారత స్వాతంత్ర్యసమరము (సిపాయీల కలహమని కొంద రందురు) యొక్క ప్రభావము ఆనాటి పాలకులలోను, పాలితులయందును పనిచేసినది. పరరాజుల పరిపాలనలో ప్రజల కెట్టి స్వాతంత్ర్యముండవలయును? ప్రజల శాంతి భద్రతలకు ఎవరు బాధ్యులు? మతవిశ్వాసములయెడల, ఆచార సంప్రదాయములయెడల ప్రజలు అనుసరించు పరిపాటిని అడ్డగించుటకు పరిపాలకులకు ఎంతవరకు అధికారమున్నది? ఇటువంటి ప్రశ్నలు అనేకములు వచ్చినవి. ఇవియన్నియును చాకచక్యముగా పరిష్కారముచేయుటచేత ఆనాటి పాలకులకు కొంత శాంతి ఏర్పడినది. ప్రజలకును కొంత భద్రత యేర్పడినది. ఈ పరిపాలనలో వచ్చిన ప్రముఖులు జమీందారులు, జాగీరుదారులు, చిన్న సంస్థానాధిపతులు మున్నగు సామంతులు. వీరికి కొంత హోదాతోపాటు, ధనము, అధికారము, ప్రాభవము ప్రాప్తిం

చుటచేత ఆనాటి లలితకళలపోషణకు ఈ వర్గము సహాయము చేయుచువచ్చిరి.

ఈ యంశములన్నియును పరిశీలించుటయే ఈ అధ్యాయము ముఖ్యోద్దేశము. మన దేశచరిత్రను పరిశీలించినచో 1800నాటికి బ్రిటిషుప్రభుత్వ ప్రాబల్యము క్రమక్రమముగా వ్యాపింపజొచ్చినది. బ్రిటిషువారు నైజాముతో ఒడంబడికచేసికొని, నైజాము సేనలలోని ఫ్రెంచిసేనల తొలగించిరి. నైజామునకు అంతర్జాతీయసంధులు చేసికొను హక్కు లేకుండచేసిరి. నైజాము సేనల సహాయముతో నాలుగవ మైసూరుయుద్ధముజరిగినది. 1799లో లోకోత్తరపురుషుడైన టిప్పుసుల్తాను మరణించెను. బ్రిటిష్‌వారు 1800లో మైసూరుప్రవేశించునప్పటికి సస్యశ్యామలమైన సుక్షేత్రములు ఎదురైనవి. టిప్పుసుల్తాను కుమారులను ఇద్దరిని వేలూరుకోటలో బంధించిరి. కోయంబత్తూరు కనరావాయనాడు ప్రాంతాలను ఇంగ్లీషువారు వశపరచుకొని, హైదరాబాదును అనుసరించియున్న ప్రదేశములను నైజాముప్రభువుకిచ్చివేసిరి. కాని అతనిపాలనలోఅవిచాలకాలం నిలువలేదు. నైజాము రక్షణకగుసైన్యములను భరించవలసిన బాధ్యత ఆతనిపైనుండెను. ఆ బాధ్యత అతడు రెండుసంవత్సరములవరకు తీర్చలేకపోయెను. అందుచేత 1800లోఆతడొక సంధిచేసికొనెను. ఆ సంధిప్రకారము తానీయవలసిన సైనికవ్యయమునిమిత్తము రాయలసీమజిల్లాలయిన బళ్ళారి, అనంతపురము, కడప, కర్నూలుతిరిగి బ్రిటిష్‌వారివశముచేసెను. అది మొదలు రాయలసీమ బ్రిటిషుపరిపాలనలోనికి వచ్చినది. వారికి సహాయకసేన పోషించునెపముతో నైజాము దత్తముఇచ్చిన జిల్లాలగుటచేత వీనికి "దత్తమండలములు" అని పేరువచ్చినది. వీనినే నేడు మనము రాయలసీమ యనుచున్నాము. మిగిలిన మైసూరు భాగమునకు ఒకరిని అధిపతిగా నియమించి, కుంపిణీవారురాజ్యమేలిరి.

ఇంతలో వేలూరులో 300మంది సిపాయీలు 1806లో తిరుగుబాటుచేసిరి. దీనికి ముఖ్యకారణము ఆనాటి సిపాయీలకు బలవంతముగా మతముమార్పించి క్రైస్తవమత మిప్పించుచున్నారను

కింవదంతి. ఆ సిపాయీలలో ఎక్కువమంది తురకలు. దానికితోడు, వేలూరులో నిర్బంధ మనుభవించుచున్న టిప్పుసుల్తానుకుమారు లీ విప్లవకారులను బాగుగా ప్రోత్సహించిరి. ఆకారణముచేత, సిపాయీలు తిరుగుబాటుచేసి, అక్కడ ఉన్న తెల్లదొరలను చంపి, వేలూరుకోటమీద మైసూరుజెండా ఎగురవేసిరి. బ్రిటిషుసైనికులు వచ్చి, వీరిని పట్టుకొని కొందరిని ఉరిదీసి, కొందరిని నిర్బంధములో పెట్టిరి. బందీలయిన టిప్పుసుల్తానుకుమారులను కలకత్తా తీసికొనిపోయిరి. ఆకాలములో కలకత్తాకు సమీపముగానున్న సీరామ్‌పూర్ అనుచోట కేరీ, వార్డు, మార్షమన్ అను క్రైస్తవమతప్రచారకులు అచ్చుకూటముపెట్టి, దేశభాషలలో అనేక గ్రంథములను ప్రకటించుచుండిరి. వారే పత్రికలుపెట్టి ప్రబోధముచేయుచుండిరి. ఈ కార్యము తమ మతధర్మములతో జోక్యముకలుగజేసినట్లు, ఆకాలపు సిపాయీలు భావించిరి. అందుచేత ఈ మిషనరీలచర్యలను నిలిపివేసిరి.

1812లో మద్రాసులో మరొక చిన్న తిరుగుబాటు సిపాయీలు జరిపినను, మింటోప్రభువు చాకచక్యమువలన నిలిచిపోయినది. ఆకాలములో కుంపిణీవారికితప్ప మనదేశముతో ఎవ్వరును వ్యాపారము జరుపకూడదు. ఇది పోయి, 1813 లో ఎవరైనను వ్యాపారము చేయవచ్చునను స్వేచ్ఛ కలిగించి, ఈస్టిండియా కంపెనీకి, మరికొంతకాలము అనుమతినిచ్చిరి. ఇంతలో ఫ్రెంచివారికి, బ్రిటిష్‌వారికి జరిగిన యుద్ధముకారణముచేత తరచు సముద్రములలో వ్యాపారనౌకలను ఫ్రెంచివారు ముట్టడించుచు వచ్చిరి. అప్పుడు బ్రిటిష్‌వారు మారిషస్ దీవులను వశపరచుకొనిరి.

ఆకాలములో మరొక గొప్ప విశేషము పిండారీదండులవారి బందిపోటుతనములు. పిండారీలు మరాఠీసైన్యములనుండి చెదరిపోయిన సిపాయీదండులై యుందురు. వారికి ఒకనాయకుడు లేడు. తత్సమయమునకు ఎవరు నాయకుడై యున్న వానిననుసరించి మూకలుగా గ్రామములపైబడి దోచుకొనుచువచ్చిరి. వారు చేయు క్రూరచర్యలకు అంతులేదు. ధనములను, ఆస్తులను కొల్లగొనుటయేగాక,

స్త్రీల మానభంగముచేయుట, గృహములను స్థలములను తగుల బెట్టుటమున్న గుఘోరకృత్యములనుకూడచేయుచుండువారు: ఇందులో హిందువులు, మహమ్మదీయులు అను భేదములేదు. అన్నిరకముల వారు నుండువారు. వారికి 'చిట్టూ' అని ఒకడు, 'కరీమ్‌ఖాన్' అని ఒకడు నాయకులుగా ఉండువారు. వారు సర్వేసర్వత్ర వ్యాపించి రాజపుత్రస్థానమునుండి దక్కనుపీఠభూమివరకు, నైజామునాగపూరు రాజ్యాలస్థలములవరకు అన్నిగ్రామములనుదోచుకొనుచుండువారు. వీరు దండుగా బయలుదేరునపుడు, వెయ్యిమొదలు నాలుగువేల మందివరకు బయలుదేరి, పొలిమేరలు దాటినతరువాత రెండువందల మంది, మూడువందలమందియున్న చిన్నజట్టులుగా చీలిపోయి, చేత కాగడాలు ధరించి కేకలువేయుచు దారుణకృత్యములు చేయువారు. వీరు డేరాలూ గుడారాలూ వేసికొనువారుకారు. గుఱ్ఱములమీద స్వారీచేయుచు ఒక్కొక్కసారి ఆ గుఱ్ఱములమూపులపైనే కన్ను మూయువారు.

1813 లార్డు హేస్టింగ్సు వచ్చునప్పటికి 50 వేలమందివరకు పిండారీదండులలో ఉండేవారు. 1815 ఇరవైఅయిదు వేలమంది తెనుగుకోస్తాతీరములో ప్రవేశించి, 300 గ్రామాలవరకు ముట్టడించి కొల్లగొట్టి సర్వనాశనముచేసివేసిరి. మరొకజట్టు నైజాముప్రాంత ములో ప్రవేశించి, అక్కడ గ్రామాలను నాశనముచేసెను. 1816–17లో మరొకదండు వచ్చి మన ఆంధ్రప్రాంతములను ముట్టడించెను. హేస్టింగ్సు పరిపాలనలోనికిరాగానే ఈ పిండారీలను రూపుమాపవలె నని నిశ్చయించి, లక్ష ఇరవైవేలసైన్యముతో దండెత్తి, అటు నర్మదవైపు వారిని తరిమివేసెను. అంతవరకు పరోక్షముగా సహా యముచేస్తున్న మహారాష్ట్రరాజులతో ఇతడు మంచితనముచేసికొని పిండారీలకు ఉప్పుపుట్టకుండ చేసెను. కరీమ్‌ఖాన్ లొంగిపోయినతరు వాత అతనికి గోరఖ్‌పూర్ వద్ద చిన్నస్థలమీయగా, ఆతడు స్వాధీన మైపోయెను. చిట్టూను తరిమి తరిమి ఆశార్‌ఘుర్ దగ్గర ముట్ట డించగా అడవులలో చిక్కి పులినోటిలో అతడు మరణించెను.

హేస్టింగ్సు అనుసరించిన విధానమువలన మధ్యభారతము నందును, దక్కను చోరమండలముప్రాంతములందును అరాజకస్థితి మారి, శాంతి భద్రత లేర్పడినవి. బందిపోటుల ప్రమాదము తప్పినది. బంగారుధాన్యముపండు పంటభూములను పాడువడిన భస్మ ప్రదేశములుగా మార్చిన దారుణకాండలు పోయినవి. తిరిగి ప్రజలు శ్రమపడి పండించిన ధాన్యలక్ష్మి వారికి స్వాధీనమగుచు వచ్చినది. బ్రిటిష్ అధికారము 1823నాటికి స్థిరపడినది. దేశమున కంతకును ఒక సర్వాధికారమును శాసించ గలిగినశక్తి ఒక బ్రిటిష్ వారికే చెల్లినదని హేస్టింగ్సు స్థిరపరచి, 1823నాటికి తిరిగి తన దేశమునకు వెళ్ళిపోయెను.

అరాజకపరిస్థితులు పోయి, ప్రజలకు శాంతి భద్రతలు చేకూరినతరువాత, సాంఘికవ్యవస్థలు మార్పులుచేయుటకుగాని, ఆచారవ్యవహారములలో సంస్కరణలు ప్రవేశపెట్టుటకుగాని తీరిక దొరకినది. లార్డు బెంటింక్ గవర్నరుజనరలుగా ఉన్నకాలములో భారతదేశపరిపాలనలో చాల హెచ్చు మార్పులువచ్చినవి. ఆకాలములోనే 'కూర్గు' కైవసముచేసికొని, ఆ రాజును కాశీకి పంపించి అక్కడ బందీచేసిరి. మైసూరులో టిప్పుసుల్తాన్ అనంతరము – రాజవంశీయులలో ఒకచిన్నవానిని గద్దెమీాద నుంచి, పూర్ణయ్యమంత్రి పరిపాలన నిర్వహించువాడు. ఇతడు ఆంధ్రుడే. ఈతనికాలములో యువరాజు 16వయేటనే పరిపాలన తాను తీసికొని, అధికారము నంతయును దుర్వినియోగముచేసి, ధనాగారములోనిసొమ్ము వమ్ము చేసెను. ప్రజలను ఇంకను పన్నులిమ్మని వేధించుటప్రారంభించగానే ఆ ప్రజలు తిరుగుబాటుచేసిరి. ఇంగ్లీషువారు సేనలనుపంపి, ఈ తిరుగుబాటు అణచివేసి, రాజ్యమును తమఅధీనములోనికి తీసికొనిరి. ఆ రాజుకి కొంతవిరాళమునిచ్చి పోషింపమొదలిడిరి. 1881లో రాజుగారిదత్తునికి మైసూరు రాజ్యసింహాసన మిచ్చి ఆయనచేత పరిపాలన చేయించిరి.

బెంటింక్ పరిపాలనలో తొలిసారి న్యాయస్థానములలో చాల మార్పులువచ్చినవి. అంతవరకు న్యాయస్థానములలో విచారణ దేశ భాషలలో జరుగుచుండెడిది. దానికిబదులు, సివిలు, క్రిమినలుకోర్టులలో పర్షియన్ భాష ప్రవేశపెట్టినారు. దానిఫలితముగానే, అన్ని దేశ భాషలలోనూ కొన్ని పర్షియన్ పదములు వ్యవహారములోనికి వచ్చినవి. అవి మనభాషలో స్థాలీపులాకముగా కలిసిపోయినవి. తొలిసారి సర్కారుఉద్యోగములలో దేశీయులకే అవకాశమిచ్చుచుండెడివారు. ఇంగ్లీషువిద్య అన్ని పాఠశాలలలోను ప్రవేశపెట్టబడినది. గ్రామములలో రివెన్యూపరిపాలన జమాబందీ ప్రవేశపెట్టినారు. పిండారీలు, థగ్గులువంటివారిని అణచివేయుటకు తీవ్రచర్యలుతీసికొనిరి. ఇండియా ఇంగ్లాండుదేశాలమధ్య ఎఱ్ఱసముద్రముమీదుగా ఓడల రహదారి లార్డ్ బెంటింక్ ప్రవేశపెట్టెను. ఇవన్నియును ఒకయెత్తు! బెంటింక్ ప్రవేశపెట్టిన సంస్కరణ ఒకయెత్తు; అంతవరకు హిందూ సంఘములోనున్న దురాచారమైన సహగమనపద్ధతిని ఒక కఠిన శాసనముద్వారా రూపుమాపెను.

1833 లో కుంపిణీప్రణాళికలో మార్పువచ్చినది. అదియొక వ్యాపారసంస్థగా పనిచేయుటకుబదులు, పరిపాలనాసంస్థగా రూపొందినది.

అదేసమయములో రష్యా తనబలములను పెంచుకొని, మధ్య ఆసియాలో కొన్నిభాగములను ఆక్రమించుచు వచ్చినది. అందుచేత ఇంగ్లీషువారు పంజాబుప్రాంతీయులతో చెలిమిగాఉండవలసివచ్చినది. ఈకారణముచేతనే సింధురాజులతోను, పంజాబులోని రంజిత్ సింగుతోను సంధిచేసికొని చెలిమిచేకొనుటకు లార్డ్ బెంటింక్ ఒడంబడెను. ఇంతలో ఆఫ్ఘన్ యుద్ధములు జరుగుట, సిక్కుప్రాబల్యము పెరుగుట, అనేక యుద్ధముల ఫలితముగా పంజాబు బ్రిటిష్ పరిపాలనలోనికి వచ్చుట 1856 వరకు జరిగిన విశేషాలు.

1856 లో లార్డ్ కేనింగ్ —చివరి గవర్నరుజనరలుగా వచ్చినపుడే—కలకత్తానుండి పంజాబువరకు మనదేశమంతటను ఒక

విప్లవజ్వాల వ్యాపించినది. 1857 లో ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధము ప్రారంభమైనది. దీనిని సిపాయీల చిన్న కలహముగా చెప్పువారును కలరు. ఆరోజులలో ప్రజలు మూఢవిశ్వాసములు కలిగియుండువారు. ఆరోజులలో సిపాయీలుఉపయోగించే తూటాలకుపందిక్రొవ్వు, ఆవుక్రొవ్వువాడేవారు. వానిని తాకుట ఘోరాపరాధముగా మన సైనికులు భావించినారు. తొలిసారి రైలుదారులు వేసి, టెలిగ్రాఫ్‌తీగెలు వేసి రహదారిసౌకర్యములు కల్పించుచుండగా అవి గారడీవిద్యలనిపించినవి. ఈ యినుపదారుల వలన, తంతితీగెల వలన మన దేశమును శాశ్వతముగాశృంఖలాబద్ధముగావించుచున్నారని వారిఅభిప్రాయము. అందుచేత ఢిల్లీ, ఔధ్‌లో, బరహంపురంలో సిపాయీలు తిరుగుబాటుచేసినారు. మీరట్‌నుండి ఒకపటాలము వచ్చి ఢిల్లీ ఆక్రమించుకొన్నది. ఆసమయాన, మొగలురాజులలో చిట్టచివరివాడైన బహదూర్‌షా వారితో కలిసి, వారికి సహాయము చేసినాడు. ఈ విప్లవవార్తలు పంజాబులోను, లక్నోలోనూ వ్యాపించి, అక్కడకూడ కొందరు యోధులు తిరుగుబాటుచేసిరి. అట్టివారిలో ఝాన్సీలక్ష్మిబాయి, కాన్పూరులో నానాసాహెబ్ మున్నగువారు ముఖ్యులు. వీరిఅందరిని లొంగదీసికొనుటకు పెద్దయెత్తున యూరపియన్‌ఆఫీసర్లు తమసేనలను సమకూర్చుకొని ముందంజవేసిరి. అప్పుడే ఢిల్లీ ప్రవేశించి తెల్లపటాలాలు బహదూర్‌షాను బంధించినవి. కాన్పూరులో కల్లోలము నణచివేసినవి. ఇంతలో మధ్యభారతములో విప్లవము ప్రారంభముచేసిన తాంతియాతోపీ వంటివారు తప్పించుకొని, ఎక్కడో ఒకచోట ఆ విప్లవనినాదము లేవదీయుచునేయుండిరి. దీనితో తెల్లదొరలు అజేయులు, అఖండులు అను నమ్మకము పోయినది. తూర్పుఇండియాకంపెనీ పరిపాలనలో జరిగిన దుండగములు సమాప్తిచెందినవి. దానితో 1858 ఆగష్టు 2 వ తేదీని తూర్పుఇండియాకంపెనీకి స్వస్తిచెప్పి, విక్టోరియామహారాణి పరిపాలనాధికారము స్వీకరించినది. ఇండియాకార్యదర్శి

యీ పరిపాలన నిర్వహించుటకు ఆతనికి 15 గురుసభ్యులమండలి సహాయముగా పనిచేయుటకు నిశ్చయమైనది. గవర్నరుజెనరలు పోయి, రాజప్రతినిధి (వైస్‌రాయ్) తొలిసారి అధికారములోనికి వచ్చినాడు. ఆ పదవి కట్టకడపటి గవర్నరుజెనరలు అయిన లార్డ్ కానింగ్‌కే లభించినది.

1858 నవంబరు 1వ తేదీని విక్టోరియా మహారాణి ఒక రాజకీయప్రకటన చేసినది. దీనినే ఇండియాకు మేగ్నకార్టా వంటిదని యందురు. ఇది అన్నిభాషలలోనికిని అనువాదము పొందినది. దీని మూలముగా కుంపిణీపరిపాలన అంతరించి, రాణీవంశీయులపరిపాలన అవతరించినది. హిందువుల మతవ్యవస్థలోనూ వర్ణవ్యవస్థలోనూ జోక్యముచేసికొనుభావము బ్రిటిష్ ప్రభుత్వమునకులేదని వెల్లడిచేసిరి.

అందున్నభాగములలో కొన్ని,

"It is our earnest desire to stimulate the peaceful industry of India, to promote works of public utlility and improvment, and to administer its Government for the benefit of all our subjects. resident there in. In their prosperity will be our strenghth; in their Contentment our security; and in their gratitude our best reward. And may the God of all power grant to us and to those in authority under us, strength to carry out those our wishes for the good of our people.

"భారతదేశములోని ప్రజల జాతి మత సంప్రదాయములతో జోక్యము కలుగజేసికొనుటకు బ్రిటిష్‌ప్రభుత్వము ఇచ్ఛగింపదు.

భారతదేశములోని పరిశ్రమలు ప్రోత్సహింపవలెనని ప్రజోపయోగకరమైన పనులు చేయపలెనని మా హృదయ పూర్వకవాంఛ ఇండియాలోని ప్రజలందరికీ క్షేమదాయకము శ్రేయోదాయకము అయిన పరిపాలన సమకూర్చవలెనని మాసంకల్పము, వారి సౌభాగ్యమే మా శక్తి; వారిసంతృప్తియే మా రక్షణ వారిసంతుష్టి మా సత్ఫలము. ప్రజల క్షేమము కొఱకు తలపెట్టి ఈ యాశయ

ములు భరించుటకు తగినశక్తి సామర్థ్యములు మాకును మా క్రింది అధికారులను భగవంతుడు ప్రసాదించు గాక!" ఇట్లు

విక్టోరియా మహారాణి.

విక్టోరియా మహారాణి చేసిన ఈ ప్రకటనవలన, భారతదేశములో ప్రజలపరిపాలన తొలిసారి భారతీయులచేతులలోనికి వచ్చినది. బందిపోటులు, తిరుగుబాటుదారులు, సిపాయీలు మొదలయినవారి దండయాత్రలవలన అరాజకమేర్పడిన దేశములో తొలిసారి శాంతిభద్రత లేర్పడినవి. అటు దేశీయులలో ఆత్మగౌరవము, ఆత్మాభిమానమును నెలకొన్నది. ఈ యాత్మగౌరవముతో మన సంస్కృతియెడల, మన విద్యలయెడల, మన భాషలయెడల, మన మతధర్మములయెడల గౌరవమేర్పడినది. దేశములో రైల్వేరహదారి సౌకర్యము, తపాలా. టెలిగ్రాఫ్ సౌకర్యములును ఏర్పడుటవలన పరస్పర సంబంధబాంధవ్యములు పెరుగుటకు వీలైనది. అచ్చువేయు ముద్రణాయంత్రములను ప్రవేశపెట్టుటచేత, పుస్తకములు విరివిగా ప్రచారములోనికివచ్చుటకు అవకాశమేర్పడినది. దేశమంతయును ఒక పరిపాలనలోనికి వచ్చి, ఒకేవిధానమననుసరించుటకు వీలుకల్గినది. గ్రామములలో భూములు సేద్యవిధానము శాశ్వతముగా సెటిల్‌మెంటుచేయించి, ఎస్టేటులుగా విభజించుటచేత, జమీందారీ విధానము భూస్వాములపలుకుబడి అభివృద్ధిపొందుచువచ్చినది.

దేశమంతయును సమానపరిపాలనాయంత్రం పనిచేయుటచేత, న్యాయస్థానములయందును, కచ్చేరీలలోనూనూ, విద్యాలయములలోనూ ఒకేపద్ధతి పరిభాష, ఒకే సంప్రదాయమును అమలులోనికి వచ్చినవి. దేశమంతటను ఇంగ్లీషు, పార్శీభాషలతోపాటు దేశభాషలు రాజ్యాంగయంత్రమునకుఉపయోగించవచ్చినవి. ఏవిషయమును ప్రజాసామాన్యమునకు తెలియజేయబూనుకొనినను వారి మాతృభాషలో చెప్పుచువచ్చిరి. భారతచరిత్రలోని ప్రధాన ఘట్టములతో — ఆంధ్రదేశచరిత్రలోని ప్రధానఘట్టములుకూడ చేరియున్నవి. 19 వ శతాబ్ది చరిత్రలోని ఈ ఘట్టములు సాహిత్యచరిత్రపైనకూడ పనిచేసినవి.

# భారతచరిత్రలోని కొన్ని తేదీలు 1800 – 1900

| | | |
|---|---|---|
| టిప్పుసుల్తాన్ మరణము | | 1799 |
| మైసూరు స్వాధీనముచేసికొనుట | | 1800 |
| దత్తమండలములు నైజామునకిచ్చుట | | 1800 |
| వేలూరులో సిపాయీల తిరుగుబాటు | | 1806 |
| మిషనరీలప్రచారముపై ఆంక్ష | | 1812 |
| పిండారీదండుల ఓటమి | | 1819 |
| కూర్గు, మైసూరురాష్ట్రాలు వశపడుట | | 1830 |
| ఆఫ్ఘన్‌యుద్ధము | | 1842 |
| సింధు ఆక్రమణ | | 1843 |
| సతి – సహగమనము – నిర్మూలనము | | 1846 |
| స్వాతంత్ర్యయుద్ధము (సిపాయీలకలహము) | | 1857 |
| తూర్పుఇండియాకంపెనీ రద్దుఅయినది | ఆగష్టు | 1858 |
| విక్టోరియా మహారాణి ప్రకటన | 1 నవంబరు | 1858 |
| మైసూరు రాజవంశీయులకు నప్పగించుట (దత్తుడిఅధికారము) | | 1881 |
| పంజాబు స్వాధీనముచేసికొనుట | | 1849 |
| విద్యావిషయకసంస్కరణలు | | 1853 |
| నాగపూరు బ్రిటిషువారి అధీనముగుట | | 1854 |
| ఇండియా – ఇంగ్లాండు దేశములమధ్య తంతిసౌకర్యములు | | 1856 |
| ఔధ్ బ్రిటిష్‌వారి అధీనమగుట | | 1859 |
| స్థానికప్రభుత్వచట్టము | | 1885 |
| భారత జాతీయకాంగ్రెస్ ప్రారంభము | | 1884 |

| | |
|---|---|
| శాశ్వతభూమిశిస్తువిధానము ( **Permanent settlement** ) | 1802 |
| ఇండియన్ పీనల్ కోడ్ | 1861 |
| మొదటి జనాభా లెక్కల సేకరణ | 1872 |
| విశ్వవిద్యాలయాల సమాఖ్య | 1882 |
| క్షామనివారణసంఘము | 1883 |
| విశాఖపట్టణము సరస్వతీనిలయము, మొదటి గ్రంథాలయస్థాపన | 1886 |
| ఆంధ్రదేశములో మొదటి రైలుమార్గము వేయుట | 1893 |
| భారత సాంఘికమహాసభ ప్రథమసమావేశము కందుకూరివీరేశలింగంగారి అధ్యక్షత క్రింద జరిగినది. | 1898 |

# ఆంధ్రదేశచరిత్ర

1799 లో టిప్పుసుల్తాను ఓటమితో జరిగిన కర్నాటకరాజ్య పునర్విభజనలో రాయలసీమలోని కొన్నిజిల్లాలు నైజాముప్రభువున కిచ్చివేసిరి. కాని యివి యెంతోకాలము నైజాముపాలనలో నిలువ లేదు. బ్రిటిషువారు నైజామునకు సహకారముచేయుపద్ధతిలో సైన్యమునకగు ఖర్చులు నైజాము భరించవలసివచ్చెను. రెండుసంవత్సరములవరకు ఈ సొమ్ము బకాయిపడినకారణముచేత, సైన్యభరణమునకుబదులుగా నైజాము ఈ రాయలసీమజిల్లాలను బ్రిటిష్‌వారివశము గావించెను. నాటినుండి (కడప, కర్నూలు, చిత్తూరు, బళ్ళారి, అనంతపురం) ఈ జిల్లాలు బ్రిటిష్‌పరిపాలనలోనికి వచ్చెను. నాటి నుండి ఇవి, నైజాముచేత దత్తములైనవికావున దత్తమండలములు (**Ceded Districts**) అని పేరుపొందెను. ఈ విషయము ముందొకసారి ప్రస్తావించుకొన్నాము. మొత్తముమీద ఆంధ్రదేశము బ్రిటిష్ పరిపాలనలోనికి వచ్చినది.

బ్రిటిష్‌వారు తెనుగుదేశములో ఉత్తరసర్కారులను, రాయలసీమజిల్లాలను పరిపాలనచేయుచున్నారేకాని, తిరుగుబాటుదారుల దుండగములను అణచలేకపోయిరి. దానికి తగిన దక్షత వారిలో లేకపోయినది. కుంపిణీవారు వర్తక వ్యాపారములయందు శ్రద్ధచూపినవారేకాని పరిపాలనాదక్షతకల వారు కారు. వారికీ పరిపాలన నిర్బంధముగా నిర్వహించవలసివచ్చినది. తొలిదశలో చాల పొరపాటులు గావించిరి. జమీందారులను నియమించి వారిపైన ఎక్కువ పన్నులను పేష్కషులను విధించిరి. అది జమీందారులకు నచ్చలేదు. పైగా జమీందారులలో అంతఃకలహములు ప్రబలి వివాదము లేర్పడినపుడు, ఒకపక్షమువారిని బలపరచిమిగిలినవారిపైకి

దండెత్తుట పరిపాటిఅయినది. ఈ కారణములవలన 1768నుండి 1838 వరకు ఉత్తరసర్కారులలోనూ, 1800మొదలు 1805వరకు రాయల సీమలోను బ్రిటిషుసర్కారుపై తిరుగుబాటులు అనేకము చెల రేగెను. చివరకు వీనినన్నిటిని అణచివేసి బ్రిటిషువారు తమ అధి కారమును ఆంధ్రదేశములో స్థిరపరచుకొనిరి.

మొదట గంజాంమండలములో జమీందారులు హెచ్చు తిరుగుబాటులుచేసిరి. తరువాత విశాఖమండలమునకు చెందిన విజయనగరరాజు తిరుగుబాటుచేసి 1794లో పద్మనాభయుద్ధములో వీరమరణమునందెను. 1802లో శాశ్వత భూమిశిస్తువిధానము అమలులోనికి వచ్చినది. దానితో ఈ పితూరీలు, విప్లవములును అణగిపోవునని తలంచినను పేష్కుషులనిర్బంధ మెక్కువైనకారణము చేత అసంతృప్తి రేగి, 1832నాటికి ఈ పరిస్థితులు విషమించినవి. 1832లో జార్జి రసెల్ అను ఉద్యోగి విశాఖ గంజాంజిల్లాల కమిష నరుగా వచ్చి, ఈ పితూరీలను అణచివేసెను. 1800లో రాయలసీమ బ్రిటిష్‌వారి వశమైనతరువాత అక్కడక్కడ కొన్ని తిరుగుబాటులు బయలుదేరినను, వానిని తామస్‌మన్రోయను పాలకుడు ఎదిరించి శాంతి నెలకొల్పెను. మన్రో రైతుజనబాంధవుడని ప్రతీతి. అందు చేత రైతులు మన్రోయందుభక్తి విశ్వాసములు పెంచుకొని తిరుగు బాటుచేసిన పాళెగాండ్రను అణచివేయుటలో తోడ్పడిరి. బ్రిటిష్ పరిపాలనము 1807నాటికి ఉత్తరసర్కారులోను, రాయలసీమలోను ఒక శతాబ్దికాలము స్థిరపడినదనవచ్చును. *"ఈ నూరుసంవత్సరము లలో దేశమందలి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరి స్థితులయందును, ప్రజల దృక్పథ మనోభావములందును విప్లవాత్మ కములైన మార్పులు కలిగెను. ఇంతటి మార్పులు మరి యే పరి పాలనకాలమందును కలిగియుండలేదు. ఒక మహాయుగము అంత రించి మరియొక మహాయుగము ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును."

---

* మామిడిపూడి వేంకటరంగయ్యగారు ఆంధ్ర సంస్కృతిసంపుటము బ్రిటిషుప్రభుత్వము పరిపాలనా ప్రభావము.

ఈ పరిపాలనలో - విశాలప్రదేశమునకు కేంద్రీకృతమైన రాజ్యాంగయంత్ర మేర్పడుటచేత రాష్ట్రమును, జిల్లాలను పరిపాలించు క్రిందిఉద్యోగులు ఒక కేంద్రాధికారమునకు లోబడి పనిచేయవలసినవారైరి. సమర్థులైనవారిని ఎన్నికచేసి చాకచక్యముతోను, ప్రజ్ఞతోను పరిపాలన నిర్వహించుచు, లంచగొండితనము, స్వాభిమానము మొదలగువానికి తావీయక పరిపాలనా సౌష్ఠవమునే పాటించి నడిపించు దక్షతగల పరిపాలకులు జిల్లాకలెక్టర్లుగాను, కమిషనర్లుగాను పనిచేయుచువచ్చిరి. న్యాయపరిపాలనలో బ్రిటిష్ వారి(**Rule of Law**) చట్టపు స్వామ్యసూత్రము అమలులోనికి వచ్చుటచేతచట్టముముందు తరతమభేదములులేక అందరునుసమానులే యను ధర్మము గుర్తించిరి. ఏమతము, ఏకులము, ఏవర్గము, ఏహోదాకు చెందినవాడైనను న్యాయశాస్త్రబద్ధముగావిచారణకు కట్టుబడి, ఆ తీర్పులకు తలయొగ్గవలసినదే. ఈ ధర్మమువలన అగ్రకులములవారు, ధనికవర్గము, సామంతులు ఇటువంటివారి పలుకుబడి పరపతి తగ్గినది. మానవులందరును పరిపాలనాదృష్టిలో సమాననను ధర్మము దేశములో వ్యాపించెను. ఈ న్యాయసూత్రము సంఘముపైన పనిచేసినది.

ముందు బ్రిటిషువారు నిరంకుశముగా పరిపాలించినను ప్రజాప్రతినిధులుగల శాసనసభలనునిర్మించిరి. క్రమక్రమముగా కొంచెము బాధ్యతగల ప్రజాస్వామ్యవిధానము అమలులోనికి వచ్చినది. రాష్ట్రశాసనసభలు, జిల్లాబోర్డులు, మునిసిపల్ సంఘములు, తాలూకాబోర్డులు మొదలయినవి ప్రజ లెన్నుకొనిన ప్రతినిధులకు తావిచ్చినవి. దానితో. ప్రజాస్వామ్యసూత్రములపై ఆలోచన, క్రొత్త రాజకీయభావములప్రచారము హెచ్చుకాజొచ్చినది.

బ్రిటిషు పరిపాలనకుముందు, మన ప్రజలలో జాతీయాభిమానము, దేశభక్తి, రాజకీయచైతన్యము లేదు. దీని అనంతరము- భాషాభిమానము, దేశాభిమానమును పెరిగినవి. ఏ ప్రాంతమునకు చెందినవారైన భారతీయులందరును ఒకటే యను అభిమానమును,

మన మాతృభూమి భారతదేశము, మనయందరికిని చెందినదను జాతీయభావము కలిగినది. దీనికి కారణము తెనుగుదేశపు ప్రజయంతయును (నైజాము మినహాయించి) ఒక ఏలుబడిలోనికివచ్చి ఒకే పరిపాలనావిధానమునకు లోబడియుండుట ఈ ఏకతను పెంపొందించెను. ఇతరరాష్ట్రములమధ్య సంబంధములను ఎక్కువచేయుటకు తగిన రోడ్లు, రైలుమార్గములు, ప్రయాణసౌకర్యములును ఏర్పడినవి. ఇరుగుపొరుగువారి భాషా సాహిత్యములతో ఆదానప్రదానము చేసికొనుట జరిగినది. ఒకవిధమైన ఉన్నతవిద్య రాష్ట్రమంతటను వ్యాపించుటచేత, విద్యావంతులు అందరు ఒకేభాషమాటలాడువారై ఒకేపద్ధతి భావములను సిద్ధాంతములను ప్రతిపాదించుట ఇటువంటివి జరిగినవి. ఈ ఫలితములవలననే జాతీయోద్యమము వ్యాప్తిలోనికి వచ్చినది.

1858 అనంతరము దేశమందు రాజకీయచైతన్యమునకు అంకురార్పణ జరిగినదనవచ్చును. ఇదేకాలమున పాశ్చాత్యవిద్య కొంతవరకు దేశమందు వ్యాపించెను. దీనిఫలితముగా విద్యావంతులలో రాజకీయావేశము మొలకెత్తి 1885లో కాంగ్రెసుస్థాపనకు దారితీసెను.

1885నుండి 1905వరకు కాంగ్రెసువలన రెండుఫలితములు చేకూరెను. ఒకటి దేశములో ఐకమత్యము సాధించుట, రెండవది: కొన్ని సంస్కరణలను పరిపాలనావిధానములో ప్రవేశపెట్టుట.

తక్కినరాష్ట్రములతోపాటు ఆంధ్రప్రాంతములవారును కాంగ్రెసుఉద్యమమందు పాల్గొనిరి. ఆంధ్రు లనేకులు కాంగ్రెసుసమావేశములకు వెళ్లుచు, ఆంధ్రులలో జాతీయభావము రేకెత్తించుటకు తోడ్పడిరి. ఇట్టివారిలో రంగయ్యనాయుడు, ఆనందాచార్యులు, న్యాపతి సుబ్బారావు, కేశవపిళ్లే, గంజాం వేంకటరత్నం, కృత్తివెంటి పేర్రాజు, వరహాగిరి జోగయ్య ముఖ్యులు. వీరిలో ఒకరైన పనప్పాకం ఆనందాచార్యులుగారు నాగపూరులో జరిగిన ఏడవ

సమావేశమునకు అధ్యక్షతవహించి, సైన్యములో చేరు హక్కు ఆంగ్లోఇండియన్‌లకే గాక భారతీయులందరికిని గలదని నిరూపించిరి.

కాంగ్రెసుసమూనాలో తెనుగుదేశములో జిల్లాసంఘములు, తాలూకాసంఘములును ఏర్పడి, జిల్లా రాజకీయసభలు, తాలూకా రాజకీయసభలు జరుపుట ఒకవిశేషము. వీనివలన ప్రజలలో రాజకీయచైతన్యము మరింత కలుగుటకు కారణమైనది.

ఒకొక్కప్పుడు రైతులు స్వయముగా వ్యవహరించి అధికారులతో అభిప్రాయభేదములువచ్చినపుడు, సత్యాగ్రహముచేసి దానిద్వారా తమచిక్కులను తొలగించుకొన్నట్లు ఈ శతాబ్దిచరిత్ర వలన గ్రహించవచ్చును. ఉదాహరణముగా 1894 - 95లో కృష్ణా జిల్లాలో ఈ సత్యాగ్రహ మొకటి జరిగెను. ఆ సంవత్సరపు నీటితీరువా నాలుగురూపాయలనుండి అయిదురూపాయలవరకు అధికారులు పెంచిరి. దానిని నిరసించుటకు ఏలూరులో జిల్లారైతులు సభజరిపి, నీటి తీరువను తగ్గించువరకు వ్యవసాయముచేయమని కట్టుకట్టిరి. ఆ సత్యాగ్రహములో గుడివాడతాలూకాలోని కొందరు రైతులు జైళ్ళకు పోయిరి. 1885 - 1905 లో కాంగ్రెసు ఉద్యమము బ్రిటిషుప్రభుత్వమును తొలగించవలెనని సాగలేదు. అప్పటివారు బ్రిటను భారతదేశములమధ్య ద్వంద్వపరిపాలన ఉభయులకు లాభదాయకమని, బ్రిటిషువారు విష్ణుఅంశసంభూతులని, భగవదిచ్ఛఇట్లు నిర్ణీతమైయున్నదనిఅభిప్రాయపడిరి.

బ్రిటిషుప్రభుత్వము పరిపాలనచేసినకాలములో కలకత్తా, బొంబాయి, మద్రాసునగరములే ప్రాముఖ్యమువహించెను. ఇక్కడ ఆంగ్లభాషాప్రాబల్యము హెచ్చుటకు విశ్వవిద్యాలయములు, ఇంగ్లీషుకళాశాలలును వచ్చెను. వీనిలో దేశభాషలయందభిమానము అంత వృద్ధికాలేదు. భాషాభిమానము, సాహిత్యాభిమానము కలుగుటకు చాలాకాలము పట్టినది. తెలంగాణా ప్రాంతము నైజాముప్రభువుపరిపాలనలో ఉన్నను రాజకీయముగా

చాల వెనుకబడియుండెను. 1804లో ఘోరమైన క్షామము సంభవించి, జనులు నరమాంసముకూడ తినెడివారట. 1804జూన్ నెలలో వెల్లింగ్టనుప్రభువు ఇట్లు వ్రాసెను.

"నిజాము రాజ్యము గోదావరి మొదలుకొని హైదరాబాదునరకునుకలగుండుపడియున్నది. దేశస్థితిహృదయవిదారకముగానున్నది. నూరార్లకొలది జనులుఆకటిబాధచే మలమలమాడుచున్నారు. వారికేమాత్రమైనట్టి సాయమును చేయగల ప్రభుత్వమేదియు లేదు"

1833లో మరొక దారుణమైన కరవు నైజాముఇలాకాలో వచ్చినది. దీనితోపాటు ప్లేగుకూడ వచ్చి అనేకులను పొట్టబెట్టుకొనెను.

1853–1883వరకు ప్రధానిగా పరిపాలనచేసిన నవాబ్ సాలార్ జంగ్ బహద్దురుకాలములో నిజాము రాజ్యము పునరుజ్జీవము పొందెను. గుత్తదారులను అణచివేసి, రైతులవద్దనుండి భూములు గుత్తతీసికొనుపద్ధతి మాన్పించెను. ప్రభుత్వమునకును రైతులకును ప్రత్యక్ష సంబంధము కల్పించెను. ఇందువలన దున్నువానిదే హక్కు అని స్థిరపడెను. ప్రభుత్వమునకు ఆదాయము పెరిగెను. దుండగులు హింసించి అక్రమముగా పన్నులువసూలుచేయుట నిలిచెను. ప్రజలలో కొంత సంతృప్తి నెలకొన్నది. 1890లో లా కమిషన్ ఏర్పాటయినది. 1893లో శాసనసభ నెలకొల్పబడినది. అందు అధికార సభ్యులు 15మందివరకు ఉండిరి. వీరిలో ఒక్కరుకూడ తెలుగువారు లేరు. ఇరుగుపొరుగులోని బ్రిటిషుపరిపాలనావిధానములోనున్న రైతువారీపద్ధతిని అనుసరించిన రివెన్యూవిధానము నైజాములో కూడ అమలులోనికి వచ్చినది, అంతవరకు, ధాన్యములమూలముగాను, పంటదినుసులమూలముగాను పన్నులు వసూలుచేయు విధానము పోయి, రొఖ్ఖమురూపముగా పన్నులుకట్టు పద్ధతి అమలులోనికి వచ్చినది. మద్రాసురాష్ట్రములోవలెనే, రివెన్యూబోర్డు వచ్చినది.

— —

# ఆర్థికవ్యవస్థలు

ఈ శతాబ్దిలో రాజకీయములలోవలెనే ఆర్థికవ్యవస్థలోకూడ చాల మార్పులువచ్చెను. వీనిలో ముఖ్యముగా గమనింపదగిన మార్పు జనాభా పెరుగుదల. శాంతి భద్రతలు నెలకొన్నవి. వృత్తి వ్యాపారములకు సంరక్షణ యేర్పడినది. కరువు కాటకములు క్రమముగా తగ్గినవి. క్రొత్త నీటివనతులసహాయముచేత గోదావరీ కృష్ణా నదులవంటివానికి ఆనకట్టలుకట్టి ఆహారధాన్యముల ఉత్పత్తి పెరిగినది. మశూచికము విషూచి, మహామారివంటి అంటురోగములబారి నుండి కాపాడుటకు ప్రభుత్వము తీసికొన్న చర్యలు ఫలించినవి. ఈ కారణములచేత జనసంఖ్యవృద్ధిగాంచెను. 1800—1850మధ్య జనాభా రెట్టింపు పెరిగినదట. 1871లో జనాభాలెక్కలు తొలిసారి సేకరించుటకు ప్రయత్నము జరిగెను. అప్పటికి, బళ్ళారి, గంజాము జిల్లాలతో కలిసి తెనుగుజిల్లాలలోని జనాభా 1కోటి ఇరవైలక్షలు (అప్పటికి అనంతపురం, చిత్తూరుజిల్లా లేర్పడలేదు)

వ్యవసాయయోగ్యములన్నియును సేద్యములోనికి వచ్చినవి. వరిపంటనేగాక, ప్రత్తి, పొగాకు, నూనెగింజలు, జనుమువంటి లాభసాటిపంటలుకూడ పండించి లాభములను సంపాదించిరి. రైతులు కొన్నిచోట్ల సహకారసంఘములుగా ఏర్పడి తమ ఉమ్మడిసమస్యలను పరిష్కరించుకొనిరి.

1800 అనంతరము కొన్ని దేశపరిశ్రమలు క్షీణించినవి. అట్టి పరిశ్రమలలో ఒకటి నేతపరిశ్రమ. 1850నాటికి నేతపరిశ్రమ తన ఔన్నత్యమును గోల్పోయి కొనయూపిరితో నిలిచియుండెను. కోటిరూపాయలవిలువగల చేనేతబట్టలు మనదేశమునుండి ఎగుమతి

యగుచుండెడివట. బ్రిటిషు మిల్లువస్త్రములపోటీకి తాళలేక ఈ పరిశ్రమ పూర్తిగా అడుగంటిపోయినది.

రాజకీయరంగమునందువలె ఆర్థికరంగమునందును నూతన భావోదయమాయెను. క్రొత్తవృత్తులు బయలుదేరినవి. లాయరులు, ప్రభుత్వోద్యోగులు, కంట్రాక్టర్లు, కమీషన్ ఏజంట్లు, గుమాస్తాలు, పత్రికలవారు, ఉపాధ్యాయులు మున్నగువారు వృత్తి మూలముగా విద్యావిషయములకు ప్రాధాన్యమిచ్చువారు బయలుదేరుటతో భావములు మారినవి. సంపద, అభివృద్ధిపరిశ్రమలవలన సాధించ వచ్చునను క్రొత్తఆలోచన తట్టినది. దారిద్ర్యము కర్మఫలము కాదనియును, కృషితో నాస్తి దుర్భిక్షమనియును ప్రజలు గ్రహింప సాగిరి. ఆ కాలములో ఆంధ్రదేశమునకు జలసదుపాయము కలిగించిన భగీరథునివంటివాడు సర్ ఆర్థర్ కాటన్. (1803-1899) 1839లో మనదేశములో నీటివసరులగూర్చి పరిశీలించుటకు నియమితుడై మూడు ముఖ్యమైన ఆనకట్టలు కట్టెను. ఒకటి కావేరి పైన, రెండవది గోదావరిపైన, మూడవది కృష్ణానదిపైన.

1847లో గోదావరిఆనకట్ట ప్రారంభించునప్పటికి – ఆ ప్రాంతములోజనులు క్షామబాధకు గురియై నానాఅవస్థలును పడుచుండెడి వారు. ఈ యానకట్ట ప్రారంభించి అయిదేండ్లలో పూర్తిచేసెను. గోదావరికి దిగువగా ఆనకట్టకట్టి, రెండువైపులను కాలువలు నిర్మించి మహోపకారముచేసెను. ఈ కారణముచేత గోదావరిడెల్టాప్రాంతము నిత్యకళ్యాణము పచ్చతోరణముగా వర్ధిల్లుచున్నది. ఇట్లే కాటన్ 1861లో కృష్ణపైన ఆనకట్టకు అంకురార్పణచేసెను. ఇది కర్నల్ సర్ హెన్రీ అట్వెల్ లేక్ అనునతడును, మేజర్ జనరల్ చార్లెస్ ఆర్ అనునతడును పూర్తిచేసిరి. ఈ రెండు ఆనకట్టలవలన కృష్ణా గోదావరిమండలముల ప్రజలకు క్షామపీడ పూర్తిగా తొలగిపోయి, జలసమృద్ధికలిగిన సుక్షేత్రములు లభించి, దేశము సస్యశ్యామలము అయినది. దానితో మనరైతులఆర్థికవ్యవస్థయేమారిపోయినది.

సాంఘికముగా ఈ శతాబ్దికి పూర్వమున్న స్థితి గమనించిన దానియందు మూడు ప్రధానలక్షణములు కన్పించును. మొదటిది: చాతుర్వర్ణ్యవిభాగము - దానితోవచ్చిన కులధర్మమును. ఆకాలములో వచ్చిన హంసవింశతివంటి కావ్యములు నూరు నూటయేబది కులములను పేర్కొన్నవి. రెండవది: సమష్టికుటుంబవ్యవస్థ. మూడవది స్వయంసమృద్ధమైన గ్రామజీవితము. కులములలో తరతమభేదములకు క్రైస్తవమతప్రచారకుల ప్రచారముతో పెద్ద దెబ్బతగిలినది. క్రొత్తగా అమలులోనికివచ్చిన ఉన్నతవిద్యావిధానము వ్యక్తిస్వాతంత్ర్యమును, సమత్వమును ప్రతిపాదించెను. ఆంగ్లవిద్యాధికులైన విద్యావంతులు కులవ్యవస్థను, దానివలనవచ్చిన భేదములను ఖండించుచువచ్చిరి. భోజనములయందును, సాంఘికకూటములలోనూ కులమర్యాదలను పాటించుట అసంభవమైనది. "కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా" అను నినాదము పోయి ఏకులమువారైనను ఏవృత్తియైనను చేపట్టవచ్చునను పద్ధతి వచ్చినది. కులమునుబట్టి తరతమభేదముల నిర్ణయించు సంప్రదాయము పోవుటకు అప్పటి న్యాయవిధానము, పరిపాలనాపద్ధతి, విద్యాప్రణాళిక తోడ్పడినవి. కొన్నిచోట్ల వర్ణాంతరవివాహములుకూడ జరిగినవి.

సమష్టికుటుంబముపద్ధతిలో - విద్యావంతులయినవారు ఉద్యోగములు చేపట్టి, వృత్తికొరకు వేరుగా పోగానే, దూరప్రాంతములలో జీవనోపాధికి గడంగుటచే సమష్టికుటుంబము విచ్ఛిత్తియై పోయెను. స్త్రీలకు విద్య, విజ్ఞానము కావలెనను నినాదమువచ్చి స్త్రీలు పురుషులతో సమానులని వారి కొకవిధమైన స్వాతంత్ర్యము తెచ్చుటకు ప్రయత్నములు సాగినవి. చాలకాలమువరకు బాల్యవివాహములు, కన్యాశుల్కములు, వృద్ధవివాహములు అమలులో నుండెడివి. ఇట్టి సాంఘికవ్యవస్థనుండి, స్త్రీపునర్వివాహములు చేయుటకు అవసర మేర్పడెను. దీనివలనకూడ సమష్టి కుటుంబవ్యవస్థ రానురాను సన్నగిల్లినది.

బ్రిటిషుపరిపాలనకుముందు గ్రామములు స్వయంసమృద్ధముగా నుండెడివి. 1805లో బ్రిటిషుప్రభుత్వము అధికార కేంద్రీకరణ చేసి పనిచేసెను. శిస్తులు వసూలుచేయుటకు కలెక్టరు, రివెన్యూ ఉద్యోగులు అవసరమైరి. దానితో గ్రామములలో రైతులప్రాముఖ్యము తగ్గి పట్టణములలోని ఉద్యోగులప్రాధాన్యము హెచ్చినది. స్వయంసమృద్ధికిబదులు దేశమంతటి పరిస్థితులపైనను ఆర్థిక వ్యవస్థ ఆధారపడవలసివచ్చినది. గ్రామములలో వ్యవసాయమునే ప్రధానవృత్తిగా చేసికొన్నవారు అది మార్చి, లాభసాటియైన పరిశ్రమలను నెలకొల్పుటలోను, వ్యాపారసంస్థలను పెంపొందించుటలోను తమ దృష్టిని కేంద్రీకరింపజేసిరి. 19వ శతాబ్దిలోని సాంఘిక స్థితిగతులకు ప్రధానలక్షణములయిన 1) కులవ్యవస్థ 2) కుటుంబ సమష్టివ్యవస్థ 3) స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ నూరుసంవత్సరములలో ఎక్కువకాలము అమలులోనున్నను, ఉత్తరార్ధములో చాలవరకు సడలిపోయినవని చెప్పవలసియున్నది.

# విజ్ఞానరంగము

18వశతాబ్ది ఆరంభములో విద్య గురుకులపద్ధతినే సాగుచుండెడిది. దీనికి ఆకాలములో దేవాలయములు, మఠములు, వేదపాఠశాలలును దోహదము కల్గించుచుండెడివి. పుణ్యక్షేత్రములయిన తిరుపతి, తంజావూరువంటి స్థలములలో గురుకులములును, వేదపాఠశాలలును వృద్ధిపొందుచుండెడివి. తంజావూరువంటి చోటులలో గ్రంథాలయములుకూడ ఉండెడివి. బ్రిటిషుప్రభుత్వకాలములో ప్రతి నగరమునందును, పల్లెయందును, పట్టణమునందును వీథిబడులుండెడివి. గుంట "ఓనమాల" తో ప్రారంభించి అమరము, ఆంధ్రనామ సంగ్రహము, పెద్దబాలశిక్ష, బాలరామాయణము, కృష్ణశతకము, నరసింహశతకము, వేమనశతకము, సుమతీశతకము, మొదలయినవి పిల్లలు నేర్చుకొనువారు. ఇవి పూర్తిఅయినతరువాత సంస్కృతములోని పంచకావ్యములను కొందరు విద్యార్థులు నేర్చుకొనువారు. ప్రతిదినమును కొన్ని ప్రార్థనశ్లోకములును, తిథులు, మాసములు, నక్షత్రములు, సంవత్సరములు వీనిపేరులను ఒకరు చెప్పుచుండగా, మిగిలిన పిల్లలు కూడబలికి వల్లించెడివారు. ప్రారంభవిద్య పూర్తి గావించి ఉత్సాహముగల విద్యార్థులు వేదాధ్యయనము చేయువారు. కొందరు తర్కము, వ్యాకరణము, సాహిత్యము, జ్యోతిషము, ఆయుర్వేదము మొదలయిన శాస్త్రములలో ఆ యా విద్యలలో ఆరితేరిన పండితులవద్ద ఉన్నతవిద్య అభ్యసించువారు. వేదవిద్యలు బ్రాహ్మణులుతప్ప, వైశ్య క్షత్రియ శూద్రులకు నిషిద్ధముగా ఉండినవి.

1804-5లో వెల్లస్లీప్రభువు రాజప్రతినిధిగా నున్నపుడు ఇంగ్లీషువిద్య మనదేశములో ప్రారంభమైనది. మనదేశమునకు ఉద్యోగరీత్యా వచ్చిన ఆంగ్లేయులకొఱకును, కంపెనీవారికొలువులో పనిచేయు మన దేశీయులకొఱకును ఈ విద్యాలయములు ఉపకరించినవి. అప్పటికే విలియమ్ జోన్సు, మేక్సుముల్లరువంటివారు భారతీయ విజ్ఞానప్రతిభ గుర్తించిరి. 1832-33 నాటికి విద్యా

విధానములో కొన్ని సమస్యలవతరించినవి. ప్రభుత్వమువారు స్థాపించిన బడులలో చెప్పు విషయములు దేశీయవిజ్ఞానమును అనుసరించియుండవలయునా? పాశ్చాత్యవిజ్ఞానమును అనుసరించియుండవలయునా? దేశభాషద్వారా విషయములు బోధించవలెనా? ఆంగ్లభాషద్వారా బోధించవలెనా? అను విషయములు మీమాంసకు వచ్చినవి. అప్పుడు మెకాలే దొరగారు పాశ్చాత్యవిజ్ఞానమే బోధించవలెననియును, అది ఆంగ్లభాషద్వారా చెప్పవలెననియును సలహాయిచ్చిరి. అప్పటి దేశీయ భాషాగ్రంథములలో చెప్పిన మూఢవిశ్వాసములను ఛాందసపద్ధతులను వారు గేలిచేసిరి. మెకాలే సలహా ఫలించి మిషనరీసంస్థలవారును, సర్కారువారును జిల్లాలలోని ముఖ్యనగరములందును, కొన్నిగ్రామములందును పాఠశాలలు నెలకొల్పినారు. 1857 లో చెన్నరాష్ట్రమునకు మద్రాసులోను, బొంబాయిరాజధానికి బొంబాయిలోను, వంగరాష్ట్రమునకు కలకత్తాలోను విశ్వవిద్యాలయములు (యూనివర్సిటీస్) స్థాపించిరి. నాటినుండి విద్యాసంస్థలు మూడుతరగతులుగా పనిచేసినవి. ప్రాథమికపాఠశాలలు (Elementary Schools) ఉన్నత పాఠశాలలు (Secondary Schools) కళాశాలలు (Colleges)

18వ శతాబ్ది చివరిభాగములో మిషనరీలు చిన్న బడులుపెట్టి చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట నేర్పుచు, కొన్ని పాఠ్యగ్రంథములనుంచి వానిలోనివిషయములను చెప్పుట ప్రారంభించిరి. ఈ బడులకు ప్రభుత్వమువలన ఆర్థికసహాయము లభించినది. ఆకాలములో ప్రభుత్వమువారొక ప్రైమరీపరీక్ష నిర్వహించుచుండువారు. దానితరువాత లోయరుసెకండరీపరీక్షలు, అటుపిమ్మట మెట్రిక్యులేషన్‌పరీక్షలును ఉండెడివి. వీనిలో ఉత్తీర్ణులయినవారికి ప్రభుత్వ ఉద్యోగము లిచ్చెడివారు. యూనివర్సిటీలు పెట్టిన యఫ్. ఏ., బి. ఏ. పరీక్షలలో ఉన్నతవిద్య నభ్యసించినవారు ఉత్తీర్ణులగువారు. ఈ పరీక్షలలో ప్యాసయినవారిని ట్రెయినింగ్‌పాఠశాలలో తరిఫీదునిచ్చి ఉపాధ్యాయులుగా నియమించువారు. ఆవిధముగా అనేక

పండితులు కవులు ఉపాధ్యాయవృత్తినవలంబించి తమ తీరికసమయములో ఇతోధిక సాహిత్యసేవ చేయుచూరు.

1880లో స్థానికప్రభుత్వవిధానము అమలులోనికి రాగానే మ్యునిసిపాలిటీలూ, తాలూకాబోర్డులూ, జిల్లాబోర్డులూ వచ్చి విద్యాసంస్థలపైన ముఖ్యముగా ప్రాథమికపాఠశాలలపైన అధికారము నిర్వహించుటకు పూనుకొనిరి. అప్పటికి మ్యునిసిపాలిటీయున్న ప్రతినగరమునందును కొన్ని ప్రాథమికపాఠశాలలు కలవు. జిల్లాలలో 2000కు మించిన జనసంఖ్యగల ప్రతిగ్రామమందునను పాఠశాల లేర్పడినవి. 2000కు తక్కువజనాభాగల గ్రామములలోమాత్రము ఏ బడులును లేవు. అప్పటికి చదువను వ్రాయను నేర్చినవారిసంఖ్య తక్కువ.

ప్రాథమికపాఠశాలలో విద్య పూర్తిచేసికొన్నతరువాత లోయర్ సెకండరీపాఠశాలలో ప్రవేశించువారు. అక్కడ విషయములన్నియును ఆంగ్లభాషలో నేర్పువారు. ఆ కారణముచేత మాతృభాషయందలి జ్ఞానము వృద్ధిపొందుటకు ఆటంకమేర్పడినది. నేర్చుకొన్న కొద్దివిషయములైనను నిర్దుష్టముగాను స్పష్టముగాను మాతృభాషలో చెప్పలేకపోయిరి. ఇట్టి విద్యావంతులకు ఆంగ్లములో ఆలోచించుట, ఆంగ్లములో మాటలాడుట పరిపాటియైనది. కొందరు మరీ తెనుగుతెలియని ఆంగ్లమానసపుత్రులై తెనుగు మీరిపోయిరి.

1835 తరువాత వంగదేశములో ఆంగ్లవిద్య ఇతరప్రాంతములలో కంటె హెచ్చు అభివృద్ధిచెందెను. ప్రతిజిల్లాకును ముఖ్యనగరమునందు ఒక ఇంగ్లీషు లేక ఆంగ్లో - వర్నాక్యులర్ స్కూలు స్థాపించిరి. వీనిలో అభివృద్ధిగాంచిన కొన్నింటిని కళాశాలలుగా పెంపొందింపజేసిరి. 1854 కలకత్తా ప్రెసిడెన్సీకాలేజీని ప్రభుత్వము తీసికొని నడిపించెను.

మద్రాసురాష్ట్రములో విద్యావిషయక కృషి మిషనరీల ద్వారా సాగెను. కుంపెణీపరిపాలన అంతమగునాటికి 1854 లో

విద్యావిషయ సంస్కరణలను చేయుటకు ఒక 'డిస్పాచ్'ని పంపించి యుండిరి. దానిఫలితముగానే అత్యున్నతవిద్య గఱపుటకు విశ్వవిద్యాలయముల స్థాపన జరిగినది. సిపాయీలకలహము అను స్వాతంత్ర్యయుద్ధ ఫలితముగా కుంపెణీపరిపాలన అంతమగుట, విక్టోరియారాణిపరిపాలన వచ్చుటతోపాటు 1857–58లో విశ్వవిద్యాలయములస్థాపన జరిగినది. మద్రాసువిశ్వవిద్యాలయములో తెలుగు అధ్యాపకుడుగానున్న ఆనాటి లక్షణకర్త చిన్నయసూరి పెట్టిన దీపము—బాలవ్యాకరణముగా అవతరించి తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నదిగానే నిలిచిపోయినది. చిన్నయసూరియును ఆతని అనుయాయులును రచించిన గ్రంథములే ఆనాటి పాఠశాలలందునను, కళాశాలలలోనూ చదువుకొను విద్యార్థులకు పాఠ్యగ్రంథములైనవి.

నూతన విద్యాధానము ప్రవేశపెట్టినతరువాత సి. పి. బ్రౌను దొరవంటివారలు పాశ్చాత్యులకొఱకును, పాఠశాలావిద్యార్థుల నిమిత్తమును కొన్ని పాఠ్యపుస్తకములను, వాచకపుస్తకములను వ్రాయించిరి. వానినిబట్టి ఆనాటి భాష, అందలి ప్రయోగములు తెలియును. అంతేగాక, కల్నల్ మెకంజీదొర, సి. పి. బ్రౌను దొరవంటి పాశ్చాత్యులు ఆంధ్రదేశమంతటను పర్యటనముచేసి పురాతనగ్రంథములను సేకరించి, వాటిని సలక్షణపాఠములతో ప్రకటించిరి. వానినిగూర్చి – మరొకచోట ప్రస్తావించగలము.

విద్యావిధానములోవచ్చిన విశిష్టమైనమార్పులతో మనభాష మనసాహిత్యము చాలరకములైన క్రొత్తవిషయములను సమకూర్చుకొన్నది. ఆనాటి ప్రపంచమున జరిగిన విజ్ఞానపరిశోధనల ఫలితముగా దేశీయులభావములే పూర్తిగా మారిపోయినవి. స్టీమరు (1807) రివాల్వరు (1837)విద్యుత్తంతి (1835) టెలిఫోను (1876) సినిమాయంత్రము (1893)సెల్యులాయిడ్ (1870) కుట్టుయంత్రము 1830) ఫొటోగ్రఫీ (1837) డైనమైటు (1867) వైర్ లెస్ (1895) 'ఎక్సరే' (1895) ఫొటోఫిల్ము (1883) రైల్వేయింజను (1829)

మైక్రోఫోను(1877) రబ్బరుటైరు (1888) బైసికిలు (1840) మోషన్‌పిక్చర్ ప్రొజెక్టరు (1805) లినోటైపు(1885) ఉక్కు (1858) ఫౌన్‌టెన్‌పెన్ (1864) టైపుమిషన్ (1873) స్టెతోస్కోపు (1819) ఇవన్నియును 19వశతాబ్దిలోనే వివిధశాస్త్రజ్ఞులు పరిశోధనలుచేసి, అనేక ప్రయోగములయనంతరము కనిపెట్టిరి. ఇవి మన దేశజీవనము పైన తమప్రభావమును ప్రసరింపజేసినవి. ఉదాహరణగా, వైర్లెస్, సినీమాయంత్రములను కనుగొనుటవలన మన సాహిత్యపువిలువలే మారిపోయినవి. సాహిత్యము అక్షరాస్యులయినవారికే గాక, చదువను వ్రాయను తెలియనివారికికూడ అందుబాటులోనికి తేవచ్చునని నిరూపించినవి. అచ్చుయంత్రమువలన సాహిత్యగ్రంథములు అసంఖ్యాకముగా అచ్చుపడుటకును, అచ్చుపడినవి అనేకము ఒకసారి పలువురి కరతలములను అలంకరింపజేయుటకును అవకాశము లభించినది. దానితో సాహిత్యమునకు క్రొత్త పోషకులును, క్రొత్త పాఠకులును లభించిరి. ఈ పాఠకుల నాకర్షించుటలో భాషయును, ప్రయోగములును సులభమై సుబోధకమై ఒక ప్రజానురంజకత యను నూతనగుణమును సంతరించుకొన్నవి. విద్యావ్యాప్తివలనను, విజ్ఞానప్రచారమువలనను విన్నది చదివినది నమ్ముస్థితి పోయి, ప్రతి విషయమునుప్రశ్నించి పరిశోధనలకు ప్రశ్నలకుపరీక్షలు పెట్టి దానిలో నిగ్గుతేరినదానినే పేర్కొనుట పరిపాటియైనది.ఒకరుసంపాదించినవిజ్ఞానము వారితో అంతరింపనీయకుండ, అది బడులలోనూ, వీధిపాఠశాలలలోనూ బహిరంగముగా విద్యను ఉచితముగా నేర్చుకొన్నవారికి పంచిపెట్టిరి. విద్యాదానములో జాతిభేదములు, వర్గతారతమ్యములు, వర్ణవ్యవస్థలును పాటించక అడిగినవారికి విద్య ఉచితముగా లభింపజేసిరి. అంతేగాక, విద్యచెప్పుటలో రహస్యములు పాటించలేదు; నిషేధములు పెట్టలేదు. సమర్థులయినవారు తెలివితేటలుగలవారు ఎంత ఉన్నతవిద్య నభ్యసించినను చదువుకోనిచ్చిరి. అట్లే స్త్రీపురుషులమధ్య విభేదముచూపక, స్త్రీలు పురుషులతోపాటు ఎంత ఉన్నతవిద్యనయినను పొందుటకు అవకాశమిచ్చిరి. సంస్కృతపద్ధతిని

ముందు అర్థము తెలియకుండ వల్లెవేయించుపద్ధతి మాన్పించి తెలిసిన విషయమును గ్రహించినతరువాత దానిద్వారా తెలియని అంశములు గ్రహించు ప్రాథమిక విద్యాసూత్రములను మన్నించిరి. అందుచేతనే తరగతులవారీగా వాచకములు, పాఠ్యపుస్తకములును పెట్టి వానిలో శబ్దములు, వాక్యములు, ప్రయోగములు మొదలైనవి కొన్ని నేర్చినతరువాత వానిమూలముగా మరికొన్ని క్రొత్త విషయములను నేర్చుకొనుటకు ప్రోత్సహించిరి. పురాణములలోనూ, రామాయణ భారతాదికావ్యములలోను ఉన్న విషయములనేకాక చరిత్ర, భూగోళము, భౌతికశాస్త్రము, ఖగోళశాస్త్రము, రసాయనశాస్త్రము, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, శారీరకశాస్త్రము మొదలయిన ఆధునిక విజ్ఞానవిషయములను బోధించుటచేత ప్రజల మనోభిప్రాయములును భావనలును మార్పుచెందినవి. దానితో ప్రజలలో ఒక క్రొత్త దృక్పథము, ఒక క్రొత్త చింతనము ఏర్పడి, విజ్ఞానతృష్ణ, పరిశోధనాదృష్టి ప్రబలినవి. వీనిప్రభావము ఆనాటి సాహిత్యమునందుసైతము అచ్చుగ్రుద్దినట్లు కన్పించినది. ఈ కారణముచేతనే తెనుగుసాహిత్యములో మరి యే యుగమునందును అంతకుమునుపు రాని శాస్త్రీయ విజ్ఞానగ్రంథములు నూతనదృక్పథముతో పలువురు రచించుట జరిగినది. వానిని జనసామాన్యమునకు అందుబాటులోనికి తెచ్చులాగున ప్రకటించుటయును జరిగినది. ఈవిధముగా ఏ కొలదిమందికో తెలిసిన అలంకారశాస్త్రములవంటివి సైతము ముద్రణపొంది పలువురు పాఠకులకరకమలముల నలంకరించినవి.

# మత సంప్రదాయములు

తెనుగుదేశములో ఏ మతము వచ్చినను వెనువెంటనే దానికి తగిన అనుయాయులు బయలుదేరిరి. హిందూమతములో ఎన్ని విభేదములున్నను అవియన్నియును ఆంధ్రదేశమున అభివృద్ధి గాంచినవి. బౌద్ధము, జైనము, శైవము, వైష్ణవము అద్వైతము, మాధ్వమతము మొదలయినవన్నియును పూర్వకాలమునుండి నేటి వరకును ఆంధ్రదేశమున ప్రవర్తిల్లుచున్నవి. 19వ శతాబ్దిలో వచ్చిన మతసంప్రదాయములలో క్రైస్తవమతము ఎక్కువ ప్రభావముచూపి నది. 1805వరకు ఆంధ్రదేశమున ముఖ్యముగా గుంటూరుజిల్లాలో రోమన్‌క్యాథలిక్ మతము వ్యాపకములోనుండెను. వీరికి 'పోపు' మతాధికారి. 'పోపు' మతాధికారము నంగీకరించని ప్రొటెస్టెంటు మతస్థులు 1805నుండి తమప్రచారము సాగించిరి. రోమన్‌క్యాథ లిక్కులు 1834లో హైదరాబాదులో ఒకసంస్థను, 1845లో విశాఖ పట్టణములో మరియొకసంస్థను స్థాపించి, వారి మతప్రచారమును సాగించిరి. వీరిప్రచారమునకు తెనుగుభాషలోనికి చేసిన అనువాద ములు తోడ్పడెడివి. ఆకాలములో క్రైస్తవప్రచారకులుగా మనదేశ మునకు విచ్చేసిన విదేశీయులుమనభాష నేర్చుకొని స్వయముగా మత గ్రంథములను అనువాదముచేసి ప్రకటించుచువచ్చిరి. వారి 'సెర్మను' లను తెలుగుభాషలోనే చెప్పుచువచ్చిరి. ప్రొటెస్టెంటుప్రచారము లండన్ మిషనరీ సొసైటీద్వారా సాగుచుండెడిది. వీరు విశాఖపట్ట ణములో మొదట స్థావరమేర్పరచుకొని సుబ్బరాయడను తెలుగు బ్రాహ్మణునకు క్రైస్తవమతమిప్పించిరి. ఆతనిసాయమున బైబిలును, తక్కిన మతగ్రంథములను తెనుగులోనికి అనువాదముచేయించిరి. 1822నుండి వీరు కడపజిల్లాయందు తమప్రచారము సాగించిరి.

కలకత్తాలో స్కాచ్ మిషనరీ అలెగ్జాండర్ డఫ్ ఒక నూతన విధానము నవలంబించి దేశీయు లున్నతవిద్య నేర్చుటకు ప్రోత్స హించెను. 1841లో నోబెల్ అనునతడు మచిలీపట్టణము వచ్చి ఈ

పద్ధతిననుసరించు ఒక విద్యాలయము స్థాపించెను. అదియే నోబెల్ కళాశాలగా పనిచేసినది. కొంద రీతనిబోధనలు విని క్రైస్తవమతము నవలంబించిరి. అట్టివారిలో అగ్రకులములవారుకూడ గలరు. తరువాత క్రిందికులములవారినికూడ మతములో చేర్పించెను. ఈ మిషనువలెనే మిగిలినచోటులలోనున్న మిషనులవారుకూడ మతప్రచారమునకు పాటుపడిరి. 1842 లో లూథరన్ మిషనువారు గుంటూరులో విద్యాలయమును స్థాపించిరి. అదియే నేటి ఆంధ్ర క్రిష్టియన్ కాలేజి. నిమ్నజాతులవారనేకులు ఈ మతప్రబోధము వలన మతము మార్చుకొని క్రైస్తవులైరి. 1840లో ఆంధ్రదేశమున మతప్రచారమునకు పూనుకొన్న అమెరికన్ బాప్టిష్టు మిషన్‌వారు 1866 నుండి ఒంగోలులో ఒక కేంద్రమును పెట్టి మతప్రచారము చేసిరి. అందుల కొక పాఠశాలపెట్టిరి. వారు చాలమంది మాదిగలకు క్రైస్తవమతమిప్పించిరి. ఈ పనిలో ఎర్రగుంట్ల పేరయ్యాఅను మిషనరీ ఎక్కువగ సాయపడెను. 1876 లో కరువువచ్చినపుడు వీరు విచక్షణలేకుండ దినమునకు నూర్గురికిపైగా మతదీక్షనిచ్చి భోజనము పెట్టి పోషించిరి. ఇవిగాక కెనేడియన్ బాప్టిష్టు మిషన్, అమెరికన్ మిషన్ మొదలైనవి యేర్పడినవి. నెల్లూరుజిల్లాలో తెలుగు బాప్టిష్టు హోమ్ మిషన్ సొసైటీ యేర్పడినది. ఇటువంటిదే ఇండియన్ మిషనరీ సొసైటీశాఖ యొకటి తెలంగాణాలో డోర్నకల్లునుండి చిరకాలముగా పనిచేయుచున్నది. క్రైస్తవప్రచారమువలన పుస్తకముల వ్యాప్తి, అనువాదగ్రంథములవ్యాప్తి హెచ్చినది. తెలుగు వచన రచనలో బైబిలుభాష ఒక విలక్షణతత్వము నలవరచుకొన్నది. క్రైస్తవమతములో కలియుటవలన, అనేక నిమ్నజాతులవారికి కులమువలన వచ్చిన నీచత పోయి, సంఘమునందొక స్థాయి, ఒక గౌరవము ఏర్పడుటయేగాక, ఆర్థికముగా కొంతవరకు లాభించినది. విద్యావిషయములో క్రైస్తవమిషనరీ పాఠశాలలు మొదట కేవలము మతప్రచారముకొఱకే ఉద్దిష్టమైయున్నను అనుభవమును బట్టి చూచినచో నాటి ఆంగ్లవిద్యను, ఆ విద్యవలన వ్యాప్తిచెందిన నవీనవిజ్ఞాన

మును కులమత విభేదములులేక అందరికిని వెదజల్లుటలో ఎక్కువగా ఈ క్రైస్తవపాఠశాలలు తోడ్పడినవి. నాడు పాఠశాలా మాత్రముగా ప్రారంభించిన ఈ సంస్థలు నేడు శతవార్షికవర్ధంతులు జరుపుకొని ఉన్నతకళాశాలలుగాను, ప్రత్యేక విద్యాలయములుగాను అభివృద్ధిచెందినవి. ఈ మిషనరీలే ముద్రణాలయములను, వార్తాపత్రికలను, వైద్యశాలలను, అనాథశరణాలయములను, కుష్ఠురోగనివారణశాలలను పెట్టి ప్రజలకు మతప్రబోధమువలననేగాక, ఐహికవిషయములందు సహితము అనేక సదుపాయములను కల్పించిరి.

ఈ మిషనరీలు తమ నాగరికత, ఆచారములను మనదేశమున పెంపొందింపజేసిరి. వారినాగరికత, వారివిజ్ఞానము మనకు కొంత విశాలదృష్టి, ఉన్నతాదర్శముల నేర్పరచుకొనుటకుదోహదముచేసినవని చెప్పవచ్చును. వీనికి నిదర్శనములుగా బయలుదేరిన విద్యాలయములు, అక్కడ తలసూపిన రాజకీయ సాంఘికసిద్ధాంతములు, మొదలుపెట్టిన వైజ్ఞానిక శాస్త్రీయ పరిశోధనలును చూపవచ్చును.

19వ శతాబ్దిలో స్థాపించిన మతములలో మరొకటి బ్రాహ్మసమాజము.ఇది ఇంచుమించుక్రైస్తవమతమునకుప్రత్యర్థిగా,హిందూమతమునకుచేసిన సంస్కరణవలన వచ్చినదనవచ్చును. ఇది ఆరంభించిన ప్రవక్త రాజా రామమోహనరాయలు వంగదేశమునుండి 1828లో దీనికి ప్రాణముపోసెను. దీనికి కేశవచంద్రసేన్, దేవేంద్రనాథ్ ఠాకూర్, బిపిన్‌చంద్రపాల్, హేమచంద్రసర్కారువంటివారలు నూతననిర్వచనములొసగి నవీనమార్గములలో ప్రచారముగావించిరి. దక్షిణభారతమున దీనిప్రచారము ప్రారంభముచేసిన బ్రాహ్మసమాజనాయకుడు బ్రహ్మానంద కేశవచంద్రసేనుడు. 1864లో ఈయన మద్రాసుకు విచ్చేసి, బ్రాహ్మధర్మమునుగూర్చి గంభీరోపన్యాసములు చేసిరి. అప్పుడు వారియుపన్యాసములు రాజగోపాలాచారి, సుబ్బరాయలుశెట్టి అను యువకులను ఆకర్షించినవి. వారితరువాత శ్రీధరన్ నాయర్ అను యువకుడు వంగదేశమునకు పోయి

చూచివచ్చి 1871లో దక్షిణభారత బ్రాహ్మసమాజమును స్థాపించెను. 1878లో ఆంధ్రదేశమునుండి మన్నవ బుచ్చయ్యపంతుల అను బడిపంతులు మద్రాసు బాలికాపాఠశాలలో పనిచేయుచ బ్రాహ్మసమాజమును అన్నాపిళ్ళెవీథిలో నెలకొల్పెను. అంతలో 1881లో పండిత శివనాథశాస్త్రి విచ్చేసి బ్రాహ్మమతప్రచారము గావించెను. ఆయనప్రబోధామృతమును గ్రోలి విద్యార్థిగానున్న రఘుపతి వేంకటరత్నమునాయుడు బ్రాహ్మధర్మదీక్షబూనెను. దీనికి తరువాత కందుకూరి వీరేశలింగంపంతులు దోహదముచేసిరి. 1895లో వీరేశలింగముగారు మద్రాసు కళాశాలాధ్యాపకులుగా వచ్చినపుడు బ్రాహ్మధర్మప్రచారము మరింత వృద్ధికాంచి, సంఘసంస్కరణసమాజము, స్త్రీపునర్వివాహోద్యమములు విజృంభించినవి. ఇవి ఒకదానికొకటి తోడ్పడినవి.

అచ్చటనుండి వీరేశలింగంపంతులు రాజమహేంద్రవరమునకు బదిలీయై రాగానే, ఈ యుద్యమమును కొనసాగించెను. మహాపండితుడును మేధావియైన వీరేశలింగము తేటతెల్లమైన తెనుగుభాషలో స్త్రీలకును పామరులకును తెలియునట్లు సుబోధక శైలిలో ఎన్నో గ్రంథములను వ్రాసి ఉపన్యాసములిచ్చి, తన నూతనసిద్ధాంతములను ప్రచారములోనికి తెచ్చెను. వంగదేశమున ఈశ్వరచంద్రవిద్యాసాగరునివలె ఆంధ్రవిద్యాసాగరునిగా తానొక హితకారిణీ సమాజమును, ఆస్తికోన్నతపాఠశాలను స్థాపించి, క్రైస్తవ మిషనరీలలాగున నూతన విద్యాప్రచారమునకూడ దోహదముచేసెను. 1870 – 1880 మధ్య తెనుగుజిల్లాలలోని ముఖ్యపట్టణములన్నింటియందును బ్రాహ్మసమాజములు వెలసినవి. 1870లో బరంపురములో బ్రాహ్మసమాజము స్థాపించబడెను. 1875 లో బందరులోను, 1878లో బాపట్లలోను, 1878లోనే రాజమహేంద్రవరములోను బ్రాహ్మసమాజములు నెలకొన్నవి. 1888లో దుగ్గిరాల సూర్యప్రకాశరావు, తాయి సూర్యనారాయణరావు ప్రభృతులు కాకినాడలో స్థాపించిరి. పిఠాపురకళాశాలలో వేంకటరత్నము

నాయుడుగారి ప్రాభవమువలన విద్యావంతులైన యువకులు ఆదర్శ జీవనము నభిలషించు నుద్దేశముతో బ్రాహ్మధర్మము స్వీకరించి, వివిధనగరములలో స్థాపించిరి. బ్రాహ్మసమాజము ఏకేశ్వరోపాసనను ప్రతిపాదించినది. విగ్రహారాధన వలదన్నది. కులమతభేదములతో కూడిన వర్ణవ్యవస్థ కాదని, వర్ణాంతరవివాహములను, సర్వవర్ణభోజనములను ప్రోత్సహించినది. అనాథశరణాలయములు స్థాపించి అగతికులకు గతి కల్పించిరి. అంటరానితనమును రూపుమాపి, నిమ్నజాతుల అభ్యున్నతికి తోడ్పడిరి. పరమేశ్వరధ్యానములో మధ్యవర్తులెవ్వరును లేరను ఉద్దేశముతో, నిత్య నిర్మల సంకీర్తనముతో, భక్తి ధ్యానములతో పరమేశ్వరానుసంధానమును సాధించుటకు ప్రయత్నించి ఒక ఆదర్శజీవనమును గడపుకొనుచు, పవిత్రలక్ష్యములను పాటించుచువచ్చిరి.

ఇట్టి ఆదర్శములను ప్రోత్సహించిన పాఠశాలలు వీరేశలింగముగారుస్థాపించిన ఆస్తికోన్నతపాఠశాల, పిఠాపురంలోని ఉన్నత పాఠశాల, కాకినాడలోని పిఠాపురం మహారాజా కళాశాల. ఇవి యన్నియును నాటి విద్యావంతులపైన ఒక ఉన్నతలక్ష్యదృష్టి నలవరచుకొను ఉత్తమదృక్పథమును చూపుటకు తోడ్పడినది. ఈ సంస్థలప్రభావమువల్లనే, వివిధరంగములలో నాయకులయినముట్నూరి కృష్ణారావు, వేంకటరత్నమునాయుడు, హనుమంతరావు, వీరేశ లింగంపంతులు, గురుజాడ అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, భోగరాజు పట్టాభిసీతారామయ్యవంటివారు బయలుదేరిరి. 20వ శతాబ్దిలో వివిధ సాహిత్యరంగములలో ప్రధానపాత్ర నిర్వహించిన ప్రముఖులలో వేంకటపార్వతీశ్వరకవులు, సింహత్రయము, కృష్ణశాస్త్రి, గుడిపాటి వేంకటచలం, చింతా దీక్షితులు మున్నగువారి మీదకూడ బ్రాహ్మసమాజమతముప్రభావము అంతో యింతో పని చేసినదని చెప్పవచ్చును. విద్యావంతులయినవారిలోని సనాతన భావములను పూర్తిగా మార్చివైచుటలో బ్రాహ్మసమాజము పని చేయుటయేగాక, నాస్తికములోనికి మునుగనున్న కొందరు యువకు

లను ఆస్తికులనుగాను శుద్ధవర్తనులుగాను మార్చుటకు బ్రాహ్మ సమాజ మెంతగానో తోడ్పడినది. బ్రాహ్మమతము కేవలము అవైదికముకాదు. హిందూమతమునకు కలిగిన నూతనస్వరూపము. ఆంగ్ల విద్యాధికులను ఎక్కువగా నాకర్షించినది.

ఆంగ్లవిద్య నభ్యసించి యింకను ప్రాచీనవిశ్వాసములనే బలపరచువారికి ప్రోత్సాహమిచ్చినది దివ్యజ్ఞానసమాజము. ఇది అనేకులను క్రైస్తవమతావలంబులుకాకుండ నిరోధించగల్గినది. హిందూధర్మ మొకటే శాస్త్రీయపరీక్షలకు నిలుచు శక్తియని నిరూపించిన దీ మతమే. దీనివలన హిందూమతధర్మములో పాశ్చాత్యుల శాస్త్రములను చదివి తెలిసికోవలసిన క్రొత్తవిషయము లేవియును లేవని చెప్పి, వైదికాచారములన్నియును ఆధునికశాస్త్రముచే సమర్థింపవచ్చునను వాదమును లేవదీసిరి. దీనికి కొందరు పాశ్చాత్యపండితుల గ్రంథములు తోడ్పడినవి. దీనితో పూర్వసంస్కృతగ్రంథములను ఇతర భారతీయభాషాగ్రంథములను సేకరించి జిజ్ఞాసతో అధ్యయనముచేయ మొదలిడిరి. హిందువులకు తమ గ్రంథములయెడల, తమ సంస్కృతియెడల తమ కళలయెడల గౌరవాభిమానములు పెరిగినవి. ఈ యాత్మాభిమానముతో తమ గ్రంథములను, తమ శాస్త్రములను పునర్విమర్శచేసికొని పఠింపదొడగిరి.

దివ్యజ్ఞానసమాజము 1875 సంవత్సరము నవంబరు 17వ తేదీని న్యూయార్కులో స్థాపించబడినది. అమెరికావాస్తవ్యుడు కల్నల్ ఆల్కాటుదొర, రష్యాదేశస్థురాలు మేడమ్ బ్లావట్స్కీ వీరుఇరువురు కలిసి దీనిని స్థాపించిరి. జాతి, మత, కుల, వర్ణ, లింగాదిభేదములు లేక విశ్వమానవ సౌభ్రాతృత్వమునుబోధించి ఈ మతము త్వరలోనే ప్రపంచవాసులనందరిని ఆకర్షించినది. 1879 ఆరంభములో న్యూయార్కునుండి బొంబాయికి, 1882 డిశెంబరులో అక్కడనుండి మద్రాసులోని అడయారుకు ప్రపంచకార్యస్థానము మార్చిరి. ఆల్కాటుదొర వేసిన పునాదిపైన డాక్టర్ అనిబిసెంటుసతి చక్కని మందిరమును నిర్మించిరి.

కల్నల్ ఆల్కాటును ఆంధ్రదేశములో తల్లాప్రగడ సుబ్బారావుగారు ఆహ్వానించి, 1882 ఏప్రిలు 22 వ తేదీని కలకత్తానుండి చెన్నపట్టణమునకు పిలిపించిరి. తరువాత వారు నెల్లూరువెళ్ళి అక్కడ అయ్యాలునాయుడు, జి. సుబ్బయ్యచెట్టిగారలతో పరిచయముచేసికొనిరి. 1881 మే నెల 3వ తేదీరాత్రి 11 గంటలకు నెల్లూరులో దివ్యజ్ఞానసమాజము స్థాపించిరి. నాడు కొందరు పండితులు మేడమ్ బ్లావట్స్కీతో సాహిత్యగోష్ఠి జరిపిరి. దానిఫలితముగానే నెల్లూరులో ఒక వేదపాఠశాల యేర్పడినది. అది నేడు సంస్కృతకళాశాలగా మారి విశ్వవిద్యాలయములో చేరి ప్రసిద్ధికెక్కినది. దీనికి బోడిరెడ్డి రంగారెడ్డిగారు చక్కని భవనమును కట్టించి భవనమును పాఠశాలను వృద్ధిచేసిరి. తరువాత కల్నల్ ఆల్కాటుదొర గుంటూరు, బాపట్ల నగరములలో ఉపన్యాసములిచ్చిరి. ఆకాలములో వీరు పడవలమీద, పల్లకీలమీద ప్రయాణముచేయవలసివచ్చినను శ్రమయనక వెళ్ళి, దూరదూరనగరములలో ప్రచారముచేసిరి.

1883 సెప్టెంబరు మాసములో ఆల్కాటుదొర బళ్ళారి, ఆదోని, హైదరాబాదు నగరములకు వెళ్ళి అక్కడ సమాజశాఖలను నెలకొల్పిరి. 1883లో సమాజము పేరు విని, విజయనగరమునేలు ఆనందగజపతి ఆల్కాటుదొరను ఆహ్వానించిరి. 1884జనవరిలో ఓడమీద ప్రయాణముచేసి, భీమునిపట్టణము రేవులో దిగి, అచ్చటనుండి గుఱ్ఱముపై నెక్కి విజయనగరముచేరి మహారాజావారితో నాలుగురోజులు గడపి, అనేకవిషయములను చర్చించిరి. రెండు బహిరంగోపన్యాసములిచ్చి ఒక సమాజశాఖ స్థాపించిరి. అడయారు గ్రంథాలయమునకు మహారాజాగారు రు 500లు విరాళమునిచ్చిరి.

గోరే గజపతిరాయణింగారి ప్రోత్సాహమున కాకినాడ వెళ్ళి, గౌతమయను పేరున సమాజమును స్థాపించెను. పిమ్మట రాజమహేంద్రవరము వెళ్ళి అక్కడ యొకసమాజము స్థాపించెను. తరువాత ఏలూరులోను బెజవాడలోను సమాజములు నెలకొన్నవి.

1889 మే 21వ తేదీని డా. అనిబిసెంటు ఇంగ్లండులో ఉండగా దివ్యజ్ఞానసమాజములో చేరెను. వెంటనే ఆమెలో నిద్రితమైయున్న పూర్వజన్మసంస్కారము మేల్కొని ఆమెచేత గొప్పకార్యములను చేయించెనందురు. ఈమె ఆల్కాటుద్వార, బ్లావట్స్కీలతో కలిసి గొప్ప ఉపన్యాసములిచ్చెను. "దివ్యజ్ఞానము – ఆధునిక భౌతిక శాస్త్రము" అనునది ఆమె అభిమానవిషయము. వీనినిగూర్చి ఆ కాలములో 1900 రాజమండ్రి కాకినాడసమాజములలోను ఆమె ఉపన్యసించెను. ఆమెఉపన్యాసము విన్నవారికి ఏదో దివ్యకర్ణామృతము గ్రోలుచున్నట్లనిపించి, మన మతవిశ్వాసములమీద హిందూ మతసంప్రదాయములమీద భక్తిప్రపత్తులను హెచ్చించెను.

ఇదేవిధముగా మన వేదధర్మములను, యజ్ఞకాండను పునరుద్ధరించి మన హిందూమతమునకు క్రొత్త ప్రాశస్త్యమును తీసికొనివచ్చిన మఱియొకమతము ఆర్యసమాజము. దీనిని కనిపెట్టిన భక్తుడు స్వామి దయానందసరస్వతి వేదములను సంస్కృతములోనుండి, హిందీలోనికి అనువదించి, "సత్యార్థప్రకాశిక" యను గ్రంథమును రచించెను. ఉత్తరదేశములో హిందూమతమును తిరస్కరించుచు అనేక ఖండనములుచేసిన ఇస్లాం, సిక్కు, క్రైస్తవమతముల వాదములకు సమాధానముచెప్పిన ఈ యుద్గ్రంథము ఆర్యసమాజవాదులకు ముఖ్య మతగ్రంథము. ఈ యార్యసమాజము పంజాబులోను, ఉత్తరాదిని, హైదరాబాదులో కొంతవరకును ప్రచారముపొందినది. దీని ప్రచారమున్నను లేకపోయినను, ఈ మతమునవలన చాల సాహిత్యము తెనుగులోనికి అనువాదమై అనేకగ్రంథముల రూపములో వెలువడినది.

ఏమతమును ప్రత్యేకముగా ప్రతిపాదించకపోయినను హిందూ మతములోని నిష్కామకర్మసిద్ధాంతమును, భక్తియోగమును సమర్థించి నూతన ప్రవక్తలయినవారు రామకృష్ణపరమహంస. ఆయన మహాభక్తుడు. పరమేశ్వరసాక్షాత్కారమునందిన చిదానందయోగి. ఆయనశిష్యుడైన వివేకానందుని ప్రచారమువలన ఈ మహనీయుని

సిద్ధాంతములు ప్రచారములోనికి వచ్చినవి. పాశ్చాత్య విద్యాప్రభావముచేత నాస్తికుడుగా ప్రారంభించిన వివేకానందుడు రామకృష్ణ పరమహంసను దర్శించి, ఆయనస్పర్శచేత పరమేశ్వరసాక్షాత్కారము పొందెను. ఈతడు మనదేశమునుండి బయలుదేరి చికాగోలో 1893లో జరిగిన ప్రపంచమతముల కాంగ్రెసులో ఉపన్యసించుచు మతప్రభావముగురించి మాటలాడినపుడు హిందూమతములోని సార్వజనీనత, సార్వకాలీనత, శాస్త్రీయదృక్పథము చూచి, అమెరికావాసులు సమ్మోహితులైరి. రామకృష్ణమతముతరఫున పరివ్రాజకులు సన్యాసులై, మతదీక్ష స్వీకరించి లోకోపకారము చేయుచుండుటయేగాక, గ్రంథాలయములు, విద్యాలయములు స్థాపించి, సాహిత్యప్రచారమును విద్యాప్రచారమును చేయుచున్నారు. అనాథశరణాలయములు, వైద్యశాలలు, అన్నసత్రములు మొదలైనవి స్థాపించి ప్రజలకు అవసరసమయములలో ఇతోధిక సేవగావించుచున్నారు.

దేశమునందంతటను; మతసంస్థలుఒకవైపు మతప్రచారమునకు పనిచేయుచు, వేరొకవైపు తమ మతప్రచారమునకు పీలైన సాహిత్యమును సృష్టించుకొనక తప్పనిసరిఅయినది. ఈ సాహిత్యసృష్టిలోను విద్యాప్రచారమునందును, విజ్ఞానప్రబోధమునందును వివేకవంతులయిన యెందరో యింగితజ్ఞులు ఆకర్షణపొంది తాము చైతన్యము పొందుటయేగాక, తమకు కలిగిన విద్యావిజ్ఞానసంపత్తితో తాము వరించిన నూతనప్రబోధమునకు తోడ్పడిరి. అట్టి నూతనప్రచారమునకును, నూతనభావముల వికాసమునకు ఆంధ్రదేశము అత్యంతము అనుకూలప్రదేశమైనది. ఆంధ్రు లేమతమును ద్వేషింపరు; ఏమతమును తూలనాడరు. అన్నిమతముల ప్రచారములను వినగలరు; విని అందలి సూక్ష్మవిషయములను తఱచిచూడగలరు. క్రొత్తలోని వింతయేగాక, విశేషములనుకూడ తెలిసకొనగలరు. అందుచేతనే 19వ శతాబ్దిలో దేశమునందు వ్యాపించిన క్రైస్తవమతము, బ్రాహ్మధర్మము, దివ్యజ్ఞానసమాజము, ఆర్యసమాజము, రామకృష్ణ

మతములు మొదలైనవన్నిటిని ఆంధ్రదేశ మాదరించినది; ఆహ్వానించి అభిమానముతో అభివృద్ధిచెందుటకు తగిన ఆస్కారము చూపినది.

> వినదగు నెవ్వరు చెప్పిన
> వినినంతనె వేగపడక వివరింపదగున్
> విని కల్ల నిజము తెలిసిన
> మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ.

అను నీతిని ఆంధ్రులు అక్షరాల పాటించినవారుకనుకనే అన్ని నూతన సంప్రదాయములను స్వీకరించి తమవిగా చేసికోనగల్గిరి. ఈ సంప్రదాయములన్నిటికిని తమ సాహిత్యములో చిరస్థాయి నివ్వగల్గిరి.

## ఆంధ్రదేశచరిత్రలో కొన్ని ముఖ్యమైన తేదీలు

1800 కడప, కర్నూలు, అనంతపురము, బళ్ళారిజిల్లాలను నైజాము ఇంగ్లీషువారి కిచ్చివేయుట.

1801 దత్తమండలములు ఏర్పడుట.

1806 తెలుగు అచ్చుఅక్షరములు తయారుచేయుట.

1827 తెలుగులిపితో అచ్చయిన ప్రథమగ్రంథము శబ్దమంజరి.

1829 బందరు ఉప్పెన.

1834 ఆంధ్రగ్రంథములు విరివిగా అచ్చుపడుట.

1835 ఆంధ్రనిఘంటు ముద్రణము.

1839 ఏనుగుల వీరాస్వామిగారి కాశీయాత్ర ముద్రణము.

1846 సంగీతచక్రవర్తి మహాభక్తుడు అయిన త్యాగరాజు పరమపదించిరి.

1848 వీరేశలింగంగారి జననము.

1857 విజయనగరములో – సంస్కృతకళాశాల – సంగీతకళాశాల స్థాపన.

1858 చిన్నయసూరి నీతిచంద్రిక.

1860 బాలవ్యాకరణము.

1862 సర్ ఆర్. వేంకటరత్నమునాయుడు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారల జననము.

1873 రాజమహేంద్రవరములో కళాశాల స్థాపన.

1885 దివ్యజ్ఞానసమాజము స్థాపన.

1886 విశాఖపట్టణము సరస్వతీనిలయస్థాపన.

1887 వీరేశలింగంగారు ఆంధ్రకవులచరిత్ర వ్రాయుట.

1893 శబ్దార్థచంద్రికయను నిఘంటువును మహాకాళి సూర్యారావుగారు ముద్రించిరి.

1900 గుంటూరులో సాహితీసంఘస్థాపనము.

1877 విజయనగరము మహారాజావారి కళాశాల స్థాపనము.

1878 మిసెస్ ఎ. వి. ఎన్. కాలేజీ స్థాపన – విశాఖపట్టణము.

1884 పిఠాపురంరాజావారి కళాశాల – కాకినాడ.
తిరుపతి వేంకటేశ్వరవిద్యాలయము – తిరుపతి.

1885 ఆంధ్ర క్రైస్తవకళాశాల – గుంటూరు.

1894 రాజమహేంద్రవరము ట్రెయినింగు కాలేజీ.

1895 పర్లాకిమిడిరాజావారి కళాశాల.

1896 ఆంధ్రదేశములో పలుప్రాంతములందు కరువులు.

# 4. విద్యా విధానము

మన దేశములో చాలకాలమువరకు ప్రభుత్వము నిర్వహించు పాఠశాలలు లేవు. ఎక్కువమంది చదువుకొనువారు లేరు. విద్య యనగా వేదవిద్యయే. వైదికవిద్యలు నేర్చుకొనువారు గురుకుల వాసముచేసి, గురుముఖతః వేదములు, తర్కము, మీమాంసవంటి శాస్త్రముల నభ్యసించువారు. ఈ విద్యార్థులు వారములుచేసికొని గురుశుశ్రూషచేసి సంవత్సరములకొలది అధ్యయనముచేయుచుండు వారు. విద్యచెప్పుటకు వేతనములులేవు. ఉచితమే. విద్యచెప్పిన గురువు తన శిష్యులకు విద్యాదానముచేసినందుకు అదియే యొక యున్నత గౌరవముగా భావించువాడు. అట్టి యుత్తమపండితుడైన గురువులవారియొద్ద విద్యనభ్యసించినందులకు నాటి ఛాత్రగణము తమ అదృష్టముగా భావించుకొనువారు. అప్పటి విద్యావ్యవస్థయే వేరు. దేశభాషలందు కంటె, సంస్కృతమునందు గౌరవమెక్కువ. రాజకీయములలో పార్సీభాషకు పరపతి మెండు. ఆకారణముచేత నాటివిద్యావంతులు సంస్కృతముగాని పార్సీభాషగాని విధిగా నేర్చుకొనుచుండువారు.

బ్రిటిష్‌పరిపాలన దేశములో వ్యాపించుసరికి, ప్రతినగరమందు నను పట్టణమందునను, పల్లెపల్లెయందునను చిన్నపిల్లలకోసము వీధి బడులుండెడివి. వీధికిఒక్కొక్క వీధిబడి. ఈబడులలోఅమరము ఆంధ్రము పెద్దబాలశిక్ష, బాలరామాయణము, కృష్ణశతకము, నరసింహాశత కము, వేమనశతకము, సుమతీశతకము, చిన్నగణితము మొదలయి నవి నేర్పువారు. ప్రతిదినమును కొన్ని ప్రార్థనశ్లోకములు, పద్య ములు, వారములు, నెలలు, నక్షత్రములు, సంవత్సరముల పేరులు మొదలయినవి పిల్లలకుచెప్పి పాటలవలె వల్లెవేయించెడివారు.

సంస్కృతము నేర్చుకొను విద్యార్థులు అమరము, శబ్దములు చెప్పు కొని క్రమముగా రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము చదువుకొని, భారవి, మాఘమువంటి పంచకావ్యములను వ్యాఖ్యా నముతోకూడ వల్లెవేయుట పరిపాటి. తెలుగుభాషయందు అభి మానముకలవారు మనుచరిత్ర, వసుచరిత్ర నంటివి పండితులవద్ద నభ్యసించువారు.

1804—5వరకు వెల్లస్లీప్రభువు రాజప్రతినిధిగా ఉన్నపుడు మనదేశములోనున్న ఆంగ్లేయుల పిల్లలకోసమును, కంపెనీవారి కొలువులో పనిచేయు భారతీయులకోసమును కొన్నిపాఠశాలలు ప్రభుత్వమువారు స్థాపించినారు. కంపెనీ గుమాస్తాలకు కావలసిన విద్యమాత్రమే యీ పాఠశాలలయందు నేర్పించెడివారు. తొలుత బ్రిటిషువారికి మనదేశీయులకు ఆంగ్లవిద్య నేర్పించుటకు సుముఖత లేదు. ఈవిద్య నేర్చిన భారతీయులు తెలివిమీరి ఎదురుతిరుగగలరేమో యని వారిభయము. ఈ భావమునే మెట్‌కాఫ్ అను ఆంగ్లపాల కుడు వ్యక్తముచేసెను.*

"ఉచితముగా విజ్ఞానప్రచారముచేయుట ఒక భయముగా పరిణమించి అదొక భయంకరవ్యాధిగా నాటిపాలకులను ఆవహించి నది. వారికి భీకరమైన పీడకలలువచ్చి, ముద్రణాయంత్రము, బైబిలు వీనినిగూర్చి కన్నపగటికలలు, దుస్స్వప్నాలు భయభ్రాంతులుగాచేసి, భయోత్పాతముతో లేచి నిలువబెట్టెడివి. ఆరోజులలో ఈ దేశీయు లను అత్యంతమూఢులుగా చేసి అంధకారములోనే ఉంచవలెనని పాలనవిధానము. అందుచేత మనపాలనలోగాని, స్వదేశసంస్థానము లలోగాని ప్రజలకు ఎంతమాత్రము విజ్ఞానము ప్రసాదించు ప్రయ త్నము జరిగిననుదానిని తీవ్రముగానిరసించి, ఎదిరించుట పరిపాటి అయినది."

---

*Kaye's Life of Metcalfe

అయినను హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్‌వంటి సంస్థానములలో విద్య మంచిప్రచారములో ఉండెడిది. ఉదాహరణముగా 1801లోనే ప్రజలకు విద్య అందుబాటులోనికి తెచ్చుప్రయత్నము జరిగినది. అందుచేతనే భారతదేశమంతటికిని అక్షరాస్యులసంఖ్య తిరువాన్కూరులోనే ఎక్కువ. నూటికి 58 మంది పురుషులు, 100కి 41మంది స్త్రీలు విద్యావంతులు.

బ్రిటిష్‌పాలకులు మనభారతీయుల విజ్ఞానవ్యాప్తికి ఎంతవిముఖులుగానున్నను, వ్యక్తిగతముగా కొందరు బ్రిటిష్‌విద్యావేత్తలు, పండితులు, మతప్రచారకులు, పత్రికాలేఖకులు మొదలయినవారు పాశ్చాత్యసంస్కృతిని భారతీయులకు అందించుటకు తోడ్పడినమాట వాస్తవము. ఆ ప్రయత్నములో కొన్నిటియెడల బ్రిటిష్‌పరిపాలకులతో సంఘర్షణము పడవలసివచ్చినది. నాటి * "ప్రభుత్వము - ఆధునికవిద్యాప్రచారముగూర్చి భయపడినమాట నిజము. అందుచేత ఎన్నో ప్రతిబంధకములను కలిగించినది. అయినను కొందరు సమర్థులును సత్పురుషులునయిన ఆంగ్లపండితులకారణముచేత, వారి చుట్టును కొందరు భారతీయవిద్యార్థులుచేరి, ఆంగ్లవిజ్ఞానము, సాహిత్యము, రాజకీయసంస్కృతి భారతదేశములో ప్రవేశపెట్టుటకు వీలయినది.... విద్యాప్రచారమునకు వ్యతిరేకముగానున్న బ్రిటిష్ పాలకవర్గముకూడ, తమసంస్థ అభివృద్ధికి అవసరములబట్టి కొందరి గుమాస్తాలను తరిఫీదుచేసి తయారుచేయక తప్పనిసరిఅయినది. ఇంగ్లాండునుండి, చిన్నఉద్యోగములుచేయుజనమును అధికసంఖ్యాకులను తెచ్చుటకు వీలులేకపోయినది. అందుచేత మనదేశములో విద్య నెమ్మదిగా వృద్ధిగాంచినది. అది అత్యంత పరిమితమై అపమార్గము పట్టినను, నూతనభావములను చైతన్యవంతమైన ఆలోచనలునుగల నవ్యభావప్రపంచములో ప్రవేశించుటకు మన మానసికద్వారములను తెఱచినవి."

---

* పండిత జవహర్లాలునెహ్రూ - భారతదర్శనము—381 పుట

ఆ కాలములో విజ్ఞానసాధనగా పరిణమించిన ముద్రణాయంత్రము, ఇతరయంత్రములు భారతీయులలో విప్లవజ్వాలలు రేపు ప్రమాదకరవస్తువులుగా భావించువారు. దీనినిగురించి ఒకకథకూడా ఉన్నది. ఆనాటి నైజాముప్రభువు, ఈక్రొత్తముద్రణాయంత్రములను యూరపియన్ మెషిన్లను చూడవలెనని కుతూహలముకనబరచెనట. అప్పటి బ్రిటిష్ రెసిడెంటు ఒక గాలిపంపు, ఒక ప్రెస్సు తెప్పించి యిచ్చెనట. దానినిచూచి, నైజాముప్రభువు ఇతర పురాతనవస్తువులతోపాటు మూల పారవైచెనట. కలకత్తాలో పాలకులు ఈ ప్రెస్సును స్వదేశీసంస్థానములో ప్రవేశపెట్టినచో ప్రమాదమువాటిల్లునని దురాగ్రహము ప్రకటించిరట. దానికి రెసిడెంటు, అంతగా ప్రమాదమనితోచిన ప్రెస్సు పగులగొట్టివేసెదనని చెప్పెనట. ఆ కాలములో ముద్రణాయంత్రములువచ్చుట ప్రభుత్వమునకు ఇష్టము లేదనుటకు ఇది దృష్టాంతము. కాని అచ్చుయంత్రములులేకుండ ప్రభుత్వము గడచునా? కలకత్తా, మద్రాసు మొదలయిన నగరములలో అచ్చుయంత్రములు స్థాపించిరి. ఆవిధముగా వచ్చిన తొలి ముద్రణాయంత్రము సిరామ్‌పూరులో బాప్టిష్టు మిషనరీలు స్థాపించినారు. 1780లో కలకత్తాలో ఒకఆంగ్లేయుడు తొలిపత్రిక పెట్టెను.

విద్యావిజ్ఞానవిషయములలోను, రాజకీయ ఆర్థిక వ్యవసాయ విషయములలోనూ వంగదేశములోనే మార్పులు హెచ్చుగా వచ్చినవి. 19వ శతాబ్దిఆరంభములో బెంగాలు భారతదేశమంతటిలోను ముందంజవేసినది. బ్రిటిష్‌ప్రభుత్వమునకు పరిపాలనా కేంద్రమగుటయేగాక ఆంగ్లవిద్యనభ్యసించిన విద్యావంతులను విజ్ఞానవంతులను ప్రసాదించినది. రాజకీయ, విజ్ఞానవిషయములలోను భాషా సాహిత్యములయందును మార్గదర్శకులనదగిన మహనీయులు కొందరు వంగదేశములో 19వ శతాబ్దిలో ప్రవర్తిల్లి – మనజాతీయభావోదయమునకు మూలపురుషులైరి. అట్టివారిలో రాజా రామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, రామకృష్ణపరమ

హంస ముఖ్యులు. రాజా రామమోహనరాయలు ఆ కాలపు సాంఘిక స్థితిగతులను చూచి శాస్త్రీయదృక్పథముతో కూడిన హిందూమత ధర్మమును ప్రచారముచేసెను. విద్యావిధానములో ఆధునికపద్ధతులు ప్రవేశపెట్టెను. ఆయన గవర్నరుజనరల్‌కు వ్రాసిన ఒక లేఖలో గణితము, రసాయనశాస్త్రము, ప్రకృతిశాస్త్రమువంటి శాస్త్రములు సక్రమపద్ధతులలో విద్యార్థులకు విధిగా నేర్పవలసిన అవసరమునుగూర్చి ఉద్ఘాటించెను. రామమోహనరాయలు సంఘసంస్కర్త; అభ్యుదయవాది; విప్లవకారుడు. "సతి" (సహగమనము) వంటి ఆచారములను నిలిపివేయగలిగిన దీక్షాపరుడు. 1780లో భారతీయపత్రికలకు మార్గదర్శి అయిన "తత్వబోధిని" అను పత్రిక పెట్టి ఈమహనీయుడు తననూతనభావములను వెదజల్లెను. ఈయన ప్రారంభించిన ఉద్యమమును వంగదేశములో ఈశ్వరచంద్రవిద్యాసాగర్, అక్షయకుమారదత్త మున్నగువారు కొనసాగించి, పత్రికాముఖముగాను, సభలలోను, వీరి నూతనసిద్ధాంతములను ప్రచారములోనికి తీసికొనివచ్చిరి.

బ్రిటిష్‌ప్రభుత్వము - విద్యాసంస్థలుపెట్టి ఆంగ్లము నేర్పుటకు సుముఖముగా లేకపోయినను కలకత్తా, ఢిల్లీవంటినగరములలో కొన్ని పాఠశాలలయందు ఆంగ్లము నేర్పుచుండువారు. చివరకు మెకాలే - విద్యావిధానముపైన 1835 ఫిబ్రవరి నెలలో వెల్లడించిన తీవ్రాభిప్రాయముల ఫలితముగా ఆంగ్లవిద్య భారతీయులకు నేర్పవలెనను నిశ్చయముజరిగినది. కలకత్తాలో ప్రెసిడెన్సీ కళాశాల స్థాపించినారు. 1857 నాటికి, కలకత్తా, మద్రాసు బొంబాయినగరములలో విశ్వవిద్యాలయముల స్థాపనకూడ జరిగినది.

*"ముద్రణాయంత్రముల రాకవలన, వాడుకవలన దేశభాషలకు గొప్ప దోహదముకలిగినది. వీనిలోకొన్ని భాషలు - హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, ఉరుదూ, తమిళం, తెలుగు, చిరకాలము

*పండిత జవహర్లాలునెహ్రూ—భారతదర్శనము—336 పుట.

నుండి వ్యవహారములో ఉండుటయేగాక, వికాసము చెందిన సాహిత్యముతో అలరారుచున్నవి. వీనిలో అనేక గ్రంథములు జనసామాన్యములో మంచి ప్రచారములోనున్నవి. వీనిలో గ్రంథములన్నియును మహాకావ్యములు; పద్యములు లేక ఛందోబద్ధములు. సులువుగా వల్లెవేయుటకు వీలుగాఉండెడివి. గద్యవాఙ్మయము ఈ భాషలలో లేదనియే చెప్పవచ్చును. ఉత్తమసాహిత్యము సంస్కృత, పర్షియన్ భాషలలోనే ఉండెడిది. ముద్రణాయంత్ర సౌకర్యమువలన కావ్యములపట్టు కొంత తగ్గినది. దేశభాషలలో వచన వాఙ్మయము వృద్ధిలోనికివచ్చినది. క్రైస్తవమిషనరీలు ముఖ్యముగా సిరామ్‌పూర్‌లోని బాప్టిష్టుమిషనరీలు ఈ విషయములో చాల తోడ్పడి, చాల చోట్ల ప్రెస్సులుపెట్టి బైబిలు గ్రంథమును వివిధభారతీయభాషలలోనికి అనువాదముచేసిరి. వచన వాఙ్మయమును ప్రచారములోనికి తెచ్చుటకు వారు చేసినప్రయత్నము జయప్రదమైనది.

తూర్పుఇండియాకంపెనీపరిపాలనలోని విద్యావిధానములో భారతీయులకు ఇంగ్లీషునేర్పెడివారుకారు. 1830లో కలకత్తాలోని హిందూకాలేజీవిద్యార్థులు కొన్నిసంస్కరణలు కోరుచు, ఆంగ్లవిద్య నేర్పుమని అడిగిరి. కంపెనీఅధికారములకు కొంత పరిమితియేర్పరచి విద్య ఉచితముగాను, నిర్బంధముగాను నేర్పవలసినదనికోరిరి. తత్ఫలితముగా ఉచితవిద్య లభించినది. ఆకాలములో సంస్కృతము, పర్షియన్ నేర్పు విద్యాశాలలుండెడివి. ఇవియన్నియును ప్రయివేటు వ్యక్తులు నడిపించువారు. అవి "మువాఫీ" లు అని పిలువబడెడివి. అట్టి విద్యాసంస్థలకు ఉచితవసతులు, భూములు ఉండెడివి. తూర్పు ఇండియాకంపెనీవారు ఈభూములు స్వాధీనపరచుకొన్నారు. దానితో చాల విద్యాలయములు, పాఠశాలలు మూసివేయవలసివచ్చినది. చాలమందికి ఉద్యోగములుపోయినవి. ఇట్టివారందరును ఇంగ్లీషు విద్యనభ్యసించిరి; బ్రిటిష్‌సర్కారునౌకరీలోచేరి ఉద్యోగములుచేసిరి.

ఇంగ్లీషువిద్యవలన – ఇంగ్లీషుసాహిత్యము సంస్కృతి విజ్ఞానము భారతీయులకు తెలిసినవి. వారిదృక్పథములో గొప్ప మార్పు

తెచ్చినది. ఈ పాశ్చాత్య భావప్రభావమువలన విద్యావంతులయిన యువకులలో చైతన్యము కలిగినది. 1852లో కలకత్తాలో బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ స్థాపించి యీ నూతనభావములకు ప్రచారముచేయుట జరిగినది. 1885లో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు సంస్థ వచ్చువరకును ఇదియే భారతీయులను క్రొత్తమార్గములో ఆలోచించుటకు తోడ్పడిన ఏకైకసంస్థ. పాశ్చాత్య భావస్రవంతి మన సాంఘికపద్ధతిలో విప్లవమునే తెచ్చినది. ఈ విషయమునే రవీంద్రనాథఠాకూరు తన 80వ జన్మదినసందేశములో (1941 మే 8వ తేదీ) పేర్కొన్నాడు.

"మన పరిపాలకుల వితరణమీద పూర్తిగా ఆధారపడుపద్ధతి గర్వకారణముకాదనుట నిజమే కాని మనలోనివిశేషము మానవ విశిష్టత ఒక పరదేశిలో కనిపించినను దానిని శిరసావహించునపుడు హృదయపూర్వకముగా స్వీకరించుటయే. మానవజాతిలోని అత్యుత్తమ వరప్రసాదములు ఒక ప్రత్యేకజాతికి, దేశమునకు చెందిన స్వంతఆస్తులు కావు; అది పరిమితమైనదికాదు. ఒక పిసినిగొట్టు నేల గుయ్యారములో దాచిపెట్టుకున్న దాపుకాదు. అందుకే, మన మనస్సులను ప్రోదిచేసిన ఇంగ్లీషుసాహిత్యము నేటికిని మన హృదయ కుహరాలలో ప్రతిస్పందన కలిగించుచున్నది." ఇంకను రవీంద్రుడు ఆనాటి సాంఘిక దురాచారములను తెలిపి యిట్లు ప్రస్తావించెను. "ఆకాలములో – ఈ సాంఘికాచారములు కట్టుబాట్లు పరిమితసీమ అయిన బ్రహ్మావర్తములో నడచినవి. ఈ చిన్నదేశము సరస్వతి, దృశ్యద్వతినదుల మధ్యనున్నది. క్రమముగా ఈ పరిమితధర్మములు పోయి, విశాలదృక్పథము పెరిగి, బ్రహ్మావర్తములో మనువు ప్రతిపాదించిన స్మృతి సాంఘికదౌర్జన్యముగా పరివర్తనచెందినది.

"నా చిన్నతనములో, బెంగాలులోని విద్యావంతులు, ఆంగ్ల విద్య నేర్చుకొన్న పెద్దలు – ఈ సాంఘికదురాచారముల నిబంధనలపై తిరుగుబాటుచేసిరి. ఈ మనుస్మృతులు నిర్ణయించిన ధర్మశాస్త్రమునకు బదులు – ఇంగ్లీషులో వచ్చిన 'నాగరికత' అను

పదము స్వీకరించినాము. మా కుటుంబములోనే, ఈ నూతన భావ పరివర్తనమునకు స్వాగతము చెప్పి, దీనిలోని నైతిక, తాత్వికశక్తుల అంతరార్థముగ్రహించుట జరిగినది. వానిప్రభావము మా జీవితము లోని అన్నిరంగములలోను పరిస్ఫుటముగా కనిపించినది. అటువంటి వాతావరణములో జన్మించి, సహజముగా సాహిత్యమువైపు అభి రుచిగల దృక్పథముతో, ఇంగ్లీషుకు నా హృదయపీఠముపైన ఉన్నత స్థానము నిచ్చినాను. ఆవిధముగా నా జీవితములో ప్రథమఅధ్యాయ ములు గడచిపోయినవి. తరువాత–ఎవరిదారివారిది అయినది–నాగరి కతలో ఉత్తమసత్యములని నమ్మినవి, ఉత్తమలక్ష్యములనుకొన్నవి సులువుగా ధిక్కరించి తమ జాతిదురభిమానములకు ఆధిక్యమిచ్చు చున్నారనగానే నా కెంతో విభ్రాంతీ, విచారమూ కలిగినది"

బ్రిటిష్‌వారి – ఆంగ్లవిద్యనభ్యసించి ఆకాలములో ఎందరో మహనీయులు ఉత్తమలక్ష్యములను, ఉత్తమదృక్పథమును ఏర్పరచు కొని, మన రాజకీయ సాంఘికవిప్లవములకు నాయకులైరి. ఈ నూతనభావములే – భాషాసాహిత్యములు పరిఢవిల్లిన నూతన పరి వర్తనలకు దారితీసినవి. తక్కువమంది పండితులకుమాత్రమే లభ్య మైన సాహితీ సంస్కృతవిజ్ఞానములు అధికసంఖ్యాకులయిన జన సామాన్యమునకు అందుబాటులోనికితెచ్చు ప్రయత్నములు విరివిగా జరిగినవి.

## కుంపిణీ కాలములో స్థితి

తొలుతలో బ్రిటిష్‌వారు – మన విద్యావిధానమునకు ఎట్టి దోహదమును చేయలేదు. లార్డ్ కార్న్‌వాలీస్ 1792లో కాశీలో ఒకసంస్కృతకళాశాలను స్థాపించుటకు ప్రభుత్వముచేత ద్రవ్యసాహా య్యము చేయించెను. కాని ఇది అంతగా వృద్ధికాలేదు. 1811లో లార్డుమింటో వ్రాసిన విజ్ఞప్తిలో విద్యనశించిపోవుచున్నదని గుర్తించి– జాగ్రత్తగా పోషించనియెడల అక్షరజ్ఞానము కలిగించుటకూడా

దుస్సాధ్యమగునని చేర్కొనెను. నాటికి పుస్తకములు లేవు; చదువు నేర్పు అధ్యాపకులులేరు. బడులులేవు. ఈదుస్థితిగుర్తించి 1813లో బ్రిటిష్‌పార్లమెంటువారు కంపెనీ విద్యావిషయకమైన శ్రద్ధతీసికొనవలెనని ఒక ఆశాసనముచేసిరి. కాని ఇది చాలకాలమువరకు అమలులోనికిరాలేదు. ప్రజలలో విద్యాప్రచారముచేయుటకు మిషనరీలు పూనుకొని ముద్రణాయంత్రసౌకర్యముతో బైబిలువంటి గ్రంథములను ప్రకటింపజొచ్చిరి. కళాశాలలను ప్రారంభించిరి. 1818లో ఒక బాప్టిష్టుమిషన్ పెరంబూరులో ఒక కళాశాల ప్రారంభించెను. కలకత్తాలో స్కూలుబుక్‌సొసైటీ ఒకటి, స్కూలు సొసైటీ ఒకటి వచ్చినవి. బొంబాయిరాష్ట్రములో ఎలిఫిన్‌స్టన్ (గవర్నరు) ప్రోత్సాహమువలన, ప్రజలే మూడులక్షల నిధిని ప్రోగుచేసి మూడుకళాశాలలు స్థాపించినారు. ఇట్లు చెదురుమదురుగా దేశములో చాలచోట్ల విద్యాలయములు వచ్చినవి. అక్కడ ఆంగ్లవిద్య నేర్పుచుండెడివారు.

1833లో కుంపిణీకి తిరిగి చార్టరు పంపునపుడు, లార్డ్ బెంటింక్ గవర్నరుజనరల్‌గా వచ్చిరి. అప్పటికే విద్యావిషయములను పరిశీలించుటకు నియమితమైన కమిటీలో రెండుపక్షము లేర్పడినవి. ఒకపక్షమువారు ప్రాచ్యభాషల ప్రాధాన్యము కోరువారు. మరొకపక్షమువారు ఆంగ్లభాషా ప్రాముఖ్యముకావలెననిరి. ఈయుభయులకు రాజీకుదరని సందర్భములో లార్డ్ మెకాలే తన "మినిట్" వ్రాసి సరియైన విద్యావిధానమును ఆదేశించెను. 1835లో వచ్చిన యీ ప్రణాళికప్రకారముగానే లోగడ వంగదేశములోను, ఇతరప్రాంతములలోను మన విద్యావిధానము రూపొందినది. వంగదేశములో ఇరువదిపాఠశాలలలో ఆంగ్లవిద్యాభ్యాసముజరుగుచుండెడిది. దేశీయ భాషలు అంత ఆదరణము పొందలేదు.

మద్రాసురాష్ట్రములో విద్యాప్రచారముచేయు భారము తొలుతలో మిషనరీలే స్వీకరించి వారు పలుతావులలో పాఠశాలలు నెలకొల్పిరి. చదువుట, వ్రాయుట, గణితము ఇవే ముఖ్యవిషయ

ములు. విద్యార్థులకు తరగతులవారీగా పాఠశాలలు స్థాపించి, వివిధ విషయములను నేర్పుచువచ్చిరి. ప్రభుత్వమువారు మిషనరీలు స్థాపించిన బడులకు గ్రాంటులనిచ్చువారు. బడులలోని తరగతుల వారీగా నేర్పు విద్యను అనుసరించి పాఠ్యపుస్తకములు కావలసి వచ్చినవి. రాష్ట్రములోని పాఠశాలలన్నియును ఇంచుమించు ఒకే విధానమును అనుసరించి పనిచేయుచుండెడిని. ఒకే పాఠ్యప్రణాళిక, ఒకేరకపు వాచకములు, ఒకేపద్ధతి విద్యావిధానము. ప్రభుత్వము పెట్టిన ప్రైమరీపరీక్షలకు విద్యార్థులను తయారుచేయుచుండువారు. ఈ పరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి ప్రభుత్వమువారి ఉద్యోగములు లభించెడివి. ప్రైమరీపరీక్ష తరువాత మిడిల్‌స్కూలు, మెట్రిక్యులేషన్, యఫ్. ఏ., బి. ఏ., మొదలయిన డిగ్రీపరీక్షలు జరిగెడివి. పరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి విద్యనేర్పు అధ్యాపకులు కావలసి వచ్చిరి. వారికి విద్యబోధించుటకు ట్రెయినింగుస్కూల్సు, కళాశాలలు వచ్చినవి. తూర్పుఇండియా కంపెనీవారికి 1857లో మరియొకచార్టరు వ్రాయవచ్చునప్పటికి దేశములో విప్లవము చెలరేగినది. 1857–58 నాటికి ముఖ్యనగరములలో విశ్వవిద్యాలయముల స్థాపన జరిగినది.

1880 లో స్థానికస్వపరిపాలన యేర్పడి, మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు వచ్చి, యీ స్థానికసంస్థలే ప్రాథమిక విద్యానిర్వహణభారము వహించినవి. ఆవిధముగా మునిసిపాలిటీయున్న ప్రతినగరములోను ప్రాథమికపాఠశాలలు వచ్చినవి. క్రమక్రమముగా 2000 మందికి మించిన జనాభాకలిగిన ప్రతి గ్రామములోను పాఠశాలలు వచ్చినవి. వానిపైన తాలూకాకేంద్రములో మిడిల్‌స్కూలు లేక సెకండరీస్కూలు, ప్రధాననగరములలో కళాశాలలు స్థాపించుట జరిగినది. వీని యభివృద్ధితో విద్యార్థుల క్రమవికాసముననుసరించి తరగతులప్రకారము పాఠ్యపుస్తకములు, సాహిత్యవాచకములు, భాషాభివృద్ధిపద్ధతులు కావలసివచ్చినవి. వానిననుసరించి నూతనసాహిత్యము వెలువడినది. వీనియందు

పాశ్చాత్య విజ్ఞానప్రభావముతో కూడిన శాస్త్రవిషయములకు, శాస్త్రీయ దృక్పథమునకు ప్రాధాన్యము లభించినది.

19వశతాబ్దిలో మన విద్యావిధానమును వర్ణించుచు విస్సా అప్పారావుగారు తెలుగుసంస్కృతి సంపుటములో ఇట్లు వ్రాసిరి.

*"చాల ఇటీవలివరకు ప్రాథమిక, లౌకికవిద్యలు నేర్పుటకై ప్రతిగ్రామమునందును వీధిబళ్ళు ఉండెడివి. ఆ ఉపాధ్యాయులను ఊరివారు పోషించి పిల్లలకు చదువుచెప్పించుకొనుచుండిరి. ఈ బడులలో నాల్గుతరగతులవరకు చదువు ఉండెడిది. బడిపంతుళ్ళు పెద్ద విద్యనేర్చినవారుకారు. వారునేర్పువిద్య లోకవ్యవహారమున కుచితమైనదై యుండెను. ఐదుబడులు, గుణింతములు పిల్లలచే ఇసుకలో దిద్దించువారు. విద్యార్థులు పేర్లు వ్రాయుట నేర్చినపిదప పలకలు పట్టించువారు. దస్తూరి కుదురుటకు చూచివ్రాత వ్రాయించువారు. తప్పులులేకుండ వ్రాయుటకు ఉక్తలేఖనము చెప్పువారు. కడితముపైన బలపముతోను, తాటాకుమీద గంటముతోను, పీచుకాగితము మీద మసిబుర్రలలోని సిరాతో బాతుకలములతోను వ్రాయుట విద్యార్థులకు నేర్పుచుండిరి. లోకవ్యవహారమునకు, కరిణీకమునకు, వ్యాపారమునకు ప్రభుత్వోద్యోగమునకు ఉపకరించు లెక్కలు పంచాంగవిషయములు, పురాతన రాజచరిత్రలు, వ్యవహారమునకు కావలసిన వివిధములైన వ్రాత ముసాయిదాలు మొదలయినవి విద్యార్థులకు నేర్పుచుండిరి. సమర్థులు భారతభాగవతాది పురాణపఠనమును నేర్పుచుండిరి. పెద్దబాలశిక్ష, నలచరిత్ర, బాలరామాయణము, ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షము, దాశరథిశతకము మొదలగునవి పైతరగతులలో వల్లింపజేయువారు ... ఆంధ్రదేశమందు వివిధప్రాంతములలో కొంతకొంత భేదమున్నను మొత్తముమీద ప్రాథమిక విద్యావిధానము ఏకరీతినేయుండెనని చెప్పవచ్చును."

*విజ్ఞానసర్వస్వము—తెలుగుసంస్కృతి సంపుటము—1086పుట

తమబాల్యములో విద్యాపద్ధతిని వర్ణించుచు అయ్యదేవర కాళేశ్వరరావుగారిట్లు వ్రాసిరి*

"నందిగామలోని సర్కారు ఇంగ్లీషుబడిలో చదివి తొమ్మిదవయేటప్రైమరీపరీక్షలో నుత్తీర్ణుడనైతిని. "ఓం నమశ్శివాయ సిద్ధం నమః" అనునక్షరములను దిద్దుటతో నాడు విద్యాభ్యాసము ప్రారంభమయ్యెడిది. అప్పటికే రాతిపలకలు, బలపములు వచ్చినవి. తెలుగక్షరములతో పాటే నాంగ్లాక్షరములనుకూడ నేర్పుచునచ్చిరి. ప్రైమరీలోనే సుమతీశతకము, వేమనశతకము, దాశరథీశతకము, భర్తృహరి పద్యములు చదివించిరి. తెలుగుసంవత్సరములు, మాసములు, తిథులు, నక్షత్రములు, లగ్నములు, అకరన్నకిరా లెక్కలు మాకు నేర్పిరి. పెద్దబాలశిక్ష చదివించిరి. చక్కని దస్తూరీ కుదురునట్లు వ్రాయించిరి. సామాన్యమైనవాక్యము లింగ్లీషునుండి తెలుగులోనికి, తెలుగునుండి ఆంగ్లములోనికి భాషాంతరీకరించు స్థితివరకు నేర్పిరి."

దీనినిబట్టి ఆకాలములో ప్రాథమికపాఠశాలలలో గలపు విద్యాపద్ధతుల నూహించుకొనవచ్చును.

విద్యాపద్ధతు లెట్లున్నను, ఆకాలపు రాజకీయముల ప్రభావను సభావేదికలయందును, పత్రికలలోను, సాహిత్యగ్రంథములందునను ప్రతిఫలించినది. ఇంగ్లీషు సారస్వతమును, ఫ్రెంచి సారస్వతమును శ్రద్ధగాచదివి అట్టి సాహిత్యప్రక్రియలను మన దేశి సారస్వతములో ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు జరిగినవి. కలకత్తాలో 1817 హిందూకళాశాల స్థాపించిన తరువాత అక్కడచదివిన విద్యార్థులలో నూతనాశయములు, క్రొత్తభావములు ఉదయించినవి. అవి నాటి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యా సారస్వతరంగములలో ప్రతిఫలించినవి. 1835లో విద్యావిధానముగూర్చిచేసిన తీర్మానముతో ఇంగ్లీషువిద్య విపులముగా వ్యాపించుటకు వీలుకల్గినది.

---

*నా జీవితకథ—నవ్యాంధ్రము—12వపుట.

ఈ నూతనవిద్యావిధానము రూపొంది, దేశభాషలతోపాటు ఇంగ్లీషుభాషను, సారస్వతమును, సైన్సువిషయములను తెలిసికొనుటకు ప్రాతిపదిక లభించినది. ఈ నూతనవిద్యావిధాన మిట్టి రూపు పొందుటకు కారకులు రాజా రామమోహనరాయలు, మెకాలే, విలియమ్ బెంటింక్ ఈ విద్యావిధానమును ప్రతిపాదించుచు మెకాలే తన మినిట్‌లో - యూరపియన్‌విద్య నభ్యసించిన తరువాత భారతీయులు కొంతకాలమునకు యూరపియన్‌సంస్థలనే కోరవచ్చునని సూచించెను. "ఆరోజు వచ్చునో రాదో నాకు తెలియదు. అది వచ్చినపుడుమాత్రము - ఆంగ్లచరిత్రలో అది అత్యంత గర్వకారణమైన సుదినము." ఆ సుదినము రానేవచ్చినది. పాశ్చాత్య రాజ్యాంగ విధానములు, స్వాతంత్ర్యలక్ష్యములు, శాస్త్రములు, భావపరంపరలు భారతదేశములో వచ్చినవి. ఇంగ్లాండు, భారతదేశముల పరస్పర ప్రతిష్ఠ పెరుగుటకును, విజ్ఞానసంస్కృతులు వికాసమందుటకును ఈ విద్యావిధానమే దారితీసినది.

19వశతాబ్దిలో సాహిత్యముపైన ఈపాశ్చాత్యవిద్యావిధానము అద్భుతముగా పనిచేసినది. విద్య విజ్ఞానరంగములలో పాశ్చాత్యభావధార తెచ్చిన మార్పులతో ఇతర దేశీయ భాషాసాహిత్యమువలననే, తెలుగుసాహిత్యములోకూడా చరిత్రాత్మకములైన మార్పులు వచ్చినవి. గద్యపద్యాత్మకమైన అన్నికృతులయందును ఈ నూతన భావధార గమనించవచ్చును. తొలిసారి మనదేశీయుల దృష్టి శాస్త్రవిజ్ఞానముపైన ప్రసరించినది. పరిశీలనాత్మకమైన అధ్యయనముచేసి హేతువాదముతో ఋజువుచేసినకాని విశ్వసించని పరిశోధనావైఖరి వృద్ధిగాంచినది. ఇట్టి నూతన దృక్పథముతో పరిశోధనలుచేసి, ఆ పరిశోధనల ఫలితములను తమ రచనలలో ప్రతిఫలింపజేయుచు వచ్చినది. విద్యావిధాన మిన్నిరీతులుగా మార్పుచెందిన యీ శతాబ్దిలో, చదువుకొనువారి సంఖ్య పెరిగినది; చదువుటకు పుస్తకములును పత్రికలును లభించినవి. చదువు ప్రోత్సహించు విద్యాలయములలో గ్రంథాలయములుకూడ అనేకము నెలకొన్నవి. ఇట్టి

నూతన వాతావరణములో ప్రాచీనసాహిత్యములో మునుకలు వేయుచున్న పండితులుసైతము క్రొత్త సాహిత్యప్రక్రియలను మన దేశ సంప్రదాయములకు అనుగుణముగా మలచుకొనుటకు ప్రయత్నముచేసిరి. చరిత్ర, భూగోళము, ఆర్థికశాస్త్రము, భౌతిక శాస్త్రము, రసాయనశాస్త్రము, జీవశాస్త్రము ఇటువంటి శాస్త్రములను అధ్యయనముచేయుటలో ఆంగ్లభాషలో అభ్యసించినవి అందరి కిని అందుబాటులోనికి తెచ్చుటకుగాను సరళమైన తెనుగుభాషలో తిరుగ వ్రాయవలసివచ్చినది. విదేశములనుండి తెచ్చిన వినూతన బీజములను, మనదేశపు సాహిత్యక్షేత్రములలో నాటుపోసి, మొల కలు పెంచి, అవి వృద్ధిపొంది ఫలముల నిచ్చువరకును కాపాడవలసి వచ్చినది. 19వ శతాబ్ది మొదటిపాదములోను అర్థభాగమునందును ప్రారంభించిన ఆంగ్లవిద్యావిధాన కల్పలత ఫలములందించుటకు మూడవపాదము ముగియవలసివచ్చినది. 1885 నాటికి దేశిసారస్వత కేదారమున నీ యంటుమొక్కలు పూలుపూచి కాయలు కాయ దొడంగినవి. ఇది తెలుగుసాహిత్యమునకే కాదు భారతదేశములోని ఇరుగుపొరుగు సాహిత్యములలో సైతము గమనింపదగిన సమాన ధర్మము.

# 5. ఇరుగు పొరుగు భాషలు

19వ శతాబ్దిలో జరిగిన చరిత్ర సంఘటనలు ప్రపంచ స్థితిగతులను దానితోపాటు భారత దేశ పరిస్థితులను మార్చివేసినవి. ఈ మార్పులన్నియును మన సాంఘిక రాజకీయ విద్యా విజ్ఞాన రంగములలో ప్రస్ఫుటముగా కనిపించినవి. ఈ మార్పుల ప్రభావము సాహిత్యముపైనకూడ ఎక్కువగా పనిచేసినది. 1800 నుండి మొదలు పెట్టిన పురోగమనములో భారత దేశములోని అన్ని భాషలును సాహిత్యపథమున ముందంజ వేసి, పైకి సాగిపోయినవి. ఈ మహాప్రస్థానములో ఎవరు ముందు ఎవరు వెనుక అనునది కొన్ని సంవత్సరముల అటు, ఇటుగా భేదమువచ్చినను, మొత్తముమీద భారత దేశములోని ప్రాంతీయ భాషలన్నియును పురోగమనమును సాధించినట్లు గమనించవచ్చును. ఈ పురోగమన విధానము 19వ శతాబ్ది యంతటను సాగినది. దానిలో కొందరు 1857 నుండి భారత స్వాతంత్ర్య యుద్ధానంతరము ఆధునిక యుగము ప్రారంభమైనదందురు. ఈ పరుగుల పోటీలో కొన్ని భాషలు ముందైనవి, కొన్ని భాషలు వెనుకపడినవి. కాని సాహిత్య విప్లవములో దేశభాషలు అనుసరించిన గతులన్నియు ఒకటే పంథాను త్రొక్కినవని పరిశీలించినవారికి తెలియును.

భారతీయ నవోదయము బహు ముఖములుగా ప్రసరించినను భావనమునందును, జీవనమునందును ఒకటిగానే యుండెను. ఈ ముందంజలో బెంగాలీ, ఉరుదూవంటి భాషలు అగ్రగణ్యమైనవి. దానికి కారణము 1800 లో కలకత్తాలో ఫోర్టు విలియమ్ కాలేజీ స్థాపనతో బ్రిటిషు అధికారము స్థిరపడినది. రాజకీయ ప్రయోజనమునకు సంస్కృతీరంగమును వినియోగించుకోవలెను సంకల్పము

కలిగినది. ఆ కాలములో మనదేశము విచ్చేసిన ఇంగ్లీషుపండితులు దేశీయులయిన పండితుల సహకారముతోడను మున్షీల సలహాల తోడను వ్యాకరణములు రచించిరి; నిఘంటువులు సేకరించిరి; వాచక పుస్తకములు రచింపజేసిరి. వంగదేశములో రాజా రామమోహన రాయలు వంగభాషలో వచనరచన కొక క్రొత్తప్రయోజనము కల్గించెను.

సీరామ్‌పూర్‌లో స్థిరపడిన మిషనరీలు వంగభాషలో పత్రికలు స్థాపించిరి. ఆకాలములో విద్యకోసము సంవత్సరమున కొక లక్ష రూపాయలచొప్పున ఈస్టిండియాకంపెనీ వ్యయపరచుటకు నిశ్చ యించెను. దానితో స్కూలు సొసైటీ, స్కూలుబుక్ సొసైటీవంటి సంస్థలు వచ్చినవి. ఈశ్వరగుప్త, మహర్షి దేవేంద్రనాధ్ ఠాకూర్, అక్షయకుమార్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌వంటి ప్రముఖులు బెంగాలీభాషలో పద్యవాఙ్మయమును గద్యవాఙ్మయమునువృద్ధిచేసిరి. 1850 వచ్చునప్పటికి ఈ నూతనోత్సాహము మొగ్గతొడిగి పుష్పించి, నూతన కవితాసుమములను సృష్టిచేసెను. ఈ కావ్యకుసుమావళి నందించినవారిలో మైఖేల్ మధుసూదనదత్తు ముఖ్యుడనవచ్చును. ఇట్లే ఢిల్లీ కాలేజి - ఉరుదూ భాషాభివృద్ధికి దోహదముచేసినది. ఉరు దూలో అనేక శాస్త్ర విజ్ఞాన గ్రంథములు వెలువడినవి. ఆంగ్లభాష నుండి అనేకగ్రంథములు తర్జుమాచేసి ఢిల్లీ కాలేజీలో మౌల్వీజాకా ఉల్లా, ఘాలీబ్, సయ్యద్ అహమ్మద్‌ఖాన్, హాలీ,నజీర్ అహమ్మద్, షిబ్లీవంటి వారలు కృషిచేసి ఉరుదూసాహిత్యములో నవోదయము నకు వైతాళికులైరని చెప్పవచ్చును.

ఈ నూతనభావోదయము ఆయా ప్రాంతములు బ్రిటిషుపరి పాలనలోనికి వచ్చుటతో వివిధభాషలలో ప్రారంభమైనదనవచ్చును. 1854 లో కాని అస్సాముదేశము బ్రిటిషుపరిపాలనలోనికి రాలేదు. వచ్చినవెంటనే అమెరికన్‌బాప్టిష్టుమిషన్‌వారు అచ్చుకూటములుపెట్టి పుస్తకములు ప్రచురించిరి. వచ్చిన మూడుమాసములలో అస్సామీ బాలశిక్ష తయారైనది. ఈ మిషనువారు నడిపిన పత్రిక 'అరుణోదయ'

ప్రభావముచేత నూతన సాహిత్యప్రక్రియలతో పరిచయముకలిగినది. ఖండకావ్యము, వ్యాసము, జీవితచరిత్ర, నవల, కథానిక మొదలైన నూతనసాహిత్యస్వరూపములు ఆ భాషవారికి ప్రత్యక్షమైనవి. తరువాత ఆనందరామ్ ఫూకన్, హేమచంద్ర బారువా వంటి హేమాహేమీలు వచ్చినారు.

1818లో కర్కి యుద్ధానంతరము గుజరాతు బ్రిటిష్‌వారి స్వాధీనమైనది. బొంబాయిలో ఎల్‌ఫిన్‌స్టన్ కాలేజీ స్థాపించినపిదప నూతనప్రయోగములు గుజరాతీసాహిత్యములో ప్రారంభమైనవి. 1848లో ఎ. కే. ఫోర్బ్సు గుజరాతీ వర్నాక్యులర్ సొసైటీ స్థాపించి అందున దళపత్‌రామ్ అను కవిని నియమించి ఆతనిచేత నూతన గ్రంథములు రచింపజేసెను. నర్మద్ అను కవి గుజరాతీ వాఙ్మయములో పాశ్చాత్యభావములను ప్రవేశపెట్టిన తొలి యుగకర్తయని చెప్పవచ్చును.

హిందీసాహిత్యములో ఈ నూతన యుగోదయము కొంచెము ఆలస్యముగా వచ్చినది. అంతవరకు హిందీ - ఉరుదూ భాషలకు హెచ్చు తారతమ్యము లేదు. పర్షియన్‌లిపిలో ఉన్నది ఉరుదూయని దేవనాగరలిపిలో నున్నది హిందీభాషయని వ్యవహరించెడివారు. ఆనాడు వ్యావహారికములో నున్నది హిందుస్థానీ. ఈ భాషలో కాశీనివాసిఅయిన భారతేందు హరిశ్చంద్ర అనునతడు ప్రారంభము చేసి ఖడీబోలీ భాషలో అనేక గ్రంథములు రచించెను. బ్రిటిష్‌వారు స్థాపించిన పుస్తకసంస్థలును మిషనరీలును ఈ 'ఖడీబోలీ' నే ఎన్నుకొని దీనిలో గ్రంథరచనచేయించి పాఠ్యపుస్తకములను ప్రచురించిరి. ఈపద్ధతిలో హరిశ్చంద్ర, రాజా శివప్రసాద్ మున్నగువారు రచనలు చేసిరి.

కాశ్మీరములో 1819లో సిక్కులరాకతో శాంతిభద్రతలు నెలకొన్నవి. పర్షియన్ రాజభాషగా సిక్కులు ప్రోత్సహించిరి. అదే 19వ శతాబ్దిచివరివరకు రాష్ట్రభాషగానున్నది. అందుచేత కాశ్మీరీ కవులు తమ కావ్యములను పర్షియన్ కావ్యసరళిలో ఆ'రుబాయీ'లను ఛంద

స్సులను అనుకరించి ప్రేమగీతముల గానముచేసిరి. 19వ శతాబ్దిలో పరమానంద్, ప్రకాశ్ రామ్, మహమ్మద్ గమీంవంటి వారలు మంచి కావ్యములను రచించినారు. బైబిలు గ్రంథమును కాశ్మీరిభాష లోనికి అనువదించినది టి. ఆర్. వాడే. కాశ్మీరిభాషలోని సామెతలను నోవెల్సు అనునతడు సేకరించెను. ఈశ్వరకవుల్ ఒక వ్యాకరణము రచించెను. ఇంతలో ఉరుదూ, ఇంగ్లీషుభాషల తాకిడికి తట్టుకొనలేక కాశ్మీరిసాహిత్యపురోగతి 1880-1925వరకు మందగించినదనవచ్చును.

మరాఠీ సాహిత్యములో నవయుగప్రారంభము 1818లో జరిగినది. బ్రిటిష్‌పరిపాలకుల ప్రోత్సాహమువలన మరాఠీ నిఘంటువు తయారైనది. నేటివ్ ఎడ్యుకేషన్ సొసైటీ యేర్పడినది. మరాఠీ రచయితలు ఒకరకమైన ఆంగ్ల – మరాఠీ భాషలో అనువాదములు చేసి, నవలలు, కథలు మొదలైనవి తమభాషలో ప్రకటించువారు. 1874 నాటికి నూతన సాహిత్య ప్రక్రియ లన్నింటిలోను ప్రయోగములుచేసి సాహిత్య నవోదయమునకు నాందిపలికిన మార్గదర్శకులనేకులు వచ్చిరి. చిప్లుంకర్ నిబంధమాల ఒక క్రొత్తత్రోవ త్రొక్కినది. తిలక్, అగర్కర్, ఆప్టే, కేశవసూత్ వంటివారల రచనలతో మరాఠీ సాహిత్య శుభోదయము ప్రారంభమైనది.

పంజాబీభాషలో మిషనరీలు నిఘంటువులు నిర్మించి కొన్ని గ్రంథములను పండిత శ్రద్ధారామ్‌వంటివారిచేత వ్రాయించినారు. కాని నూతనయుగప్రభావము 1?వ శతాబ్ది చివరభాగమువరకు పంజాబీసాహిత్యములో ద్యోతకము కాలేదు. పంజాబు కేసరి లాలా లజపతిరాయ్ నాయకత్వముతో వచ్చిన జాతీయమహోద్యమము, సర్దార్ అజిత్‌సింగ్‌వంటివారలతో వచ్చిన మత సాంఘిక విప్లవము వేరులు పాతుకొనువరకు పంజాబుసాహిత్యములో నవోదయము ఆరంభము కాలేదు. ఈ నూతనోద్యమమునకు భాయి మోహన్‌సింగ్ భాయి కహాన్‌సింగ్, భాయి వీరసింగ్‌వంటివారలు నాయకులై క్రొత్త రచనలు గావించిరి.

ఒరియాభాషలో నూతనభావోదయము క్రైస్తవమిషనరీల తోనే ప్రారంభమైనది. 1820 ఆ ప్రాంతములలో కొందరు యుగ పురుషులు పూనుకొని క్రొత్తమార్గములలో సాహిత్యసృష్టిచేసి ఉత్కృష్ట గ్రంథరచనలు గావించినారు. రాధానాధ్‌రాయ్‌వంటి ప్రకృతి ప్రేమికులు, మధుసూదనరాయ్‌వంటి ఛాయావాదకవులు, ఫకీర్ మోహన సేనాపతివంటి నవలారచయితలు ఒరిస్సాలోని సాహిత్యమహోదయమునకు మార్గదర్శకులైనారు.

అంగ వంగ కళింగ బీహారుప్రాంతములలో ఈ సాహిత్య విజ్ఞానప్రచారము ఒకరిని అనుసరించి ఒకరు చేసినట్లు తోచును. మగధదేశములోని మూడు నాలుగుభాషలకును బెంగాలీభాషలోని సాహిత్యము ముందంజవేసి మార్గదర్శకమైన దనవచ్చును.

అట్లే దక్షిణభాషలయిన తెలుగు, తమిళ, కన్నడ, మళయాళభాషలలోవచ్చిన సాహిత్యనవోదయములో తెలుగుభాష అగ్రగామియైనదని చెప్పవచ్చును. ఈ నవోదయము 1800నుండి తెలుగు భాషలో ప్రారంభమై 1900వరకు అవిచ్ఛిన్నముగా సాగి, ఆధునిక సాహిత్య నవోదయమునకు 19వ శతాబ్దిని ఉషఃకాలముగా చేసినది. తమిళభాషలో ప్రాచీనగ్రంథముల సేకరణ యు. వి. స్వామినాథయ్యరుతో ప్రారంభించినను సాహిత్యరచనలో నూతనశకము సుబ్రహ్మణ్యభారతితో కాని ప్రారంభముకాలేదు. ఈయన 19వ శతాబ్ది చివర కొన్ని గ్రంథములు రచించినను ఇరవదవ శతాబ్దారంభములో గాని సాహిత్యప్రవక్త కాలేదు. ఈ నాలుగుభాషలలోనూ 19వ శతాబ్ది ఆరంభములోనే మిషనరీలు నిఘంటువులు, వ్యాకరణములు మొదలైనవి రచించి, బైబిలువంటి గ్రంథములను అనువాదము చేయించిరి. కన్నడములో 19వశతాబ్ది ఉత్తరార్థమునగాని అనువాదము, అనుకరణ, నూతనకల్పన అను విధానములతో కూడిన నూతన సాహిత్యసృష్టి ప్రారంభముకాలేదు. అట్లే మళయాళభాషలో కూడ 19వశతాబ్దిమధ్యభాగములో కేరళవర్మ, రాజరాజవర్మ యను వారలు మహాకావ్యరచనలు గావించి సంస్కృతమునుండి కొన్ని

అనువాదములుచేసిరి. ప్రాచీన సంప్రదాయములను ప్రతిపాదించు గ్రంథములనేగాక ఆధునికభావములతోకూడిన శాస్త్రవిషయము లను వెల్లడిచేయు విషయములను వచనగ్రంథములుగా కూడ రచిం చిరి. అనంతరము కావ్యరచన, ఖండకావ్యరచన, నవలారచన, నాటక రచన మళయాళసాహిత్యములో వర్ధిల్లినవి.

మొత్తముమీద కాశ్మీరునుండి కన్యాకుమారివరకు అఖండ భారతములో ఆనాటి ప్రజలుమాటలాడిన చతుర్దశభాషలను పరికించి చూచినచో, ఆయాసమయములలో విదేశీయుల పరిపాలనలో వచ్చిన మార్పులవలన ఒకేరక ప్రప్రభావములు పనిచేసి ఒకేమాదిరి ఫలితము లను తెచ్చినట్లు ఈ సమీక్షవలన మనము గ్రహించగల్గుదుము.

భారతదేశములో బ్రిటిష్అధికారము స్థిరపడిన ఈ శతాబ్ది కాలములోనూ ఇంగ్లీషువిద్య అభ్యసించిన విద్యావంతుల తరగతి ఒకటి అన్నిభాషలలోనూ ఉద్భవించినది. అంతవరకు అన్నివిషయము లందును నాయకత్వమువహించిన జమీందారీ తరగతి పోయి ఈ మధ్యతరగతి విద్యావంతుల ఆధిక్యము హెచ్చినది. ఈకాలములోనే కలకత్తాలో బ్రిటిష్అధికారము స్థిరపడినది. బ్రిటిష్వారితో పారి శ్రామికయుగము ప్రారంభమైనది. పాశ్చాత్యరాజకీయములలోని ప్రజాస్వామికవిధానమును, వ్యక్తిస్వాతంత్ర్యరక్షణమును బ్రిటిష్ వారే భారతదేశములో ప్రవేశపెట్టి ఈ భావములుకల సాహిత్య ముతో పరిచయముకల్గించినారు. పాశ్చాత్యవిద్యవలనను సాహిత్యము వలనను స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాతృత్వము, (**Liberty, Equlity and Fraternity**) వంటి భావములను ప్రజలలో వెదజల్లిరి. దానితో కులవ్యవస్థమీద, జమీందారీ భూస్వాములమీద ఆధారపడిన ఒక కృత్రిమసౌధమునకు పునాదులు కదలినవి. ప్రజలలో నూతనభావోదయము కలిగి పెద్ద విప్లవమునకు బీజాంకురములు పడినవి.

ముద్రణాయంత్రములు లభ్యముకాగానే సాహిత్యగ్రంథముల ప్రచారమునకు ఎన్నడును లేని విస్తృతావకాశము లభించినది. పత్రి

కలు అన్ని దేశభాషలలోనూ వెలువడుట ఆరంభమైనది. ముద్రణా యంత్రము ప్రసాదించిన వరములలో పత్రికాప్రచురణ యొకటి. కావున, ఈ వినూతన సాహిత్యప్రక్రియ పాఠకుల నాకర్షించి విభిన్న విషయములపైన వారి యభిప్రాయములను విస్పష్టముగా ప్రకటించుటకు వేదికగా మారినది. బ్రిటిష్ అధికారవర్గము తమ పరిపాలనా యంత్రమును నడపుటకొఱకని విద్యాపద్ధతులు నేర్పి సంసిద్ధపరచిన విద్యావంతులయిన ఉద్యోగులవర్గము పాశ్చాత్యభావములను అలవరచుకొని వానిని సాహిత్యములో ప్రయోగించుటకు ప్రయత్నములుచేసిరి. దేశభాషలను తొలిసారి నేర్చుకొని, పాశ్చాత్యభాషలలోని వాఙ్మయమును దేశభాషలలోనికి అనువదించి, దేశభాషలకు వ్యాకరణములను, నిఘంటువులు మొదలైనవానిని రచించి యెనలేని ఉపకారమును విదేశీ మిషనరీలు చేసిరి.

పాశ్చాత్య వాఙ్మయముతో పరిచయము సంపాదించుకొని దానితో పోల్చి తమభాషలలోని సాహిత్యము చూచునప్పటికి 'రాజునుచూచిన కళ్ళతో మొగుణ్ణిచూస్తే మొత్తబుద్ధి' అన్న సామెత చందమున, మన భాషలలోలోపములను సవరించిరి. మన దేశమునకు అధికారులుగా వచ్చిన బ్రిటిషు ఆఫీసర్లు దేశ భాషాభిమానముతో ప్రాచీనగ్రంథముల సేకరణకు ప్రచురణకు సాహిత్య సత్వరాభివృద్ధికి అనేక సంఘములను స్థాపించి సాహిత్యనవోదయమును విభిన్నభాషలయందునను ప్రోత్సహించిరి. తమ మతప్రచారమునకును, బ్రిటిష్ అధికార స్థిరీకరణకును ఈ కార్యములు చేసి అవే ప్రధాన లక్ష్యములుగా పెట్టుకొన్నను, ఈ మిషనరీలు, అధికారులు దేశ భాషా వాఙ్మయ పునస్సృష్టికి గట్టి పునాదులు వేసి నూతనసౌధముల నిర్మాణమునకు గొప్ప దోహదముచేసిరి.

అప్పుడే క్రొత్తగా పాఠశాలలయందును, కళాశాలలయందును ప్రవేశపెట్టిన పాశ్చాత్య విద్యాప్రభావముకూడ ఈ సాహిత్యరంగముపైన పటిష్ఠముగా పనిచేసినది. పూర్వకాలపు విద్యావిధానమును, గురుకులపద్ధతిని, వల్లెవేయు విధానమును తారు

మారుచేసి మన ఛాందసపండితుల మనస్సులలో పట్టిన బూజు దులిపి, నూతన విజ్ఞానకిరణములతో అజ్ఞానాంధకారమును పటాపంచలుచేయుటలో ఈ పాశ్చాత్యవిద్య ఉపకరించినది. వివిధదేశముల విజ్ఞానవిషయములను తెలిసికొని సమకాలీన విజ్ఞానశాస్త్ర ప్రగతిని అర్థముచేసికొనుటకేగాక, ఈవిద్యవలన కల్గిన నూతనదృక్పథముతో మన ప్రాచీన గ్రంథములను వాఙ్మయమును మరింత భక్తి శ్రద్ధలతోడను, గౌరవప్రపత్తులతోడను పఠించుటకు ఉపకరించినది. ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశీలనవలనను సాంఘికసూత్రములవలనను భారతీయులకు భౌతికవాదములోని ప్రయోజనము అర్థమైనది. "చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష" అను విధానము పోయి, సంఘములో వ్యక్తిస్వాతంత్ర్యమునకు సమష్టిబాధ్యత కావలెనను సామ్యవాద ధర్మములోని అంతరార్థము తొలిసారి వ్యక్తపడినది. ప్రజాస్వామిక విధానములోని విశిష్టత రాజకీయములలో ఎట్లు సమన్వయించ దగునో అర్థమైనది. స్వతంత్రముగా ఆలోచించి, విచారణచేయుటకు మూఢవిశ్వాసములు, మతధర్మములు కాక, హేతువాదముతోకూడిన పరిశీలన, పరీక్ష అవసరమని ఒక తర్కశీలము, ఒక జిజ్ఞాస భారతీయుల కలవడినవి.

ఈ యంధకారములో గోచరించినది ఒక గ్రహము ఒక గ్రహకూటము కాదు, కొన్ని నక్షత్రమాలికలే కనిపించి వెలుగుబాటలు వేసినవి. ప్రసిద్ధఉరుదూకవి 'గాలిబ్' ఈసంగతినే ఒకగీతముగాపలికెను.

చీకటుల ఈ రేయి పోయి
వేకువగునను వార్త చెప్పిరి,
లోకబాంధవు చూడుమని రటు
చీకు దీపిక నార్పివైచిరి.
మఘువమస్తక కిరీటముపై
మణగియుండిన మణుల రాలిచి
మానవుని విజ్ఞాన కంఠపు
మాలగా నిడిరి.

వర్ణవ్యవస్థతో బిగుసుకొనిపోయిన హిందూసంఘమహావృక్షమును ఈ పాశ్చాత్యవిద్య కూకటివ్రేళ్ళతో పెకల్చివేసినది. ఘోర దురాచారములును, ఛాందసమైన నమ్మకములును హేతువాద మనియెడు వజ్రకుఠారముతో త్రుంచివేసిరి. పాశ్చాత్యసాహిత్యమువలన రాజకీయభావములే కాక మానవ సహజమైన విశిష్టగుణములను రచయితలు అలవరచుకున్నారు. సత్యమ్, శివమ్, సుందరమ్ అని మన ఉపనిషత్తులు ప్రబోధించిన విశిష్టగుణాదర్శములను పాశ్చాత్త్యుల సౌందర్యవాదముతో మేళవించి ఒక నూతన కవితావాదమును దేశభాషలలో అనేకులు ప్రవేశపెట్టిరి. అదియే అభినవకవిత (**Romantic Poetry**). దీనికి ప్రకృతి ప్రేమ, సౌందర్యము అను భావములు నూతన తేజఃకిరణములతో ప్రకాశింపజొచ్చినవి. ఇంచుమించు అన్నిభాషలలోను నవోదయమును ప్రతిపాదించిన భావకవులు యుగప్రభాతమునుగూర్చి గానముచేయుచు నూతనదేవతల నారాధించిరి. వీరి భావములలో ఒక నూతనకాంతితోపాటు, ఒక విచిత్రమైన ఆత్మనిగ్రహము, క్రమశిక్షణ ఈ రచయితలకు అభ్యాసమైనవి. వీరి భావనాప్రపంచములో ఒక అగ్నిపరీక్ష జరిగి తత్ఫలితముగా పవిత్రాశయముల బంగారుతీవెలు మేలిమిపుటము వేసినట్లు బయటికి వచ్చినవి.

పాశ్చాత్య విజ్ఞానమువలన కలిగిన మరొక సుగుణము, భారతీయసాహిత్యమును విజ్ఞానమునుచదివి, సర్ విలియమ్‌జోన్సు రైడర్, గెటే మున్నగు యూరపియన్ పండితులు, కవులు రసాస్వాదనచేసి భారత సాహిత్యములో స్వర్గ మర్త్యలోకముల సంగమమును చూడగల్గిరి. ఇహాపరముల ఏకలక్ష్యమైన పరమార్థచింతనము, వ్యక్తిప్రాధాన్యముతో ముడివడిన సంఘలక్ష్యము, ప్రాతక్రొత్తల మేలుకలయిక భారతీయతత్వములోని ప్రధానగుణములని ఈ పాశ్చాత్త్యులు చూపిన తరువాత భారతీయులకు తమ సంస్కృతియెడల గౌరవము పెరిగినది. 1857 తర్వాత వృద్ధిపొందిన దేశాభిమానమును, జాతీయాభిమానమును ఈ గౌరమును మరింత వృద్ధి

చేసినవి. దానితో భారతీయభాషలలోని మహాకావ్యములన్నియును విభిన్న భాషలలోనికి అనువాదమైనవి. అట్లే ఇంగ్లీషులోని ప్రసిద్ధ గ్రంథములుకూడ దేశభాషలలోనికి అనువాదమైనవి. పాశ్చాత్య విద్యా సంపర్కమువలన నూతన సాహిత్యప్రక్రియలు, ఛందోరీతులు, రచనాప్రయోగములు దేశభాషలలోనికి ప్రవేశించినవి. నాటకములు, కథానికలు, నవలలు, దేశచరిత్రలు, జీవితచరిత్రలు, ఖండకావ్యములు మొదలైన అన్నిరకముల సాహిత్యప్రక్రియలును పాశ్చాత్య లోకమునుండి మనక్షేత్రమునకు తెచ్చి ప్రోదిచేసిన నూతన బీజాంకురములే. ఈ19వ శతాబ్దిలో సాహిత్యములోనచ్చిన నూతనోద్యమము నీ విధముగా సమీక్షచేయనచ్చును. *

(1) గద్యవాఙ్మయాభివృద్ధి - దానితోపాటు నవల, కథానిక వంటి సాహిత్యవిభాగముల అభివృద్ధి.

(2) సాహిత్య కథావస్తువులుగా సాంఘికవిషయములను, మానసికభావపరివర్తనలను తీసికొనుట.

(3) కవితలో వ్యక్తిగతభావప్రకటన, ఆత్మీయభావచిత్రణము, స్వీయవిరచిత సంకేతసూచనలు,

(4) వాస్తవికత అను నూతనసంవిధానముతో అన్ని సాహిత్య ప్రక్రియలయందును ప్రయోగములుచేయుట.

ఇంచుమించు అన్ని దేశభాషాసాహిత్యములయందును కలిగిన నూతనభావోదయమునకు ఈ లక్షణములు సమన్వయపరచవచ్చును. ఇవియన్నియు యుగలక్షణములనుకొన్నచో 19వశతాబ్ది పూర్తిగా నూతనజీవనముతో కలకలలాడినదని చెప్పవచ్చును. ఈ నూతన జీవనములోని భాగములే పాశ్చాత్యభావానుకరణగాని, భారతీయ గౌరవప్రశంసగాని. 800నుండి ప్రారంభమైన ఈ జీవనస్రవంతిలో మొదటియుగధర్మము సంఘసముద్ధరణము, సంఘసంస్కరణము.

---

* J. C. Mathur in his talk on modern Hindi literature—literature in Indian Languages- A Govt. of India Publication.

సంఘదురాచారములను, వ్యవహారములను విమర్శచేయుటకు సాహిత్యము ప్రధానసాధనముగా ఉపయోగించబడినది. ఇది 1800నుండి ప్రారంభమై 1850వరకు అన్ని భాషలలోను వ్యాపించినదనవచ్చును. వంగదేశములో రాజారామమోహనరాయలు, ఈశ్వరచంద్రవిద్యాసాగరులు ప్రారంభించిన ఈ యుద్యమము 1875 తరువాత ఆంధ్ర దేశములో వికసించినది. 19వ శతాబ్దిలో పూర్వరంగములో ప్రాచీనగ్రంథముల పునరుద్ధరణ, దేశభాషలకు నిఘంటువులు వ్యాకరణములు మొదలైనవాని నిర్మాణము జరిగినది. 1850నుండి 1875వరకు నూతనవాఙ్మయసృష్టి సాగినది. దీనియందు హెచ్చు భాగము అనువాదములతోడను అనుకరణలతోడనుకూడ దేశ భాషలలో చదువువారికి పాశ్చాత్య భావప్రపంచముతోడను, ప్రాచీన భారత సంప్రదాయములతోడను పరిచయము కలిగించినది. సాహిత్యము జనసామాన్యమునకు అందుబాటులోనికి వచ్చినది. 1875నుండి 1900వరకు వివిధభాషలలో నూతన సాహిత్య ప్రక్రియలను ప్రవేశపెట్టి స్వతంత్ర భావసముదయముతో ప్రజలలో నూతనదృక్పథమును చూపించిన యుగకర్తలు బయలుదేరినారు. వీరు చేసినవి ప్రయోగాత్మకరచనలైనను, ఆ రచనలు ప్రజలమీద మాయని ముద్రలువేసి, సాహిత్యచరిత్రలోనే స్వర్ణపుటల నాక్రమించుకున్నవి. అందుచేత 19వ శతాబ్దిలో ప్రవర్తిల్లిన సాహిత్య మహోదయమును మూడు ప్రధాన ఘట్టములుగా వీక్షింపవచ్చును.

మొదటిఘట్టము, నిర్మాణాత్మకమైనది, రెండవది విమర్శాత్మకమైనది; మూడవది సృజనాత్మకమైన నూతన పరికల్పన. ఈ మూడు ఘట్టములను 1800 కును, 1900 కును మధ్య వివిధ దేశభాషలలో వచ్చినను కొన్నిభాషలలో అవి ముందుగా వచ్చినవి. మరి కొన్ని భాషలలో కొంత వెనుక అయినవి. దానికి కారణములు ఆయా ప్రాంతములలో కొంచెము వెనుక ముందుల ప్రారంభించిన పాశ్చాత్య విద్యాప్రభావమే యనవచ్చును.

భారతీయ భాషలన్నిటిని పరిశీలించినచో కొన్నింటిని ఒక్కొక్క వర్గముగా గుదిగ్రుచ్చి వాటిని ఒక్కొక్క కోవగా మనము సమీక్ష చేయవచ్చును. ఆవిధముగా తీసుకున్నచో నవోదయములో మొదట వచ్చినది బెంగాలీభాష. 1800 లో డాక్టర్ గిల్‌క్రైస్టు ప్రిన్సిపాలుగా ఫోర్టు విలియమ్ కాలేజీ వచ్చినది. ఈ కళాశాలలో బెంగాలీ, హిందీ, పంజాబీ, ఒరియా మొదలయిన భాషలకు వ్యాకరణములను శబ్ద చంద్రికలను తయారుచేసెను. మిషనరీగా వచ్చిన డాక్టర్ కారీ బైబిలును బెంగాలీలో రచించెను. ఇతడే తెనుగులో కూడ వ్రాసి ప్రకటించెను. సిరామ్‌పూర్ నుండి 'సమాచార దర్పణ' అని ఒక పత్రిక ప్రకటించి పత్రికారచనకు ప్రారంభముచేసినదికూడ ఇతడే. ఇటువంటి పత్రికలు ఇతరదేశభాషలలోకూడ వచ్చినవి. ఆ కాలములో స్కూలుసొసైటీ ఒకటి స్థాపించి కొన్ని గ్రంథములను దేశభాషలలో ప్రకటించిరి. ఇటువంటి సంఘమొకటి ఒరిస్సాలోను, మద్రాసులోను కూడ ప్రారంభముచేసిరి. గద్యవాఙ్మయమునకు రాజారామమోహనరాయలు ఒకత్రోవ చూపగా, పద్యవాఙ్మయమునకు ఈశ్వరగుప్త త్రోవచూపి కొన్ని ఇంగ్లీషుకావ్యములను బెంగాలీలోనికి అనువాదముచేసెను. 1830లో దేవేంద్రనాధ్ ఠాకూర్ తత్వబోధిని సభ స్థాపించి, తత్వబోధిని పత్రికను ప్రకటించెను. దీనియందు అక్షయగుప్త, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వ్రాయుచుండువారు. వీరిరువురును గదవాఙ్మయమును అమితముగా సృష్టిచేసి వచనరచనలో ఒక సరళత ఒక తేటతనమును తెచ్చిరి. ఈ పద్ధతినే మన తెలుగుభాషలో కందుకూరి వీరేశలింగంపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు కొంతకాలమునకు తరువాత అవలంబించిరి.

1850నాటికి ఆంగ్లమునుండి అనువాదములుచేయుట ప్రారంభమైనది. దానికి 'బ్లాంక్‌వర్సు'లో ప్రయత్నించి బెంగాలీ కవితారీతులలో ఒక క్రొత్తమార్గము త్రొక్కినవారు మైఖేల్ మధుసూదన్ దత్. ఈతడు రచించిన మేఘునాదవధ స్వతంత్రకావ్యమే-వీరాంగనలో ఇలియడ్ కావ్యమును అనుసరించెను. ఈతనిపథమును అనుసరించి,

ఒరియాలో రాధానాథ్‌రథ్, అస్సామీభాషలో రమాకాంతచౌదరి (1875) కొన్ని వీరకావ్యములను 'బ్లాంకువర్స్' లో రచించిరి. మధుసూదన్ తరువాత గిరీశచంద్రఘోష్, ద్విజేంద్రలాల్‌రాయ్ గారలు నాటకములు పద్యములతోను, గద్యములతోను రచించి చక్కని దృశ్యకావ్యములను వంగసారస్వతమున కందించిరి. ఈ నాటకములలో అనేకము భారతీయభాషలన్నింటిలోనికిని అనువాదము పొందినవి. ద్విజేంద్రలాల్‌రాయ్‌వలె ఒరియాలో అశ్వినీకుమార్‌ఘోష్, అస్సామీభాషలో హేమచంద్రబారువా (1836-1896)లో నాటకములను రచించిరి.

1860 లో బంకించంద్రచటర్జీ వంగసాహిత్యగగనమున ధ్రువతారవలె అవతరించి నవలారచనలో నవీనమార్గమును చూపించెను. ఆతడు రచించిన దుర్గేశనందిని, ఆనందమఠము, దేవీ చౌదురాణి, సీతారామము, విషవృక్షము, కృష్ణకాంతుని మరణశాసనము మున్నగు నవలలు అఖిలభారత భాషలలోనికి అనువాదముపొందినవి. ఈ రచనలు తరువాత నవలలు రచించిన రవీంద్రనాథ్‌ఠాకూర్ గారికి శరత్‌చంద్రచటర్జీకీ ఒకవిధమైన ఒరవడులుగా కనిపించినవి. బంకించంద్రుని సాహిత్యము దేశభాషలన్నింటిలోను అనువాదము పొంది బహుజన ప్రియత్వమును పొందినది. చరిత్రలోని కథలకు కల్పనతో ఒక సౌందర్యము కల్పించి వానియందు 'సన్యాసి' వంటి పాత్రల ప్రవేశపెట్టి ప్రాచీనగౌరవమును ప్రబోధించుట బంకించంద్రునినవలలలో విశిష్టత. ఆకాలములో బంకించంద్రుడు 'వంగదర్శన్' అను పత్రికపెట్టి వంగసాహిత్యప్రవర్తగా రాజిల్లి, భారతీయసంస్కృతియెడల గౌరవము పెంపొందించు వ్యాసములను రచించెను. ఈతని పద్ధతిని వివిధ భాషలలో పలువురు నవలలు రచించి నూతన గద్యవాఙ్మయాభివృద్ధికి దోహదముచేసిరి. ఒరియాభాషలో ఫకీర్ మోహన్ సేనాపతి (చౌమాణో ఆఠో గుంఠ), అస్సామీభాషలో పద్మనాథ్ గోహాయిన్ బారువా, రజనీకాంత బార్డోలాయ్ నవలలురచించినారు.

బెంగాలులో వచ్చిన సాహిత్యప్రక్రియలలో అభినవకవిత ప్రకృతికవిత పేర్కొనదగినవి. అదేరీతిగా అస్సామీలో కొందరు పట్టభద్రులు కలిసి "జోనకీ" అను ఒకసాహిత్యమండలిపెట్టి నూతన కావ్యరచనలు చేసిరి. ఇటువంటిది 'సబుజ్‌పత్ర' అనుపేరుతో బెంగాలీలోను, 'సహకార' అనుపేరుతో ఒరిస్సాలోనూ పనిచేసి 'రొమాంటిక్' కవిత్వమును ప్రవేశపెట్టినవి. అయితే యివియన్నియును, 20వ శతాబ్ది ఆరంభములోవచ్చిన మార్పులు. బెంగాలీ సాహిత్యములోని ఛాయలు ఇరుగుపొరుగులోని ఒరియా అస్సామీభాషలలో గోచరించినట్లే, మగధదేశమునకుచెందిన బీహారురాష్ట్రములోకూడ పొడసూపినవి. హిందీమాటలాడువారి సంఖ్య యెక్కువగాగల ఈ రాష్ట్రమును, ఒరిస్సారాష్ట్రమును చిరకాలమువరకు (19వ శతాబ్దిలో పూర్తిగా) బెంగాలురాష్ట్రములో చేరియుండెడివి. అందుచేత బెంగాలీ సాహిత్యములోని ప్రగతి హిందీసాహిత్యముపైన సైతము పనిచేసినది. బెంగాలులో ధనికవర్గమును నూతనసాహిత్యము ఆకర్షించినది. వారే సాహిత్యయుగకర్తలుగా ప్రధానపాత్ర నిర్వహించినారు. హిందీలో భారతేందు హరిశ్చంద్ర తప్ప ఎవ్వరును ఉన్నతతరగతికి చెందినవారు సాహిత్యరచనకుపూనుకొనలేదు. మధ్యతరగతివిద్యావంతులు ఇంకను గుమాస్తాలు మొదలయినవారే హిందీభాషలో రచనలు గావించిరి. మొదటిదశలో భారతేందు హరిశ్చంద్రప్రభావము పనిచేసినది. ఖడీబోలీభాష ప్రచారములోనికి తెచ్చుటకు కళాశాలలలో చదువుచున్న విద్యావంతులు పూనుకొనిరి. మిషనరీలు 'ఖడీబోలీ' తీసికొని తమ మతప్రచారమునకు సాధనగా వాడుకొనిరి. వారితరువాత హరిశ్చంద్ర, రాజా శివప్రసాద్, రాజా లక్ష్మణసింగ్ మున్నగువారలు రచనలుచేసిరి. హిందీవాఙ్మయము విషయములో 1850-1900 వరకు వచ్చిన సాహిత్యమును భారతేందుయుగముగా వర్ణించుదురు. ఈతడు మన కందుకూరి వీరేశలింగంపంతులుగారివలె హిందీలో నవల, వ్యాసము, పత్రికారచన తొలుదొల్త ప్రవేశపెట్టినవారు. ఆకాలములో హిందీసాహిత్యములో ఉరుదూ వాఙ్మయము

కలిసిపోయినను, భాషనుపట్టి ఒక ప్రత్యేకత సంపాదించి నూతన సాహిత్యమును సృష్టిచేసినగౌరవము భారతేందు హరిశ్చంద్రునకే కలుగును. ఈతడు నవలలు, నాటకములు, చరిత్రవ్యాసములు, కథలు మున్నగునవి యన్నిటిని రచించుటయేగాక 'బ్లాంక్ వర్స్' లో రచనలుచేసెను. ఈ శతాబ్దిలో వైతాళికులయిన మరికొందరు హిందీ కవులు, లాలా శ్రీనివాసదాస్, ప్రతాప్‌నారాయణమిశ్ర, బాలకృష్ణ భట్, బద్రీనారాయణచౌదురీ (ప్రేమఘానము) మున్నగువారున్నను, పాశ్చాత్య కథావస్తువులను అనుకరించక, ప్రాచీనసంప్రదాయములనే అనుసరించిరి. సంఘసంస్కరణను సూచించు ఆదర్శ భావములను తమ రచనలలో సూచించినను అవి భారతీయసంప్రదాయములను విడువనట్టివిగా ప్రతిపాదించిరి.

హిందీభాషలోకంటె హెచ్చు విప్లవాత్మకభావనలు ఉరుదూ వాఙ్మయములో వచ్చినవి. బ్రిటిషుఅధికారము స్థిరపడినతరువాత కలకత్తాలో స్థాపించిన ఫోర్టు విలియమ్ కాలేజీవలనను, ఢిల్లీలోని ఉరుదూకాలేజీవలనను ఉరుదూవాఙ్మయాభివృద్ధి కొంతవరకు జరిగినది. ఢిల్లీకాలేజీలో శాస్త్రీయవిజ్ఞానమును దేశభాషలలో నేర్పుటకు ఉరుదూభాషద్వారా తొలిప్రయత్నము జరిగినది. ఇందునిమిత్తము ఇంగ్లీషునుండి అనేకగ్రంథములు ఉరుదూలోనికి అనువాదము చేయించిరి. ఈ యనువాదముచేసినవారిలో ప్రముఖ రచయిత మౌల్వీ జకాఉల్లా.

మీర్జా అసాదుల్లాఖాన్‌గాలిబ్ యుగకర్త అయిన ఉరుదూ కవి. 1857లో భారత స్వాతంత్ర్యయుద్ధజ్వాలలు వ్యాపించుట, దిగంతవిఖ్యాతిగాంచిన మొగలుసామ్రాజ్యము పతనమగుట కన్నులార గాంచి విభ్రాంతిచెంది ఆకాలములో ఢిల్లీనగరములో ఉండి కవితాగానముచేసెను. ఈతడు ప్రాచీనసంప్రదాయపద్ధతిని కవితారచనముచేసినను, నూతనభావములను వెదజల్లెను. అందుచేత ఉరుదూసాహిత్యమున మధ్యమ-ఆధునికయుగములను కలుపు వంతెనవంటివాడని యీతనిని వర్ణింతురు.

గాలీబ్ రచించిన ఘుజల్ గీతములు, ఆనాడు గొప్ప ప్రచారములో లేకపోయినను, ఉత్తమకవితకు ఉదాహరణములుగా నేటికిని వాటిని ఉరుదూవాఙ్మయాభిమానులు పాడుకొందురు.

గాలీబ్ ఉరుదూ గద్యవాఙ్మయములో క్రొత్తపంథాత్రొక్కి-సరళమైన వ్యవహారిక శైలిలో లేఖలు మొదలైనవి రచించెను. అవి తరువాత యనేక సంపుటములుగా వెలువడినవి.

1857లో భారతస్వాతంత్ర్యయుద్ధము విఫలమైనపిదప ఉరుదూ కవులలో ఒక ఆశాభంగము, ఒక నిర్విణ్ణత పొడసూపినవి. అప్పుడు సయ్యద్ అహమ్మద్ ఖాన్ అను విద్యావేత్త ఉరుదూభాషకు ఎక్కడ లేని ప్రోత్సాహమిచ్చి ఆలిఘర్ విశ్వవిద్యాలయమును స్థాపించెను. ఈతడు గొప్ప కవులను రచయితలను చేరదీసి వారిచేత అద్భుతరచనలు చేయించెను. అట్టివారిలో ముఖ్యులు హాలీ, నజీర్ అహమ్మద్, షిబ్లీ. ఆనాటి శాస్త్రీయవిజ్ఞానమును, విద్యాభావములను ప్రచారముచేయుటకు ఒక పత్రికపెట్టి అందు తన ఆశయములను పొందుపరచెను. ఈ పత్రిక పేరు తాజీబ్ - ఉల్ - అఖ్లాల్——

ఈయన యభిప్రాయముప్రకారము కళ కళకోసమే యను సూత్రము సరియైనది కాదు; కవులు సాహిత్యవేత్తలును ప్రజాభిప్రాయము ప్రకటించు ప్రతినిధులుగాను, ప్రజలనుద్బోధించు ప్రబోధకులుగాను పనిచేయవలెనను సూత్రములను ప్రతిపాదించి, కవులచేత రచనలు చేయించిరి. ఈ భావములను ప్రతిబింబింపజేసిన ప్రసిద్ధకవి 'హాలీ'. ఈతడు ఇస్లాంమతచరిత్రనందలి ఆటుపోటులను గొప్ప కావ్యముగా రచించి ముస్లిములు సాధించిన ఆధిక్యమును గౌరవించెను. ఈతడు రచించిన వచనరచనలలో గాలిబ్ చరిత్ర, సయ్యద్ అహమ్మద్ ఖాన్ జీవితచరిత్ర పేర్కొనదగినవి. నజీర్ అహమ్మద్ అనేకనవలలు రచించెను. వీనియందు మధ్యతరగతి ముస్లింకుటుంబాలజీవితములను చిత్రించెను. ఈతడు కురాన్‌కు ఉరుదూలో చేసిన అనువాదము విశిష్టమైనది. ఈతడు అనేక 'లా' చట్టములను, శిక్షాస్మృతులను (Penal Code) ఉరుదూలోనికి అనువాదముచేసెను.

షిబ్లీ గొప్ప జీవితచరిత్రలను, సాహిత్యవిమర్శనలను వ్రాసి ప్రసిద్ధికెక్కిన మహనీయుడు. పార్శీసాహిత్యచరిత్రగూర్చి ఈతడు రచించిన గ్రంథము చాల ప్రసిద్ధికెక్కిన సమాలోచనాగ్రంథము. ఉరుదూకావ్యచరిత్రవ్రాసిన మరొక ప్రసిద్ధ విమర్శకుడు మహమ్మద్ హుస్సేన్ ఆజాద్. ఈతడు రచించిన అబ్ - ఇ - హాయత్ గొప్ప కావ్యవిమర్శ. ఢిల్లీలో ఉన్న "దాగ్" అను కవి ప్రాచీనసంప్రదాయములలో కవితారచన గావించి ప్రసిద్ధికెక్కినవాడు. నిజమునకు ఉరుదూవాఙ్మయచరిత్రలో ఉత్కృష్టదశ 19వ శతాబ్ది చివరిభాగములో వచ్చిన అనేక రచయితల నూతనప్రయోగములతో పరిఢవిల్లినది. ముఖ్యముగా రతన్‌నాథ్ శర్షార్, అబ్దుల్ హాలీమ్ షరార్, మీర్జా రూజ్వా మున్నగువారు గొప్ప చారిత్రిక నవలలు రచించిరి. లక్నోనగరములోని నర్తకిచరిత్రకు సంబంధించిన 'ఉమ్రావ్ జాన్ ఆదా' అను నవల లోకప్రసిద్ధమైనది. 19వ శతాబ్ది చివర వచ్చిన అక్బర్ అలహాబాదీ యను కవి, పాశ్చాత్యపద్ధతులను అనుకరించుటచేత వచ్చిన దుష్పరిణామములను అధిక్షేపణచేయుచు హాస్యముతో కూడిన హేళనకావ్యములను రచించినాడు. ఈతని కవిత్వములో ఛందస్సు, భాషాప్రయోగమును పరిపూర్ణ పరిణతిని పొందినవి.

ఉరుదూభాష ముస్లిములే ఎక్కువ వ్యవహరించినను, హిందువులు ముస్లిములుకూడ ఈ భాషలో కృషిచేసినవారున్నారు. వీరి ప్రభావము పంజాబులోను, కాశ్మీరులోనుకూడ ప్రసరించినది. ఆధునికయుగప్రభావము 20వ శతాబ్దివరకు పంజాబు, కాశ్మీరు దేశములలో ప్రారంభముకాలేదు. 19వ శతాబ్దిలో కొన్ని అనువాదములు వచ్చినను, పంజాబుసాహిత్యములో అవి ప్రత్యేకస్థానము పొందలేకపోయినవి. అంతకుముందు గురు నానక్ పరంపరలో వచ్చిన సిక్కుగురువులరచనలే పంజాబువాఙ్మయమునకు 'శబ్దము' లను పేరుతోడను గురుగ్రంథములను పేరుతోడను పవిత్ర గ్రంథములుగా ప్రఖ్యాతి పొందినవి. సిక్కులందరును అవి దైనందినపారాయణము చేయుచుందురు. ఈ గీతములలో భక్తితో కూడిన ఒక మర్మవాణియును

ఒక దివ్య ఛాయావాదమును గోచరించును. ఇట్టి కవిత్వముపైన పర్షియన్ భాషలోని సూఫీవాదము కొంత, వ్రజభాషలోని "సంతవాణి" కొంత పనిచేసినవి. ఈ కవిగీతములు మనోహరభావములతో ప్రకృతి, పురుషులమధ్య ప్రేమతత్త్వమును సమర్థించునదిగా నుండును. కొన్నింటియందు జీవితవేదాంతతత్త్వమును ప్రతిపాదించి పరమార్థమును ప్రబోధించునదిగా గోచరించును.

ఈ పంజాబీసాహిత్యప్రభావమే కాశ్మీరీసాహిత్యములో కూడ కన్పించును. భాయి పరమానంద్‌వంటివారలు రామాయణము, శివలగన్‌వంటివి వ్రాసిరి. మహమ్మద్ గామీ (1855) ప్రేమకావ్యము లనేకములు రచించెను. వానిలో ప్రసిద్ధికెక్కినది యూసఫ్ జులేఖా, లైలామజ్నూ, షిరీన్‌ఖుస్రూవంటివి లలితపదజాలముతో మృదులభావములను వ్యక్తపరచినవి.

రసూల్ మీర్ అనునతడు, గజలుపద్ధతిలో గేయరచనలుచేసి ఒకరకపు నూతన ఖండకావ్యములను ప్రేమగీతికలను ప్రచారములోనికి తెచ్చెను. ఈపాటలవంటివి రచించినవారిలోహబ్బాఖాటూన్, ఆర్నిమల్ మొదలగువారిగీతికలు కాశ్మీరులో అందరును పాడుకొందురు. పరమానంద్ "లీలా" కావ్యములను రచించిన కవి. పూర్వ సంస్కృతకావ్యమార్గములో ఈతని రచనలయిన రాధాస్వయంవరము, సుదామచరిత్ర, శివలగన్ ప్రసిద్ధికెక్కినవి. ఈతడు (1819-1880) వరకు జీవించినకాలములో అనేక కావ్యములు రచించెను. గద్యవాఙ్మయములో అనేక కథలున్నవి. ప్రజలలో ప్రచారములో నున్నవి. ఇవి చాలకాలమువరకు గ్రంథరూపముదాల్చలేదు. మిగిలినభాషలలోవలె కాశ్మీరుభాషలోకూడ మిషనరీలు ఇంగ్లీషునుండి బైబిలువంటిగ్రంథములను అనువాదముచేసిరి. రివరెండు టి. ఆర్. వాడే బైబిలును కాశ్మీరీలోకి తెచ్చిరి. ఈశ్వరకౌలు కాశ్మీరశబ్దామృతము అను వ్యాకరణమును రచించెను. కాశ్మీరీభాషలోని సామెతలను సేకరించి రివరెండు నోవెల్సు **Kumrilcs** ఒకగ్రంథమును ప్రక

టించెను. ఇందులో కాశ్మీర్ప్రజల హాస్యధోరణి, శీలము, చరిత్ర ఆచారవ్యవహారములు ప్రతిబింబించును.

పశ్చిమకోస్తాప్రాంతములలో గుజరాతీ, మరాటీభాషలలో సాహిత్యనవోదయము ప్రారంభమగుటకు బొంబాయిలో స్థాపించిన విద్యాలయములు కారణ మనవచ్చును. 1818లో కర్కి యుద్ధఫలితముగా గుజరాతుదేశమంతయును బ్రిటిషుఅధీనములోనికి వచ్చెను. బొంబాయిలో ప్రారంభముచేసిన ఎల్ఫిన్స్టన్ విద్యాలయములో గుజరాతీ నేర్పుటకు ఉపాధ్యాయులకు అవకాశమిచ్చిరి. ఆకాలములో గుజరాతీభాషాసంఘ మొకటి (1848) అహమ్మదాబాదులో ఎ. కె. ఫోర్బ్సు అనునతడు స్థాపించి దళపత్ రామ్ అను కవిని ఆహ్వానించెను. దళపత్ రామ్ సంస్కృతఛందస్సులను శయ్యలను రీతులను మన్నించి పద్యములలో నూతన భావములను వ్యక్తపరచెను. 1851లో ఆతడు రచించిన దీర్ఘకావ్యములో 'పరిశ్రమలపై దాడి' యను పేరున పాశ్చాత్యసంపర్కముచేత మన పరిశ్రమలు క్షీణించిన విధమును వర్ణించెను. ఈతనికాలములో వచ్చిన నవకవి నర్మద్ - పాశ్చాత్య ప్రభావమువలన కలిగిన నూతన వైఖరులను ప్రకృతికవితలోనూ ఆత్మాశ్రయ కవిత్వమునందునను ప్రదర్శించి ప్రేమగీతములను రచించెను. ఈతడు గద్యవాఙ్మయములోకూడ అనేక నూతనప్రయోగములుచేసి నూతన సాహిత్యమును సృష్టిచేసెను. మఱియెవ్వరిసహాయమును లేక, స్వయంసాహాయ్యముతో గుజరాతీ నిఘంటువును నిర్మాణమొనరించెను. నర్మద్ తన తీవ్రధోరణిలో అప్పటి ఆచారవ్యవహారములను నిశితముగా విమర్శించెను. 1857లో బొంబాయి విశ్వవిద్యాలయస్థాపన జరిగింది. ఇక్కడ చదివిన విద్యావంతులు ఆంగ్లసారస్వతము చదివి, వానిభావములను తమకవితలో ప్రవేశపెట్టిరి. అట్టివారిలో బాలశంకర్, కలాపి, మణిలాల్ ముఖ్యులు. నానాలాల్ జానపదగేయములలో కవిత చెప్పగా ఖబర్దార్ పార్సీ భాషలో మంచి రచనలుచేసెను.

గద్యరచనలలో పెద్దనవలలు రచించిన గోవర్ధన త్రిపాఠీ(1855 జననము) గొప్పవాడు. ఈతడు సరస్వతీచంద్ర అను పేరుతో 1905 పుటలుగల నాలుగుభాగాల నవల రచించెను. దళపత్ రామ్, నానాలాల్ కలిసి గుజరాతీసాహిత్యములో 113 సంవత్సరములవరకు ఎనలేని ప్రయోగములుచేసి అద్భుతరచనలను గావించిరి. 1866 లో 'కరణఘేలో' అనే చారిత్రికనవల గుజరాతీభాషలో వెలువడిన తొలి నవల యందురు. మరాటీభాషలో కూడ 1818 లో నవోదయము ప్రారంభమైనది. మిగిలినభాషలలోవలెనే మొదటిదశలో నిఘంటువులు, వ్యాకరణములు వెలువడినవి. ముఖ్యగ్రంథములు నేటివ్ ఎడ్యుకేషన్‌సొసైటీద్వారా మరాటీలోనికి అనువాదమైనవి. మరాటీలో ఒక వింతరకపుశైలితో కృత్రిమ ఆంగ్ల-మరాటీభాషలో గ్రంథములు వ్రాసెడివారు. 1818-1874 వరకు సంస్కృతకావ్యముల ప్రభావమే మరాటీరచనలపైన పనిచేసినదని ఈ కాలములో వచ్చిన 'నవనీత్' అను సంకలనము నిరూపించును. అంతకాలమువరకు ప్రచారములోనున్న 'లలిత్' వంటి వీధినాటకములు పోయి, అనువాద నాటకములు అనేకము వెలువడినవి. శాకుంతలము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికవంటి సంస్కృతనాటకములేగాక, షేక్స్పియరు రచనలయిన ఒథెల్లో, కింగ్‌లియర్, వింటర్స్‌టేల్‌వంటివి మరాఠీలోనికి అనువాదమైనవి. మొదటి స్వతంత్రనాటకము 'కీర్తనే' రచించిన "త్రోర్లే మాధవరావు" అను చారిత్రికనాటకము. అలాగే 1871 గుంజీకర్ రచించిన 'మోచనగడ్' అను చారిత్రికనవల మరాఠీలోని తొలి నవల.

1831లో మరాఠీలో 'దర్పణ' అను పేరుతో పత్రికారచనకు శంఖుస్థాపన జరిగింది. కాని 1874లో చిప్లుంకర్ రచించిన 'నిబంధనమాల'తో వ్యాసరచన ఒక ఉన్నతస్థాయి నందుకొన్నది. ఈతడు 'కేసరి' 'మరాఠా' అను పత్రికలను సంస్థాపించెను. ఈతని ఆదర్శముతో అనేక నవరచయితలు మరాఠీలో వచ్చి సాహిత్యమును పరిపుష్టముచేసిరి. వారిలో అగరేకర్, తిలక్, పరంజపే, హెచ్. యన్.

ఆప్టే ముఖ్యులు. ఆధునిక మరాఠీకవితాపితామహుడని చెప్పదగిన కేశవసూత్ స్వచ్ఛందమైన స్వాభిమానపూరితమైన నవభావములతో కూడిన నవ్యకవిత్వమును సృష్టిచేసెను. నవలారచనలో ఆప్టే సాంఘిక, చారిత్రికగాథలతోకూడిన నవలల్లో మరాఠీగౌరవమును ప్రతిష్ఠింపజేసెను. వీనిలో 'ఉషఃకాలము' ప్రసిద్ధమైనది.

మరాఠీసాహిత్యము - ఇరుగుపొరుగులోనున్న కన్నడసాహిత్యముపైన తనప్రభావమును చూపినది. 185౦ తరువాతనే ఆధునిక యుగ లక్షణములయిన, అనువాదము, అనుకరణము, అతి నవీన కావ్యకల్పన ప్రారంభమైనవి. ముమ్మడి కృష్ణరాయరు (1794-1868) కన్నడములో గద్యరచనలుచేసిన తొలి గ్రంథకర్త. ఈతడే తెలుగు భాషలోకూడ కొన్నిరచనలు చేసెనందురు. ఇతరభాషలలోవలెనే కన్నడములో ప్రథమదశలో సంస్కృతమునుండి, ఆంగ్ల, బంగాలీ భాషలనుండి అనువాదములు వచ్చినవి. ఆకాలములోని గద్యశైలి 'ముద్రామంజూష'అను కావ్యములో కనిపించును. మిషనరీల బైబిలు మొదలయిన మతగ్రంథములు కన్నడ సాహిత్యములోనికి వచ్చినవి. ముద్దన్నరామాశ్వమేధ యను పేరున రాముని అశ్వమేధగాధ చెప్పగా మధ్య భార్యవేయు ప్రశ్నలకు ఆతడు సమాధానములు చెప్పెను.

తొలుత వంగభాషనుండి సంగన్, పి. బి. నారిగల్ అను వారలు అనేక అనువాదాలు చేసినారు. మరాఠీలోని చారిత్రక నవలలవంటివి కన్నడములో అనేకము వచ్చినవి. కాని ఆధునికపద్ధతి పద్యకావ్యములును, గద్యకావ్యములును నవీనమార్గములో వచ్చుట ఇరువదవశతాబ్దిలోనే ప్రారంభమైనది. కన్నడములోవలె రాజకవులు నవీనసాహిత్యమునకు ప్రోత్సాహముచేసిన మరొకభాష మళయాళము. కేరళవర్మ, రాజరాజవర్మయనువారలు సంస్కృత కావ్యములను అనుసరించి మళయాళములో అనువాద రచనలు చేయించిరి. ఆవిధముగా శకుంతల, ఉత్తరరామచరిత్రవంటి నాటకములేగాక హాలాస్యప్రబంధము, జ్ఞానవాశిష్ఠమువంటి వేదాంత గ్రంథములను సైతము అనువాదముచేసిరి. మళయాళములో క్రొత్త

విద్యావసరములకు కావలసిన వాచకములను పాఠ్యపుస్తకములను రాజరాజవర్మ, కేరళవర్మ రచించి, పాశ్చాత్యభావములను సులభ శైలిలో ప్రకటించిరి. కేరళవర్మ గద్యరచనలు ఇతరులకు మేలు బంతులైనవి. రాజరాజవర్మ తన మేనమామవలె చక్కని గద్యరచనలు చేసెను. ఇతడు రచించిన 'సాహిత్యసహాయము' గద్యరచన చేయు పద్ధతిని సూచించు మార్గదర్శివంటిది.

కేరళవర్మ 'అక్బరు' అను ఆంగ్ల నవలను అనువాదము జేసెను. కాని అది సమాసభూయిష్ఠమైన క్లిష్టశైలిలోనుండెను. నవలారచనలో సి. వి. రామన్‌పిళ్ళై, చంటూమీనన్‌గారలు గొప్ప కృషి చేసిరి. రామన్‌పిళ్ళై తిరువాన్కూరునేలిన రాజులచరిత్రలకు సంబంధించిన గాథలు తీసికొని చారిత్రికనవలలు రచించెను. ఆతడు రచించిన మార్తాండవర్మ, ధర్మరాజ, రామరాజబహద్దర్ ఇట్టినవలలలో ముఖ్యమైనవి. చంటూమీనన్ 'ఇందులేఖ' 'శారద' వంటి సాంఘిక కథలనుగూర్చి నవలలుగా రచించెను. ఈ ఇద్దరు రచయితలును రచించిన నవలలు మళయాళసాహిత్యమునకే మెఱుగు తెచ్చిన మణిహారములవంటివి. 'ఇందులేఖ' ఆకాలములోనే తెనుగులోనికి అనువాదమైనది. ఇంక పద్యవాఙ్మయములో ప్రాచీనసంప్రదాయముల ననుసరించి మహాకావ్యములను రచించినవారును ఉన్నారు. ఇట్టి కవులలో పేర్కొనదగినవారు, కుమారన్ఆశాన్, ఉల్లూరు పరమేశ్వరన్ అయ్యరు, వల్లత్తోల్ నారాయణమీనన్‌గారలు ముఖ్యులు. వీరియందరిలోనూ వల్లత్తోల్ రకరకములకావ్యముల రచించెను. ఋగ్వేదమును అనువాదముచేయుటనుండి ఖండకావ్యములు, లఘుకావ్యములవరకు అన్ని రకములరచనలుచేసెను. ఆతని రచనలలో అనిరుద్ధన్ గణపతి, శిష్యనుమ్ మకనుమ్, మాగ్దాలానా మారియుమ్ ప్రసిద్ధికెక్కిన చిన్నకావ్యములు. ఈతడు మొన్నమొన్నటివరకు వుండెను. ఇటీవలనే కీర్తిశేషు డయ్యెను. (1957)

ఆధునిక సాహిత్యయుగోదయములోని అన్నిలక్షణములను జీర్ణింపజేసికొని, అత్యుత్తమ రచనలు తెచ్చుటలో మళయాళము

దక్షిణభాషలలో కొంతవరకు ముందంజవేసిన దనవచ్చును. దీనికి కారణము మళయాళ దేశములో అక్షరాస్యులసంఖ్య హెచ్చుఅగుట, ముద్రణయంత్రమును తెచ్చిన క్రైస్తవమతప్రచారకులు హెచ్చుయి, ఆ మతావలంబకులు ఎక్కువయగుట యనవచ్చును. దక్షిణభాష లలో సంస్కృతపదములు మణిప్రవాళముగా కలిసిపోయిన వ్యావహారికశైలి యిది యగుటచేత, ప్రాతక్రొత్తలమేలు కలయికను సాధించుటకు వీలైనది. 19వ శతాబ్ది సాహిత్యము మళయాళములో ఆధునిక మధ్యయుగములకు సంధియుగముగా పనిచేసినది. దీనితో 19వ శతాబ్ది తమిళసాహిత్యమును సరిపోల్చినచో అన్నిమార్పులు తమిళములో రాలేదేమో యనిపించును. 1814లో ఫోర్టుసెంట్‌జార్జి కాలేజి మద్రాసులో ప్రారంభించి అన్నిభాషలకును ప్రోత్సాహము లభించినది. అంతకుముందే 'పోప్'అను పండితుడు తమిళభాష నభ్య సించి బైబిల్‌వంటిగ్రంథములను తమిళములోనికి అనువాదముచేసెను. ఫాదర్ బెష్చి తమిళనిఘంటువులు తయారుచేయుటయేగాక, తమిళ మహాకావ్యము నొకటి రచించెను. ఈతడు అనేక తమిళకావ్యములను యూరపియను భాషలలోనికి అనువాదముచేసినాడు. అందుచేత ఆధునిక తమిళసారస్వతమునకు ఈతనినే యుగకర్తగా కొందరు పేర్కొందురు. 19వ శతాబ్ది ఆరంభములో కొన్ని తమిళరచనలు ప్రాచీనపద్ధతిని అనుసరించి ఇలక్కియ త్తమిళ్ భాషలో వెలువడినవి. ఫాదర్ బెష్చి వ్యావహారికభాషలో సులభమైన శైలిలో రచించి అందరికి సుబోధకమగునట్లుచేసెను. నాటి తమిళపండితుల కిది నచ్చ లేదు. తిరిగి గ్రాంథికభాషను నెలకొల్పుటకు ప్రయత్నముచేసిరి. కొందరు ప్రజావాఙ్మయపద్ధతుల ననుసరించి యక్షగానములవంటి నాటకములు రచించిరి. 18వ శతాబ్ది ఆరంభములో రామనాటక మును రచించిన అరుణాచలకవి యిది ప్రారంభముచేసెను. ఈ పద్ధ తిని 19వ శతాబ్దిలో గోపాలకృష్ణ భారతి నందనచరితమును రచిం చెను. 19వ శతాబ్ది మధ్యభాగమునుండి, భక్తకవులు, గాయకులు, వీరగాథాగాయకులు తమిళకవిత్వమును చెప్పి క్రొత్తపద్ధతులు ప్రవేశ

పెట్టినారు. అట్టివారిలో జ్యోతి రామలింగస్వామి రచించిన తత్వములు వేదాంతసారమును ప్రబోధించు గుళికలు. అట్లే అన్నామలై రెడ్డిగారు ఆకాలపు తమిళకవులలో పేరెన్నికగన్నవారు. కథలను చరిత్రను తిరుగ వ్రాయుటలో ఆరుముగనావలార్, ఇబ్రహీమ్ పారవుతర్ క్రొత్తబాటలను త్రొక్కి తమరచనలచేత ప్రజలమన్ననలందుకొనిరి. క్రైస్తవులు, ముస్లిములు, హిందువులు అను భేదములేక అన్నిమతములవారును తమిళసాహిత్యములో కృషిచేసిరి. పాశ్చాత్యభావసంపర్కమువలన నవలవంటి రచనలకు 1869లోనే ప్రారంభము జరిగినది. వేదనాయకంపిళ్ళై ప్రతాపమొదలియారుచరిత్రము1869లో ప్రచురణఅయిన తొలినవల. దానితరువాత మరి యిరువది సంవత్సరములకు రాజమ్ అయ్యరు కమలాంబాళ్ చరిత్రమును, మాధవయ్య పద్మావతిచరిత్రమును వెలువడెను. 19వ శతాబ్దిలోనే తమిళములో నాటకరచన ప్రారంభమైనది. సంబంధంమొదలియారువంటి రచయితలు నాటకములను రచించి రంగస్థలముమీద ప్రదర్శించుట 19వ శతాబ్ది చివరిభాగమున పరిపాటియైనది. చెన్నపురిలోని సుగుణవిలాస సభ ఈ నాటకప్రదర్శనములకు ప్రోత్సాహమిచ్చినది. శాస్త్రగ్రంథములును, విజ్ఞానగ్రంథములును, సాహిత్యపత్రికలును 19వ శతాబ్ది ఉత్తరార్థములో వెలువడినవి. వీనియన్నింటియందును గ్రాంథిక భాషను మాత్రమే వాడుటచేత తమిళము అంతగా ప్రచారములోనికి రాలేదు. ఆనాటి విద్యావంతులు ఇంగ్లీషుభాషగాని సంస్కృతముగాని శ్రద్ధతో నేర్చుకొన్నారేగాని తమిళసాహిత్యమును అంత అభిమానముగా చదివినవారుకారు. ప్రాచీన తమిళసాహిత్యము యెడల అభిరుచి కలిగించుటకు మహాపండితుడైన యు-వేం-స్వామినాథయ్యరు ప్రాచీనగ్రంథములను సేకరించి వానిని సవిస్తరమైన వ్యాఖ్యానములతో ప్రకటించెను. వివిధకవుల చరిత్రలను, కావ్యవిమర్శలను చక్కని భాషలో రచించి ఆధునిక తమిళసారస్వతమునకు ఒక క్రొత్తత్రోవ కల్పించెను.

తమిళసాహిత్యములో నవయుగప్రారంభము సుబ్రహ్మణ్య భారతి ప్రజ్వరిల్లచేసిన కవితాజ్యోతితోనే కలిగెను. అంతవరకు చీకటికోణములో, ఎవ్వరికినీ అర్థముకాని అన్వయకష్టమైన భాషతో చిక్కుపడిన సాహిత్యమహారణ్యములో 'భారతి' తన కవితా విద్యుత్ కాంతితో ఒక్కసారి తమిళపాఠకుల కన్నులను జిగేలుమనునట్లు చేసెను. ఆయన రచించిన ఖండకావ్యములు, దేశభక్తిగీతములు, కన్నన్‌పాటలు, పాంచాలీ శపథమువంటి నాటకము, కథలు, చరిత్రలు, వ్యాసములు గద్య పద్య రచనాపద్ధతులలో క్రొత్తవెలుగులు ప్రసరింపజేసెను. ఇదియంతయు విద్యార్థిగా ఉన్నపుడే సుబ్రహ్మణ్య భారతి సూచనప్రాయముగా ప్రారంభముచేసినను 20వ శతాబ్ది ప్రథమపాదములోగాని పరిణతికి రాలేదు. ఆయన కీర్తిశేషుడైన తరువాతగాని తమిళప్రజలు ఆయన కీర్తి ప్రతిభలను, ఉపదేశముల అంతరార్థమును గుర్తింపలేదు.

అందుచేత 19వ శతాబ్దిలో తమిళసాహిత్యములోజరిగిన కృషి తరువాత వచ్చినదానికి ప్రాతిపదికగా ఉపకరించినదే తప్ప పెద్ద విశిష్టస్థాయి నందుకొనలేకపోయినదని చెప్పుకొన్న చాలును.

ఈ విభిన్నభాషలలో 19వ శతాబ్దికాలములో వచ్చినమార్పులను స్థూలముగా గమనించినచో అన్నింటిమీదను పాశ్చాత్యప్రభావము పనిచేసినను పూర్వసంప్రదాయములముద్ర పూర్తిగా పోలేదని ఒప్పుకొనితీరవలెను. ఈ సంప్రదాయము కొంతవరకు ప్రాచీన సాహిత్యమునుండి అనుస్యూతముగా వచ్చినదిగాను మరికొంత సంస్కృతభాషనుండి సంక్రమించినదిగాను పోల్చుకొనవచ్చును. కొన్నిభాషలపైన సంస్కృతభాషాప్రభావము అమితముగా కనిపించును. (ఉదా-తెలుగు, మరాఠీ, మళయాళం, మరికొన్నింటిపైన పర్షియన్‌భాషాప్రభావము కనిపించును. (పంజాబీ ఉరుదూ గుజరాతీ కాశ్మీరీ) మరికొన్నిభాషలపైన సన్నిహితభాషల సంపర్కము కొంతవరకు పనిచేసినట్లు చెప్పవచ్చును. (వంగ - అసామీ - ఉత్కళ భాషలు.)

ఇపుడు తెనుగు సాహిత్యముపైన 19వ శతాబ్దిలో ఇతర భారతీయభాషల ప్రభావము ఎట్లు పనిచేసినదియును గమనించి తెలుగు సాహిత్యము ఇరుగుపొరుగు భాషలపైన ఎట్లు పనిచేసినదియో పరిశీలింతము. తెలుగుభాష తెలిసినవారు కన్నడ, ఉత్కళ, తమిళ ప్రాంతములలో నుండుటచేత ఆ యా భాషలతో సంపర్కమువలన మనభాషను, సాహిత్యమును వృద్ధిపొందజేసిరి. దానికి ముఖ్యకారణము తెలుగుభాషకు గల విశాలదృక్పథము దోహదముచేయుటయే. తెలుగుభాష ఏభాషలోని శబ్దములనైనను, భావములనైనను ఆనందముతో స్వీకరించుకొనును. వానిని 'తెలుగు' చేసికొని 'తెలుగు' తనము వానికిచ్చివేయును. అందుచేతనే సంస్కృతమునుండి, తద్భవములు, తత్సమములు అనేకము తెలుగులో ప్రవేశించి మన పదకోశమును వర్ధిల్లజేసినవి. అట్లే ఆంగ్లభాషాపదములుకూడ. 'నవల'ను 'కాదంబరి'యని 'ఉపన్యాస'మని'ఆఖ్యాయిక'యని ఏవేవో పేరులతో పిలువక నాజూకుగా 'నవల' యని పిలిచి దానిని తెలుగుపదముగా చేసికొనుట తెలుగువారికే చెల్లినది. ఇట్లెన్నెని ఉదాహరణములు చూపవచ్చును. 1848లో మన కోర్టులలోభాష పార్సీ కావలెనని నిర్ణయించిన తరువాత, మనకు రివెన్యూవిధానము అమలులోనికివచ్చిన తరువాతను 'శిరస్తాదారు' 'గుమాస్తా' 'కచ్చేరీ' 'అమలు,' 'హక్కు' 'కవులు' వంటి పదములు తెనుగుపదములుగానే మారిపోయినవి. దానివలన 'హిందూస్థానీ' మాటలు తెనుగులో లెక్కకు మిక్కిలి యుండును. తెనుగులో ప్రవేశించిన యితరభాషాపదముల పట్టికను చార్లెస్ బ్రౌను తయారుచేయుచు ఇట్టిపదములను వేలసంఖ్యగా సేకరించెను. 5000 మాటలవరకు హిందుస్థానీపదములు కలిసియున్నవి. ఉదాహరణగా ఈ క్రిందివాక్యములు చూడవచ్చును.

*'రైతుకు' భూమియే ఆధారం 'రైతే' భూమికి 'కామందు' ఏ 'ఆసామీ' యైనా 'జమీందారీ' లోవున్నా 'సర్కారీ'లో వున్నా

---

*ఆంధ్ర సర్వస్వము : 34వపుట—తెనుగునాట హిందీభాషాప్రభావం—మోటూరు సత్యనారాయణగారు.

అతడు 'జరీబు' దున్నినా 'తరీ' సాగుచేసినా 'ఇజారా' పాడుకున్నా 'మక్తా'కు ఒప్పుకొన్నా అతడికి 'రోజూ' 'మున్సబు' తోటీ 'తహసీల్దారు' తోటీ 'అమల్దారు'తోటీ 'లావాదేవీ'లు తప్పవు. ఇటువంటి ఉదాహరణ లెన్నియైనను చూపవచ్చును. తెలంగాణములోని వాడుకభాష అరబ్బీ, పార్శీమాటలతో కలిసి హిందూస్థానీ యనిపించును. 19వ శతాబ్దిలో కొన్ని హిందూస్థానీ నాటకసమాజములు వచ్చి, హరిశ్చంద్ర, పీష్వా నారాయణరావు వంటి నాటకములను ప్రదర్శించినవి. వానినిచూచి బందరు గుంటూరు నగరములలో కొందరు హిందూస్థానీ నాటకములను ప్రదర్శించి కృతకృత్యులయిరి. ఆకాలములో విద్యాధికులైనవారు ఉరుదూకూడ ఆంగ్ల సంస్కృతభాషలతోపాటు నేర్చుకొనుచుండుట పరిపాటి. నేటికిని తెలంగాణాలో తెనుగువారనేకులు ఉరుదూలో ప్రసిద్ధకవులుగాను రచయితలుగాను ప్రసిద్ధికెక్కిరి. ముందుముల నరసింగరావు, బూర్గుల రామకృష్ణరావు, మాడపాటి హనుమంతరావుగారల ఉరుదూభాషా పరిజ్ఞానము తెలంగాణములో ప్రసిద్ధికెక్కినది.

ఏనాడో తెనుగుదేశమును వీడి ఉత్తరదేశమున మతప్రచారముచేసిన మహాప్రవక్త - వల్లభాచార్యుడు శుద్ధాద్వైత (వైష్ణవ) మతమును ఉత్తరభారతఖండమున ప్రవర్తిల్లజేసెను. ఉత్తరదేశమునకు వలసపోయిన తెనుగువారిలో ప్రసిద్ధకవియగు మోహన్‌లాల్ భట్, పద్మాకర్, గదాధర్ భట్, గోరీలాల్ మున్నగువారి పేరులు చెప్పుకోదగినవి. 20వ శతాబ్దిలో తెనుగు - హిందీ సాహిత్యముల మధ్య ఆదానప్రదానము విరివిగా సాగుచున్నది. కుతుబ్‌షాహీల కాలములో కొన్ని తెనుగుకావ్యములు ఉరుదూభాషలోనికి అనువదితమైనవని యందురు.

ఇట్టి పదములను పద్యములలోకూడ ప్రయోగించి నిత్యవ్యవహారములోని వీని పరిభాషతో ఆకాలపు కవులు కొందరు పరిచయముచేసియున్నారు. 18, 19వ శతాబ్దులకుచెందిన శ్రీ విస్సాప్రెగడ

కామరాజ కవికృతమైన "బేరీజు పద్యములు" పరిశీలించిన ఈ మిశ్రమభాషా ప్రయోగములను గమనించవచ్చును.

నగదు చిఠ్ఠాప్రాయదగురీతి జమ ఖర్చు
    వేర్వేఱ నావర్జుచేయుదారి
నెల జమాఖర్చు నర్మిలి వ్రాయుపద్ధతి
    వేడ్కఁ జెందిన పద్దువేయు సూటి
పరికించి మునరపు బారుసేయు తెఱంగు
    సాలు జమాఖర్చు సలుపువిధము
పరగ జమా వసూల్బాకీ జమాఖర్చు
    వరుస వసూల్వాడి వ్రాయునేర్పు
లోకు లెన్నంగదగు చెల్లుబాకి సరణి
యవని జమకట్టి సెహసేయునట్టి క్రమము
చెప్పబూనితి నాకు దోచినవిధంబు
రసిక జనులార మీ దయారసము నొంద ॥

వంగభాషలో నవోదయము 1850 నుండి ప్రారంభమైనను, దానిప్రభావము మొదలుపెట్టి తెలుగుదేశముపైన ప్రసరించుటకు కొంతకాలము పట్టెను. వంగభాషలో బ్రహ్మసమాజమునకు చెందిన రచనలు ఆకాలములో కొందరు చదివి తెలుగులోనికి అనువాదము చేసిరి. వారిపద్ధతుల ననుసరించి వీరేశలింగంపంతులుగారు స్వతంత్రముగానే వ్యాసములు రచించిరి. కొన్ని ఆంగ్లానువాదములను కన్నడ భాషానువాదములను చూచి బంకిమ్‌చంద్రుని నవలలు తెనుగులోనికి కొందరు అనువాదముచేసిరి. అట్టివానిలో తొలుత ఆనందమఠము, ప్రఫుల్ల (దేవీచౌదురాణి) 19వ శతాబ్దిలోనే వచ్చినవి. వంగభాషనుండి అసంఖ్యాకముగా నవలలను అనువాదము చేయుపద్ధతి 1912లో ఆంధ్రప్రచారిణీగ్రంథమాల అవతరించువరకును ఆరంభముకాలేదు. అట్లే రవీంద్రుని రచనలు, శరత్‌చంద్రుని రచనలు తెలుగులోనికివచ్చుటకు చాలకాలముపట్టెను. అప్పటికి ఆంగ్లములోకూడ వెలువడిన రమేశ్‌చంద్రదత్ నవల (Lake of Palms)

సుధాశరత్ చంద్రమువంటివి చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు అనువాదముచేసిరి. ఈ యనువాదములు నాటి తెలుగుసాహిత్యము పైన పెద్దప్రభావమును చూపినవనుటకు తగిన నిదర్శనములులేవు. 19వ శతాబ్ది చివరివాదమున తెలుగు గద్యసాహిత్యములో కలిగిన చైతన్యమును, సంచలనమును వంగదేశమునుండి ప్రారంభమైన ఒక అల గాకూడ తీసికొనుటకు వీలులేదు. ఇచ్చటి సాంఘికస్థితిగతులకు, విద్యావసరములకు, విజ్ఞానప్రబోధమునకు కావలసిన సాహిత్యమును ఆనాటి సాహిత్యకృషీవలులు స్వయంకృషివలన ఉత్పత్తిచేసిరేకాని ఒకరినద్ద ఎరువుతెచ్చుకొన్నదికాదు; ఒకరినిచూచి నేర్చుకొన్నది యునుకాదు. తెలుగుసాహిత్యమునకు కావలసిన క్రొత్త మొలకలు తెచ్చుకొని నాటుకొని, ప్రోదిచేసి వానిని వృద్ధిచేసి వానిని పుష్పింప జేసి, ఫలింపజేసి ఆ ఫలితముల ననుభవించి ఆనందించిరేకాని ఎరువుసొమ్ము బరువుచేటుగా చేసికొనలేదు. తెలుగుసాహిత్యము ఇతరులలో మంచి యున్న సంతోషముతో స్వీకరించినది. తనలో సుగుణములున్న ధారాళముగా ఇతరుల కందించినది.

మహారాష్ట్రము ఆంధ్రదేశమునకు అంత సన్నిహితము కాకపోయినను ఇరుగుపొరుగు దేశములలో ఒకటి. కొన్నిమాటలు, ప్రయోగములు 'అక్కడ యిక్కడ' వంటివి తెలుగును పోలియుం డును. మహారాష్ట్రుల 'అభంగములు' తెనుగువారికి చిరపరిచిత ములు. మహారాష్ట్రభాషలోని పాండురంగని భక్తులచరిత్రలు కలి గిన 'భక్తవిజయము' తెనుగులో ప్రసిద్ధికెక్కినది. సమర్థరామదాసు గోదావరీతీరములో జన్మించి కృష్ణాతీరమున తపశ్చర్యచేసి కాశీనుండి రామేశ్వరమునరకును పర్యటనముచేసెను. దక్షిణాంధ్రమున తంజా వూరునేలిన మహారాష్ట్రనాయకులలో శివాజీ, శహాజీ, ఏకోజీ ప్రభృతులు యక్షగానములను తెనుగులో రచించిరి. అట్టి యక్షగాన ములే 'లలత్' అనుపేరున వీధినాటకములుగా మరాఠీలో అవతరించి నవి. శివాజీకాలమున మరాఠీదండులు ఆంధ్రదేశమువైపు వచ్చిపోవు చుండెడివి. అప్పుడే 'పవాడే'వంటి వీరపదములగానము ప్రారంభ

మైనది. తెలుగుదేశములో చెప్పు హరికథలలో మొన్నమొన్నటి వరకు 'ఓలీ' 'చౌపాయీ', 'ఆర్యా' చెప్పనిదే కథ ముగిసెడిదికాదు. నేటికిని మహారాష్ట్రములో పోతన భాగవతమును చదివించుకొని వినువారును, భద్రాద్రి రామదాసుకీర్తనలు పాడించుకొని వినెడు వారును ఎందరో యున్నారు. మహారాష్ట్రులలో గొప్ప వేదాంతి జ్ఞానదేవు ప్రారంభముచేసిన 'అజాత' వాదమునకు చెందినవాడే "సీతారామాంజనేయము" అను వేదాంతగ్రంథము రచించిన పరశు రామపంతుల రామమూర్తి.

మహారాష్ట్రదేశమునుండి తెనుగుదేశము వలసవచ్చిన వారిలో అనేకులు మరాఠీలు నేటికిని ఉన్నారు. ఆరెమరాఠీలకథ తెనుగుదేశములో పాడుకొను వీరగాథలలో నొకటి. ఈ తెగకు చెందినవారు కొందరు బయలాటలు, తోలుబొమ్మలు ఆడించు చుందురు. వీరు చర్మవిగ్రహములు అతినిపుణముగా తయారుచేసి, వానిని తోలుబొమ్మలాటలుగా ప్రదర్శించి, యక్షగానములను, ద్విపదకావ్యములను వెనుకపాటగా పాడుచుందురు. ఈ యక్షగాన ములలో దరువులు, తోహారాలకుతోడు హాస్యసంభాషణములుకూడ నుండును.

మహారాష్ట్రముతరువాత తెలుగునకు అత్యంత సన్నిహితమైన భాష కన్నడము. ఈ రెండు భాషలును ఒక తల్లి కుటుంబమునకు చెందిన అక్కచెల్లెండ్రవలె వర్ధిల్లినవి. 19వ శతాబ్దిప్రారంభములో పిడపర్తికవులు బసవన రచించిన దీక్షబోధను, సోమనాథులు రచిం చిన ప్రభులింగలీలలను తెనుగులోనికి అనువాదములుచేసిరి. 18వ శతాబ్దిచివరిభాగములో మైసూరునేలిన కంఠీరవనరసరాజు తెలుగు నను, కన్నడమునను యక్షగానములు రచించెను. మైసూరి సామంత రాజులలో సుగుటూరి తమ్మభూపాలుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషావిశారదుడు. మూడుభాషలలో కృతికర్త. ఇరువదేండ్లు సర్వాధి కారి పదవి నిర్వహించిన నంజరాజు కన్నడమున తెలుగున కాశీ మహిమార్థదర్పణము మున్నగు వచనగ్రంథములను రచించెను.

ఇంకను కర్ణాటకకవులలో దైవజ్ఞవల్లభుడు, నరసార్యుడు, రామాయణము తిరుమలకవి బుక్కమ, సాంబయ్య మున్నగు తెలుగు కవులెందరో కన్నడమున రచించిరి. 19వ శతాబ్దిలో సాధుపల్లి చంద్రశేఖరశాస్త్రియను కవీశ్వరుడు మనుచరిత్రను కన్నడములోనికి తెచ్చినట్లు తన 'ఆంధ్రామరుక' కావ్యమున చెప్పుకొనెను. 19వ శతాబ్ది చివర తెనుగులో నాటకములు రచించిన ధర్మవరము రామకృష్ణాచార్యులుగారును, కోలాచలం శ్రీనివాసాచార్యులుగారును, కన్నడములో నాటకములు రచించి బళ్ళారి సరసవినోదినీసభవారిచేత ప్రదర్శింపజేసిరి.

యక్షగాన ప్రబంధమను సాహిత్యప్రక్రియ తెనుగులో 16వ శతాబ్దిలో ప్రారంభమై 18, 19 శతాబ్దులలో కన్నడప్రాంతమునకు వ్యాపించి వీథినాటకముగాను, బయలాటగాను విశేషవ్యాప్తినంది పండిత పామరులను ఆకర్షించగల్గిన విశిష్టమైన గేయనాటకముగా రూపొందినదని నిరూపించవచ్చును. ఈరకము నాటకములు కన్నడములోనేగాక, తమిళములోకూడ తెలుగుయక్షగానమును, వీథిభాగవతమును అనుసరించియే పాటలతోకూడినవిగా వచ్చినవని భావించవచ్చును.

ఇరుగుపొరుగున ఉన్న ఓఢ్రప్రదేశమునుండికూడా తెనుగు సాహిత్యములోనికి కొన్ని రచనలను తెచ్చుకొన్నట్లు చెప్పవచ్చును. ఓఢ్రమున సిద్ధేశ్వరయోగి రచించిన రామాయణమును డొంకా గోపీనాథుడు తెనుగున విచిత్రరామాయణమను పేరున వచనరూపములో వ్రాసెను. ఇది యాధారముగాగైకొని కొమ్మాజీ సోమనాథశిల్పాచార్యుడనునతడు గోపీనాథుని వచనకృతినే పద్యకావ్యముగా రచించెను. ఇతడు లాంగలీనదీ సమీపమునందలి పార్వతీపురమున కధిపతి ధనంజయ భాత్రాజు ప్రాపుగలవాడు. వీరిననుసరించి మరికొన్ని కావ్యములు వచ్చెను. హిందీలో తులసీదాసు రచించిన రామచరితమానసము ఆధారముగా రామచరితమానససరోవరమను పేరుతో తెనుగులోనికి (విజయనగరవాస్తవ్యులు) శిష్టు కృష్ణ

మూర్తిశాస్త్రిగారు అనువాదముచేసిరి. (ఈయన కాళహస్తివారు కాదు) హిందీలో వాడిన 'దోహా' 'ఛంద్', 'చౌపాయీ'ల వంటి వృత్తములను అనుసరించిన విభాషీవృత్తములనే దీనియందు ప్రయోగించిరి. ఉత్కళాంధ్రభాషలనెరిగిన విక్రమదేవవర్మవంటివారు ఉభయ భాషలయందునను గ్రంథరచనముచేసిరి, పర్లాకిమిడిరాజుల కొలువులోనున్న ఉపేంద్రభంజవంటి ఉత్కళకవులు 'ఒడిస్సీ' వంటి గీతరచనచేయునపుడు, త్యాగరాజు రచించిన కర్ణాటక రాగపద్ధతుల ననుసరించి ఆనందభైరవి, నాట, ఘంటావంటి తెనుగురాగములలో సంగీతరచన గావించిరి.

19వ శతాబ్దిలో తెనుగుదేశము స్థితిగతులు పరిశీలించిన ఇరుగుపొరుగు భాషలతో తెనుగుసాహిత్యము పరిచయము వర్ధిల్ల చేసికొనుటయేగాక ఆ భాషాపదములతో తనభాషను అభివృద్ధిచేసి కొన్నది. ఆదానప్రదాన కార్యములో ఒక విశాలదృక్పథమును తెనుగుభాష ప్రదర్శించినది. ఇంతకంటెను ఎక్కువ సాహిత్యసేవ ఆంధ్రదేశములో జన్మించి సంస్కృతములో గ్రంథరచనగావించిన మహాపండితులవలన జరిగినది. 19వ శతాబ్దిలో అనేక సాహిత్య తర్క వ్యాకరణాది శాస్త్రములందునను, అలంకారశాస్త్రమునందు నను అమిత వైవిధ్యముగల గ్రంథములు తెనుగులిపిలోని సంస్కృత భాషలో వెలువడినవి. కొన్ని ముద్రితములు; కొన్ని అముద్రితములు.

తర్కవ్యాకరణాలంకారాది శాస్త్రములలో నిధులనదగిన విద్వాంసు లీశతాబ్దిలో అనేకగ్రంథములను రచించిరి. పూర్వగ్రంథ ములకు చక్కని అనువాదములుచేసిరి. ఆంగ్ల, ఫారశీభాషలలోని గ్రంథములుకూడ సంస్కృతీకరింపబడినవి. పురుషులతోపాటు స్త్రీలు కూడ సంస్కృతభాషావైదుష్యము ప్రకటించి ఉత్తమ కావ్యరచనల చేసి గీర్వాణ సరస్వతిని తమ యావచ్ఛక్తితో సాలంకృతజేయుట ఈ శతాబ్దిలో మరొక విశేషము.

ఈ సాహిత్య సింహావలోకనములో తెలుగుభాష 19వ శతాబ్దిలో సాధించిన ప్రగతికి నిదర్శనముగా ఇతరభాషలలో వచ్చిన మార్పులకును పురోగమనమునకును ఎందులోను తీసికట్టు కాలేదని తేటతెల్లమగుచున్నది. వివిధప్రాంతములలో వర్ధిల్లిన దేశభాషా సాహిత్యములను వానిలో ప్రవర్తిల్లిన నవయుగోదయ ఛాయలను పరికించినచో, ఇంచుమించు అట్టిలక్షణములే తెనుగుసాహిత్యమునందు సైతము కన్పట్టునని గ్రహించవచ్చును కొన్నిభాషలు (బెంగాలీ ఉరుదూవంటివి) తెలుగుభాషకంటె ఒక్క అడుగు ముందు వేసియుండవచ్చును. మరికొన్ని భాషలు వెనుకంజ వేసియుండవచ్చును. మొత్తముమీద దేశము అంతటను సమస్తదేశభాషలయందును 19వ శతాబ్దిలో ఒక నవచైతన్యము పొడసూపినట్లు ద్యోతకమగుచున్నది. అది మూడు దశలుగా వ్యక్తమగుచున్నది. మొదటిదశ 1800–1857 వరకు భారత స్వాతంత్ర్యయుద్ధమునరకు నిర్మాణఘట్టము; భాషా సామగ్రిని సమకూర్చుకొని నూతన యుగప్రభాతమునకు ఆయత్తము చేయుటతో సరిపోయినది. అది పాశ్చాత్యులవలననే జరిగినది. 1857నుండి 1880 వరకు మరొకదశ–అనువాదములతో, అనుకరణలతో కూడిన భాషాంతరీకరణదశ; ఇది యెక్కువగా మన దేశీయులే చేసి కొత్తపంథాలు చూపిరి. 1880–1900వరకు పూర్తిగా నూతన సాహిత్యప్రక్రియలలో చేసిన ప్రయోగాత్మకమైన నూతనకల్పన. ఈ దశలోనే యుగకర్తలు, మార్గదర్శకులు అనదగిన మహనీయులుదయించి ఇతరులకు వెలుగుబాటలు వేయుట జరిగినది. ఇదే యుగ ప్రభాతమునకు తొలిసంజ!

★

# 6. పద్యవాఙ్మయము — పూర్వరంగము.

తెనుగు సాహిత్యసరస్వతి కన్న కానుపులలో మనోహర సౌందర్యముచేత అందరిని ఆకర్షించు కావ్యకన్యక ప్రబంధలక్ష్మి. ఇట్టి సాహిత్యస్వరూపము సంస్కృతమునగాని మఱి యేయితరభాషలోగాని లేదు. దీని కిదియేసాటి. సంస్కృతమున కావ్యమును ప్రబంధముగా రాజశేఖరుడు పేర్కొన్నాడుకాని,ఆ దినుసు వేరు. ఇది తెనుగు సాహిత్యములో ఒక అపూర్వరూపమును సంతరించుకొన్న వివిధ లక్ష్య లక్షణ సమన్వితమైన చంపూరచన. పద్య గద్యాత్మకమైనను పద్యమునకే హెచ్చు ప్రాధాన్య మొసగిన కథాకావ్యము. ఇతివృత్తము ఎట్టిదైనను కావచ్చును. కాని అపరిచితముకాని కేవల కల్పనాకథ కాకూడదు. అందుచేత పురాణములనుండి, ఇతిహాసములనుండి తీసి కొన్న కథలకు క్రొత్తరూపములు కల్పించుట ఇందులో విశేషము. వీనియందు, అష్టాదశవర్ణనలు అను నెపమున కవి తన చమత్కార ధోరణిని చూపించవచ్చును. భాషలో కొంత శ్లేష, కొంత భావ వ్యంజన, కొంత రసపోషణ చేయవచ్చును. శృంగారరసప్రధానమైన సంస్కృతకావ్యలక్షణములలోని కొన్ని అంశములు పాటించుట మరి యొక పరిపాటి. నాయక నాయికాలక్షణములను, రసభావములను పోషించుటయే కాక కావ్యమును మంగళాంతముచేయుట, ధీరోదాత్తులను నాయకులుగా పెట్టుకొనుట మొదలయిన కొన్ని సంప్రదాయములు సంస్కృతమునుండి వచ్చినవే. ఆంధ్ర కవితాపితామహుడు అల్లసాని పెద్దన ప్రాణముపోసిన ఈ ప్రబంధకన్యక, విజయనగర రాజులకాలములో అష్టదిగ్గజములనుపేర బరగిన కవులచేతులలో అలంకారములను సమకూర్చుకొని, పింగళి సూరనచేతిలో మరింత గడుసుతేరి దక్షిణాంధ్రనాయకులకాలములో చేమకూర వెంకన్న

చిత్రరచనలతో సొగసులు తీర్చుకొన్నది. ఇట్టి ప్రబంధసాహిత్యము 1775 తరువాత పరస్పరానుకరణలతోడను, సంఖ్యాధిక్యమువల్లను చెడిపోయి క్షీణదశకువచ్చినదని కొందరి సాహిత్యవిమర్శకుల యభిప్రాయము. అందుచేతనే 1775–1875 వరకు గల కాలమును వీరు క్షీణయుగమని యన్నారు.

ఈ దశను వివరించుచు పింగళి లక్ష్మీకాంతముగారు వెల్లడించిన యభిప్రాయము ఆంధ్ర విజ్ఞానసర్వస్వములో నిట్లున్నది:

*"ప్రజలలోను, వారికి ప్రతినిధులయిన కవులలోను – ధర్మభ్రంశము కలిగిన రోజులలోనే ఆంధ్రులకు తంజావూరు, మధుర మొదలైన సామంతరాష్ట్రిములైనను లేకుండ పాశ్చాత్యు లాక్రమించుకొనిరి. స్వాతంత్ర్యరహితములును, ప్రాచీనైశ్వర్యశూన్యములును అయిన జమీనులు మిగిలినవి. జాతిముఖకళ క్షీణించినట్లే, సారస్వతకళలును క్షీణించినవి. జాతియొక్క దారిద్ర్య పరాధీనతలే కవితలోని భావదాస్య పరాధీనతలకు కారణమైనవి. మహోన్నత స్థితిలో నున్నపుడు జాతికి పరమలక్ష్యముగా వెలుగొందిన ఉన్నతాశయములు నశించి క్షుద్రభావములు పొడసూపెను. కవులలోను ఉదాత్తాశయము లడుగంటి క్షుద్రత తలసూపెను. ఆంధ్రులతోపాటు ఆంధ్రప్రబంధములును జీవచ్ఛవములయ్యెను. నిద్రాణమైన జాతిని మేలుకొల్పగల వీరుడుగాని, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరించగల కవివీరుడుగాని లేకపోయెను. ఈ కారణముచేతనే 1775 తర్వాత ఒక శతాబ్ది మన వాఙ్మయచరిత్రలో క్షీణయుగమని పిలువబడుచున్నది. కాని ఈ యుగములో తామరతంపరగా కావ్యరచన జరుగుచునేయున్నది. ఆ గ్రంథరాశియంతయు ప్రాణరహితమైన పొల్లు. కవులెల్లరును అస్వతంత్రులే. అందరును అనుకరణశీలురే. ఏ కవిలోను నూతనత్వము లేదు. కృష్ణరాయలయుగములోని ప్రబంధములను, అందును వసుచరిత్రను అనుకరించినవారు కొందరు,

* ఆంధ్ర విజ్ఞానసర్వస్వము—సంస్కృతి సంపుటము—తెలుగు వాఙ్మయము 619పుట—పిం. ల.

దక్షిణాంధ్ర ప్రబంధముల ప్రతిబింబములు తీసినవారు కొందరు. రాఘవపాండవీయపద్ధతిని రెండర్థములనేకాక, మూడర్థముల శ్లేష కావ్యములను రచించినవారు కొందరు. చర్విత చర్వణముగా ప్రబంధ ములసంఖ్యను పెంచిన కవులుమాత్రము పెక్కురు గలరు. వారిలో ఏమాత్రమేని గుణముగలవారు కంకంటి పాపరాజు మొదలైన అయి దారుగురు మాత్రమే."

19వ శతాబ్ది సాహిత్యచరిత్రలో ఈ అయిదుగురు అంతకు పూర్వము వచ్చినవారగుటచేత రారు. 1800 నుండి 1900వరకు వెలువడిన ప్రబంధములను పరిశీలించినచో ఇంతటి తీవ్రవిమర్శకు అవి గుఱియగునాయను ప్రశ్న తోచును. ఈకాలములో వచ్చినన్ని ప్రబంధములు మరి యేకాలమునను రాలేదు. ఆ మాట అందరును ఒప్పుకొనితీరుదురు. అవి కొన్నిలక్షణములబట్టి ఒకేమూసలోపోసిన జీవములేని మాటల బొమ్మలవలె కనిపించినను వానియందలి వస్తు వైవిధ్యము మరి యే యుగపు ప్రబంధసాహిత్యమునందునను లేదు. ఈ కావ్యవిమర్శచేయునపుడు నేటి యభిరుచులబట్టి నేటి ప్రమాణ ములబట్టి తూలనాడుట సమంజసము కాదేమో. కాలమునుబట్టి కావ్యాదర్శములును మారుచుండును. ఒకయుగములో అష్టాదశ వర్ణనలు కావ్యములకు సొడిమి కలిగించవచ్చును. అవియే మఱి యొకయుగములో బరువునగలు కావచ్చును. ఏదియేమైనను, 19వ శతాబ్దిలో తెనుగు కావ్యరచనచేసిన కవులు స్వతంత్రభావము లతో స్వచ్ఛందముగా చక్కని కావ్యసృష్టిచేసినవారే కాని, అస్వ తంత్రులు కారు; భయపీడితులు కారు. రాజకీయముగా పరరాజుల పరిపాలన వారి నంతగా బాధించలేదు. పైగా అంతవరకు లేని శాంతి భద్రతలు సమకూర్చినది. క్రొత్తసౌకర్యములు కలిగించినది. కరువుకాటకములకు, వరదవెల్లువలకు ఆటపట్టయిన నదీప్రదేశము లను సస్యశ్యామలముగా చేసిన నీటివనరులువచ్చినవి. కవితాసరస్వతికి ఎన్నడును లేని ప్రజాదరణ లభించినది. అంతవరకు అసూర్యం పశ్యయై అంతఃపురములలో తాళపత్రములలో తలదాచుకొన్న

తెనుగు కావ్యలక్ష్మి, ముద్రణాయంత్రసౌకర్యముతో ముద్దులు మూటలుగట్టు అచ్చుతో ముచ్చటగా ముస్తాబుచేసికొని మురిపెముల గురిసినది. కవితారచనకు చక్కని వాతావరణము కలిగినది. అందు చేతనే కాబోలు, అంత హెచ్చుమంది కవులు 1800 – 1875 మధ్య కాలములో కావ్యరచనలు చేసినారు. అసంఖ్యాకమైన ఈ కావ్యములలో దేశచరిత్ర యున్నది; సమకాలికసంఘటన లున్నవి. శాస్త్రము లున్నవి, పురాణము లున్నవి, కథ లున్నవి, కావ్యము లున్నవి, ప్రబంధము లున్నవి, అనేకార్థకావ్యము లున్నవి. ఇవియన్నియును చాలక శబ్దములతోచేసిన ఇంద్రజాలమహేంద్రజాలము లున్నవి. కావున ఈకాలమున వచ్చిన పద్యవాఙ్మయములో తలసూపిన వైవిధ్యము మరి యేకాలములోను లేదు. అంతేకాదు, పద్యములలో అనేక సాహిత్యప్రక్రియలు ఈ శతాబ్దికాలమున పుష్కలముగా అభివృద్ధిపొందినవి. ప్రబంధములేకావు, అనేకార్థకావ్యములు, శతకములు, ద్విపదలు, యక్షగానములు మొదలైన వెన్నో రకముల పద్యకావ్యము లీకాలములో విశేషముగా వచ్చినవి. వీని యన్నింటిని సమీక్షచేసి వీనియందలి గుణదోషములను పరిశీలించుటయే ఈ అధ్యాయములో తలపెట్టినది. పూర్వరంగము అనుటలో పాశ్చాత్యవిద్యను అనుసరించుటచేతగాని, పాశ్చాత్య సాహిత్య ప్రభావముచేతగాని వచ్చిన మార్పులను ఇందులో ప్రస్తావింపదలప లేదు. అంతేకాదు, 1857కుముందు ఒకఘట్టముగా నియమించుకొని అంతకుముందు తెనుగుసాహిత్యములోవచ్చిన కావ్యములను కవులను పేర్కొని, ప్రాచీన సంప్రదాయములను అనుసరించిన కృతులనే ఈ యధ్యాయములో పరామర్శచేయుచున్నాము. ప్రబంధములను అంధానుకరణచేసినవారిని వదలిపెట్టి ఏకొంచెమైనను క్రొత్తదనముతోకూడినప్రత్యేకత గడించుకొన్న విశిష్టరచనలనే ఈ విమర్శలో పేర్కొనుచున్నాము. ఈకాలపు కావ్యములలో–నాటి యభిరుచుల ననుసరించి శబ్దాలంకారములకు, చమత్కారములతోకూడిన శ్లేషార్థములకు, ఛేకానుప్రాస, లాటానుప్రాసాది శబ్దచమత్కృతికి కొంత

ప్రాధాన్యమిచ్చినమాట నిజమే. అది ఆకాలపు సాహిత్యములో "ఫేషన్". దానిని గుణముగాగాని దోషముగాగాని పేర్కొనవల సినపని లేదు. 19వ శతాబ్దిలో వెలువడిన సాహిత్యగ్రంథముల ఉన్నతశిఖరములను అధిరోహించి అచ్చటి సౌందర్యమును చూడ గలుగువారికి ఇంతటి యరుచి కనిపించదు. ఏ యొకటిరెంటో కృతులు చదివి మొత్తముమీద అన్నికావ్యములును ఇట్లే యుండవచ్చునని కొందరు సమీక్షకులు సాధారణీకరించి, యిప్పటి కావ్యములనన్ని టిని చేర్చి, నిరసనభావముతో చూచిరి కాని, శ్రద్ధతో నిష్పక్షపాత బుద్ధితో చూచినవారికి ఈ యుగములోని కావ్యములుకూడ మరి యే యుగపు కావ్యములకును తీసిపోవని దృగ్గోచరమగును. ఏయుగ ములోనైనను వచ్చిన కావ్యములన్నియును మహోన్నతస్థాయినందు కొనలేవు. కృష్ణదేవరాయలకాలములో—తెనుగు ప్రబంధసాహిత్య మునకు స్వర్ణయుగమని చెప్పు కాలములోకూడ — వచ్చిన కావ్యములన్నియును ఉత్తమ తరగతికి చెందవు; మనుచరిత్ర, పారి జాతాపహరణమువంటివి మాత్రమే ఉత్తమస్థాయిలోనివిగా పేర్కొను చున్నారు. వానికైనను కొందరు విమర్శకులు అనుకరణదోషమంట గట్టి, పద్యములకు భావములకు మాతృకలను చూపుచున్నారు. ఆ దృష్టితో చూచిన - 19వ శతాబ్దిలో వచ్చిన కావ్యములలో కించ పడవలసిన కార్యమేమియును జరుగలేదు. అంతక్రితము వచ్చిన సాహిత్యమునకును సమకాలికజీవితమునకును ఎక్కువ సంబంధము లేకపోయినది. అదియంతయును నేలవిడిచిన సామే. జీవితమునకును ప్రబంధములలో కనిపించు పాత్రలకును ఎచ్చటను పోలిక కనిపిం చదు. జీవితానుభవములకు దూరముగా ఏవేవో అతిశయోక్తులతో కూడిన వర్ణనలుచేసి చంద్రోపాలంభనలతోడను, మన్మథదూషణ లతోడను కాలక్షేపముచేసిరి. శతాధిక ప్రబంధములలో 'ఆముక్త మాల్యద', 'కళాపూర్ణోదయము', 'విజయవిలాసము', 'సింహాసన సాలభంజిక' వంటి రచనలలోతప్ప సమకాలిక జీవితదృశ్యములే కని పించవు. 19వ శతాబ్ది సాహిత్యము ఏది సాధించినను, ఏది సాధించ

లేకపోయినను, సాహిత్యము జీవితప్రతిబింబము అను సూత్రమును చక్కగా చూపెను. కవులు స్వతంత్రులే యనుటకు స్వచ్ఛంద భావములతోకూడిన స్వతంత్రరచనలు చేసినారు. చరిత్రలో జరిగిన సమకాలికసంఘటనలను కావ్యములుగా తీసికొన్నవారున్నారు. (దిట్టకవి నారాయణకవి – రంగరాయచరిత్ర) నిగూఢమైన వేదాంతరహస్యములను నిరూపించుటకు కావ్యము నొక సాధనచేసినవారును ఉన్నారు. (ఉదా:– పరశురామపంతులు లింగమూర్తి – సీతారామాంజనేయ సంవాదము) అపరూపమైన పద్ధతిలో ప్రాచీన భారత రామాయణాది గ్రంథములనే తిరుగ వ్రాసినవారును ఉన్నారు. అలంకారశాస్త్రమును, వ్యాకరణమును పద్యకావ్యములుగా తెలిపినవారు ఉన్నారు. ఇంతేకాక, మరికొందరు కావ్యములలో సమకాలిక జీవనముపై విసుగెత్తి, విమర్శనాత్మకమైన చాటువులు చెప్పినవారున్నారు. ముక్తకములవంటి అధిక్షేపకావ్యములు రచించి తిట్టుకవితలో దిట్టలైనవారును ఉన్నారు. ఏ గ్రంథమును తెఱచినను – అందలి కావ్యలక్షణములతోపాటు – సమకాలిక జీవనముపైన వ్యాఖ్యలు కనిపించును. కావ్యసాహిత్యము జీవితవిమర్శకాక మరియేమి?(Poetry is criticism of life) అయినను స్థూలముగా పైపై లక్షణములను చూచి ఈకాలపు సాహిత్యమును కొందరు నిరసనగాచూచిరి.

"పురాణమునందలి ఆంధ్రకవిత్వమున శబ్దార్థములకు సమప్రాధాన్యము కనిపించును. ప్రబంధయుగమునాటి కర్థభావములకంటె శబ్దములపై కవులకు మక్కువ పెరిగినది. దక్షిణాంధ్రయుగమున నది మఱింత యభివృద్ధియైనది. చివరకు 19వ శతాబ్దినాటికి ఆంధ్రకవిత రసభావములందు కొఱనడి శబ్దార్థాలంకార ప్రధానమై ఔదాత్త్యమును కోల్పోవుట సంభవించినది. కవులు పలువురు స్వతంత్ర ప్రక్రియలకు పూనక పెద్దన రామరాజభూషణాదుల ప్రబంధముల ననుసరించుటే పరిపాటియైనది. ఈ కారణముచే నాంధ్రసరస్వతి యమకశ్లేషానుప్రాసాద్యలంకార శృంఖలలో తగుల్కొని, సహజ

స్వచ్ఛంద సంచారమునకు దూరముకావలసివచ్చినది.''* ఇది యొక చూపు. ఈ సమాలోచనయందు స్థూలముగా కనిపించు శబ్దాలంకారాదులనే తీసికొన్నారుకాని, వానివెనుక చెప్పదలచిన అంశముల అంతరార్థమును గమనించలేదు. విషయవైవిధ్యము వస్తునవ్యత్వము ఈ శతాబ్దిలో వచ్చినంతగా మరి యెన్నడును రాలేదు. భాషలో సంతరించుకొన్న ఇతరభాషాపదములు కవితారీతులు, సాహితీ స్రవంతిలో కలిసిన చిట్టిచిట్టి సెలయేళ్ళపాయలు తెచ్చిన వినూతనధారలతో పరిచయముచేయును. అదిగాక ఆంధ్రదేశమంతటను ఒక నూతనచైతన్య మావహించి, సాహిత్యసృష్టి పద్యముగా, గద్యముగా, పాటగా, ఆటగా, కథగా, గాథగా, నాటకముగా, యక్షగానముగా, శతకముగా, చాటువుగా అనేకరూపములుగా ఉప్పొంగిపోయినది. స్వచ్ఛ గోదావరీనదివలె పొంగిపొరలి, తాను త్రొక్కిన సీమలను పునీతముచేసి, పుష్కలావర్త మేఘమువలె పుణ్యాగామినియై రసపరిపుష్ట గావించినది. రాజులు సామంతులును పోవుటచేత, ఇంట గెలిచి రచ్చ-గెలువుమన్న సామెతను కావ్యరచనలో ఋజువుచేసికొన్నది. ఆంధ్రకావ్యస్రవంతి తన సంస్కృతిని నిరంతర ధారాప్రవాహముగా ఈ విశాలభూభాగములో ఉచ్చలింపజేయుచున్నది. అది అవిచ్ఛిన్నము, అనంతము. దానికి మొదలు - తుద లేదు. అది యొక జీవనవాహిని.

''ఆంధ్రకవిత్వ మీనాడు రాజాంతఃపురములో మేలుకొని మానుకొన్నది. ఆంధ్రదేశముయొక్క ఏ యొకమూలనో వాసనలు వెదజల్లుట చాలదని నిశ్చయించుకొన్నదివలె, తెలుగుసీమ నాలుగు చెరగులనుండియు కావ్యకుసుమముల పూయించినది. ఆంధ్రభారతి 'నేను అగ్రవర్ణములవారికి గాని నగరవాసులకుగాని ప్రత్యేక సొత్తును కా'నని ఘోషించుటకో యనునట్లు ప్రజాకవుల రసనాగ్రములనుండి గేయమధువును జాలువారించినది. గేయవాఙ్మయనిర్మాతలలో మహాపండితులు, గొప్ప సంగీతవేత్తలు, తత్త్వచింతనాపరా

*దివాకర్ల వేంకటావధాని ఆంధ్రవాఙ్మయచరిత్రము—109పుట.

యణులు పాండిత్యగంథ మెరుగక స్వచ్ఛ నిర్మలహృదయులైన ప్రజాకవులును ఉన్నారు. ఈవిధముగ పందొమ్మిదవశతాబ్దమున ఆంగ్లేయులపాలనము మనదేశములో స్థిరపడువరకును ఆంధ్రభాషా స్రవంతి ప్రవహించినది.*

ఈ వ్యాఖ్యానము 19వ శతాబ్ది పూర్వరంగములోని పద్య వాఙ్మయమునకును, గేయవాఙ్మయమునకు అక్షరాల సరిపోవును. పద్యవాఙ్మయములో ప్రథమస్థానమువహించు ప్రబంధములను (19వ శతాబ్దిలో వచ్చినవాటిని) పరిశీలించునపుడు అందలి అష్టాదశవర్ణనములును, నాయికానాయక ప్రకరణములుగాక ఈ సాహిత్యవిభాగములో విశేషించి గావించిన నూతనప్రయోగము లెట్టివి యను నవియే పరీక్షగా సమావలోకనము చేయవలయును. నాలుగు చెఱగుల తెలుగుసీమ సాహిత్యరంగములో ఒక్కటియై ఒక్కకంఠముతో పలికినట్లు ఈ పద్యవాఙ్మయములో పలుకరించుచున్నది. ఈభాషలో, ఈ మాటలపొందికలో, ఈ నుడులలో, ఈ పలుకుబడులలో ఒక చనవు, ఒక కలుపుగోరుతనము, ఒక తేటతనము, ఒక తెలుగుతనము ప్రతిధ్వనించుచున్నది.

ఈ యేకత, ఈ సహజభావానుసంధానమును ఈనాటి సాహిత్యమునతప్ప మరి యే కావ్యములందును కాంచజాలము. అయితే ఇది గుర్తుపట్టుటకు అనేక శబ్దాలంకారములతో కంచెలు వేసిన కీకారణ్యములలో ప్రవేశించి సహజసౌరభమును ఆస్వాదించు కుతూహలమును కోరికయును గల గుణవిమర్శకులు కావలెను.

స్వపరపక్షపాతములేని సహృదయులారా! రండు. బహుపద పాదపావృత ప్రబంధకాననములో రసబంధురకావ్యసౌరభములను పరిశీలించుదము రండు! శ్లేష యమక ప్రాసాదుల జూచి మోసపోకుడు; చిత్రకవితారీతులయిన ఛందోగతులను జూచి భ్రాంతిపడకుడు; నిరోష్ఠ్య నిర్వచన నిర్గంధకుసుమముల జూచి నిరుత్తరులు

---

*ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము—ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము 266—67 పుటలు.

కాకుడు. అచ్చ తెనుగు ప్రామినుకులలోబడి అడలిపోకుడు. పురవర్ణనల పొలిమేరల నధిగమించుడు; నాయకుని మృగయావినోదయాత్రతో నలిగిపోకుడు. నాయిక నఖశిఖపర్యంత ప్రత్యంగవర్ణనతో జుగుప్స పడవద్దు. ఆశ్వాసాంతగద్యలతో అలసిపోకండి. కోకిలను, తుమ్మెదను వసంతుని, మన్మథుని, చంద్రుని తిట్టినతిట్లు, చేసిన ఉపాలంభనములు ఇదివరకెన్నోసారులు విని విసిగెత్తెనందురా? ఇవియన్నియును కావు మనకు కావలసినవి - ఈ కథలమాటున మన ఆచార సంప్రదాయ ముల వర్ణన మెంతవరకు వచ్చినది? మన దేశ ప్రకృతిదృశ్యము లెంతవరకు గోచరించును ? మన జీవితచిత్రణ మెంతవరకు మిగిలి నది ? మన తెనుగుతన మెంతవరకు మెఱసినది ? మన పాత్రోన్మీల నము ఎంతవరకు కొనసాగినది ? మన భావవిమర్శ ఎంతవరకు తూగి నది ? ఈ దృష్టితో పరికించండి. రససిద్ధి పొందండి. అప్పుడు 19వ శతాబ్ది పద్యవాఙ్మయము అనుకరణమో, అంధకారమో తేల్చండి. పేరులుచూచి మోసపోవలదు; ఈకాలపు కవులకు పేరు ప్రఖ్యా తులు లేవు. వారి రచనలే వారిపేరులు; వారి నవీనకల్పనలే వారి యోగ్యతాపత్రములు. మరియొక మాట: కవి ఆరువేలనియోగియో, ఆపస్తంభసూత్రుడో, నందవరీకబ్రాహ్మణుడో పరిశీలించవద్దు. గోదా వరీతీరమున జన్మించెనో లేక గోల్కొండవద్ద పుట్టెనో మనము చూడవద్దు. అతడు వ్రాసిన విషయమేమి ? చెప్పదలచుకొన్న అంశ మేమి? అది యేవిధముగా చెప్పినాడు ? ఈ విషయములు పరికించిన చాలును. అతని కులగోత్రములతో మనకు నిమిత్తములేదు. ఆతనితో సంబంధబాంధవ్యము లందగోరి ఈ విమర్శనము చేయుటలేదు. ఆతని జనన తిథినక్షత్రములతో నంతకంటెను పనిలేదు. ఆతని జాతకచర్యను మనము వ్రాయుటకు బూనుకొనలేదు. కవుల జన్మస్థలముగురించిన వివాదలతో మనకు ప్రయోజనములేదు. అత డేప్రాంతములో జన్మిం చినవాడైనను తెనుగులో కవితారచనచేసినవాడు. తెనుగువాడు. కొన్ని కావ్యములకు కృతికర్త లెవరో మనకు తెలియదు. అయినను ఆ కావ్యగుణదోషముల విచారణలో మన నిష్పాక్షికదృష్టిని విడనాడ

నక్కఅలేదు. ఈ దృక్పథముతో 19వ శతాబ్ది పద్యవాఙ్మయమును పరిశీలింతము.

అడిదము సూరకవి:

18వ శతాబ్ది చివరిభాగములో పుట్టి, 1799లో జరిగిన పద్మనాభయుద్ధమును జూచి 19వ శతాబ్ది ఆరంభమువరకు కృతులు రచించిన ప్రథమకవి అడిదము సూరకవి. ఇతడు చంద్రమతీపరిణయమను కవిజనరంజనమును రచించెను. మూడాశ్వాసములుగల చిన్న ప్రబంధమైనను దీనియందలి గుణవిశేషములనుబట్టి పిల్ల వసుచరిత్ర యందురు. ఇత డింకను రామలింగేశ్వరశతకము, కవిసంశయవిచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, ఆంధ్రనామశేషము అను గ్రంథములను రచించెను. కవిసంశయవిచ్ఛేదము వ్యాకరణము. ఆంధ్రనామశేషము పైడిపాటి లక్ష్మణకవికృతమైన ఆంధ్రనామసంగ్రహము లోని అచ్చతెనుగుపదములను కూర్చిన పద్యరూపమైన చిన్న నిఘంటువు. చంద్రాలోకమునకు ఇతడు తెనుగుఅనువాదము చేసెను. ఈతని చాటువులు లోకప్రసిద్ధికెక్కినవి. తిట్టుకవితలో దిట్ట. విజయనగరమునేలిన విజయరామరాజుగారి కొలువులో నుండెను. ఆకాలములో కొందరు సామంతులు విజయనగరరాజుల కెదురు తిరిగిరి. అట్టివారిలో సీతారామరాజొకడు. ఈతడు పరరాజులను జయించుటయేగాక, తురకదొరలు మశీదులకిచ్చిన భూములను, పూర్వరాజులు బ్రాహ్మణులకిచ్చిన మాన్యములనుగూడ లాగుకొని ప్రజలను అనేక బాధలుపెట్టెను. వానినే సూరకవి యిట్లు వర్ణించెను.

మాన్యంబు లియ్య సమర్థు డొక్కడు లేడు
మాన్యముల్ చెఱుప సామంతు లంద
ఱెండిన యూళ్ళ గోడెఱిగింప డెవ్వడు
పండిన యూళ్లెన్న ప్రభువులంద

ఱితడు పేద యటంచు నెఱిగింప డెవ్వడు
కలవారి సిరి యెన్నగలరు దొరలు
తన యాలి చీఁకటిఁ తప్పెన్న డెవ్వడు
పరకాంత ఱంకెన్నఁ బెద్దలందు

ఱిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెగాక దుర్జ్ఞయుల ననగ
నేమి పనియున్న దిక సత్కవీంద్రులకును
రామలింగేశ రామచంద్రపుర నివాస ॥



సూరకవికి రేనయనుగ్రామమున చెరువుగట్టుక్రింద నొక మాన్య ముండెడిదట. ఆ గ్రామమును గుత్తచేసిన దంతులూరి యన్నమరాజు కవిమాన్యమునకు చెరువునీరు పెట్టుకోనీయలేదు. కవి మొఱపెట్టుకొనెను. కార్యము కాలేదు. తుదకు చెఱువులో నిలుచుండి, నాలుగుపద్యములు చెప్పగానే చెరువుకట్టలు తెగి, నీరు ప్రవహించెనని యందురు. ఆత డంతటి అమోఘ వాక్విల సనుడైన కవియని తాత్పర్యము. ఆ నాలుగు పద్యములలో ఒకటి మచ్చునకు:

కృతకాద్రు లాయెనా కీలోగ్ర ఫణిఫణానేక ఫూత్కార వల్మీకచయము
విరిదోటలాయెనా కఱకు కంటక కంటకాంకుర విస్ఫురితాగచయము
పువుఁ బాన్పులాయెనా నవమంజుల శ్వేతలవణాలవాలమౌ చవుటినేల
బొమ్మరిండ్లాయెనా భూరి భేకాండజాధారమై తనరు కేదారచయము

నీకు విహరింప వసతులై నివ్వటిలెనె
చిన్నపొలములు బ్రాహ్మణక్షేత్రమునకు
ఘాతుకత్వంబు చేయు ముష్కరులు కలరె
కదలు మిట మాని దివిజ గంగాభవాని.

ఈతని చంద్రమతీపరిణయములో తెలుగునాట కనిపించు పెండ్లియాచారము తలబ్రాలుపోయుట ఎట్లు సహజముగా వర్ణిత మైనదియో చూడుడు.

అలమన్ మై బులకాంకురాళి దరహాసాంకూరముల్ కన్గవం
దొలకన్ ముత్యపుటొంట్లు గండయుగళిం దూగన్ గనత్కంకణం
బులు మ్రోయన్ భుజమధ్యసీమ రతనంపుందాలి తార్మాఱుగా
దలబ్రాల్వోసె లతాంగి యౌదలపయిన్ ధాత్రీశు డత్యాదృతిన్.

ప్రబంధములనే గాక, నిఘంటువును, వ్యాకరణమునుకూడ పద్యమయముగా రచించిన కవిశేఖరుడు—

వెన్నగ బీజమంజరి
వెన్నన చరమాంగమునకు వెలయును పేరై
కన్నులనం బర్వంబులు
కన్నులనన్ లోచనములు కంఠేకాలా !-ఆంధ్రనామశేషము.

వ్యాకరణగ్రంథమైన కవిసంశయవిచ్ఛేదమునుండి యొక ఉదాహరణము:

ఎఱుకగలవారె యనుచోట నెఱుకగలరె
యిట్టివారె యనెడిచోట నిట్టిరెయగు
జేయగలవారె యనుచోట జేయగలరె
యనుచు లోకప్రసిద్ధోక్తి యగును శర్వ—

ఆంధ్ర చంద్రాలోకము అను అలంకారశాస్త్రగ్రంథములో ఈతనిరచన:

అక్రమాతిశయోక్తి ప్రఖ్యాతికెక్క
హేతుకార్యంబులకు సహవృత్తి గలుగ
జ్యాపరీరంభణైక దక్షతవహించె
నీ శరంబులు నీ శత్రునృపులతోడ.

మంగళగిరి ఆనందకవి :

18వ శతాబ్ది ఉత్తరార్థమునకు చెందిన మఱొకకవి మంగళగిరి ఆనందకవి. ఇతడు 'లాక్షణికాగ్రగణ్యుడైన ప్రబంధకవి' గా కందు

కూరి వీరేశలింగంగారు పేర్కొన్నారు. వేదాంతరసాయనమను పేరు గల నాలుగాశ్వాసముల పద్యకావ్యమును రచించి బందరులో పని చేసిన 'దాసయమంత్రికి' అంకితము చేసెను. ఈతడు నియోగి బ్రాహ్మణుడైనను క్రైస్తవమతము స్వీకరించెను. క్రీస్తుజీవితకథ తన కావ్యవస్తువుగా చేసికొని, మృదుమధురశైలి రచించెను. మచ్చునకు ఒక పద్యము-

> వార లవార్య కౌతుక నివాస మనోంబుజులై జగజ్జనా
> ధారు నయప్రచారు సముదారుని నమ్మరియాకుమారునిన్
> భారపు స్లీవమ్రానున విపద్దశలం బొరయించినట్టి ని
> ష్కారణ వైరులన్ సరకుగాగొన కించుక యెల్ల దిక్కులన్.

ఈతడు కూచిమంచి తిమ్మకవి తరువాత వచ్చినవాడు; కృష్ణా మండలములోనే ఉండెనట, తన కృతిభర్తనుగూర్చి చెప్పిన పద్యములో

> ప్రకటారాతి చమూభయానక ఘనప్రాకార ఖేయంబులన్
> సుకరశ్రీతగు బందరాఖ్యనగరిన్ సొంపొందు దీనార్థి క
> ల్పకభూజంబన దాసమంత్రి రుచిశుంభద్రత్నజాంబూనదా
> దిక వస్తుప్రకరాన్వితాయతనుడై ధీరుల్ ప్రశంసించగన్.

ఈ కృతిపతి దాసయ్యకు రాజప్పయను సోదరుడుండెనట. ఈతడు.

> మదిరాక్షీమదనుండు రాజపమహామంత్రీంద్రు డుద్యన్మహ
> మ్మదలీఖాను కృపానులబ్ధ మదవన్మాతంగ మాణిక్య హా
> ర దుకూలాదిక సత్కృతిం ద్రిదశవర్యస్ఫార సామ్రాజ్యల
> క్ష్మి దనర్చెన్ బుధకోటి పేర్కొనగ బుల్చేర్పట్టణాధ్యాసియై.

ఇందు తెలిపిన కర్ణాటకనవాబు మహమ్మదాలీఖాను 1750లో సింహాసనమునకు వచ్చియుండుటచేత తదనంతర మీ గ్రంథము

వచ్చియుండునని వీరేశలింగంపంతులుగారి అభిప్రాయము. యేసు క్రీస్తు జీవితచరిత్ర వస్తువుగాగొని, ప్రబంధముచేయుట ఈ గ్రంథములో ప్రత్యేక నూతనత. అట్లని ఆకాలమునాటి ప్రబంధకావ్య శైలిలోని జటిలత పీడలేదు.

చని సెలయేటి నెత్తముల చందనశైల మరుద్విలోలకాం
చన కురువింద చందనరసాల ముఖద్రుసమీపగోస్తనీ
ఘనతర కాయమానముల కప్రపు దిన్నియలన్ లతా నికే
తనముల సంచరింపుచు నతండు పరాత్పరచింతనంబునన్.

రెట్టమతశాస్త్రము :

1769లో యొకగ్రంథమును రచించిన అయ్యలరాజు-- అయ్యల భాస్కరకవులు 19వ శతాబ్ది ఆరంభమునరకును జీవించి యుందురు. వారు కన్నడమునుండి తెనుగులోనికి అనువదించి రెట్టమతశాస్త్రమును కర్నూలుమండలములోని యెఱ్ఱపాలెము నేలిన కొండ్రాజు వేంకటరాజునకు అంకితముచేసిరి. ఆ రాజు వీరిని పిలిపించి, కన్నడగ్రంథమును తెలుగుసేయుడని కోరెనట. అహోబిల క్షేత్రమున కాతడు ధర్మకర్త. ఈతడు కామందకమునుగూడ కృతిగా స్వీకరించెనట.

పాతెడు బండిస్రోతగతి పందులు చెల్వగ రొప్పురీతి వే
సారక గార్దభం బఱచుజాడను ఘంటలనాదు కైవడిన్
వారక తోము కుండలరవంబుగతిన్ స్తనితంబుపర్వినన్
ధారుణి వాన లేదనియె ధన్యుడు రెట్టడు ప్రాజ్ఞు లెన్నగన్.

దీనినిబట్టి ధ్వనులచేత వాతావరణసూచనలుచేయుట ఆకాలములో పరిపాటియనునది గ్రహింపవచ్చును.

మరింగంటి సోదరులు :

18వశతాబ్దిలో బరగిన కవులలో మరింగంటి సింగరాచార్యులు ఒకరు. మరింగంటి సింగరాచార్యులు దేవరకొండలోనుండి దశరథరాజనందనచరిత్రమను పేర నిరోష్ఠ్య రామాయణము రచించెను. ఈయనకు శతఘంటావధాని యను బిరుదు కలదు. మరింగంటి వేంకటనరసింహాచార్యుడనుకవి శ్రీకృష్ణశతానందీయము అను కావ్యమును భాగవతకథననుసరించి వ్రాసెను. కృష్ణుడు మాయాబ్రహ్మయై సరస్వతికడనుండ, సత్యబ్రహ్మ అట కరిగి అతనితో వాదించుట ఈ కల్పనలో ముఖ్యాంశము. కళాపూర్ణోదయములోని కలభాషిణీ రంభలతో మణికంథర నలకూబరులు చేసిన మాయావినోదమును ఇది జ్ఞాపకముచేయును. చిలువపడిగ రేని పేరణము అను పేరున నాగకేతనుడైన దుర్యోధనుని కళ్యాణము కథావస్తువుతో మరియొక కావ్యము రచించెను. ఇది అచ్చ తెనుగులో వచ్చినది. మరింగంటి వారిలో మరియొక కవి నరసింహాచార్యులు. ఇతడు రచించిన తాళాంకనందినీ పరిణయమను ప్రబంధములోని ఇతివృత్తము తెనుగు దేశములో ఆచారములోనున్న మేనరికపు మనువులస్థితిని వర్ణించినదై యుండును. ఈకాలములో వచ్చిన ప్రబంధకర్తలలో ఇట్టివారు ఏదో యొక క్రొత్తదనమును చూపుచునేవచ్చిరి.

మంగళగిరి ఆనందకవివలె క్రైస్తవగాథను కథావస్తువుగా తీసికొన్న మఱియొకకవి పింగళి యెల్లనార్యుడు. ఈతడు సర్వేశ్వర మాహాత్మ్యమను పేరున తోభ్యచరిత్రమును చిత్రప్రబంధముగా రచించెను. అది 18వ శతాబ్దిలోనే వచ్చినదని వీరేశలింగముగా రభిప్రాయపడిరి.

ధరణీదేవుల రామయమంత్రి :

18వ శతాబ్ది చివరలో వచ్చిన మరొక అసాధారణకవి ధరణీదేవుల రామయమంత్రి. ఈతడు దశావచరిత్రయను ప్రబంధమును

రచించి కృష్ణమంత్రికి అంకితమిచ్చెను. నెల్లూరి మండలములోని ప్రళయకావేరీపట్టణములో ఒలాందావారి (Dutch) ద్విభాషిగా నుండెను. ఈ పుస్తకము నీతడు వ్రాయక పుష్పగిరి తిమ్మన్న రచించెననువాదము కలదు కాని, అది చెల్లదని వీరేశలింగముగారు నిర్ణయించిరి. ఇందలి పద్యములు చక్కని ధార గలవి; ఆకాలపు స్థితులను కొంత వర్ణించును. వేశ్యావృత్తిని వెక్కిరించుటకు కొన్ని పద్యములు :

> ఔనౌ నే వెలయాలినా యిటులు నీవాడన్ బళా చాలు! పో
> పో నవ్వే రెవరైన విన్న నిట నేర్పుల్సాపగా వచ్చితో
> నా నాథుం డిది విన్నయంత దనకు న్నాకున్ మహాహాని రా
> దా నావంటి కులాంగనామణికి న్యాయంబౌనె యీ మార్గముల్!

ఆకాలపు నమ్మకములపై చురుక.

> రంభాభోగము గోరి యాగముల కర్థంబెల్ల వెచ్చించుటా
> యంభోదమ్ముల జూచి చెర్వుజల మాద్యంతంబు చల్లించుటల్
> సంభోగేచ్ఛ జనించెనేని మఱి వేశ్యారత్నము ల్లేరొకో
> సంభోగింపగరాదె, కానరు జనుల్ జ్ఞానంబు సామాన్యమే.

రంగరాయచరిత్రము :

ఈకాలములో వచ్చిన మఱొకకవి దిట్టకవి నారాయణకవి సమకాలీనచరిత్రగాథ తన కావ్యవస్తువుగా గైకొని ప్రబంధము రచించెను. అది రంగరాయచరిత్రమను పేర బొబ్బిలియుద్ధమును వర్ణించునది. ఇది 1790 ప్రాంతము లో రచించబడినను, 1800 తరువాతగాని ప్రకటనపొందలేదు. ఇది నర్సారావుపేట జమీందారు మల్రాజు రామారాయనింగారికి అంకితమైన గ్రంథము. దీని విధానము పూర్వప్రబంధములను పోలియుండక వీరరసప్రధానమై బొబ్బిలియుద్ధవిశేషములను కన్నులకుగట్టినట్లు వర్ణించెను.

1757వ సంవత్సరము జనవరి 24వ తేదీని ప్రాతఃకాలమున యుద్ధమారంభమైనది. శత్రువులు కోటబురుజులపై కప్పు తీసివేసిరి.

జాముప్రొద్దెక్కునప్పటికి బురుజుగోడలలో కంతలుపడినవి. శత్రు సైన్యములు నిచ్చెనలు గైకొని లగ్గలుపట్టుటకయి కోటగోడను చేరి గంటవరకు ప్రయత్నించిరి. కోటను రక్షించుచున్న భటుల శౌర్య పరాక్రమములవలన ఒక్క శత్రుసైనికుడుకూడ కోటగోడ నెక్క లేకపోయెను. ప్రయత్నించినవారు గాయములతో క్రిందపడిరి. ఆ దృశ్యము కవిదృక్కులలో—

తగ్గ పరాసుమండల ముదగ్రతమై బిరుదుల్ వచించుచున్
లగ్గలకెక్కి రా బురుజులందగు మన్నెకుమారసైన్యముల్
వెగ్గలమైన కోపమున వెన్కొనుచు న్నురుమాడు వీకచే
నగ్గలికం దుపాకుల గిలార్చుచు నేయుచు రోయుచున్ వడిన్.

లగ్గలెక్కి కోటపట్టుటకు శక్యముగాక ఆ ప్రయత్నము విర మించి, కోటమీద ఫిరంగులను ప్రేల్చుటకు ప్రారంభించిరి. అట్లు ప్రయోగించిన ఫిరంగిగుండ్లు చెల్లాచెదరుగాపడిన మరొక దృశ్య మును కవి యిట్లు చూపించెను.

తట్టికోట యగల్చి దారుణోష్మలుగ్రమ్మ, వంతదారు డాసి ప్రాలునవియు
ఇనుపతల్పుల ఘణిల్లున తాకి పిడిదికిరవళిమైవచ్చి చిట్లవియునవియు
ద్వారబంధపుగమ్మి దూటి యవ్వలికంట డుస్సిపాఱగ నోడి డొల్లునవియు
గుఱితప్పి పఱతెంచి కోటముంగలి హస్తినఖపుదుమ్ములరేచి నక్కునవియు

అగుచు నొండెడ ఎడయాక యంటి తూగి
బంతులాడిన పగిది గుభాలుభాలు
నినదభయదార్భటుల శతఘ్నిప్రయుక్త
తాళఫల సన్నిభాయస గోళతతులు.

విజయరామరాజును వెనుచాటుగా వచ్చి ముప్పదిరెండు చోట్ల బొడిచి చంపిన తాండ్ర పాపయ్య చెయ్దమును కవి యిట్లు వర్ణించెను.

కదిసి పైబడి యొకకేల నదిమిపట్టి
వాడివాలున వక్షఃకవాట పాట
నంబు గావించె నతని యా నాభికుహర
విదళితాంత్రవ్రజంబులు వెలికి నుఱక.

ఇందలి వీరరస మించుమించుగా భారతమున తిక్కనసోమ యాజిచే వర్ణింపబడినట్లున్నదని వీరేశలింగంపంతులుగారు తెలిపి యున్నారు. రంగరాయచరిత్ర ఈకాలపు కృతులలో నూతనపథము తొక్కినవానిలో నొకటి.

కస్తూరిరంగయ:

1790 ప్రాంతములలో తంజావూరునందు నివసించి, 1800 నుండి 1820వరకు కావ్యరచనములనుచేసిన కవి కస్తూరి రంగయ. ఈతడు లక్షణచూడామణి యను పేరున రంగరాట్ఛందస్సును రచించెను. దీనిలో అనేక పూర్వగ్రంథములనుండి లక్ష్యములుగా చూపియున్నాడు. ఇతడు సాంబనిఘంటువను ఒక నిఘంటువును, కృష్ణార్జున సంవాదమనెడు ఐదాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందలికథ గయోపాఖ్యానముకథయే.

తరణి సుధాకరుల్ గతులుతప్ప కులాచలముల్ వడంక ది
క్కరులు చలింప సర్వసురకాండము లంబరవీధి భీతిచే
నొరగ బయోధు లింకగ మహోద్ధతి మంటలు గ్రక్కుకొంచు దీ
వరముగ క్రీడిపైని ఘనవైష్ణవసాయక మేగుదెంచినఁ

గణపవరపు వేంకటకవి :

ప్రబంధయుగమునకంతకును చెడ్డపేరు తెచ్చినవాడు గణప వరపు వేంకటకవి. ఈతడు 19వ శతాబ్దివాఁడోకాఁడో నిశ్చయముగా చెప్పలేము. ఇతడు (శ్రీ) ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాస మనెడు ఏకాశ్వాసప్రబంధమును రచించెను. ఇతడు పల్నాటిసీమకు చెందినవాడు. స్వాతిశయము చెప్పుకొన్న ఆంధ్రకవులలో అగ్రగ ణ్యుడు. ఈతనిగ్రంథములలో అనేకములున్నవని చెప్పుకొన్నను –

ఈతడు రచించిన పుస్తకములు లోకమునకు ఉపయోగపడవలెనను ఉద్దేశముతోగాక, తన సర్వతోముఖపాండిత్య ప్రకర్షమును లోకమునకు ప్రకటింపవలెనన్న యుద్దేశముతో రచించునట్లుండునని వీరేశలింగముగారు చెప్పిరి. వారే యిట్టిరకపు ప్రబంధముల నీసడించుచు వ్రాసిన వాక్యములు: "1650వ సంవత్సరములోపల బహుమార్గములయిన నూతన ప్రబంధములు తెనుగున చేయబడినవి. అంతటితో నూతనసృష్టి బహుతరముగా నంతరింపగా, ఈవలివారు వసుచరిత్రమును మాతృకగాగొని దానికి పాఠాంతరములో యనునట్లు పూర్వవర్ణనములనే తలలుమార్చి ప్రయోగించుచు వెనుకటిప్రబంధముల ననుకరించి తమ ప్రబంధముల నల్లజొచ్చిరి." అని తెలిపి, ఈ వేంకటకవిని, బలరామచరిత్ర వ్రాసిన వేంకటదాసకవిని ఈ కోవలో చేర్చిరి. ఈ కవియును మఱికొందరును బంధకవిత్వమును, గర్భకవిత్వమును చెప్పిరి. ఏకాక్షరనిఘంటువులను వెదకి వ్రాసిన పద్యమునకు నిదర్శనము.

కైకో కీకా కెకుకై, కోకా కాకింక కూకి కూకకు కోకీ
కాకు కకు కేక కేకిక కూకో కొక్కాక కింక కోకై కౌకా॥

ఇట్టి చిత్రకవిత్వముతో కవి "తన శిల్పివ్యాపారకౌశలము నెంతచూపినను కాళ్ళతో నడచి గమ్యస్థానమును చేరు సామాన్యమార్గము విడిచి, యడ్డముగా భూమిమీదపడి కడుపుతో దొర్లి ప్రయాసపడి గమ్యస్థానమును జేరి, యసాధారణ ప్రౌఢిమను జూపిన బుద్ధిమంతుని శక్తిని మెచ్చుకొన్నట్లే, యిట్టి కవితాచమత్కృతులు మెచ్చుకొనదగియుండును గాని అంతకంటె నెక్కువ శ్లాఘాపాత్రములు కావు"*

హంసవింశతి

19వ శతాబ్ది ఆరంభములో నున్న కవులలో అనేకులు ప్రబంధములు రచించినను, ప్రత్యేకముగా పేర్కొనదగిన కవి

*కందుకూరి వీరేశలింగము - కవులచరిత్ర — 3వ భాగము — 241 పుట

హంసవింశతికర్త అయ్యలరాజు నారాయణకవి. హంసవింశతి ఐదాశ్వాసముల రసవంతమైన పద్యకావ్యము. ఈ గ్రంథమునందు నాటి యాచారవ్యవహారములను తెలిసికొనుటకు వీలైన అనేక వర్ణన లిందు కలవు. ఉదాహరణకు స్త్రీలు ప్రసాధనముచేయువిధము—

పన్నీట న్నయనంబులొత్తి తనువుం బాటీర పంకంబుతో
జెన్నారం బదనిచ్చి గీఱి సిగవేసెం దాయెతుల్సుట్టి జీన్
సొన్నా పట్టెరుమాలు గట్టె జలతార్చుట్టంచు డాల్మించు మేల్
మిన్నా సన్నపు దుప్పటంబు దగ హాళిం గప్పె సొంపారగన్॥

ఆనాటి వస్త్రాలంకారములను చిత్రముగీసినట్లు తెలుపుచున్నది. ఆనాడు స్త్రీలుధరించు ఏడువారాల నగలను పేరుపేరున పేర్కొను పద్యములున్నవి. (ఆకాలములో బంగారుపనిచేయువాని వర్ణనలో ఆతని పనిముట్లు పేరులు వచ్చినవి.)

కుప్పె, రాగడిబిళ్ళ, కుంకుమరేఖ పా
పటబొట్టు, కమ్మలు, బావిలీలు
లలి సూర్య చంద్రవంకలు, సూసకము, కెంపు
రవల పల్లెరుబూవు, రావిరేక
బుగడలు, నాన్ దీగె, సొగసైన మెడనూలు
కుతికంట్లు సరిపెణ, గుండ్లపేరు
సరిగె, ముక్కర, బన్నసరము, లుత్తండాలు
కంకణంబులు, తట్లు, కడియములును

సందిదండలు, నొడ్డాణ మందమైన
ముద్రికలు, హంసకంబులు, మ్రోయు గజ్జె
లలరు బొబ్బిలికాయలు, గిలుకుమెట్టె
లాదియగు సొమ్ము దాల్చి య య్యబల మెరయ

కమటము కట్లసంచి యొరగల్లును కత్తెర సుత్తి బీరముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పటకారు మూస పలునాణెపరీక్షల మచ్చు నాదిగా
నమరగ భద్రకారక సమాహ్వయు డొక్కరు. డుండు నప్పురిన్

కటికనేని రామయ్య :

కొందరు కవులు సంస్కృతమునుండి అలంకారశాస్త్రముల వంటివి అనువాదముచేసిరి. అట్టివారిలో కటికనేని రామయకవి యొకడు. ఇతడు పద్మనాయకకులమునకు చెందినవాడని తానే చెప్పుకొనెను. 'కువలయానంద' మను అలంకారశాస్త్రమును కువలయానందప్రకాశమను పేరుతో తెనిగించెను. అన్యాపదేశముగా లేడిని ప్రబోధించి చెప్పిన ఈ పద్యములోని చమత్కారము పరికించుడు.

ధనికులమోము కన్గొనవు దబ్బఱలాడవు వారి గర్వదు
ర్వినయవచస్తతుల్ వినవు వేమఱువారల డాయబోవు, క్ర
న్నన దిసెదిచ్చు నూతన తృణంబుల నిద్దురరాగ నిద్దురం
గొనియెద వెందు నేమి వ్రతగోష్ఠిని జల్పితొ తెల్పు మేణమా?

శ్లేషకు ఉదాహరణము :

అబలలయందు గాంచనమునందు భ్రమన్ విధి కల్గజేసె నా
యబలలయందు గాంచనమునందును భ్రాంతి దొఱంగి నిష్ఠచే
ప్రబలినవాడు చూడగ నరాకృతి దాల్చి చెలంగుచున్న య
న్నిబిడ పరాక్రమక్రమ వినిద్రుడు కేవల రుద్రుడే ధరన్.

శుకసప్తతి :

హంసవింశతివంటిదే మరొక గ్రంథము శుకసప్తతి. దీనిని రచించినవాడు పాలవేకరి కదిరీపతి. నెల్లూరిమండలమువాడు. ఈ గ్రంథమునందుకూడ సమకాలీన సాంఘికస్థితిగతులు ప్రతిబింబిం

చును. ఆకాలములో దోసతోటకుకూడ దొంగలబాధ తప్పలేదట - చూడుడు !

అక్కడ దోసతోట యిదియైన తదీయ ఫలంబు లమ్మి యీ
డొక్కయు సాక గోరితి కడు న్నడురేయిని వచ్చి రెవ్వరో
మక్కువలేక నా కడుపుమంటయు బుచ్చుకొనంగ బూని యీ
చక్కెరవంటి పండ్లు తినసాగిరటంచు గృశించు నెంతయున్.

ఈ గ్రంథములో రెండు ఆశ్వాసములుమాత్రము దొరికినవి, పూర్తిపాఠము లభింపలేదు. ఈ కవి నాయకవంశజుడని గద్యలో చెప్పుకొన్నాడు. కదిరినేలిన రాజు పుత్రుడు. తాడిగోళ్ళ కరియ మాణిక్యరాజునకు పౌత్రుడు. రామాంకితముగా తన గ్రంథమును రచించెను.

సంస్కృత కావ్యములు :

ఈ కాలమున మరొక విశేషము సంస్కృతకావ్యములలో కథలు తీసికొని, స్వకపోలకల్పనలతో ప్రబంధముల నల్లుట. అట్టి వానిలో ఒకటి జయదేవుని గీతగోవిందమునకు కృష్ణదాసకవి చేసిన అనుసరణ, రాధాకృష్ణ విలాసమను మూడాశ్వాసముల కావ్యము. బిల్హణకథను తీసికొని పలువురు పలురచనలు గావించిరి. వానిలో చెన్నూరి శోభనాద్రి రచించిన శృంగార సుధాసముద్ర పూర్ణ చంద్రోదయమను నాలుగాశ్వాసముల కావ్యము. ఇందు మచ్చున కొక పద్యము చూచిన నాటి కులభేదములు తెలియును.

తనయా రాజకుమారులన్ విడిచి విద్వాంసున్ గ్రహింపంగ నీ
మనసెట్లొప్పెను రాజకన్యవు గదా మర్యాదయౌనా ధరన్
వినవే పెద్దలు చెప్పుచుందురుగదా "విద్వత్సు దారిద్ర్యతా"
యని తద్వాక్యము వ్యర్థమయ్యెనుగదా! హా! యేమి చేయందగున్

ఇదే కథను యామినీపూర్ణ తిలకావిలాసమును పేరున చెళ్ళపిళ్ల నరసకవి శృంగారకావ్యముగా రచించెను. ఇది పై కావ్యముకంటె

మనోహరముగా నున్నది. ఈయన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి పితామహుడు. కడియమ్‌గ్రామమున రావు నీలాద్రిరాయనింగారి కాలమున నుండెను. (1810) ఇందున ఒక పద్యము -

స్వామీ! నేరములేదు నా వలన నీ సర్వంబు నీ కృత్రిమ
స్తోమంబు న్నను భ్రాంతిముంప సమయస్ఫూర్తిన్ మదీయానన
క్షేమాలోకనబద్ధకాండ పటరాజిం గూర్చితౌ గాదె మ
త్ప్రేమానందకరాశయగ్రహణకారి ప్రాప్తిగా మున్నుగన్

కొన్ని శాస్త్రగ్రంథములను తెనుగుచేసినవారిలో భైరవకవి యొకడు. ఇతడు రత్నశాస్త్రమును పద్యకావ్యముగా కూర్చెను. కర్నూలుమండలమువాడు. ముత్యములగూర్చి చెప్పినపద్యము అప్పటి వృత్తివిద్యలను తెలుపును.

నీరదముల్ దిగంతముల నిండి తటిద్ఘన గర్జితంబు లిం
పార మహోగ్ర వృష్టికురియన్ ప్రభవించు నితాంత కాంతితో
నారయ కుక్కుటాండసమమై పడు ముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్

వేదాంతగ్రంథములు:

ఇంక వేదాంతగ్రంథములను పద్యకావ్యములుగా రచించిన పరశురామపంతుల లింగమూర్తిగూర్చి యిదివరకే ప్రస్తావించి యున్నాము. ఈతడు రచించిన సీతారామాంజనేయసంవాదమను మూడాశ్వాసముల పద్యకావ్యమునందు నిగూఢ వేదాంతవిషయములను తెలిపెను. ఇది స్త్రీలు పురుషులు నిత్యమును చదువుకొను జనప్రియమైన గ్రంథము.

గానంబున్ నటనంబు తాళగతులన్ గావించుచున్ జారు వి
ద్వానైపుణ్యము జూపుచున్ శిరముమీదన్ గల్గు పెందొంతరన్
బూనం గైకొను నాట్యశీలుని గతిన్ పుంఖానుపుంఖోజ్వల
న్నానార్థానుభజజ్ఞుడయ్యు బుధు డానందాత్ము గాంచున్ మదిన్

ఈయన తెలంగాణమునకు చెందినవాడు – ఈయనకుమారుడు కూడ తండ్రిపోలిక 'శుకచరిత్ర'మను వేదాంతగ్రంథమును ఐదాశ్వాసముల కావ్యముగా రచించెను. ఈతడు పరశురామపంతుల రామమూర్తి. ఈతనిరచన వేదాంతగ్రంథమయినను శృంగారరసకావ్యముల బోలియుండును.

లలనా యీ వనభూమి కెల్లపుడు వాలాయంబుగా నప్సరో
లలనారత్నము లేగి యీ యురులపాలన్ గల్గు సేమంతిశా
లల నా తీర రసాలజాలముల నేలాడోలలం గేళిలీ
లల నాట ల్గొనియాడుచుండుదురు బాలా కంటివే యిచ్చటన్

ఈతనిగ్రంథము తండ్రిగ్రంథమంత జనప్రియత పొందలేదు. వేదాంతగ్రంథములు రచించిన మరికొందరు కవులు – వివేకసింధువు రచించిన వేగినాటి కొండనార్యుడు; జీవప్రబోధము రచించిన వాసుదేవయోగి, శేషధర్మముల రచించిన కానాల నరసింహాకవి, బ్రహ్మోత్తరఖండము పద్యకావ్యముగా వ్రాసిన శ్రీధరమల్లె వేంకటస్వామి. (1815) ఇవిగాక వైద్యశాస్త్రములుకూడ పద్యరూపములో వచ్చిన వనుటకు ముడుంబి వేంకటార్యులు రచించిన 'రసప్రదీపిక' యను మూడు ఆశ్వాసముల కావ్యమును ఉదాహరణముగా చెప్పవచ్చును.

మంచి సువర్ణ భస్మము క్రమంబున గొన్నను రాజయక్ష్మమున్
సంచిత కర్మజంబులగు సర్వరుజంబుల భూతవేధలన్
ద్రుంచి యమోఘ వీర్యమయి దోర్బలమున్ ఘన కాంతి తేజ మ
త్యంచిత బుద్ధిమార్గము చిరాయువొసంగును మౌనిచంద్రమా!

ఇది గాక నిఘంటువులను వ్రాసిన కవులు కొందరున్నారు. వారిలో 1836 లో ఫక్కి వేంకటనరసయ్య అనునతడు విశాఖపట్టణములో క్రైస్తవపాఠశాలలో ఉపాధ్యాయుడుగా నుండి శతకములు, ప్రబంధములతోపాటు అమరపదకల్పద్రుమమను నిఘంటువును, కవిదర్పణఛందమను ఛందశ్శాస్త్రమును రచించెను. కొన్నిపాటలను పద్యకావ్యములుగా రచించినవా రున్నారు. అట్టివారిలో వేలూ్వరి

వేంకటేశ్వరకవి గోవ్యాఘ్రచరితమును రచించెను. 1851లో ఈతడు విజయనగరమువద్ద రాచివలస గ్రామములో నుండి ఈ గ్రంథమును రచించెను.

> సంతతి లేక డెందమున చాలగ డస్సి వ్రతోపవాసముల్
> సంతతమే మొనర్చి కడు సంతసమొప్పగ వేల్పు తేండ్ల మత్
> స్వాంతమునందు నిల్పి హిమశైలసుతేశ్వరు నిందుమౌళి న
> త్యంత సుభక్తి గొల్చి సుతు నంచితవాంఛ ఫలించ గాంచితిన్

విచిత్రరామాయణము :

ఈతడే గోపీనాథుడు రచించిన వచనగ్రంథమును ఆధారముగా గైకొని, పద్యకావ్యముగా విచిత్రరామాయణమును రచించెను. దీనినే నరసింహదేవర వేంకటశాస్త్రియను కవికూడ పద్యకావ్యముగా రచించెను. వీనియన్నింటికిని మూలము ఓఢ్రభాషలో సిద్ధేశ్వరుడు రచించిన విచిత్రరామాయణము. అలంకారశాస్త్రములలో ప్రసిద్ధమైన విశ్వగుణాదర్శమును తిరుమల బుక్కపట్టణపు చినతాతాచార్యుడు పద్యకావ్యముగా రచించెను. 1850 తర్వాత ఈ గ్రంథము వచ్చినది. దొంగల నిర్వచనము చూడుడు.

> ఘన వనభూములన్ మెలగి కన్నమువేసి గృహాళి విత్తమున్
> గొని చనువారి దొంగ లనగూడునె పోషకులైనవారి లె
> క్కను గడు బొంకుపుచ్చి తదఖర్వధనంబులు దొంగిలింతు రీ
> గణకులె దొంగ లీ గణనకర్మలనే భజియింతు రీ జనుల్.

నాటికాలములో కరణీకపు లెక్కలు వేయువారిపైన విమర్శ.

ద్రావిడకవులు :

1813—1863లో చెన్నపురిలోనున్న కరాలపాటి రంగయకవి రెండు కావ్యములు రచించెను. ఈతని తాత నారాయణసూరి కర్ణాట రాజులను మెప్పించెనట! ఈతడు చెన్నపురిలో పచ్చయప్ప పాఠ

శాలయందును, ప్రెసిడెన్సీ కాలేజీయందును పండితుడుగా పని చేసెను. ఈతడు భూతపురీ మాహాత్మ్యము, కవిజనమనోహరము అను కావ్యములను రచించెను. మొట్టమొదట ఆంధ్ర భారత, భాగవత, రామాయణములను లేఖకప్రమాదములను లేకుండ సవరించి ప్రకటించిన దీ పండితుడే.

త్యాగరాజమొదలి శుద్ధ ద్రావిడిమైనను తెలుగులో చక్కని గ్రంథములు రచించెను. 1830 – 1875 వరకు చెన్నపురిలో నున్న ఈ కవి విద్వత్కర్ణామృతమను పేరుగల సుబ్రహ్మణ్యవిజయ మనెడి ఐదాశ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతని ఛందో రత్నాకరమను చిన్న ఛందస్సుకూడ ముద్రింపబడినది. ఈతడు ఇంజనీరింగు డిపార్టుమెంటులో ఓవరుసీయరుగా పనిచేసెను. సంస్కృత ద్రావిడ హూణభాష లిదివరకే తెలియును. తెనుగు క్రొత్తగా అభ్యసించి, దానియందు కావ్యరచన చేసెను.

ఈతడు తీసికొన్న యితివృత్తము తమిళులు తఱచు భక్తితో నారాధించు షణ్ముఖునికథ. వచ్చిన కొక పద్యము పురుషులపై స్త్రీ చెప్పినది:

ఘన మాయావులు నిత్యచంచలులు నిష్కాముల్ స్వకార్యానుకూ
ల నవోపాయవిధిజ్ఞు లస్థిర మృషాలాపుల్ కృపాశూన్యు లెం
దును బుంవర్యులు దేవదేవు లెపుడుఁ దుర్వార సంపత్ సుమూ
ర్తి నితాంతాంధులు పల్కనేల మగవారి న్నమ్మగావచ్చునే

బేరీజు పద్యములు :

ఆకాలములో జమీందారీలలో వ్యవహారములోనున్న లెక్కలును జమాఖర్చులను వివరించుచు విస్సాప్రెగడ కామరాజను కవి ఒక చిన్నగ్రంథమును రచించెను. దీనిలో ప్రస్తుతము 81 పద్యములుమాత్రము లభించుచున్నవి. ఈతనికి మంచి కవితాధార యున్నదని నిరూపించుటకు కృత్యాదిపద్యములే నిదర్శనములు.

కరపద్మంబున బువ్వుబంతివలె శంఖం బుప్పతిల్లంగ నా
సిరి మాణిక్యమురీతి వక్షమున భాసిల్లంగ బైమీద బం
గరు నిగ్గుల్గల వల్వ కేలు కరణిం గ్రాలంగ శోభిల్లు తా
మరసాక్షుండు దయాసముద్రుడగుచున్ మమ్ముం గటాక్షించుతన్

ఆకాలములో వ్రాత కుపయోగించు కలములను వర్ణించిన పద్యము :

కణపకలంబు బ్రహ్మకనికారము, నెమ్మి కలంబు పంకజే
క్షణుని దయారసంబు రభసంబున బాతుకలంబు నాగభూ
షణు కృపగల్గి మించెనని సర్వజనుల్ ప్రణుతింప మానవా
గ్రణులు కరారవిందముల గైకొని వ్రాయుదు రక్కలంబులన్

చిఠావర్జాలలో ఆవర్జాపద్ధతిని వ్రాసిన పద్యములో ఆనాడు వాడుకలోన్న పారశీక పారిభాషికపదములన్నియును వచ్చి చేసినవి.

తనరారు నొక్క తెల్లని తాబు గైకొని
    చెలువైన కత్తెర చేతబూని
వన్నెమీఱగ నాల్గువైపులు కత్రించి
    యెనిమిది గదులుగా నేర్పరించి
తురుమగా వ్రాయు బాతుకలంబు చేపట్టి
    నిండు షాయీబుడ్డి దండ నునిచి
చెలువొందు దాపుపై చిఠ్ఠాను లిఖియించి
    బారామునద్దీలు ప్రస్తుతింప
నాడెమై చెన్నొందు నగదుచిఠ్ఠా చూచి
    కూరిమి రోజు మజ్కూరువేసి
తొలిగదియందు బొందుగ బారుగావించి
    కడు వేడ్క మిగిలిన గదులయందు
తెలియంగ తాలూకు దేహాయఖర్చులు
    వట్టముల్ రుసుములు బాజుగుస్తు
లొదవు జుమ్మానాలు మొదలుగాగల వస్తు
    బత్తబిసీళ్ళతో బారుచేసి

వాని బేరీజులన్నియు వరుస గూడి
దేని బేరీజు దానిని తేటపఱిచి
మెట్టు బేరీజు గల్పి సరికట్టియున్న
నది వసుంధర నావర్జ యని వెలుంగు

ఇట్టి విచిత్రమైన భాషాప్రయోగములను, మణిప్రవాళము లను చూపు గ్రంథము లీకాలములో వచ్చినవి.

మరికొందరు కవులు :

ఓగిరాల జగన్నాథకవి 1879లో సుమనోమనోభిరంజనమను పేరుతో నైదుల్లాసముల ప్రబంధమును ప్రకటించెను. ఇది యూని వర్సిటీ పట్టపరీక్షకు పఠనీయగ్రంథముగా ననేకపర్యాయములు నిర్ణ యించియుండిరి. ఉదాహరణమున కొక పద్యము —

చిలుక హుమావజీరను కృషీవలు డంగన చిత్తవప్రముఁ
జలజకలంబలాంగలములఁ దళనంబొనరించి కృష్ణు ను
జ్జ్వల గుణబీజమంటి యతిబంధురరాగరసంబు నింప కో
మల సుమనోరథాంకుర మమందముగా జనియించి మించెడుఁ

ఈయన కాకినాడనుండి సుధీరంజని యను మాసపత్రికను 1885 వరకు నడపుచుండెను.

నడకుదుటి రామనకవి (1821 – 1887) ద్విపదకావ్యములను పద్యకావ్యములుగా మార్చిన కవులలో నొకరు. పాల్కురికి సోమ నాథుని ద్విపదకావ్యము నీతడు పద్యకావ్యముగా రచించెను. ఇంకను శంకరాచార్యుని వివేకచూడామణిని, హరిమీళేస్తవమును తెనిగిం చెను. ఆశుకవిత్వ మప్పుడే ప్రారంభమైన క్రొత్తలో పేరుగాంచిన కవి మాడభూషి వేంకటాచార్యకవి. ఈయన శతలేఖినీపద్యసంధాన సామర్థ్యమును, అష్టావధాన వ్యస్తాక్షరీకౌశలమును గలిగి అనర్గళ ముగా కవిత చెప్పగలిగిన దిట్ట. ఈయన నూజివీడు సంస్థానమునందు చిరకాలముండి విద్యానభినవ పండితరాయాది బిరుదముల నం

దెను. అసాధారణ ధారణాశక్తికలిగి ద్విసంథగ్రాహియని ప్రసిద్ధి గాంచెను. ఎనిమిదిభాషలలో వ్యస్తాక్షరి చెప్పగలిగిన నేర్పరియై, 1898వరకు జీవించి కీర్తిశేషుడయ్యెను. ఈయన రచించిన నాలుగాశ్వాసముల గ్రంథము భరతాభ్యుదయము మధురమైన కవితారసమును చిలుకరించెను.

ఆకాలపు సాంఘికాచారములలో నొకటిగూర్చి వీరు చెప్పినతీరు:

వనితలు పుట్టినింట బహువర్షము లుండగరాదు భర్తతో
ననికియె యుత్తమం బది యటుండగనిమ్ము సమస్త రాజలో
భన మకుటార్చితాంఘ్రియగు పార్థివశేఖరు ధర్మపత్నివ
య్యు నిటుల బీదరాలివలె నుండగ నేల సతీ శిరోమణీ!

గోపీనాథము వేంకటకవి :

19వ శతాబ్దిలో వచ్చిన కవులందరిలోను ప్రత్యేక ప్రశంసలతో పేర్కొనదగినవాడు గోపీనాథము వేంకటకవి. (1820 - 1890) నెల్లూరుజిల్లాలోని కావలికి సమీపమున లక్ష్మీపుర మీతని జన్మస్థలము. వేంకటగిరి రాజులకొలువులో ఉండి, యువరాజగు శ్రీ గోపాలకృష్ణయాచేంద్రులచేత గౌరవ సన్మానములను పొందెను. వేంకటకవి సంస్కృతమునందలి రామాయణమును యథామాతృకముగా తెనిగించి పద్యకావ్యముచేసెను. తెలుగులోవచ్చిన రామాయణములలో యిది యుత్కృష్టమైనదని కొందరి యభిప్రాయము. దీనినే గోపీనాథ రామాయణ మందురు. ఇందలి పద్యమొకటి:

ఘన గుణశాల ప్రాణమునకంటె ప్రియుండగు రామచంద్రునిన్
జననుతు నొంటి బంపి నిమిషంబయినన్ మనజాల వంశవ
ర్ధనుడగునట్టి యీ తలిరుబ్రాయపు ముద్దులకుఱ్ఱ డేల నీ
యనుమతి నేన వచ్చెద సురారుల జంపి మఖంబు గావగన్ ॥బా॥ కాం॥

మఱియు నీతడు బ్రహ్మకైవర్తపురాణమునందలి కృష్ణజన్మఖండము నెనిమిదియాశ్వాసముల ప్రబంధముగా రచించెను. అందొక పద్యము:

పరికింపం గడు దుర్లభం బవనిలో ప్రాణేశ! కాంతామణీ
పురుషప్రేమ గుణాతిరిక్త మనిశంబుం బూతచారిత్రయుఀ
స్మరసారజ్ఞయు సాధ్వియుఀ రసికయుఀ జాతుర్యసంయుక్తయౌ
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుడుఀ తథ్యంబు చింతింపగఀ

మాఘుడు సంస్కృతమునరచించిన శిశుపాలవధ తెనిగించెను. ఈయన భగవద్గీతకూడ పద్యకావ్యముగా చేసెను.

మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱు నదీప్రవాహముల్
నిండి చలింపకున్న యల నీరధి జేరిన మాడ్కి నెవ్వనిం
దండిగ సర్వకామములు తప్పక చేరు నతండు శాంతుడై
యుండు సకాముడైన నరు డొందడు శాంతిని పాండునందనా!

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి :

ఈ శతాబ్దిలో వచ్చిన కవులలో మఱొక దిట్ట—శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి (1800 - 1880). ఈయన రామచంద్రపురములో కాకర్లపూడి వేంకటకృష్ణరాజుగారి అభిమానముపొంది, అయినవల్లి గ్రామములో పదిపుట్లుస్థలము బహుమానము పొందెను. ఈయన రామేశ్వరయాత్రకు వెళ్ళి తిరిగివచ్చుచు కాళహస్తిలో ఆగి, దామెర వేంకటపతిరాయనిగారివద్ద 16 యేండ్లు ఆస్థానపండితుడుగా నుండెను. అప్పు డీయన అనేకగ్రంథములు సంస్కృతములో రచించెను. వానిలో నొకటి 'హరికారికలు.' ఇది దొంగిలించి చిన్నయసూరి తన వ్యాకరణము రచించెనను వదంతి కిట్టనివారు లేవదీసిరి. అది సత్యముకాదని వీరేశలింగంపంతులుగారు ఋజువుచేసిరి. ఈయన గోదావరిమండలము కలెక్టరువద్ద శిరస్తాదారుగానున్న తుళసింగసెట్టిగారియింట పురాణము చెప్పుచుండెడివాడట. ఆయన ప్రోత్సాహముచేత స్త్రీనీతిశాస్త్ర మనెడు ఏకాశ్వాసగ్రంథమును రచించెను. ఇందలి పద్య మొకటి యుదాహరణముగా నిచ్చుచున్నాము.

మన్ననచేయ సబ్బ కవమానముచేయగ స్రుక్కకే పతిం
జెన్నలరంగ గొల్చుచు విశిష్టత నాత్మకుల ప్రతిష్ఠ సం
పన్నముచేయుచుం దనదు బంధులచేత పొగడ్తగన్న య
య్యన్నులమిన్నచే జగములన్నియు నిల్చునటంచు నెంచెదన్

ఈయన సంస్కృతమున యక్షోల్లాసమను కావ్యమును, వల్లవీ పల్లవోల్లాసము, మదనాభ్యుదయము నను భాణములను, హరికారికలను, నీలశైలనాథీయమును రచించెను. ఆంధ్రమున సర్వకామదాపరిణయమును, వేంకటాచలమాహాత్మ్యమును, పీఠారణ్యమాహాత్మ్యమును, పంచతంత్రమును, వసుచరిత్రవ్యాఖ్యానమును రచించెను. ఈయన సమకాలికుడైన పిండిప్రోలు లక్ష్మణకవికిని వీరికిని తరచు పరస్పరస్పర్థలు జరుగుచుండెడివట. దానియందు లక్ష్మణకవిదే పైచేయి అగుచుండెడిది. ఒకసారి కాజలూరిగ్రామములో సర్వకామదాపరిణయమును కృష్ణమూర్తిశాస్త్రి పఠించుచుండగా లక్ష్మణకవి దానియందు కొన్ని దోసగులు చూపెను. ఈ యవమానము సహింపలేక, కృష్ణమూర్తిగారు రామచంద్రపురము విడిచి వెళ్ళిపోయిరని కందుకూరివారు తెలిపియున్నారు. కృష్ణమూర్తి శాస్త్రి చివరిదశలో మాడుగుల భూపతిగారివద్ద రెండు సంవత్సరములుండెనట. ఒక్కరాత్రిలో వీరు 'అశ్వశాస్త్రమును' మాడుగులలోనున్నపుడే రచించి యిచ్చెనందురు. వీరు విద్వత్ కవులు. ఎన్నికావ్యములు వ్రాసినను స్త్రీనీతిశాస్త్రము ఈ శతాబ్దివాఙ్మయములో పేర్కొనదగినది.

## పిండిప్రోలు లక్ష్మణకవి :

ఇంక ఈయనసమకాలికుడైన పిండిప్రోలు లక్ష్మణకవి తిట్టు కవిత్వమునకు పేరుపడినవాడు. ఈయనకు పెట్టినవారికి తలపై కిరీటము, లేనివారికి శ్రాద్ధము. తిట్టుటలో తనయంతటివాడు లేడని తన కావ్యములో చెప్పుకొనెను.

తెలియ విను రామకవ్యాదులు సూరకవి ప్రముఖ పృథు ప్రతిభావం
తులు భీమ శ్రీనాథు ల్వెలయగ నాకరణి దిట్టలే రూఢమతీ॥

ఈయన రామచంద్రపురమువద్ద కుయ్యేరు అను గ్రామములో నుండువాడు. "లంకావిజయ" మను పేరుతో వ్రాసిన ద్వ్యర్థి కావ్యము రావణదమ్మీయమనికూడ పేరుపొందినది. ఈతడు 1780–1840వరకు జీవించెను. కుయ్యేరు గ్రామకరణముగా పనిచేయుచుండు వాడు. ఈ గ్రామమును గుత్తజేసిన రావు ధర్మారాయడను వెలమ వంశజుడీ కవికి చెందిన లంకనేలలో ఏడుపందుము లపహరించెనట. ఆతనిమీద కోపావేశముచేత 1800లో ఈ కవి "లంకావిజయ" మను పద్యకావ్యమును రచించెను.

ఏడుపందుము ల్లోకంబు లెఱుగ లంక
నేల కొల పరక్షేత్రాప్తి మేలుకాదు
పేర్మి నా భూమిజాత సంప్రీతితోడ
వీడు మదియె సౌఖ్యములిచ్చు వేయు నేల

ప్రాజ్ఞత నెవ్విధంబునను రామునకుందగు సాటిరావు స
ర్వజ్ఞ నృసింహరాయన సువంశమున॥ జనియించి చెడ్డ దు
ష్ప్రజ్ఞుడ వీవు కానకు విచారములన్నియు మాని ధర్మగో
ప్తిజ్ఞులు మెచ్చు చొప్పు కని సీతను వే విడు మంత మేలగు॥

జ్యేష్ఠుడా లక్ష్మణాగ్రజ క్షేత్ర మీవు
వదలకుండిన మోసంబువచ్చు నింక
చండ నిర్భీక వనచారి పిండిప్రోలి
కవికులవరుతో రిపుత ముఖ్యముగ వలదు.

ఈ పై పద్యములయందలి రెండుకావ్యార్థములు పలువురు మెచ్చుకొందురు. కాని యిది రాఘవపాండవీయమంత ప్రౌఢరీతిని సాగలేదని వీరేశలింగముగారే యన్నారు. లక్ష్మణకవి జీవితకాల మంతయును అల్పములైన యైహికలాభముల నిమిత్తము పరులను దూషించుచు భూషించుచు పద్యములను చెప్పుచుండువాడట. వివా

హోదులకు వెళ్ళి కవీశ్వరసంభావనములను గొనుచు ధనార్జనముచేయు చుండెనట. తన కోర్టువ్యాజ్యమునిమిత్తము సి. పి. బ్రౌనుదొరను చూడనేగినపుడు చెప్పిన పద్యము:

పప్పసచేసె నా బ్రతుకు పండితు డింకెటు నిల్తునంచు నే
నిస్పృహ వృత్తి నుండగను నిన్నటిరేఁ గలలోన కోర్టువా
రిన్పెసియాలు పట్టి రిక నేర్పడ న్యాయముతీర్తుమంచు దై
ర్యాస్పదసూక్తి పల్కినటులైన మిముం బొడగాన వచ్చితిన్

అంతకుముందు తన మేనల్లునికి విరోధముగా తీర్పు చెప్పె నని పండితసదరమీనగు శంకరమంచి యనంతశాస్త్రిని శ్లేషార్థముతో తిట్టెను.

అవురా శంకరమంచివాడవె యనంతాఖ్యుండవై తీర్పెఱుం
గవు మంగన్నరజేసి నీవు బుధమార్గభ్రష్టతన్ జోగిరా
గ వరాలంది పినాకినిం బశుపతీ కల్లోలునిం బట్టి స
త్యవధూసత్యము దానియం దిడితి వాశాయత్తు లిట్లేకదా!

ఇవియన్నియును తిట్టుకవిత్వమునకు ఉదాహరణములైనను లంకావిజయమునందు చక్కని కవిత్వమును చూపు పద్యములు లేకపోలేదు. వానియందుకూడా ఆకాలపు స్వభావమైన–శబ్దాలంకార ప్రీతి మిక్కుటముగా కనిపించును.

తమ్ములు నీదుపల్కులు హితమ్ములుగా గొని చేయ నార్యజా
తమ్ములు నీదు సద్గుణశతమ్ములు సంస్తుతిచేయ పక్షపా
తమ్ములు లేక న్యాయకలితమ్ములుగా క్రియలొప్ప నక్వభూ
తమ్ములు విశ్వసింప సుకృతమ్ములు వర్ధిలునట్లు చేయుమీ!

అనేకార్థకావ్యములు :

19వశతాబ్దిలో ప్రవర్తిల్లిన ద్వ్యర్థికావ్యముల కిది యొక మచ్చుతునక. అయినను రెండు, మూడు, నాలుగు, అయిదు అర్థ

ములుగల కావ్యములు వ్రాయుట కూడా అప్పుడు ఒక ఫేషన్ అయినది. అట్టి యనేకార్థకావ్యములు పెక్కు వచ్చినను పేరుప్రఖ్యాతులు సంపాదించుకొన్నవి, వానిలో చాలతక్కువే. అన్నింటికంటెను అగ్రగణ్యమైనది పింగళి సూరన రాఘవపాండవీయము. దానికదియే సాటి. కృష్ణాధ్వరియను కవి నైషధపారిజాతీయమును, క్రొత్తలంక మృత్యుంజయకవి ధరాత్మజా పరిణయమును, నెల్లూరి వీరరాఘవ కవి 'యాదవరాఘవపాండవీయము'ను త్ర్యర్థికావ్యములుగా రచించిరి. 1886లో పూండ్ల రామకృష్ణయ్యగారీమూడవగ్రంథమును ముద్రించిరి. బుక్కపట్టణము వేంకటాచార్యులు 'అచలాత్మజాపరిణయము' లో లక్ష్మీపార్వతుల వివాహకథలు శ్లేషగా కూర్చి ద్వ్యర్థి కావ్యమునుచేసి, కావ్యనామమునందుకూడా రెండర్థములను సాధించిరి. ఈ గ్రంథములో కథాసందర్భమున రెండర్థములుగల పద్యములు చాల తక్కువ. దండకము, రగడ, లయగ్రాహివంటి వృత్తములను ప్రయోగించెను.

సంస్కృతాంధ్ర భాషాద్వయ శ్లేష కుదాహరణము :

జడజారి కళలతో కడు వేడుకలయందు
ప్రమథవల్లభుని వైరాగ్యమెంత ?

ఇందు జడజారి – చంద్రుడని సంస్కృతార్థమును జడ – జారి అను తెనుగుఅర్థమును బోధించుచున్నది. అముద్రికగ్రంథములలో – ప్రాచ్యలిఖితపుస్తకాలయములోనున్న యామునవిజయ మొకటి విశిష్టగ్రంథము. అనేకార్థకావ్యములు కవి తన పాండిత్యప్రకర్షను ప్రదర్శించుట కుపయోగించినవేకాని, యివి యుత్తమకావ్యములనిపించుకొనలేదు. శబ్దములలో కథాసందర్భమునకు చేసిన మార్పుల చేత సాధించిన ఈ శ్లేషార్థవిశేషములు ఆ కవి తెలివితేటలకు, గడుసుదనమునకును నిదర్శనములైనవికాని, ఉత్తమకావ్యములకు నిదర్శనములు కాలేదు.

ఇచ్చట పేర్కొన్న కవులలో ప్రబంధములు, శాస్త్రములు, కావ్యములు, మహాకావ్యములు రచించినవా రున్నారు. కొందరు 18వశతాబ్దిలోనే జన్మించి కవితారచనచేసినవారు. మఱికొందరు 19వ శతాబ్దిలోనే జన్మించి కవితారచనచేసినవారు. మరికొందరు, 19వ శతాబ్ది పూర్వభాగములో జన్మించి, కావ్యరచనకు గడంగినవారు. ఆ కాలమునకు వచ్చిన యుగలక్షణములు కలవారినిమాత్రము చూపి ప్రబంధకావ్యరచన 19వశతాబ్దిలోకూడ అంత మరీ హీనస్థితికి దిగ జారలేదని కొంతవరకు నిరూపించితిమి. కుల, జాతి, లింగభేదములు లేకుండ అన్నిజాతులవారును రచనగావించిరి.

ఈ కాలములో పద్యకావ్యరచనగావించిన కొందరి స్త్రీలను పేర్కొని ఈ యధ్యాయమును ముగింతుము.

కవయిత్రులు :

కవయిత్రులలో ముందుగా పేర్కొనదగినది "ముద్దుపళని" ఈమె ప్రతాపసింహమహారాజుచేత 'చామీకరాంబరాభరణాదులు' బహుమతిగాపొందెను. అనగా 1780-93ప్రాంతములలో నున్నదన్న మాట. 19వశతాబ్ది యారంభమువరకు జీవించియున్నదేమో! "ముచ్చటగొలుపు తెలుగు నుడికారము సరసపదజాలము మిక్కిలి సున్నితమైన భావములు భావమార్దవము నలిగిపోకుండ వాసింప జేయగల రచనావిధానము. ఇవి ముద్దుపళని కళాకృతులు. ఈమె కావ్యపుపూదోటయందు మురిపెమైన అచ్చ తెనుగుపదము లెన్నియో వింతవింత హొయలుతో గులుకుచుండును. శృంగారముచే జీవించిన ముద్దుపళని శృంగారమును కావ్యములోనికి నడియగట్టుటయందు గొప్పవిజయమును సాధించినది"*

ఈమె కవిత్వములో స్త్రీసహజమైన వాక్యములును జాతీయ ములును కన్పించును.

---

*ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు-ఆంధ్ర సాహిత్యచరిత్రసంగ్రహము 184పుట.

తనదు మప్పెంత తా నెంత తానె యింత
చేయజూచిన నే నెంత చేయరాదు
వేలువాచిన రోలంత విరివియైన
రోలువాచిన నది యెంత మేలుగనునొ.

కుట్ట తేలు, కుట్టకున్న కుమ్మరబూచి
తోసిరాజటంచు దోచె జెలియ
దానివేలు దీసి దానికన్ను పొడిచి
నటులు చేయకున్న నగునె చిలుక

లేని పట్టింపులెల్లను బూని వాన
నేనె యెదురైనగాని యింతైన జూడ
దల్పునకు గల్మి వచ్చిన నర్థరాత్రి
గొడుగు తెమ్మన్న కతగాను కోమలాంగి

మరొకసందర్భములో కృష్ణునిచూడ బంపిన చిలుకనుగూర్చి:

శౌరిని బిల్వగా జనిన చక్కని కీర మదేల రాదొ, యే
దారిని జన్నదో నడుమ తారెనొ చేరెనొ లేదొ గోపికా
జారుని గాన్చెనో కనదొ, చక్కగ నా వెత విన్నవించెనో
సారెకు లేక శౌరినుడి, చక్కెర యుక్కెర మెక్కి చిక్కెనో

ఈమె తరువాత పేరెన్నికగన్న కవయిత్రి తరిగొండ వేంకమాంబ. ఈమె 1840లో జీవించియున్నట్లు బ్రౌన్‌దొరగారు తన నిఘంటువులో వచించిరి. ఈమె జ్ఞానవాశిష్ఠరామాయణమును, శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును, రాజయోగసారమును రచించెను. ఈమె కడపమండలములోని తరిగొండగ్రామమునకు చెందినది. ఈమె వేంకటాచలమాహాత్మ్యము వ్రాయుచు ప్రబంధపద్ధతిని శృంగారవర్ణనముచేయలేనని శ్రీకృష్ణునికి ముందే విన్నవించుకొనెను.

శృంగారాకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
డం గూఢంబుగ జెప్పు నీవనగ నట్లే చెప్పలేనన్న. నన్
ముంగోపంబున జూచి లేచి యట నే మ్రొక్కంగ మన్నించి తత్
శృంగారోక్తులు తానె పల్కికొను నా శ్రీకృష్ణు సేవించెదన్

వేంకటాచలమాహాత్మ్యములో నీమె పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణము చక్కగా వర్ణించెను. ఎఱుకతను వర్ణించునపుడు తెనుగు మాటలతో పాత్రోచితభాషనే వాడుకొనెను.

ఆ కురవంజి యిట్లనియె నాడకు రమ్మని పిల్వవచ్చినా
రాకొనినాడు బిడ్డ డిపు డమ్మలనక్కల నేడనైన నే
జోకగ జేరి వారలకు సోదె నిజంబుగ జెప్పకుండినన్
నా కడుపెట్లు నిండునని నవ్వుచు బల్కుచుమూల్గి యిట్లనెన్

ఈమె రాజయోగసారము, భాగవతము ద్వాదశస్కంథములను ద్విపదకావ్యముగా రచించినట్లు వేంకటాచలమాహాత్మ్యములో చెప్పుకొనెను.

దారునిర్మిత వీణ నారూఢి బల్కించు గాయకపురుషుని కరణిగాను
పురుషోత్తముడు దయాపూర్ణుడై నా జిహ్వాయందు దావసియించియరుదుగాను
బలికించు గావున భాగవత పురాణ మమర నే ద్విపదకావ్యంబుగాను
ద్వాదశస్కంథము ల్తగ జెప్పి హరికి సమర్పించి శ్రీవేంకటాద్రిమహిమ

అతనిపై రమ్య పద్యకావ్యములచేసి
శ్రీనివాసునకే సమర్పింపనుంటి
ఈగ తోయధి దాటబోయినవిధమున
నా స్వతంత్రత కిల బుధుల్ నవ్విపోరె

ఈమె ద్విపదరచన యింతకంటె సరళముగా సాగిపోవును. ఈమె రచించిన రాజయోగసారమునుండి ఒక ఉదాహరణము—

కామాంధులై తమ గతి కానలేక
భామలవలలోన బడి లేవలేక
తఱగని యీషణత్రయ వార్ధిలోను

మఱిమఱి మునుగును మమత రెట్టింప
నాలుబిడ్డల కని యుద్ధంబు గూర్చి
కాలంబు నూరకే గడుపుచునుండి
యంతకాలము వచ్చినప్పుడు యముని
చింతజేయుచు హింసచే గంది కుంది
కూపంబులోబడి కొన్నినాళ్ళుండి
పాపాత్ములగుచు ప్రపంచంబునందు
బుట్టుచు గిట్టుచు బొరలుచుండెదరు.

"ద్విపద"రచనలు తెనుగుసాహిత్యమునకే ప్రత్యేకత సాధించిన సాహిత్యప్రక్రియలు. 19వశతాబ్దిలో "ద్విపద"లు కూడ అనేకములు వచ్చినవనుటకు వేంకమాంబ రచించిన పై "రాజయోగ సారమే" నిదర్శనముగా నెన్నవచ్చును. ఇంకను ఆమె రచించిన భాగవతము ద్విపద లభ్యమగుటలేదు.

ద్విపదకావ్యములు :

18వ శతాబ్ది చివరిభాగములో జోగుల ఏకోజీ రామాయణమును, పరమానందతీర్థుని శివజ్ఞానమంజరియును పేర్కొనదగిన ద్విపదకావ్యములు. 19వ శతాబ్ది చివరిభాగమున మామిడన్న సుభద్రమ్మగారి అధ్యాత్మరామాయణ ద్విపదరచనయును, గార్లదిన్నె సుబ్బరాయకవిగారి హరిశ్చంద్రరచనయు, పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారి ద్విపద మేఘదూతయు పేర్కొనదగిన కావ్యములు. ద్విపదరచనయందు భాష, భావము, వస్తువు, దేశీయమై జాతీయత జాలువారుచుండును. అందుచేత ఇది తెనుగువారి "స్వంతయాస్తి"గా పరిణమించినదని నిడుదవోలు వేంకటరావుగారు విజ్ఞానసర్వస్వమునందు వ్రాసిరి.

శతకరచనము :

ద్విపదలవలె తెనుగువారి స్వంతయాస్తియనదగినవి శతకములు. ఇవి నూరుమొదలు నూటయెనిమిదివరకు ఉండి, ఒకేమకు

టముతో కగిలిన ఒకేరకపు వృత్తములతో నడిచిన పద్యములు. ఇవి మొత్తము వేయికి మించియుండునని, ముద్రితములకంటె అముద్రితములే ఎక్కువ మిగిలిపోయెనని యందురు. సంస్కృత ప్రాకృత భాషలలో సప్తశతులు, త్రిశతులు నున్నవి. అట్లే హిందీ, అవధి వ్రజభాషలలో "సత్సాయీ" లనునవి యున్నవి. ఈ శతకములను స్తోత్రములుగాను, నీతిగుచ్ఛములుగాను, భక్తిప్రధానములుగాను, విమర్శప్రధానములుగాను, వ్యాజస్తుతులుగాను, విభజించవచ్చును. ఇట్టి శతకములలో అనేకము 19వ శతాబ్దిలోకూడ వచ్చినవి. కొన్నింటియందు, సమకాలీన పరిస్థితులపైన తీవ్ర విమర్శకూడ నుండును. ఉదాహరణగా నీతిబోధకమై హాస్యరసముతో చెంగలించు "చంద్రశేఖరశతకము"న గుంటూరుజిల్లాలోని మంగళగిరి తిరునాళ్లు చూడవచ్చుపామరజనుల ప్రసంగములు ఉల్లేఖ్యమైనవి.

> సీ : దగడీకబాపల వసిద్ది సరే; పొగనిప్పుకంట పో
> మాదుగులింటి పోయి బతిమాలితి మూడునెగళ్ళ మందుతై
> లేదని తిట్టె పాపపు కలిగ్గము యింత పరాకదాంట్లో యీ
> రాదట యంద్ర సహ్యులు దురాత్ములు మూర్ఖులు చంద్రశేఖరా!

సంగీతగాయకునికూర్చి చెప్పిన పద్యము:

> సంగితకాడ, పాడ కిక సాలిచు నీ వది పాడినందుకున్
> ఇంగితమెర్గి నేను మరియున్నదుకున్ సరిపోయె యింటివా
> అంగుననే తలూపినటియప్పుకు తమ్మర యీడ మెట్టిపో
> బంగుడు బాపనాడ యని పల్కును మూర్ఖుడు చంద్రశేఖరా!

ఆకాలపు ఆచారములపైన తీవ్రవిమర్శ:

బాలబాలికలకు నీతులునేర్పు 'కుమారశతకము' 'కుమారీ శతకము' 19వ శతాబ్దిలోని కవులు రచించినవి. గృహిణికి నీతిగరపు 'మానినీశతకము' ఉత్తమశ్రేణికి చెందినది.

ఈ శతకములలో సమకాలీన సంఘవిమర్శలును, రాజకీయ విషయములును, దేశకాలపరిస్థితులును, వాఙ్మయభాషాపరివర్తనములును నూతన సంస్కృతులును, నానావిధ కళాభ్యుదయమును అద్దమునందువలె ప్రతిబింబించును. కవులు పద్యరచనలో చేయితిరుగుటకు చేసిన ప్రథమరచనలని కొంచెము అలతిగా వీనిని చూచుట కలదు. అంతేకాదు. భాషవిషయములో వ్యాకరణచట్రములను సడలించి కొంతస్వేచ్ఛతో వింతప్రయోగములుచేసిన శతకకవులున్నారు. అట్టివారి రచనల వలన శతకములకు కొంత చిన్నపేరు వచ్చినది. కాని తెనుగుసాహిత్యములో ఈ విశిష్టప్రక్రియ తెనుగువారి జాతీయ జీవనమును నిర్వచించుటకు అమితముగా తోడ్పడినదనుటకు సందేహములేదు. 19వ శతాబ్ద మొక సంధియుగము. రాజకీయముగాను, ఆర్థికముగాను ఎన్నో సంక్షోభములు, సంస్కరణలును వచ్చినవి. అవియన్నియును ఈ శతకములలో కాననగును.

సాహిత్యరూపముగా శతకములు విషయప్రధానములు కావు; ఆత్మభావప్రధానములు ( Subjective ). అందుచేత ఈ పద్యముల మాటున కవిహృదయము స్పందించుచుండును. చారిత్రకవిషయములనేకము తెలియును. సింహాద్రిని ముట్టడించిన తురకలదండు దుండగములను సింహాద్రి నారసింహశతకము వర్ణించెను. అట్లే భద్రాద్రిపై దండెత్తివచ్చిన తురకలనుండి తప్పించుటకు పూజారులు శ్రీరాములవిగ్రహములను పడవలపై పోలవరము చేరవేసిన యుదంతమును చల్లా పేరయ్యకవి భద్రగిరిశతకమున వర్ణించెను. గోరుందొర శ్రీరాముని రక్షించెనని వర్ణించుటచే నివి 18వ శతాబ్ది చివరికాలమున రచించియుండును.

19వ శతాబ్దిలో వచ్చినవారిలో మండపాక పార్వతీశ్వరశాస్త్రి ఎనుబది శతకములవరకు రచించెను. ఈయన బొబ్బిలిప్రాంతములలో జన్మించినను, వేంకటగిరి సంస్థానములోనుండి ఆసంస్థానాధిపతుల వంశానుక్రమమును వర్ణించెను. ఈకాలములోనే సత్యవోలు భగవత్కవి నూఱుశతకములు చేసినట్లు తానే చెప్పుకొనెను.

ధీరత శత శతకములు
దారావళులున్ దశావతారావళులున్
జారూదాహరణములు
శ్రీరాజిత దండకములు చెప్పినవాఁడన్

త్రిపురాన తమ్మయదొర (1849) శ్రీకాకుళమునద్ద సిద్ధాంతములో జన్మించి, నీతిశతకము, పాండురంగాష్టోత్తరశతకము. ముఖలింగేశ్వరశతకము మొదలైనవి రచించెను. ఈకాలములోనే తెలంగాణమున అనేకులు శతకములు రచించినవారున్నారు. పుల్లంరాజు నరసింగరావు బూరుగులనివాసి. (1860) రామకృష్ణారావుగారి మాతామహుఁడు. నృకేసరిశతకము రచించెను.

అడిదము బాలభాస్కరుఁడు (1808-1874) మాడుగులసంస్థానములో నుండి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి సమకాలికుడై చరించెను. ఈయన శ్రీ వేంకటేశ్వరశతకము, జానకీరామశతకము, భోగలింగశతకము, సింహాశైలశతకము రచించెను. తోట విజయ రాఘువకవి 1849లో తన గ్రంథముల ముద్రించెను. వీనిలో పార్థ సారథిశతకము (ఏకప్రాస) నాయకీనాయకశతకము ముఖ్యములు.

కార్వేటినగరములోని పోలిపెద్ది వేంకటరాయకవి- (1800-75) వేణుగోపాలశతకము, లావణ్యశతకము తిట్లదండకము రచించెను. సంస్కృతమున మయూరకవివలె సూర్యశతకమును రచించి, పోయినకన్నులు తెచ్చుకొన్న కవి ఝంఝూమారుతము వేంకట సుబ్బకవి (1850)

స్త్రీలలో మదిన సుభద్రయ్యమ్మ (1781-1840) రఘు నాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘువరామశతకము రచించెను. మచ్చున కొక పద్యము :

మన్నన దప్పియున్నయెడ మక్కువగల్గినవారినేనియున్
దిన్నగ మందలించినను దెల్లముగా మది నొవ్వకుండునే
యన్నకు ధార్తరాష్ట్రునకు నాదరమొప్ప హితోపదేశ మి
మ్లైన్నగజేసి యా విదురు దేమి ఫలంబును జెందె కేశవా !

1800వరకు శతకములు చాలతక్కువయే యనవచ్చును. కారణము అంతవరకు ప్రబంధములమీాద తెలుగువారికిగల మోజు తగ్గకపోవుటయే. 1800నుండి 1900వరకు శతకములపై మక్కువ యెక్కువగుటచేత, ఇవి యసంఖ్యాకముగ వెలువడినవి. కాసుల పురుషోత్తమకవి, గోగులపాటి కూర్మనాథుడు నిందాస్తుతులతో కూడిన మంచి శతకములు రచించిరి. ఇవియన్నియును 18వ శతాబ్ది చివరిభాగమునందున వచ్చినవి. పురుషోత్తమకవి రచించిన ఆంధ్ర నాయకశతకము, హంసలదీవి గోపాలశతకము గొప్ప పేరుగల గ్రంథ ములు– 1800–40ప్రాంతములలో ఈతడు కృష్ణాజిల్లా చల్లపల్లి రాజా అంకినీడువారి ఆస్థానముననుండెనట. శ్రీకాకుళాంధ్రవిష్ణువును సంబోధించి, 'నీకు వచ్చిన పేరు ప్రతిష్టలు ఆడువారిచేత బిడ్డలచేత వచ్చినవికాని, నీవి కావ'ని పలుకు నిందాస్తుతి యీపద్యమున కాన వచ్చును.

> ఆలు నిర్వాహకురాలు భూదేవియై
> యఖిలభారకుడను నాఖ్య దెచ్చె
> ఇష్టసంపన్నురా లిందిర భార్యయై
> కామితార్థదుడన్న ఖ్యాతి దెచ్చె
> కమలగర్భుడు సృష్టికర్త తనూజుడై
> బహుకుటుంబకుడన్న బలిమి తెచ్చె
> కలుషవిధ్వంసియౌ గంగ కుమారియై
> పతితపావనుడన్న ప్రతిభ దెచ్చె
>
> ఆంధ్రు బిడ్డలు తెచ్చు ప్రఖ్యాతిగాని
> మొదలునుండియు నీవు దామోదరుడవె
> చిత్ర చిత్ర స్వభావ దాక్షిణ్యభావ
> హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ॥

గోగులపాటి కూర్మనాథుడు—— కవితాలతాంగిని కైవసము చేసికొనె నందురు. ఈతని నరసింహశతకమున ఆనాటి తురకల మూకలు పెట్టిన బాధలు పేర్కొని సింహాద్రినరసింహుని ఆత్మరక్షణ

చేసికొనుమని హెచ్చరికచేసెను. ఈ శతకము ప్రజాదుఃఖవ్యథిత మైన కవిహృదయాంతరాళమునుండి వచ్చినదగుటచే గొప్ప యురవడియు ధారాశుద్ధియు కలిగియున్నది. *చక్కని యుక్తులు, సామెతలు, ఎత్తిపొడుపుమాటలు కవి ప్రయోగించెను.

యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము
　　విడిచి మందిరములు వెడలువారు
వెడలియు తలదాచ వెరవేమి గానక
　　నడవుల నిడుమలబడెడువారు
బడియు నెచ్చట కూడు బట్టయు గానక తమ
　　శిశువులతో వెతజెందువారు
చెంది డెందముగుంద కాందిశీకత నభి
　　మానార్థులై ఖేదమూనువారు
వైరి యొక్కొక్కభార్యతో నవని ప్రజలు
అష్టమహిషులపై పదియారువేల
సతులతో నీవు వలస కెచ్చటి కరిగెదు
వైరివరరంహ! సింహాద్రి నారసింహ.

ఈతడే సుందరీమణిశతకమనునది మరియొకటి రచించెను. అది విరహార్తుడైన నాయకుడు దూరముననున్న ప్రేయసితో చెప్పుకొను వేదన.

మదనుడు డాసె పూవిలుతు మర్మములంపగనేసె నక్కటా!
హృదయముదూసె, దానిపయి నిందుడు వెన్నెలగాచె కోకిలల్
బెదరక కూసె చిల్క రొదచేసె, అళుల్ వడిమ్రోసె నెట్టులో
ర్చెద, విధి నిన్ను నన్నెడలజేసె దురాత్మత సుందరీమణీ!

పత్రిక లంతగా ప్రచారములేని ఆకాలములో శతకములు ప్రభువులచర్యలను అధికారులచర్యలను విమర్శించు ప్రజాభిప్రాయ వేదికలయినవి. 19వ శతాబ్ది ఉత్తరార్థములో అనేకకవులు శతక

---

*ఖండవల్లి లక్ష్మీరంజనముగారి - ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము 231 పుట

ములు రచించిరి. వారినందరిని పేరుపేరున తెలిపిన యొక గ్రంథమే వ్రాయవలసివచ్చును. భక్తిశతకముగా పేరెన్నికగన్న "భక్తచింతామణి" రచించిన వడ్డాది సుబ్బారాయకవిసూక్తులు ఆంధ్రులందరికిని అభిమానపాత్రమైనవి. ( 1867 - 1938 )

> సేవింతున్ భవదీయ పాదజలరుచ్ఛింతానుపానంబుతో
> దేవా ! మందు ననామయత్వము ప్రసాదింపంగదే మేనికిన్
> బ్రావృణ్మేఘపు బ్రాపుగల్గినను, దానం చేర్చునే వృక్షమున్
> నీవుండన్ హృది నాకు వ్యాధిభయమున్నే ? భక్తచింతామణీ !

తెలుగున భక్తచింతామణివలె హెచ్చుగా ప్రచారము పొందిన పద్యసంపుటులు తక్కువ. ఇదేకాలమునకుచెందిన దాసు శ్రీరాములుగారు "చక్కట్లదండ" యనుపేర అచ్చతెనుగున ఒక శతకము రచించిరి. ఇందు సమకాలిక సంఘరీతులు సరసముగా వెక్కిరించెను.

> అచ్చి రచ్చలకెక్కనని బుచ్చి పెండ్లాడ
> బుచ్చి మిండలవెంట బోవ మఱగు
> కోడూర్ర బురదని మేడూరు పోయిన
> మేడూరిలో జాస్తి మెట్టశిస్తు
> జక్కిదాణా కోడి స్వారెక్కబూనిన
> బోయి బత్తెములకే పోయి గడన
> తోటాకు పసరంచు దోసకాయను దిన్న
> దోసకాయది జబ్బుచేసి విడును
>
> కొంచె మిబ్బందికలదని క్రొత్తబూని
> ప్రాత విడిచిన నది దాని తాతయగును
> అని పలుకు దాసు శ్రీరాము డచ్చతెనుగు
> గబ్బ మందము నిండ జక్కట్ల దండ

19వ శతాబ్దిచివర తమ కవితావిద్యుత్ వల్లికలతో ముత్యాలు రాల్చిన మహనీయులు తిరుపతి వేంకటకవులలో వేంకటశాస్త్రిగారే.

వ్రాసిన ఒక శతకముకూడ పేరెన్నికగన్నది. ఇందు సమకాలికా చారసంప్రదాయములను వారు తీవ్రముగ విమర్శించిరి.

> సకలమ్ముం గొటిగించుకొందురకటా! సన్న్యాసులా? కారు బొ
> ట్టొకయింతేని మొగమ్మునందిడ రదేమో! ముండలా? కారు; వి
> ప్రకులోత్తంసుల కిట్టి పాటు గలిగెన్ బైవారిమాటేల? యెం
> దుకు లోకం బిటు మారె? నీ కెఱుగరాదో దేవి! కామేశ్వరీ!

ఆంధ్ర శతకవాఙ్మయ మొక 'రత్నాకరమువంటిది. ఎన్ని చిరత్నరత్నములు పైకి తీసినను ఇంకను మరికొన్ని రత్నములు అమూల్యములై మారుమూల మణగియేయుండును. ఈ శతకములలో వాడినభాషలో కొంత స్వతంత్రత తీసికొని వాడుకకు చేరికయైన పదములను వాక్యములును ప్రయోగించి వ్యాకరణచక్రములను అతిక్రమించినను ఇందు స్వచ్ఛమైన జాతీయతతో కూడిన తెనుగుభాష తీయముగా చిలుకుచుండును. తేటలూరుచుండును. ఆంధ్ర లాక్షణికులు ప్రబంధముల కిచ్చిన గౌరవము శతకముల కీయ లేదు. ఆకాలములోనే వెలసిన అప్పావు మొదలి ( 1800 - 1870 ) కోటగిరివాస్తవ్యుడైన ద్రావిడకవి మాతృశతకమును రచించెను. ఇది 1861లో ముద్రితమైనది. 'తల్లి నిబోల రెవ్వరున్' అను మకుటముతో మాతృప్రేమ నుద్బోధించు నీతులతో కూడియున్నది. 19వ శతాబ్ది చివరిభాగములో కొంఠి భద్రాద్రిరామశాస్త్రి (1860) చిత్రసీమయనుకావ్యమును రచించెను; 1840లో ఫక్కి వేంకట నరసయ్య రచించిన కుమారీశతకము మంచి ప్రచారములో నున్నది. బహుజనపల్లి సీతారామచార్యులవారు 1847 లో సుందర రాజశతకమును, వెనకయ్యశతకమును రచించిరి.

ఫక్కి అప్పలనరసు 1885లో కుమారశతకమును రచించెను. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి 1860లో సింహాద్రిరామశతకము, పాపయమంత్రి, కృష్ణభూపతి, లలామాది శతకములు రచించెను.

రఘురఘూమారుతము వేంకటసుబ్బకవి మయూరకవి సూర్యశతక మును అనుసరించి 1850లోనే సూర్యనారాయణశతకమును రచించెను. మచ్చ వేంకటకవి ( 1856 - 1920 ) రామాయణమునంతను ఒక శతకముగా చెప్పెను. ఈతడే ఛాయాపుత్రశతకమును కూడ శనీశ్వరునిపై చెప్పెను. ఈతడు శ్రీకాకుళంజిల్లా జలుమమూరు గ్రామములో జన్మించి, కొంతకాలము పర్లాకిమిడిరాజావారి కళాశాలలో పండితుడుగా పనిచేసెను. శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య కుశచరిత్రయను ప్రబంధమును, రుక్మిణీనాటకము, ద్రౌపదీవస్త్రాపహరణము, మయూరధ్వజోపాఖ్యానము, అంబరీషోపాఖ్యానము అను యక్షగానములను, కొన్నికీర్తనలను రచించెనట.

తరిగొండ వేంకమాంబ కృష్ణపదాంకితముగా నొక ద్విపద శతకమునుకూడ రచించెను. ఇందు 137 ద్విపదలు కలవు. స్త్రీలలో వేమనశతకమువంటి విమర్శనాత్మకమైన భావములతోకూడిన శతకము రచించినది దార్ల సుందరమ్మ (1830). ఈమె భావలింగశతకమను పేరున 113ఆటవెలదులతోకూర్చినశతకముచేసెను. గుంటూరుమండలమునందలి చెర్లగుడిపాడు ఈమె జన్మించినచోటు. పద్మసాలివంశములో పుట్టి రామచంద్రపురము నివాసియైన దార్ల శేషయ్యను వివాహమాడెను. గంజి శ్రీరాములు ఈమెతండ్రి. ముప్పదియేండ్లయిన నిండని వయస్సులో ఈమె పద్యరచనకు గడంగి నిశితవిమర్శలతో ఆనాటి సంఘదురాచారములను, మతముపేర మోసముచేయు సన్యాసులను దుయ్యబట్టినది. ఒక అజ్ఞాతకవయిత్రియనుపేరున (1958 ఆంధ్రప్రభసవంబరు.) ఈమెగూర్చి ఒక విపులవ్యాసమునందీ శతకమునుగూర్చి విపులముగా చర్చించియున్నాము. ఈ భావలింగ శతకము 1829లో పూర్తిచేసినట్లు ఈమె చెప్పుకొన్నది. వేమన పద్యములపోలిన ఈ పద్యములు – రసగుళికలవలె తోచును.

పుండుగల్గు కోతిపురుగు పాఱిన చేను
బురద చిక్కువడ్డ కరివిధాన
మాటనెంచునట్టి మనుజుండు దక్కడు
పాపభయవిభంగ - భావలింగ

గొప్పకులముగాదు గొప్పద్రవ్యముకాదు
గొప్పవిద్యకాదు కోటియేల
మాటనిల్పెనేని మాదిగైనను గొప్ప
పాపభయవిభంగ భావలింగ

శతకములెన్నో వచ్చిన 19వ శతాబ్ది ఈ వాఙ్మయవిభాగమునకు ఒక పరిపుష్టిని, ఒక పరిపక్వతను ఆపాదించినది. ఎన్నిశతకములు వచ్చినను చివరికి కలకాలము తెనుగులపెదవులపై చిందులు చేయుచు మిగులునవి కొన్నిమాత్రమే.

పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా
విశ్వదాభిరామ వినురవేమ.

## శతకముల పట్టిక

| | | |
|---|---|---|
| కాసుల పురుషోత్తమకవి | 1800 | ఆంధ్రనాయక, హంసలదీవి, గోపాల, మానసబోధ, భక్త కల్పద్రుమ |
| గోగులపాటి కూర్మనాథము | 1750 - 1800 | సింహాద్రినారసింహ |
| వంకాయలపాటి వేంకటకవి | 1810 | మదనగోపాల |
| జూలూరి అప్పయ్య | 1810 | యదువంశభూషణ |
| కానుకొలను నాయనప్ప | 1816 | చింతగుంటపాలెపురామశతకం |
| అమలాపురపు సన్యాసికవి | 1830 | పంచముఖేశ, ముఖలింగ; |
| మాదిన సుభద్రయమ్మ | !830 | రఘునాయక, కేశవ, కృష్ణ, రాఘవ రామశతకములు |
| దార్ల సుందరమ్మ | 18·0 | భావలింగ |
| తరిగొండ వెంకమాంబ | 1840 | కృష్ణశతకము |

| | | |
|---|---|---|
| మత్తూరి అప్పావుమొదలి | 1840 | మాతృశతకము |
| ఫక్కి వేంకటనరసయ్య | 1840 | కుమారిశతకము |
| తోట విజయరాఘవకవి | 1840 | పార్థసారథి |
| బహుజనపల్లి సీతారామాచార్యులు | 1847 | సుందరరాజు, వెనకయ్య |
| ఝుంఝూమారుతము వేంకటసుబ్బకవి | 1850 | సూర్యనారాయణ |
| అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 1860 | సింహాద్రిరామ, పాపయమంత్రి కృష్ణభూపతి, లలామాదిశతకాలు |
| మండపాక పార్వతీశ్వరశాస్త్రి | 1861 | గోపాలకృష్ణ, సీతారామశతకములు |
| దాసు శ్రీరాములు | 1870 | చక్కట్లదండ |
| వడ్డాది సుబ్బారాయుడు | 1890 | భక్తచింతామణి |
| చళ్లపిళ్ల వేంకటశాస్త్రి | 1899 | కామేశ్వరి |

# యక్షగానము

శతకములవలె ప్రజాజీవితమును ప్రతిబింబింపజేసి, ప్రజలకత్యంత గౌరవపాత్రమైన మరియొక దినుసు యక్షగానము. ఇది చదువు తెలిసినవారినేగాక, చదువను వ్రాయను తెలియని సామాన్యజనులను సైతము మెప్పించినది. 19వ శతాబ్దిలో మహోత్కృష్టపదవినందుకొన్న రచనలలో యక్షగానము ప్రత్యేకప్రశంసలను పొందదగియున్నది. ఈ రచనము, దక్షిణాంధ్రమునను ఉత్తరాంధ్రమునను తూర్పున విజయనగరమునుండి, అటు తంజావూరువరకు అన్నిచోటులను విలసిల్లినది. ఆ సంప్రదాయము నేటికిని అవిచ్ఛిన్నముగా వర్థిల్లుచున్నది. ఉత్తరాంధ్రమున కూచిపూడి ఈ నృత్యనాటకములకు ఉత్పత్తిస్థానము కాగా, దక్షిణమున తంజావూరువద్దనున్న మేలట్టూరు దీనికి జీవస్థానమైనది. దక్షిణాంధ్రమున తంజావూరునేలిన మహారాష్ట్రనాయకులలో శహాజీమహారాజు అనేక యక్షగానములను రచించి వానిని ప్రదర్శింపజేసెను. ఏభాషలోను లేని సంగీతనృత్యనాటకములు (operas) తెలుగుభాషలోనే 16వ శతాబ్దమున

కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయముతో ప్రారంభమాయెనందురు. తెలుగుభాషనుండి, 18, 19శతాబ్దములలోనే తమిళ, మరాటీ భాషలలోనికి ఇది ప్రవేశించినది. చెంచునాటకమువంటివి చూచి, తమిళదేశములో "కురవంజి"వంటి నాటకములు బయలుదేరినవి. యక్షగానములవంటివి సరిగా అదేతీరున కన్నడములో నేటికిని వీథిలో ఆరుబయట రంగస్థలములో ప్రదర్శితమగుచున్నవి. వీనినే రాయలసీమలోను, కన్నడదేశమునందును * "బయలాట" లందురు. ఈ నాటకములన్నిటియందును పాటలు, దరువులు, పాత్రలు ప్రవేశపెట్టువిధానము, సంభాషణలు మొదలయినవన్నియును ఒకేతీరుగా నుండును. తెలుగునాటకములలో లయకు అనుగుణమైన వివిధగతులు మార్చుటకు అనువుగా రగడలు, జంపెలు, త్రిపుటలు, యేలలు మొదలయినవి పాడుట జరుగుచున్నది. ఇందు వచ్చు పాటలన్నియును జాతులు, ఉపజాతులు అని చెప్పు దేశిఛందములను, గేయపణితులను, మాత్రాఛందస్సులను విపులముగా అనుకరించినవే. మధ్యమధ్య తోహరాలు, కందార్థములు ఇట్టివాని మూలముగా కథను సూత్రధారుడు చెప్పుట, పాత్రలను ప్రవేశపెట్టుట జరుగుచున్నది. పాత్ర రంగస్థలముపై ప్రవేశించునపుడు, తనకుతానే ఎఱుకపఱచుకొనును. "భామనే సత్యభామనే," అట్టి పాటలకు ఒక ఉదాహరణము.

యక్షగానములన్నియును నాటకములుగా మనుష్యులు వేషధారణచేసి ప్రదర్శించుటకు ఉద్దేశింపబడినను, చర్మములతో విగ్రహములు చేసి, తోలుబొమ్మలుగాను, కొయ్యలతో బొమ్మలుచేసి కీలుబొమ్మలుగాను ప్రదర్శించుట ఆంధ్రదేశములో సంప్రదాయముగా వచ్చుచున్నది. ఇన్ని రకముల ప్రదర్శనలకు వీలగునట్లు గీత నృత్య వాద్యసమ్మేళనముతో మధ్యమధ్య నటకులు పలుకు హాస్యసంభాషణములతో మనోహరముగా ఒకరాత్రి పర్యంతము వీనుల విందుచేయుట ఈ యక్షగానములలో రివాజు. హరికథగా ఒక్క-

* చూడు — పరిశోధన పత్రికలో ప్రత్యేకవ్యాసము.

నటుడు గీత నృత్య వాద్యములతో కాలక్షేపముచేయుట ఈ శతాబ్ది లోనే వచ్చినది.

ఇవి కురవంజులనియును, యక్షగానములనియును, వీథిభాగవతములనియును, వీథినాటకములనియును వేరు వేరు రీతులుగా ప్రదర్శించుచున్నారు. 'కురవంజి'లో కొండవాళ్లను, ఆటవికులను ప్రవేశపెట్టి వారిభాషతో, సంభాషణలు చెప్పి, చమత్కారముచేయించుట, చెంచెత, సింగి సింగడు మొదలయినవారిచేత 'చిందు' నృత్యములు చేయించుట పరిపాటి. యక్షగానములో నృత్యభాగము కొంచెము తగ్గించి, పండితకవులు రసించులాగున నాటకనిర్మాణము జరిగినది. వీథిభాగవతములు కూచిపూడిలోని భామాకలాపము, గొల్లకలాపము అను నృత్యప్రబంధములతో పేరులోనికివచ్చినవి. ఇందలి యితివృత్తము భాగవతమునుండి తీసికొన్న కృష్ణగాథ యగుటచేత భాగవతములని వీనికి పేరు. ఈ నాటకములను ప్రదర్శించువారు భాగవతులు. వీరు బ్రాహ్మణులలో నున్నారు; గొల్లలలో నున్నారు, యానాదులలో నున్నారు, దాసరులలో నున్నారు. కూచిపూడి అగ్రహారములోనున్న బ్రాహ్మణులు సిద్ధేంద్రయోగికాలము నుండి వంశపారంపర్యముగా దీనివిషయమున ప్రత్యేక కృషిచేయుట చేత, కూచిపూడి భాగవతులపేరు మిన్నంటినది.

ఇట్లే మేలట్టూరుగ్రామములో భాగవతమేళమును కట్టువారు హెచ్చుమంది యుండుటచేత, వారికి మేలట్టూరు భాగవతులు అని పేరు వచ్చినది. వీరుగాక వీథినాటకములువేయువారు వీథిభాగవతులు. ఇంకను కొందరు పామరజాతి యానాదులు మున్నగువారు వీథినాటకములు బయలాటలు ప్రదర్శించుచున్నారు. వీనియన్నింటి యందును విధానము ఒక్కటియే; నృత్య గీత భావాదులచే నాటకమునొప్పించుట. నటీసూత్రధారుల ప్రస్తావనతో అన్నినాటకములును ప్రారంభమగును. రంగపూజ, మేళప్రాప్తి అన్నింటికిని ఒక్కే పద్ధతి. ప్రధానపాత్రలు ప్రవేశించునపుడు, బిరుదములు పలుకు శబ్దములు కాంభోజిరాగములో పాడుట అన్నింటికిని సమానము. ఇట్టి

విశిష్టలక్షణములుగల యక్షగానములు 19వశతాబ్దిలో ఏ తీరులు త్రొక్కి యెట్టి యభివృద్ధిసాధించినవో ప్రాయికముగా నిందు పరామర్శచేసికొందము. యక్షగానమునుగూర్చి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగా రొక విపులమైన పీఠికనువ్రాసి సుగ్రీవవిజయములో ప్రకటించిరి. దీనినిగూర్చి విజ్ఞానసర్వస్వములో వ్రాయుచు డా. యస్వీ జోగారావుగారు 'ఆంధ్రతాముద్రను భద్రపఱచిన దేశిసాహిత్యప్రక్రియలకెల్ల తలమానికము' అని పేర్కొని 19వశతాబ్దిలోనే ఇది యెక్కువగా పరిణతినొందినదని అన్నారు.

తంజావూరునాయకులలో కట్టకడపటివాడైన శహాజీ (1833-1855) రచించిన అన్నపూర్ణాపరిణయమను యక్షగానము ఒక పరిణతసిద్ధినందుకొన్నది. శహాజీ మహారాజు రెండవ శరభోజి కుమారుడు. ఈతడు రచించిన అన్నపూర్ణావిజయమున ఇతివృత్తము కోంకణేశ్వరదేవుడు అన్నపూర్ణమ్మను వివాహమాడినకథ. రెండవ శరభోజీమహారాజుకూడ కొన్ని యక్షగానములు రచించెను.

దక్షిణాదిని ఎక్కువ ప్రశస్తినందిన యక్షగానములు మేలట్టూరు వేంకటరామశాస్త్రి రచించిన భాగవతమేళములు. ఇందలి కథలన్నియును పురాణములనుండి గైకొన్నవే. అందుచేతనే మేలట్టూరులో వార్షికముగా నరసింహజయంతి జరుగునపుడు స్వామి కళ్యాణమునకు ప్రదర్శించుట నాటినుండి నేటివరకు అనుస్యూతముగావచ్చుచున్న యాచారము. మేలట్టూరు వేంకటరామశాస్త్రి పల్లవి గోపాలయ్య వంశమునకు చెందిన తెలుగువాడు. దక్షిణదేశమధ్యమున నివసించినను తెనుగులోనే తన రచనలుచేసెను. ఈయనకు సంగీతసాహిత్యములయందు మంచి ప్రవేశముండెను. ఈయన (1807 - 60) మేలట్టూరులోనే యుండి, మొత్తము 12యక్షగానములను రచించెను. ఇవియన్నియును అముద్రితములే. ఇటీవల విజయవాడ ఆకాశవాణివారు కొన్నిటిని సేకరించి రేడియోలో ప్రసారముచేసినారు. మద్రాసు అడయారు కళాక్షేత్రంవారు ఉషాపరిణయమును ప్రాచీన సంప్రదాయపద్ధతిని ప్రదర్శించినారు. వీనిలో

ప్రహ్లాదచరిత్ర, మార్కండేయచరిత్ర, ఉషాపరిణయము, హరిశ్చంద్రనాటకము, రుక్మిణీకళ్యాణము, శివరాత్రినాటకము, సత్సంగరాజనాటకము, అసత్సంగరాజనాటకము, సీతాకళ్యాణము, జగన్మోహనవిలాసనాటకము అనునవి నేటికిని మేలట్టూరులో ప్రదర్శించుదురు. సంగీతసాహిత్యములలో కూచిపూడి యక్షగానములస్థాయిని యందుకోలేవు.

దక్షిణదేశములోనే చెంగల్పట్టుజిల్లాకు చెందిన చెయ్యూరి చెంగల్వరాయశాస్త్రి (1810 - 1900) సుందరేశ్వరవిలాసమను చక్కని యక్షగానమును రచించెను. ఇందలి ధరువులు చక్కని సాహిత్యముతో నృత్యసంగీతమునకు ఒదుగునట్లుండును. మీనాక్షీదేవి బయలువెడలినవిధము.

దరువు : దిగంతములు జయింప మీనాక్షీదేవి వెడలె జూడరె చెలులార
ధగద్ధగితకేతనము వెలుంగను జగంబులకును సుఖంబు లొసంగను
శూల చక్ర వరశు ఛురిక ముఖాభీల నిశితకరవాలము లమరగ
స్త్రీలు కొంద రుభయభాగంబుల మేలమాడ పరమేశ్వరి శంకరి

సుందరేశ్వరునకు మధురమీనాక్షికిని మధ్య శృంగారగాథ ఈ యక్షగానమునకు కథావస్తువు. చంద్రోపాలంభముచేయు చందమామపదము :

ఇందీవరాక్షుల నెందుకు యేచేవు చందమామా - అల్ల
కందర్పునకు జోడు చెందినవాడవె చందమామా
ఉర్విని పాంథుల ఉసురుపోసుకొనేవు చందమామా
పర్వదినంబుల పాము మ్రింగును నిన్ను చందమామా

వీనియన్నింటికంటె, కర్ణాటక సంగీతచక్రవర్తి త్యాగరాజు రచించిన యక్షగానములు తలమానికములు. త్యాగరాజు వాగ్గేయకారుడే కాక మహాభక్తుడు. అందుచేతనే ఆతడు రచించిన రెండు యక్షగానములందునను భక్తికే ప్రాధాన్యమిచ్చెను. ప్రహ్లాదభక్తవిజయమనుపేరులోనే కథను సూచించెను. ఈ నాటకమున

హిరణ్యకశ్యపుడు రాడు. భవబంధములతో సాగరమునపడిన ప్రహ్లాదుని సాగరుడు భవబంధమోచనముచేసి తిరిగి వప్పగించును. ఇందు జ్ఞాన, వైరాగ్య, విజ్ఞాన, సద్భక్తిభావము లుండునని త్యాగరాజస్వామి వచించెను.

నాటకారంభమునందున్న ప్రస్తావనలో దావారికునితో సూత్రధారి సంభాషించును. ఆ సంభాషణలో చైత్రోత్సవమునకు సమావేశమైన సభాసదులు త్యాగరాజకృతమయి ఇహపరసాధకమైన ప్రహ్లాదభక్తవిజయమును ప్రదర్శింపుమన్నట్లు వెల్లడిచేయును. హిరణ్యకశ్యపుడు నాగపాశముచేత బంధించి ప్రహ్లాదుని సాగరమున త్రోయగా ఆతడు సముద్రుని తరణోపాయ ముపదేశింపుమని ప్రార్థించును.

దనుజబాధలనెల్ల దలచను భోగ
ధన సంపదలకు చేయిచాచను నా
మనసున హరిని నే మానను నా
కనులార నాథుని గన దెల్పుము నాతో॥

ఆత్మార్పణమే షోడశోపచారములుగాచేసి, భగవంతుని కీర్తింపుమని సాగరు డుపదేశించును. ప్రహ్లాదు డట్లే చేసి ముక్తిమార్గము పొందును. ఇది యైదంకములనాటకము. ఇందు వచ్చు పాత్రలు ప్రహ్లాదుడు, నారదుడు, సాగరుడు, శ్రీమన్నారాయణుడు, లక్ష్మి. ఈ పాత్రలన్నింటిలోనూ ముఖ్యపాత్ర ప్రహ్లాదుడే. ఇందు కథాసంవిధానమునకంటె, భావరసోన్మీలనమునకే ప్రాధాన్యమిచ్చి సంగీత సాహిత్యముల సమ్మేళనముతో రససిద్ధి కలిగించు రూపకము. దృశ్యముగాకంటె శ్రవ్యముగానే ఆనందింపదగినది.

త్యాగరాజు రచించిన మరొకనాటకము దృశ్యప్రధానమయినది. నౌకాచరిత్రము నృత్యగీతములతో అందముగా ప్రదర్శింపతగిన ఉత్తమశ్రేణి రూపకము. భక్తితోకూడిన శృంగారము యిందలి రసము. గోపికలు బాలకృష్ణునితో యమునానదికి నౌకావిహారమునకు పోయి, అచ్చట పొందిన గర్వభంగము ఇందలి యితివృత్తము.

యమునానదినే కాదు, ఈ సంసారసాగరమునే తరింపచేయగల నౌకావిజయసారథి శ్రీకృష్ణుడని త్యాగరాజు చెప్పిన దివ్యసందేశము. భాగవతములోని గోపికావస్త్రాపహరణకథను చమత్కారముగా మార్చి, త్యాగరాజు నౌకాచరిత్రమును రచించెను. గోపికలు గర్వముచే శ్రీకృష్ణుని కూడ తీసికొనిపోక, యమునావిహారమునకు పోవుదురు. కొంతసేపటిలో భీకరమైన గాలివాన వచ్చి ఓడ అలలతాకిడికి చిల్లుపడును. అపాయము – స్త్రీలు శ్రీకృష్ణుని వేడుకొందురు. వారిచీరెల దీసి ఆ రంధ్రము పూడ్చుడని శ్రీకృష్ణుని ఉపదేశము. అయినను నీరు లోపలికి వచ్చుచునేయుండును. కట్టుపుట్టములన్నియును తీసిపెట్టుమనును. "అన్యథా శరణమ్ నాస్తి త్వమేవ శరణం మమ" యని గోపికాస్త్రీలు ఆతని వేడుకొందురు. స్త్రీలు మానసిక గర్వమనెడు ఆచ్ఛాదనములవీడి ఆ పరమేశ్వర సాన్నిధ్యమునందు సిగ్గువిడిచి ఆతని కరుణాకటాక్షమునకు పాత్రులగుదురు. ఇందు "ఓడను జరిపే ముచ్చటకనరే" "అల్లకల్లోలమాయెనమ్మా" వంటి పాటలు అతి మనోహరముగా నుండును. ఇదిగాక త్యాగరాజు రచించిన మరొక నాటకము సీతారామవిజయము. ఇందలి యితివృత్తము ఉత్తరరామాయణములోనికథ. "మా జానకి చెట్టబట్టగా మహారాజువైతివి" అను కాంభోజీరాగకీర్తన శ్రీరామునిగూర్చి ఒక చెలి పాడిన పాటయే.

వీనియన్నింటిలోను సంగీత సాహిత్యము లున్నతస్థాయికి చెందిన ఉత్తమనాటకము "నౌకాచరిత్రమే". నృత్యప్రదర్శనలకు ఇది యోగ్యమైనట్లు మఱి యేనాటకమును కాదని చెప్పవచ్చును. దక్షిణాంధ్రమున త్యాగరాజాదు లిట్టి యున్నతశ్రేణికిచెందిన ఉత్తమ సంగీతనాటకములను రచించుచుండగా ఉత్తరాంధ్రమునకూడ కోకొల్లలుగా యక్షగానములు వచ్చినవి. ముద్రణసౌకర్యము లభించిన క్రొత్తలో అవి అచ్చులోకూడ దర్శనమిచ్చినవి. ఇవియన్నియును 1800 – 1900 మధ్య వచ్చినవే.

వీనిలో ఉత్తమోత్తమమైనది లేపాక్షి రామాయణము. లేపాక్షి శ్రీహరి కంకితముగా చెప్పిన ఈ యక్షగానము లేపాక్షి రామాయణమని పేరుగన్నది. సమగ్రరామాయణకథను మూడు రాత్రులలో నాటకముగా ప్రదర్శించుటకు అనువుగా దీనిని రచించెను. ఇందు దరువులు, పాటలు, పద్యములు, వచనములు నుండును. కథాసంవిధానమునకును సంభాషణలకును ప్రాధాన్యమిచ్చి కవి నాటకీయతను చక్కగా పాటించెను. ఇట్టివి యింకను చాల యక్షగానములు రామాయణము నితివృత్తముగా చేసికొన్నవి యున్నవి. వానిలో ప్రసిద్ధమైనవి శేషాచలకవి (1780 - 1840) రచించిన ధర్మపురిరామాయణము, ముద్దయకవి రచించిన (1834 - 90) మంథెనరామాయణము. ఈ కవులిరువురును తెలంగాణమువారు. అయినను ధర్మపురిరామాయణకీర్తి విశాఖమండలము వరకు వ్యాపించినది. 19వ శతాబ్ది ఉత్తరార్థమునుండి ప్రదర్శనోద్దిష్టములైన చక్కని రచనలు సాగినవి. గోవర్ధనం నరసింహాచార్యులు శేషభట్టరు కృష్ణమాచార్యులు, వట్టెము పాపకవి మున్నగు పండితకవులుకూడ యక్షగానరచన గావించిరి. ఆ కాలములో రాజాశ్రయము, పోషణ లభించుటచేత పలువు రీ నాటకములను రచించిరి. ఆత్మకూరు సంస్థానమున ముక్కర సీతారామరాజు పోషణచేత రామదాసను కవి తారాశశాంకము, భీమసేనవిలాసము అను యక్షగానములు రచించెను. ఆకాలముననే గోవర్ధనంవారి గొల్లకలాపము, గూఢానుపేట రత్నమ్మ రచించిన ఒక కురవంజి వెలసినవట. ఆ సంప్రదాయము వీడక నేటికిని వీథినాటకముల రచనము, ప్రదర్శనము విస్తృతముగా సాగుచునేయున్నది. నూతన సంగీత సాహిత్యములను సంతరించుచునేయున్నారు. తెలంగాణకవులలో రచించిన యక్షగానములలో వేంకటకవి విరచితమైన విరాటపర్వము ప్రసిద్ధికెక్కినది. దీనినే ధేనువకొండ విరాటపర్వమందురు. దక్షిణ గోగ్రహణమువరకు మాత్రమున్న ఈ కథ ఆంధ్రభారతము ననుసరించినది. మరియొక ప్రసిద్ధనాటకము వట్టెము పాపకవి విరచితమైన

'హరిశ్చంద్ర'. ఈకవి 19వశతాబ్ది ప్రారంభమున నున్నట్లు, ఈతడు 'టపా'లు బటువాడాచేయుట నాటకములో వ్యవహరించినదానినిబట్టి గ్రహించవచ్చును. దరువులు, పాటలు, పద్యములతో పాటు వచనములను అంత్యానుప్రాసలతో సమకూర్చెను. "ఇంతీ, నలరాజదాంతీ" ఇట్టి అంత్యానుప్రాసలు యక్షగానములందు అన్నింటను వచ్చును.

పద్యవాఙ్మయపూర్వరంగమున, ప్రాచీనసంప్రదాయములలో ప్రసిద్ధిగన్న సాహిత్యప్రక్రియలన్నియును 19వశతాబ్దియందు ఎట్లు రూపొంది, పరిణతిపొందినదియును ఈ సింహావలోకనమున గమనించినాముకాని, ఏ విభాగమున కా విభాగము వేరువేరుగా మనము పరిశీలించదలచినచో అది దేనికదియే విపులగ్రంథము కావచ్చును.

యక్షగానములంత పెద్దవికాకపోయినను 19వ శతాబ్ది ప్రచారములోనికి తీసుకునివచ్చిన మరొక సాహిత్యసాధన "దండకము". కాళిదాసునుండి పోతనవరకు అనేకకవులు దండకములు రచించినను ఇవి 19వ శతాబ్దిలోనే ప్రచారములోనికి వచ్చినవి. దేవతలను స్తుతించు శ్రీరామదండకము, ఆంజనేయదండకము, శ్యామలాదండకమువంటివే కాక, పోలేరమ్మమీద, పొగాకుమీద దండకములు వచ్చినవి. పొగాకు క్రొత్తగా వాడుకలోనికివచ్చుటచేత అది కవితా వస్తువైనది. భాషీయదండకము రచించిన గండ్లూరి నరసింహశాస్త్రి 1800తరువాత కర్నూలుమండలనివాసి, తనదండకములో నాటి యాచారములను వర్ణించెను. దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడుకదా! నందినిగూర్చి – ఇత డిట్లు చెప్పెను.

తొల్త పెండ్లిండ్లకున్ తర్లిపొయ్యేటివారందరున్
ముందుగా మిమ్ము ప్రార్థించుచున్నారు మి మ్మెందు
సేవించి కార్యార్థులై పోయినా వారి కా పొద్దు
వైకుంఠ యాత్రాసమంబైన సౌఖ్యంబు సిద్ధించు.

దండకములవంటి స్తోత్రములతో కూడిన చూర్ణికలును, విన్నపములును, వచనములును 19వ శతాబ్ది సాహిత్యమున కానవగును.

ఇవి ప్రత్యేకపద్యములను, ఛందస్సులను పోలకున్నను ఒకవిధమైన మాత్రాఛందస్సననుసరించి పాడుకొనుటకు వీలుగానుండును. ఇవి యన్నియును ఇష్టదేవతను సంబోధించుటతో ప్రారంభమై, భక్తుని హృదయావేశమును భావరసబంధురముగా విశదీకరించును. ఇట్టివిధానములోవచ్చిన మరొక కావ్యపద్ధతి ఉదాహరణము. ఇది సంస్కృత పద్ధతినిబట్టి వచ్చిన సంప్రదాయము. తెనుగులో త్రిపురాంతకోదాహరణము రచించిన రావిపాటి త్రిపురాంతకమహాకవి దీనికి త్రోవచూపించెను. భక్తిరసప్రధానమైన ఈరచనములను శైవవాఙ్మయకర్తలు ప్రచారములోనికిదెచ్చిరి. ముఖలింగేశ్వరోదాహరణము అనుపేరున మచ్చ వేంకటకవి 1896లో రచించెను. పుదుక్కోటరాజగు విజయ రఘునాథుని కంకితముగా ఆంధ్రభాషార్ణవకర్త నుదుపాటి వేంకనార్యుని మనుమడు సాంబశివకవి యొక యుదాహరణము రచియించినాడు. అది చాటుపద్యరత్నాకరమున ముద్రితమైనది. ఈ కావ్యమున విభక్తులకు ఉదాహరణముగా సప్త విభక్తిరూపములతో ఈ కావ్యరచన సాగును. ఈ గ్రంథములు భాషాతత్త్వవివేచనమునకు తోడ్పడును. వీనియందు పద్యకవితకంటె పదకవితకు ప్రాధాన్యమిచ్చినట్లుకనబడును. జాత్యుపజాతులతోకూడిన రగడలు చక్కని గతులతో ఇంపులొప్పచుండును. ప్రాచీనకాలమునవచ్చిన ఈయుదాహరణకావ్యములను పదకవితలగుటచేత క్షుద్రకావ్యములలో చేర్చిరి కాని, ఇవి కావ్యగౌరవమును పొందగల్గిన చిన్నకావ్యము లనవచ్చును. *"పరిణామమున చిన్నవియయ్యును ప్రతిభాసంపత్తిని మిన్నలై శబ్దార్థప్రతిపత్తిని గలిగియున్నవి." సిద్ధరామకవి రచించిన మల్లికార్జునదేవస్తవోదాహరణము 1800లో వచ్చినది. ఈతడు ఆరాధ్యశైవుడు; కృష్ణామండలములోని గుడివాడవద్ద ఎలకుర్రు అగ్రహారములో సగముభాగము బడసిన మహనీయులు. వీరు కాశీనాథుని నాగేశ్వరరావుగారి వంశీయులు. ఇది సంస్కృతములో వెలువడిన ఉదాహరణము. కళికలతోను ఉత్కళికలతోను ఒప్పారుచు సప్త

*నిడుదవోలు వేంకటరావుగారు- త్రిపురాంతకోదాహరణము పీఠిక, 1937

విభక్తులను చూపును. ఈ ఉదాహరణమునకు నాయకుడు కాశీ
నాథుని వీరనారాధ్యుడు. ఇతడు రెండు తెనుగుకావ్యములు రచిం
చెను. ఒకటి భద్రాయుశ్చరిత్ర, భద్రాయువను శివభక్తునిచరిత్ర.
రెండవది ధర్మగుప్తుడను శివభక్తునిగూర్చిన ప్రబంధము.

మొత్తముమీద ఉదాహరణకావ్యములు పద్యకావ్యముల
కును పదకవితలకును సామరస్యమేర్పరచిన సాహిత్యవిశేషము లన
దగును. 19వశతాబ్దిలో ప్రబంధములతోను బహుళార్థకావ్యములతో
ప్రారంభమైన వాఙ్మయస్రవంతి రానురాను పలుచనై అను
వాదగ్రంథములతోను, శాస్త్రగ్రంథములతోడను పరిపుష్టమై, శతక
ములతో శతధా విస్తరిల్లి, యక్షగానములతో అందరికిని అందు
బాటులోనికివచ్చి, దండకములు చూర్ణికలు మొదలయిన పదకవి
తలతోడను, రగడలు, కళికలు, ఉత్కళికలు, ద్విపదలు మొదలైన
దేశిరీతులలో సర్వజనసమాదరణమును చూఱగొని సాంఘికప్రయో
జనము సాధించెను. సాహిత్యక్షేత్రమును సస్యశ్యామలము చేసెను.

ఈ గ్రంథసముచ్చయమును, వీనిలోని ఇతివృత్తములను
పరిశీలించిన ఒకటిరెండు విషయములు మనకు దృగ్గోచరమగు
చున్నవి. ఇందువచ్చిన యితివృత్తములన్నియును మన భారతీయ
జీవనాంతర్గతములో జీర్ణించిపోయిన రామాయణ, భారత, భాగవత
ములను మించి క్రొత్త కథావస్తువులకు పోలేదనుట ముందు కనిపిం
చును. అదేవిషయము అనేకులభావనలో, రసవ్యంజనలో పలుపోక
డలుపోయి భిన్నత్వములోనిఏకత్వమును, ఏకత్వములోని భిన్నత్వ
మును నిరూపించినవి. అసంఖ్యాకముగా వెలసిన ప్రబంధములలో,
కావ్యములలో, అనువాదములలో, శతకములలో, యక్షగానములలో
తెనుగుభాషాసరస్వతి ఒక నవీనత, ఒక 'నాజూకు'తనము, ఒక
తేటతనము అలంకరించుకొన్నది. సమాసభూయిష్ఠమైన సంస్కృత
శబ్దాలంకారములను విడచివైచి క్రమక్రమముగా తన సహజసౌంద
ర్యమును నిరాడంబరవాక్యములోని నిస్తుల రసభావనతోకూడిన
తేలికదుస్తులతో ప్రత్యక్షమైనది. ఇన్ని సాహిత్యపదార్థముల రసా

స్వాదనతో తెనుగుసరస్వతి క్షీణించెనో, పరిపుష్టమైనదో ఆ పరిపుష్టి తెలుగుసారస్వతమునకు బలుపో వాపో నిష్పాక్షిక విమర్శచేయ గల్గిన సహృదయులే నిర్ణయించవలసియున్నది. అంధయుగముగా అభివర్ణితమైన ఈ శతాబ్దిపూర్వార్ధమందు చీకటికోణములు కావు కదా, వేఙోకలోని నేగుచుక్కలకాంతితో విలువగల రత్నద్యుతులే గోచరింపగలవని తలంచవచ్చును. కాని అందులకు కావలసినది యే విద్వేషమును లేని నిరపేక్షతోకూడిన నిస్స్వార్థదృష్టి. శ్రద్ధతో శ్రమతో రసానంద మందగోరువారికి 19వశతాబ్ది సాహిత్యము ఆశాభంగము కలిగింపదు.

## ప్రబంధములోని అవలక్షణములు

అల్లసాని పెద్దనామాత్యుడు మనుచరిత్రరచనలో ప్రబంధ కవితాపితామహుడై ఒరవడిపెట్టి చూపించిన మార్గములో పలువురు కవులు ప్రబంధ కావ్యరచనము చేసినారు. అది నూటయేబది సంవత్సరములవరకు అవిరళముగా సాగినది. 1650 సంవత్సరములోపల బహుమార్గముల నూతనప్రబంధములు తెనుగున వచ్చినవి. అవియే కడకు 19వశతాబ్దిలో శ్రుతిమించిన ధోరణిలో పడినవి.

> కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములాద్య సత్కథల్
> వావిరి బుట్టు రత్నము లవారిత సత్కవి కల్పనావిశే
> షావహ పూర్వవృత్తములు సానలదీరిన జాతిరత్నముల్
> గావున నట్టి విచిత్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్॥

అని రామరాజభూషణుడు వసుచరిత్రలో పేర్కొన్నప్రకారము పలువురు 'పిల్లవసుచరిత్ర'లనే రచించిరి. వీనియందు అష్టాదశవర్ణనలకును ప్రాధాన్యమిచ్చుటచే కథకు కావ్యరసానుభూతికి ప్రాముఖ్యము తగ్గుచువచ్చినది. దక్షిణాంధ్రయుగమని చెప్పదగు నాయకరాజుల కాలములో చేమకూర వేంకటకవి, సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు, శేషము వేంకటపతి, కంకంటి పాపరాజు మున్నగు వారున్నను-వారితోనే ప్రబంధములలోని రసవత్కాలమునకు సరి

యనవచ్చును. 18వ శతాబ్ది చివరిభాగమునను 19వశతాబ్ది ఆరంభమునను ప్రబంధరచన చాల హెచ్చుగా జరిగినది. కాని వీనిలో గణాధిక్యముతప్ప గుణాధికత కన్పించదు.

ప్రబంధములలో కథ ముఖ్యముకాదు. అష్టాదశవర్ణనలను ఇష్టమువచ్చినచోట ప్రవేశపెట్టుటకు కల్పించిన నెపము. ఈ ప్రబంధములలోని కథలన్నియును ఒకేమూసలోపోసిన యచ్చులవలె ఒకే స్వరూపము దాల్చినవి. వీనిలోని కథాసంవిధానము ఒకేపద్ధతి. దీనిని గూర్చి కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారమున చేసిన వర్ణనము వినుడు:

"ఒకపట్టణమున ఒకరాజు. వీరి కేమి గ్రహచారము పట్టినదని తెలియకముందే ప్రథమాశ్వాసము సంపూర్ణము. చెవియో కన్నో జ్ఞానేంద్రియముగ రాజుగారు కన్యామణియొకటున్నదని గ్రహించియుండుట, మతి కొంచెము గోలుపోవుట, తన స్నేహితునితో విరహవిషయమైన ప్రసంగముచేయుచు గన్యామణిశరీరమేమాత్రము విడువక విమర్శించుట! వేటకుపోవుట ఇత్యాదులు. ద్వితీయాశ్వాసము ముగిసెను. కన్యామణిమాత్ర మూరకుండునా యేమి? ఆ యమ్మ తబ్బిబ్బు ఇంతయని చెప్పగాదు. శ్లేషలుపెట్టిన నేమి తృప్తి! శ్లేషలువెట్టిన కొంత ఫర్వాలేదు. తనవలెనే చంద్రముఖులైన చెలికత్తెలం జేర్చుకొని నాయకుని సౌందర్యవిషయములు యొకరెండుగంట లుపన్యాసమిచ్చువేళకు మూడవయాశ్వాసము ముగింపునకురాకేమి చేయును? కన్యామణియొక్క తాఁకకు నుపశమనముచేయుటకై చెలు లామె నుద్యానవనమునకు బిలిచికొనిపోవుట, సరోవరసందర్శనము. ఆప్రొద్దుమాత్ర మందరును స్నానము చేయుట, చన్నీళ్ళుపడువేళకు గగుర్పాటు, వణకు మొదలైన శృంగారావస్థలు తిక్కెక్కినట్లు ప్రబలుటయు, యజమానురాలిని చివురుటాకులశయ్యపై బరుండజేసి, వస్త్రములు సడల్చి, శైత్యోపచారములుచేయుటయు, నవియు నిష్ఫలంబగుటయు, చంద్రోదయవర్ణనము, ఏమో వినోదముచూతమని వచ్చిన చంద్రుని నా శుకపిక

వాణులందరు గలసి యేకకంఠముగ దిట్టుటయు, మలయమారుత మన్మథదూషణము మొదలగు నోరూరజేయు సంగతులు గలిగి,

సర్వజనంబులు చదువ న
ఖర్వంబగు కౌతుకంబు గాంచెడు తెలుగుల్
పర్వంగజేసి నాల్గవ
పర్వం బది యస్తమించు భామిను లలరన్

ఇంతైన వెనుక బెండ్లి కాకపోవునా ? సూర్యోదయవర్ణనము (కారణము మృగ్యము) ఇంక నెవియైన మఱచిపోయియుండిన నిదే సమయమని ఈ యన్ని వర్ణనములును, పరిణయము, దంపతులు పురప్రవేశముచేయుట, ఆ పురములోని స్త్రీలందరు దొట్టిపాటుతో వీరిని జూడవచ్చి బదులిచ్చుటకోయనం దమ యంగసందర్శనము అందరకును జేసి ఋణవిముక్తులగుట. శయ్యాగృహప్రవేశము. చెలికత్తియలు క్రొత్తగా సిగ్గుదాల్చిన కన్యామణికి నింపైన నీతులు చెప్పుట, ప్రథమసంయోగముయొక్క సాంగోపాంగవర్ణనము. శ్రుతిఫలము సంతానప్రాప్తి! ఇత్యాది నానాచిత్రముల బ్రదర్శించి యైదవ ఆశ్వాసము సమాప్తిజెందును. ఈ విషయమునే ఆఱాశ్వాసముల గ్రంథముగా వ్రాసినను బాధలేదు.

పాత్రములన్నియు నొక్కతీరుందాల్చిన బొమ్మలు-అలంకార శాస్త్రప్రకారము చెక్కబడినవి. ఆ యా కావ్యములలోని పాత్రములు ఒండొంటిననుకరించునట్టి ప్రతిబింబములు. పేరు ఊరు మాత్రము మార్చియుందురు. ఇంక నీమాత్రము జేయక వ్రాయగడంగనగునో! స్వభావము, చరిత్రము, నడవడి, తీరు మొదలగు లక్షణములన్నియు నెరవలిసొత్తులు". ఇందు కొంత అతిశయోక్తితో కూడిన కాకుస్వరమున్నను 18, 19వశతాబ్దులలోవచ్చిన ప్రబంధములన్నింటికిని యీ విమర్శ సరిపోవును. శృంగారరసప్రధానమైన ఈ కావ్యములలో కథాచమత్కారము సున్న. పాత్రచిత్రణము మృగ్యము. రసవత్ వర్ణనములు అరుదు. రూఢియైన కవి సమయము

లతో అతిశయోక్తులతో కూడిన అభూతవర్ణనలతో అన్ని కావ్యము
లును ఒకేపోతలోని నిర్జీవప్రతిమలవలె నుండును.

దీనికితోడు శబ్దార్థభావములతో కూడిన అలంకారములు. ఇవి
యున్నియును మట్టిబొమ్మలకు మణిభూషణములు పెట్టి, అలంకరించు
నట్లు జీవకళలేక నిస్తేజముగా నుండును. ఇవిచాలక నిరోష్ఠ్య, నిర్వ
చన, అచ్చాంధ్రరచనలు, అనేకార్థరచనలు, బంధకవిత్వములు,
చిత్రకవిత్వము, గర్భకవిత్వములు చేసి, భాషాసరస్వతిని చక్రబంధ
ములతో బంధించిన కవులుకూడ నున్నారు. ఇట్టి బాహ్యాడంబ
రములన్నియును రసహృదయములేని కవిమాత్రోపజీవులు చేసిన
గారడీవిద్యలు. వీనిలో రసానుభూతి కల్గదు సరికదా, జుగుప్స ఉద్భ
వించును. 18వ శతాబ్దిచివర, 19వ శతాబ్ది యారంభమునందును
వచ్చిన గ్రంథములన్నియును ఈ కోవకు చెందినవగుటచే ఈకాల
మును క్షీణయుగమని చరిత్రకారులు చెప్పియున్నారు. ప్రబంధముల
కిది తప్పక క్షీణయుగమే. కాని, స్థాలీపులాకముగా సమీక్షచేసిన
ఈ గ్రంథములను, గ్రంథకర్తలను గమనించిన కొన్ని సమానలక్ష
ణములు కనిపించును. అన్నియును ఒకమూసలో పోసిన ప్రతిమలవలె
పైకి దోచినను, వీనిలో ఒకవైవిధ్యము, ఒకప్రత్యేకత, ఒకచమ
త్కారమును గోచరించుచునేయున్నవి. ప్రబంధములతో నాగక
పలువురు ఇతరభాషలనుండి యనువాదములుచేసిరి. శాస్త్రగ్రంథము
లనేకములు ప్రకటించిరి. వేదాంతగ్రంథములును, తత్వశాస్త్ర
ములును, నిగూఢరహస్యములునుకూడ పద్యకావ్యములలో భావ
యుక్తముగా రసవంతముగా వెల్లడించిరి. నిరోష్ఠ్య నిర్వచన,
అచ్చాంధ్రరచనలతోపాటు, గర్భ చిత్ర బంధకవిత్వాది చిత్ర
విచిత్ర పద్ధతులును శ్లేషకవిత్వమును వచ్చినవి. వీనిమూలముగా
భాషలోని శబ్దముల అనేకార్థప్రయోగములు తెలిసినవి. అనేకార్థ
కావ్యరచనముతోపాటు, అనేక కావ్యరచనమును సాగినది. ఆంధ్ర
దేశములోని అన్నిప్రాంతముల కవులును రచనలుచేసినారు. ఉదా
హరణకు చెన్నపట్టణములో నివసించిన త్యాగరాజు మొదలియును

ద్రావిడపండితుడు (1830 - 1880) సుబ్రహ్మణ్యవిజయమను ప్రబంధమును, విద్వత్కర్ణామృతము, ఛందోరత్నాకరమను ఛందస్సునుకూడ రచించెను. ఈవిధముగా తమిళులు, కన్నడిగులు, మహారాష్ట్రులు, ఓఢ్రులు, తెనుగువారుకూడ కావ్యరచనములుచేసి ఆంధ్రసరస్వతికి అలంకారముల నర్పించిరి. పురుషులతోపాటు స్త్రీలుకూడ చక్కనికావ్యముల నా యుగములో రచించిరి.

## ప్రబంధముల కాలపట్టిక

| | | |
|---|---|---|
| మంగళగిరి ఆనందకవి | 1760 - 1820 | వేదాంతరసాయనము |
| కనుపర్తి అబ్బయామాత్యుడు | 1770 - 1840 | అనిరుద్ధచరిత్ర<br>కవిరాజమనోరంజనము |
| దిట్టకవి నారాయణకవి | 1780 - 1820 | రంగరాయచరిత్ర |
| ముద్దుపళని | 1790 - 1830 | రాధికాసాంత్వనము |
| తరిగొండ వేంకమాంబ | 1840 - 1980 | ద్విపదభాగవతము, వేంకటాచల మాహాత్మ్యము, రాజయోగసారము |
| పిండిప్రోలు లక్ష్మణకవి | 1840 - 1900 | లంకావిజయము |
| శిష్టు కృష్ణమూర్తి | 1840 - 1906 | సర్వకామదాపరిణయము |
| మాడభూషి వేంకటాచార్యులు | 1840 - 1910 | భరతాభ్యుదయము |
| గోపీనాథుని వేంకటకవి | 1861 - 1980 | వాల్మీకిరామాయణము, శిశుపాలవధ, భగవద్గీత |
| మండపాక పార్వతీశ్వరశాస్త్రి | 1870 - 1918 | అనేకశతకములు, మావికలు |
| త్యాగరాజమొదలి | 1830 - 1880 | సుబ్రహ్మణ్యవిజయము, విద్వత్కర్ణామృతము, ఛందోరత్నాకరము |
| చెళ్ళపిళ్ళ నరసకవి | 1850 - 1900 | యామినీపూర్ణతిలకవిలాసము |
| కోలా శేషాచలకవి | 1840 - 1900 | నీలగిరియాత్ర |
| అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి | 1831 - 92 | శేషధర్మములు, మణిధ్వజచరిత్రము, చాటుధారాచమత్కారసారము |

# 7. పద్యవాఙ్మయము — ఉత్తరరంగము

19వ శతాబ్ది మధ్యభాగముతో ఉత్తరరంగము ప్రారంభమైన దనుకొన్నచో ఆకాలములో వచ్చిన తిరుపతి వేంకటకవులు, కందుకూరివీరేశలింగంపంతులు,గిడుగు రామమూర్తి, గురజాడఅప్పారావు గారలు ఈనాటి నవోదయమునకు వైతాళికు లనవచ్చును. ఈ సంధి యుగములో ప్రాచీన పురాణేతిహాసములధోరణిలో వ్రాసినవారును ప్రబంధధోరణిలో కావ్యరచనములు చేసినవారును లేకపోలేదు. నవోదయకర్తలనునపుడు ఈ వైతాళికులు పాడిన నూతనగీతులును, మేలుకొలుపులవంటి క్రొత్తకవితలను పేర్కొందుమే కాని, ప్రాత సరణినున్న రచనలమాట తలంపము. ఆధునికయుగమునుగూర్చి వ్రాయుచు పింగళి లక్ష్మీకాంతముగా రామాటనే చెప్పిరి.

"పురాణేతిహాసములను ఇటీవల తెనిగించిన మహాకవులు మఱికొందరు కలరు. వారిలో దాసు శ్రీరాములుపంతులుగారు, తిరుపతి వేంకటేశ్వరులు, త్రిపురానన తమ్మయదొర, శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రిగారు, వావిలకొలనుసుబ్బారావుగారు, జనమంచి శేషాద్రిశర్మగారు ముఖ్యులు. ఈ పురాణములతోపాటు ప్రాచీన ధోరణిని మఱికొన్ని ప్రబంధములు వ్రాసినవారును కలరు. వారిలో చాలమంది, క్షీణయుగప్రబంధములకు పుత్రికలనో, పుత్రికాపుత్రిక లనో అవతరింపచేసినవారే. స్వతంత్రసృష్టిచేసినవారు తక్కువ. పూర్వపక్కిని ప్రబంధములువ్రాసియు వానికి నూతనత్వము నాపా దించిన కవులు తిరుపతి వేంకటేశ్వరులు. వీరిదయవలన ప్రబంధ భారతికి నిగళబంధములు తొలగి స్వేచ్ఛాసంచారము లభించినది.

అందుచేతనే ఈ మహాకవుల వాక్కు ప్రాచీనసరణికి భరతవాక్యము. నవీనసరణికి నాందీవాక్యము."

తిరుపతి వేంకటేశ్వరకవులు ఆధునికయుగమునకు కర్తలను వారు కొందరు కలరు. కాదనువారును కొందరు కలరు.

*తిరుపతి వేంకటకవులు యుగకర్తలనుటకు కారణము వారు కవితాసరస్వతిని రాజసభలనుండి సామాన్య ప్రజాగృహాంగణములకు తెచ్చుట. వారు శతాధికగ్రంథముల రచనచేయుటయేగాక, వారు నిర్వర్తించిన శతావధానాష్టావధానములు, ఆశుకవితాప్రదర్శనములు ప్రజలలో కవితయెడల అభిరుచి పెంచుటకు కారణమైనవి. ఆనాడు వీరుచేసిన అవధానపద్యములు తెనుగువారినోట నెచ్చట విన్నను వినవచ్చుచుండెడివి. ఆంధ్రకవితాసరస్వతిని తమ వాగ్దేవిగా చేసికొని నానారాజసందర్శనముచేయించి, ఏనుగునెక్కి మహీశులు మ్రొక్కఁగ నిక్కి దిగ్విజయయాత్రచేసికొనివచ్చినారు ఆనాటి చిన్నచిన్న సంస్థానములలో వారు ప్రవేశించి సన్మానముపొందని తావులేదు. వీరు మొదలుపెట్టిన ఆశుకవిత్వపద్ధతి అప్పటికే, చరిగొండ ధర్మన్న, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మాడభూషి వేంకటాచార్యులు, కుంటిమద్ది తిరుమలరామాచార్యులు వంటివారలుకొంత ప్రచారములోనికి తెచ్చిరి. కాని ఈ యవధానవిధానము వీరితో గాని పరాకాష్ఠనందుకొనలేదు. ఆశుకవిత్వప్రదర్శనములేకాక, దేవీభాగవతము, బుద్ధచరిత్రము వీరుచేసిన అనువాదప్రబంధములు. శ్రవణానందము శతక పద్ధతినడచిన ఖండకావ్యము. వారకాంత వీటికిబోవు నొక విలాసపురుషుని మందలించు ఆత్మప్రబోధ మీకావ్యమున కితివృత్తము. ఇది (Subjcetive poetry) ఆత్మాశ్రయకవిత్వమున కావిధముగా ఆరంభముచేసినదనవచ్చును. "మనమా! వద్దికనాదుమాట వినుమా, మర్యాద కాపాడుమా" అను మకుటముతో రచించిన ఈ పద్యములు మనోరంజకమైన రసగుళికలవలెనుండును. "గీరతము" భారతమునకు హేళనకావ్యము.

*దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు 1871-1991 చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 1870-1950

భారతపర్వములవలె మేకుబిగింపుపర్వము, చప్పట్లపర్వము ఇట్టివి వీనిలో ఉన్నవి. దీనినిగూర్చి కవులు చెప్పినమాటలు:

'గీర్షు యేతు రతా స్తేవై గీరతాః పరికీ ర్తితాః తానుద్దిశ్యకృతం కావ్యం గీరతం పరిరక్షతే.' ఇది యొక 'పేరడీ'.

నానారాజ సందర్శనము, పాణిగృహీత, శ్రవణానందము స్వంతరచనలు. పూాలిక భావములతో మనోహరముగా నడచిన రసవ ద్రచనలు. తరువాతవచ్చిన కవు లనేకు లీ జంటకవులకు ప్రత్యక్షము గనో పరోక్షముగనో శిష్యులని చెప్పుట పరిపాటియైనది. "చెళ్ళపిళ్ళ వెంకన గురువంచు జెప్పుకొనగా నది గొప్ప తెలుంగునాడునన్" అని సూక్తియే వచ్చినది. సంస్కృతాంధ్రములలో మంచి ప్రజ్ఞగడించిన ఈ కవులు రెండుభాషలయందును కవితాధార కలనారు. అదే వారు గర్వముగా మీసములమాట వచ్చినపుడు, "దోసమటం చెరింగియును దుందుడుకొప్పక పెంచినార మీా, మీసము రెండుబాసలకు మేము కవీంద్రులమంచు" అని చెప్పు కొన్నారు. వీరిని ఆదరించిన ప్రభువు పోలవరం జమీాందారు వేంకటకృష్ణారావు. ఆయన ప్రోత్సాహముతోడనే ఎడ్విన్ ఆర్నాల్డు రచించిన లైట్ ఆఫ్ ఏషియాను బుద్ధచరిత్రయను పేరుతో రసవత్తర మైనకావ్యముగా వీరు రచించినారు. ఆంధ్రదేశములోని అన్నిసంస్థా నములను దర్శించి అవధానములు, ఆశుకవిత్వము చెప్పి తమ కవితా లతాంగిచేత నానారాజసందర్శనము చేయించినారు. వీరు అవధా నముచేయుచుండగా అదొక అపూర్వఅనుభవము, ఒక ఆనందవిహా రము. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని వర్ణించుచు అన్నమాట లలో దానిపద్ధతి యెట్లుండెడిదో గ్రహించవచ్చును.

"తిరుపతి వేంకటకవులు ఎక్కడేని యవధానముచేసిరనగా నా చుట్టుపట్టులవారనేకులు ప్రతిభాసౌధమునవడి మెట్టులెక్కిరన్న మాటే. ఆ సమయములందు వేంకటశాస్త్రిగారు విశ్వమూర్తులు. సభ్యులు వెంటాడుభక్తులు"— జాతకచర్య, కామేశ్వరీశతకములలో స్వీయచరిత్రను స్వానుభవభాష్యాలతో వీరు చెప్పి పద్యముచేత

యిష్టమువచ్చినట్లు పలికించినారు. పద్యమును "కృతక" భాషనుండి తప్పించి, సాధ్యమైనంతవరకు శ్రవణసుఖముగా వినిపించినారు. ఈ ప్రయత్నములో భాషాసంప్రదాయములను, వ్యాకరణనియమ శాసనములను ఉల్లంఘించలేదు. అక్కడక్కడ ఆశుకవిత్వములో కొన్ని వ్యాకరణసాధ్యములు కాని ప్రయోజనములుచేసినను వానికి ఎవరిదో ఒకప్రయోగమును చూపినారు. వీరి ప్రతిభావిస్తరణకు "తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నది" యనిపించినది. వేంకట శాస్త్రిగారు గొప్పవక్త. "శాస్త్రిగారుప్రసంగముచేస్తూఉంటేజనం విర గబడతారు. సరస్వతీదేవి మాట్లాడుతూఉన్నట్లువుంటుంది"—జరుక్ "పద్యకవిత్వములో ఆధునికులలో ప్రబంధకవులపోకడలూ ఆధునిక కవులఫక్కీని అనుసరించిన తిరుపతి వేంకటకవులు ఈ యుగపురుషు లనదగు"నని మోటుపల్లి రామానుజరావున్నాయుడుగా రన్నారు.

వీరిరచనలలో భాష సరళమై ప్రాచీనశబ్దాలంకారనిర్జీవపత్ర ములనుండి తొలగి, నునులేతతీగెజొంపముల తేటమాటలతో కొనలుసాగినది. అందుచేతనే వీరికవిత్వము జనప్రియత నందు కొన్నది. వీరు 19వ శతాబ్ది చివరిపాదములో రాజాస్థానములు సంద ర్శించి, దిగ్విజయయాత్రగావించిశతావధానప్రదర్శనములుమొదలయి నవిచేసి, ప్రజాభిమానమును చూఱగొన్నారు. అప్పటికి శతావధాన ములు లేకపోలేదు; ఆశుకవిత్వమును లేకపోలేదు. వీరు చేపట్టుటతో దానికి వింతగౌరవమును, విశేషప్రచారమును కలిగినవి. రాజాస్థాన ములలో సంస్కృతపండితు లుండువారు. పట్టణములలో ఆంగ్ల విద్యాధికులలో తెనుగుప్రసక్తి యుండునదికాదు. "పల్లెలలో మాత్రము—" ముదికరణాలు రాముగుడిమోసల రచ్చలుదీర్చి భారతాల్ చదువుచు లోకవార్తల ప్రశంసల "తెలుంగుబాస మంచిది" యనుచుండువారట. అట్టిదుష్కాలమున ఆంధ్రులకు మరల స్వస్థాన వేషభాషాభిమానము కల్పించిన మహనీయులలో తిరుపతి వేంకటకవులు ప్రధానముగా పేర్కొనదగుదురు"*

*కాటూరి వేంకటేశ్వరరావుగారు - ఆంధ్రవిజ్ఞానసర్వస్వము - 823పుట

కవితాలతాంగికిన్, ధనము ప్రధానమా
రసికతాధికతాసుఖతల్ ప్రధానమా?

యని ప్రశ్నించి, తా మొక బాట నేర్పరచుకొని అట్లే నడచుకొనుటకు దీక్షపూనిరి.

కవుల మున్పటిరూల్సుకు కట్టువడము
ఘనులు పండితరాయాది కవులు చూపు
త్రోవలంబట్టిపోదుము, దేవునైన లక్ష్యపెట్టము

అని ధైర్యముగా చెప్పి, నాటి పండితకవులపై సవాలుచేసి సాహిత్యవిజయయాత్ర చేసివచ్చిరి. "మారుమూల పదములు గుప్పిన ముచ్చటగునె, ప్రతిపదమ్మున రస ముట్టుపడినగాక" అను తీరున తేటమాటలతోనే తమ పద్యరచన గావించిరి. "కాలముబట్టి దేశమును గాంచి, ప్రభుత్వము నెంచి" దేశభాష మారునని గుర్తించి అట్టి వ్యావహారిక ప్రయోగములనుచేసి, వానికి సొంపునింపిరి. తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నదికావున, లక్షణముకంటె లక్ష్యమే ఉపాధేయమన్న మతమును పాటించిన స్వతంత్రకవులు వీరు.

తిరుపతి వేంకటకవులు శతావధానులు, కింకపేంద్ర ఘంటా పంచాననులు, కళాప్రపూర్ణులు అందుకే సగర్వముగా తాము సాధించిన కవితావిజయములను తామే చాటుకొన్నారు.

ఏనుగునెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము స
న్మానములందినాము బహుమానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధులంచు బేరుగొనినారము నీవలనన్ సరస్వతీ!

అంతేగాక వారి విశేషగుణమ్ములను వారే చాటుకొనినారు!

శతఘంట కవనమ్ము సల్పు సంగతియన్న
కరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబనమన్న
"నంబికొండయ దండనంబు" మాకు

ఆశుధారాకవిత్వాడంబరంబన్న
"నల్లేరుపై బండినడక" మాకు
సత్కావ్యనిర్మాణ చాకచక్యంబన్న
"షడ్రసోపేత భోజనము" మాకు
వ్యర్థవాదములొనర్చునట్టివారి
దంబ మణగించు టాపోశనంబు మాకు
దాన రాధేయకవిసముదాయ గేయ
పండిత విధేయ రామభూపాలరాయ.

ఇట్టి వెన్ని చాటువులయినను చెప్పి, ప్రేక్షకులను వీరు తన్మయుల జేసిరి. వీరికి వేంకట రామకృష్ణకవులతోనూ, కొప్పరపు కవులతోనూ వాగ్వివాదములు, సాహిత్యకలహములు జరిగినను, అవి యన్నియును 19వ శతాబ్ది అనంతరము జరిగిన ముచ్చటలేయగుట చేత, అవి మన సమీక్షకు అప్రస్తుతములు. తిరుపతి వేంకటకవులకు ముందే నూజవీడుసంస్థానములో మాడభూషి వేంకటాచార్యులు గారును, అనంతపురములో కుంటిమద్ది తిరుమలరామాచార్యులు గారును అవధానములుచేయుటలో అత్యంత ఖ్యాతినార్జించిరట.

19వ శతాబ్ది ఉత్తరార్ధములో తిరుపతి వేంకటకవులు తెనుగు కవితావీథులలో ఎన్నడును లేని సంచలనమును కలిగించిరని చెప్పిన చాలును. వారు అర్వాచీనయుగమునకును ఆధునిక యుగమునకును వంతెనవంటివారని కొందరు చెప్పుమాట కొంతవరకు సముచితమని పించును. నిజమునకు ఈ సంధియుగము 1850 తరువాత చిన్నయ సూరితో ప్రారంభమైనదేమో. (1806 - 1820) చిన్నయ్యసూరి సంధియుగకర్తగా ప్రవర్తింపవలసిన అవకాశము మద్రాసురాజ ధానిలో మొదటికళాశాలలో ఆంధ్రపండితునిగా పనిచేయుటతో కలిగినది. అది పూర్తిగా వినియోగించుకొనుటకు ఆత డనేక గ్రంథ ములను రచించవలసివచ్చినది. నిజముగా అతడుచేసిన గొప్పసేవ వ్యాకరణరచనలోను, నిఘంటునిర్మాణములోను, నీతిచంద్రికవంటి గద్యరచనలలోను కనిపించినది. ఈతడు వచనరచనలోనేగాక, పద్య

రచనలోకూడ కొంత ప్రతిభ చూపెను. పచ్చపన్నుపయశోమండ
నమునుండి ఒక పద్యము.

> గగనంబట్లు రసప్రపూర్ణ విలత్కందంబులన్మీరి య
> భ్రగసాలంబుగతిన్ సితచ్ఛదములన్ భాసిల్లి మేరుక్రియన్
> జగదామోద సువర్ణ భాస్వరముగా జానొంది పచ్చావనీ
> శరుణంబుల్ గణుతించు కోశ మిది యిచ్చున్మెచ్చు గావించెడిన్

ఇంతకంటెను నీతిచంద్రికకు పీఠికగా రచించిన ఈ కవిపద్య
ములు సరళమైనశైలిలోనుండి తెలుగుపాఠకులందరికిని సుపరిచిత
మైయున్నవి. పంచతంత్రములోని ఒకశ్లోకమునకు ఈతనిఅనువాదము

> జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు
> ధనము విద్య గూర్చ దలపవలయు
> ధర్మమాచరింపదగును మృత్యువు చేత
> పట్టి యీడ్వబడినవాడు వోలె

మరొక పద్యము :

> విద్య యొసగును వినయంబు, వినయమునను
> బడయు పాత్రత, పాత్రతవలన ధనము
> ధనమువలనను ధర్మంబు, దానివలన
> ఐహికాముష్మికసుఖంబు లందు నరుడు

ఇదికూడ ఒక సంస్కృతశ్లోకమునకు అనువాదమే. పద్య
వాఙ్మయమునందుకంటె చిన్నయసూరికి గద్యవాఙ్మయమునందే
యెక్కువ ప్రఖ్యాతికలదు. అది గద్యవాఙ్మయసమీక్షచేయునపుడు
తిరిగి ప్రస్తావించుకొందుము. ఈ కాలములోని ఉత్తరార్ధములో జరి
గిన సాహిత్యకృషిలోని ముఖ్యలక్షణము అనువాదము, అనుకరణ
యును. ఇవి రెండును సంస్కృతాంగ్లకావ్యములననుసరించి జరిగి
నవి. ఈ కార్యమునందు ప్రత్యేకప్రజ్ఞచూపిన కొందరి ప్రముఖ కవి
పండితుల సాహిత్యసేవను పరిశీలించుదము.

ఈ కాలములో సంస్కృతమునుండి అనువాదములుచేసిన కవులుఅసంఖ్యాకముగాగలరు. వారిలో ప్రప్రథముగా చెప్పవలసినది మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులువారికృషి. వీరు తర్కవ్యాకరణమీమాంసాది శాస్త్రములలో నందెవేసినచేయి. 1872లోనే కాళిదాసురచించిన శాంకుంతలనాటకమును తెనిగించి, సకలవిద్యాభివర్ధనీపత్రికలో రెండుఅంకములు ప్రకటించిరి. వీరుచేసిన గొప్పకార్యము ఉపనిషత్తులను తెనుగుపద్యములలో అనువాదము చేయుట. ఉదాహరణగా "పూర్ణ మదః పూర్ణమిదం" అను శ్లోకమునకు వీరి అనువాదము,

> పూర్ణ మది, పూర్ణ మిదియుం
> బూర్ణంబగుదానివలన పూర్ణము పొడమున్
> బూర్ణమగు దానిదేయగు
> పూర్ణముగొని మిగులుచుండు బూర్ణమె యెందున్

ఇవిగాక కుంభకర్ణవిజయము, ఆంగ్లాధిరాజ్యస్వాగతము అను చిన్నకావ్యములుకూడ రచించినారు. కమలినీకలహంసము అను పేరున రాజచూడామణి దీక్షితునికృతి కాంధ్రపరివర్తనమునుకూడ వీరుచేసిరి. ఆంగ్లములో "ఎన్సైక్లోపీడియా బ్రిటానికా" గ్రంథమువలె శబ్దార్థసర్వస్వమును వీరు స్వయముగా ఎవరిసాహాయ్యమును అపేక్షచేయక రచించినారు. 200పుటలుగల రెండుసంపుటములు 'అ' కార 'ఆ' కారములకు విడివిడిగా ప్రకటించినారు. రంగాచార్యులుగారి అసమానపాండిత్యమును చూచి, అప్పటిప్రభుత్వము వారు 1887లో విక్టోరియాజూబిలీలో మహామహోపాధ్యాయ బిరుదమిచ్చి సంత్కరించినారు. ఆంధ్రదేశములో ఈ బిరుదునందినవారిలో రంగాచార్యులవారు ప్రథములు. ఆయన గొప్పరచయితే గాక, గొప్ప వక్తకూడ. వారివక్తృత్వధోరణివలన ఎందరో యువకులు క్రైస్తవమతము తీసికొనబూనినవారు హిందూమతప్రాశస్త్యమును గుర్తించి, తమ నిశ్చితాభిప్రాయమును మార్చుకొన్నారు. అట్టివారిలో రాజమహేంద్రవరములోనున్న ముత్తుస్వామిశాస్త్రి మతము

మార్చుకొని "అంతవరకు క్రైస్తవమతావలంబినయిన నేను హైందవ మతావలంబి నయితి"ననియు, చెప్పినట్లు వీరేశలింగంపంతులు గారు తెలిపియున్నారు. 1822 – 1900వరకు నిండుజీవితము జీవించిన పరవస్తు రంగాచార్యులుగారు ఆ యుగ ప్రతినిధి.

19వ శతాబ్ది ఉత్తరార్థమున తమ ప్రతిభ వికసింపజేసిన మరొక బహుముఖప్రజ్ఞాశాలి దాసు శ్రీరాములుగారు (1846 – 1908). ఈయన తన పండ్రెండవయేటనే అష్టావధానమును చేసి బహుమతులనందెనట. ఇరువదేండ్ల వయస్సు వచ్చునప్పటికి తర్క, వ్యాకరణ, సంగీత, సాహిత్య, వేదాంతశాస్త్రములలో పాండిత్యము సంపాదించి డోకిపఱ్ఱుగ్రామములో ఒక విద్యాశాలను స్థాపించెను. ఆంగ్లభాషకూడ నభ్యసించి, 1878లో సెకండుగ్రేడు ప్లీడరుగా బందరులో ప్రాక్టీసు మొదలుపెట్టెను. 1884నాటికి ఫస్టుగ్రేడు ప్లీడరై ఏలూరులో పదియేండ్లు న్యాయవాదవృత్తిలోనుండి చాల విత్తము నార్జించెను. ఈయన స్వయముగా కవి; సంగీతరసికుడు. కవులను పండితులను స్వయముగా సన్మానించెను. ఈయన అనేకమైన అనువాదములుచేసెను. వానిలో "దేవీభాగవతము" ప్రశస్తమైనది. "చక్కట్లదండ" శతకముగురించి యిదివరకే చెప్పుకొన్నాము. స్వతంత్రరచనలలో చెప్పదగినది "తెలుగునాడు" ఇందు ఆనాటి సంఘములోని స్థితిగతులు చక్కగా వర్ణితమైనవి.

లేవరు "లెండులెం" డనిన లేచినవారయినం దటాలునం
బోవరు పోవుచు న్నిలిచిపోదుము పోదుము త్రోయకుండటం
చీవరు సందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్య సం
భావనవేళ జూడవలె బాపనసాముల సాములన్నియు॥

నమ్మిన నమ్మకున్న నది నా వశమా? జనులాడికొన్న వా
క్యమ్ములు నేను జెప్పెద భయంపడియో పడకో, నియోగి లో
క మ్మనివార్యకార్యఘటకమ్మవుగాని పరోపకార శూ
న్యమ్మును స్వప్రయోజన పరాయణముం దలపోయ నిద్ధర॥

ఈ కవి కవిత జనరంజకమును లోకానుభవవ్యంజకమునై యున్నదని చెళ్ళపిళ్ళకవిగారు నుడివిరి. చమత్కారమునకు వ్రాసిన మరొక పద్యము :

అస్సే చూస్సి వషే వొషే చెవుడషే అష్లాగషే యేమిషే
విస్సావఝ్ఝలవారి బుఝ్ఝినష ఆ విస్సాయ కిస్సారుషే
విస్సం డెంతటివాడె? యేఖ్ఖు పదిషే—

సంభాషణారూపకమైన ఈ పద్యరచన శ్రీరాములుగారికే చెల్లినది. వీరి సంగీతరచనలు సాహిత్యరచనలకంటె ఎక్కువ ప్రఖ్యాతి ఆర్జించిపెట్టినవి. వానినిగూర్చి మరొకచోట ముచ్చటించు కొందము.

దేవీభాగవతమును పద్యానువాదముచేసిన మరొక కవి త్రిపురాన తమ్మయదొర వీరి సమకాలికుడే (1849 - 1890). ఈయన సంస్కృతాంధ్రములయందు కవితచెప్పగలిగియుండి దేవీభాగవత రచన 1883 ఏప్రిల్ 8వ తేదీని ప్రారంభముచేసి, రెండేండ్లలో ముగించెనట. ఈయనకృతిలో పద్యములు కమ్మెచ్చునుతీసిన తీగలవలె కొనసాగును.

కాలము గడుచుట నైజం
బేలీలలనైన గడచు హీనులకు, సము
ద్వేల వ్యసనమ్ముల గుణ
శాలురకున్ హరికథా ప్రసంగవశమునన్

ఘృతాచివర్ణనముచేయు పద్యము:

చన్నులపెంపు, పాదజలజమ్ములకెంపు మనోహరమ్ము లౌ
కన్నులసొంపు, మైయగరుకంపు, కనుంబొమవంపు, శ్రోణులన్
తిన్నెలనింపు, వెన్నడలతీఱునిజంపు, నఖాళితెంపు పల్
క్రొన్ననయింపు, ముంగురులగుంపు దలంప వరింప కెల్లగున్

వీరందఱును సంస్కృతగ్రంథముల అనువాదములుచేయగా కొందరు ఆంగ్లగ్రంథములు తెనుగులోనికి అనువాదముచేయ మొదలిడిరి. అట్టివారిలో వావిలాల వాసుదేవశాస్త్రిగారు ముఖ్యులు. నందకరాజ్యము సంస్కృతమునుండి, సీజరుచరిత్ర ఆంగ్లమునుండి యనువాదముచేసిరి. నాటకములప్రస్తావనలో వీరినిగూర్చి చెప్పుకొందుము. వీరిపేరు తేటగీతిలోనికి సరిపోవుటచేత కాబోలు, తేటగీతినే వీరు వచనములవలె అన్నింటికిని వాడుకొనిరి.

తేటగీతమంచె దీనిని వ్రాయంగ
మంచిదంచు దోచె మదిని నాకు
సాయమిండి నాకు సదయత బుధులార
వావిలాల వాసుదేవశాస్త్రి

1874లో ముముక్షుతారకమను పేరున భజగోవిందశ్లోకములను తెనిగించిరి. 1875లో 'బ్రాహ్మణీయము' అను పేరున ఆధునిక సాంఘికకథావస్తువుతో ప్రబంధము రచించుట ఒక క్రొత్తదనము. వీరిస్వీయచరిత్రను సీసపద్యములో గద్యమువలె నడిపించి చమత్కరించిరి.

"తొల్లి విరోధికృత్తున జ్యేష్ఠ శుక్ల ద్వితీయాదివారకతిథికి సరిగ
నానవేయి యెనిమిదగు నూటయేబదియొకటవయేటి జూనొకటినాడు
పుట్టి కార్న్మూరిలో మట్టెమువారింట మేనమామల కోర్కెమీద నట్లు
చేవేంద్ర కృష్ణమ్మ శేషాచలముగార్ల యొద్దను బడిచదు వొనర జదివి
మేనత్తపెదకొడుకైనట్టి యా రామలింగశాస్త్రులవారి చెంగటను, బ
సందుగా కాళిదాసత్రయ మేమొ పఠించి యప్పకవీయ మెంచి నేర్చి
కార్న్మూర, గుంటూర పేర్మితో నింగ్లీషు చదివి బందర గొద్దిశాల చదివి
నోబిలుస్కూలులోను బ్రవేశపుపరీక్ష ప్రథమశాస్త్ర పరీక్షవఱకు దేవి
యఛట వేదుల వేంకటార్యవర్యుల సన్నిధిలో నాంధ్రసంస్కృతముల
జాడలు మఱుగులు చక్కగా వినగల్గి మేరలేని కృతజ్ఞభారమొంది
రాజమహేంద్రవరము వచ్చి స్కూలులో మేష్టరీహోదాను మేలుపొంది
సర్వేశుకరుణ శాస్త్రబ్రహ్మచారినై కాలేజి మేష్టరీ గ్రాలుచున్న
నేను నా కుపకర్తలైన మహానుభావులపేళ్ళు సతముగా భువిని వెలుగ

వారి కీ యపూర్వ ఫక్కిక పుస్తంబు
నన్ను బెంచి విద్య నాకు జెప్పి
నట్టి దయకు గృతిగ బట్టియిచ్చెద నిదె
వావిలాల వాసుదేవశాస్త్రి 1 - 4 - 1880

(నందకరాజ్యపీఠికలో వ్రాసిన ఈ సీసమాలిక ఆనాటికవులు ఛందోమాత్రబద్ధములైన పద్యములపై ఎంతగా మోజుపడినదియును తెలుపును) ఆకాలములో సామాన్యవిషయములకుకూడ పద్యములే వాడిరి. అముద్రితగ్రంథచింతామణియను పత్రికకు ప్రారంభము చేసిన (శ్రీ) పూండ్ల రామకృష్ణయ్యగారు (1860 - 1904) సంపాదకీయము నెట్లు పద్యములతో వ్రాసిరో చిత్తగింపుడు.

జతనము మీఱంగ నముద్రిత సద్గ్రంథముల సేకరించి కడు బరి
ష్కృతములుగావించి యథామతి పత్రిక గూర్చెదము క్రమంబుగవానిన్

తోరపు నూలుదాఱములతో బదిలంబుగ గట్టిపెట్టి యం
బేరుప నందు జీర్ణదశజెంది మొగిం గ్రిమికీటకచ్ఛటా
పూరితమై వృథా సెడు నముద్రితపుస్తకపంక్తి నెంతయుం
గూరిమిమీఱ నచ్చునను గూర్చుట సెల్లదె పత్రికాకృతిన్

ఈ ప్రతిజ్ఞప్రకారము అనేకగ్రంథములను ప్రకటించిరి. ఆకాలపు పత్రికలలో ప్రాచీనగ్రంథములు కొన్ని నూతనగ్రంథములు కొన్ని ధారావాహికముగా వచ్చుచుండెడివి. దీనికితోడు సాహిత్యవిషయములపై వాదప్రతివాదములు రక్తికట్టించుచుండెడివి. "వార్తాలహరి" అను పత్రికలో త్రిపురాననతమ్మయ ద్వార ఒక సమస్య నిచ్చెనట. అది

"ప్రద్యుమ్నాగారమందు భానుడు వెలిచెన్" అని. దానికి

మచ్చా వేంకటకవి (1856 - 1903) మూడువిధములుగా పూరించి పంపెనట.

మద్యమ్ము ద్రావినావో, విద్యున్నేత్రలగుఱించి వెతజెందితివో
విద్యావిహీన యెక్కడి ప్రద్యుమ్నాగారమందు భానుడు వొలిచెన్
విద్యానిధి విటు డొకసతి జోద్యమ్మగ గూడునెడ రజోగుణమిషచే
హృద్యమ్మగు నక్కోమలి ప్రద్యుమ్నాగారమందు భానుడు వొలిచె౯ !

విద్యాధరార్చితా! యరపద్యమ్మున నీ సమస్యపరగ ముగింతున్
హృద్యమ్మగు ప్రాగ్గిరి దీ ప్రద్యుమ్నాగారమందు భానుడు వొలిచెన్

ఈయన (1856 - 1903) గూర్చి కొండొకచో చెప్పుకొన్నాము. ఈయన రచించిన ప్రబంధములలో వైదర్భీపరిణయ మొకటి. ఆకాలమున వేంకటకవి బ్రౌనుదొరగారితో చెలిమిచేసి మన్ననలపొందెనట.

సీ. పీ. బ్రౌన్ దొరగారు మండలపు జడ్జీ సుప్రమేయంబులం
దేపారంజని గంగయాహ్వయుడు హాయింగాంచి తా నాంధ్ర వి
ద్యాపాండిత్యము మేటి గ్రంథపఠనాద్యస్తోక నైపుణ్యమున్
జూపెన్ రాజమహేంద్రపట్టణమున౯ సూర్యుత్తముల్ మేలనన్

ఈ కవి గిడుగు రామమూర్తిపంతులుగారితో కలిసి పర్లా కిమిడిరాజాకళాశాలలో పనిచేసెను. ఈయన సాహిత్య చర్చలు ఆంధ్రభాషాసంజీవని, హిందూజనసంస్కారిణి (చెన్నపురి) బుధ విధేయ మొదలగు పత్రికలలో పడెడివి. ఈయననుగూర్చి 1884-ఫిబ్రవరి 2వ తేదీని భొబ్బిలినుండి మండపాక పార్వతీశ్వరశాస్త్రి వ్రాయుచు అన్నమాటలు:

మచ్చరము లేదు కవితలో మచ్చలేదు
మచ్చయిన లేదు నుతికి సొమ్మచ్చలేదు
మచ్చయన మెచ్చదగు పుట్టుమచ్చగాన
మచ్చ వేంకటకవినామ మచ్చయయ్యె

అకాలములో శుభలేఖలకుకూడ పద్యములే వాడిరనుటకు ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు కుమారుని వివాహమునకు పంపిన ఆహ్వానపత్రిక యొక నిదర్శనము.

వినుడీ! కీలక మాఘశుద్ధ దశమిన్ వేగ న్విథిన్ గుంభరా
శిని మత్పుత్రుడు కోట వేంకటసుతున్ జేనందికో వృద్ధమా
ననమయ్యెన్ జరుగు న్వివాహము జగన్నాథాచలంబందు గా
వున విచ్చేయుడు! బందు లీ నవయుగళంబున్ లెస్స దీవింపగన్.

వ్యాసమూర్తిశాస్త్రిగారు శ్రీ మహాభారతనవనీతమను పేరున 18పర్వములు రచించిరి. ఇంకను ఎన్నో శతకములు, నాటకములు తెనిగించిరి. కృష్ణాపుష్కరమాహాత్మ్యము రచించిరి. వీరి కవిత్వము స్వయంపాకమువలె శుచిగానుండెనేగాని, ద్రాక్షాపాకమువలె రుచిగా లేదని ఒక వాడుకయుండెడిది. వీరొక చలత్ విజ్ఞానసర్వస్వమని పేరుపడిరి. వీరుకూడ మయూరుని సూర్యశతకమును తెనిగించిరి.

వాల్మీకిరామాయణమును తెనిగించి గొప్ప పేరు ప్రఖ్యాతు లార్జించిన కవి వావిలకొలను సుబ్బారావుగారు (1863-1939) వీరు వాల్మీకిరామాయణమును మాతృకనుఅనుసరించి రచించిరి. వీరు మహాభక్తులై ఒంటిమిట్ట కోదండరామస్వామిభక్తులై, చివరికాలములో సన్యాసము స్వీకరించిరి. వీరింకను, కుమారాభ్యుదయము, కౌసల్యా పరిణయము, సుభద్రావిజయము మున్నగు కావ్యములు రచించిరి. పోతన వీరి యభిమానకవి. అందుచేత పోతన్నకవిత్వమును కాదను వారినిగూర్చి యిట్లు చెప్పిరి.

తుచ్ఛులు సరిగాదనినను స్వచ్ఛపు బోతనకవిత్వసంపద చెడునే
స్వేచ్ఛ జఱచి దూషించిన నచ్ఛ పతివ్రతను బాపమంటుటయున్నే...

అని తమ రామాయణపీఠికలో రచించిరి. 'భక్తిసంజీవని' యను పత్రిక పెట్టి శ్రీరామనామసంకీర్తనమహిమగూర్చి ప్రచారముగావించిరి.

మరొక రామాయణకవి జనమంచి శేషాద్రిశర్మ (1882 - 1940. వీరు నెల్లూరిమండలములో జన్మించి కడపలో నుండువారు. అనేక పురాణములను, వేదాంతగ్రంథములను తెనిగించిరి. హృద

యానందమను పెద్దప్రబంధమును మూడువేలపద్యములతో రచించిరి. శ్రీ పీఠేశంకరగురువరచరితముకూడ (3000పద్యాలు) పెద్దకావ్యముగా రచించిరి. సర్వమంగళాపరిణయమనునది వీరి మరొక కావ్యము. భారతము, భాగవతముకూడ రచించిరి. వీరిరచనలలోని విశేషత సుబోధకత, స్పష్టత, సరళత. వీరిగ్రంథములన్నియు ననువాదములే. వీరికంటె వయస్సున పెద్దలును, నేటికిని చిరంజీవులుగానున్న మన యాస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారుకూడ రామాయణ, భారత, భాగవతములను తెనిగించిరి. శంకరచరిత్రను రచించిరి. శతాధిక గ్రంథకర్తలు. వీరుకూడ కళాప్రపూర్ణులు, మహామహోపాధ్యాయులు. వీరి తెనుగుసేత యథామాతృకముగా సాగినది. భారతమునందు వీరికి అభిమానముకల్గుటకు కారణ మిట్లు చెప్పిరి:

అయిదాతేడుల యీడునం బ్రతిదినం బా భారతామ్నాయమున్
నియమంబొప్ప పురాణమున్ వినిచి నిర్ణిద్ర ప్రబోధాప్తి మా
యయగా రర్థము సెప్పి తత్కథలు లోనంటింప నెంతేనియుం
బ్రియమయ్యెంజుడి నాకు భారతముపై నిత్యానుబంధంబుగన్

వీరు చెన్నపురిలో 'కళావతి' పత్రిక పెట్టి, అనేకగ్రంథములు తమవి ఆ కాలములో ప్రకటించిరి.

ఆకాలమున కవిపండితులకోవకు చెందిన మహనీయులు ఇంకను ఎందరో కలరు. వారిలో స్థాలీపులాకముగా కొందరిని మాత్రము యిచ్చట పేర్కొనగల్గితిమి. విజయనగరము, బొబ్బిలి సంస్థానములలో కొందరు జగదేకజెట్టులవంటి పండితాగ్రేసరు లుండిరి. అట్టివారిలో ఒకరు ముడుంబై నరసింహాచార్యస్వామి. (1842-1924). వారికి అసమానమైన కవిత్వపాటవమేగాక, షడ్దర్శన తత్త్వగ్రహణ, వేదాంతరహస్యపరిజ్ఞానముకూడ కలదు. పాలకొండదగ్గర అచ్యుతాపురములో జన్మించి, వ్యాకరణము, ఛందస్సు నభ్యసించి, కవిత్వములో అఖండ ప్రజ్ఞ సాధించినారు. ఈయన దక్షిణాదిలోని పుణ్యక్షేత్రములన్నియును సేవించి చివరికి సింహాచల

క్షేత్రమునకు చేరుకొని, అక్కడ విజయనగరయువరాజైన ఆనంద గజపతితో పరిచయము సంపాదించుకొనెను. ఈయన కవితాప్రతిభ చూచి ఆనందగజపతి విజయనగరసంస్థానములో తనతండ్రిఅయిన విజయరామగజపతికొలువులో ప్రవేశపెట్టెను. నాడు, కృష్ణలీలా విలాసమునుగూర్చి ఈ కవి చెప్పిన పద్యము.

ఈజగమందు నిందు నఖలెల్లరకున్ గనువిందొనర్చుమై
యోజగనంగ రాజగుట కుల్లము సందియమొంద డెందునన్
రాజనుమాట మా విజయరామనరేంద్రునకే పొసంగు పై
రాజులు శోక వహ్ని మదిరాజుట రాజులనంగ జెల్లెడిన్

విజయరామరాజు ఈ పద్యము విని తనయాస్థానకవిగా చేసి కొనెను. ఈ కవి వేదవ్యాసునిగూర్చి పంచాగ్నిమధ్యమున నలుబది రోజులు తపస్సుచేసి ఆయనవరప్రసాదముచే దర్శనములన్నింటికిని వ్యాఖ్యానములను రచించెను. ఈయన యేబదిగ్రంథములకుపైగా చేసి, తన స్వకీయముద్రణాలయమున తనకుమార్తె పర్యవేక్షణము క్రింద ప్రచురించెను ఈయనగ్రంథావళిలో సంస్కృతకావ్యములు, నాటకములు, చంపువులు, శృంగారరచనలును ఉన్నవి. రుక్మిణీ కృష్ణులశృంగారమును వర్ణించు లింగేశశతకమున విప్రలంభశృంగారమును రసవంతముగా చెప్పెను. అంగశృంగారమును వర్ణించు పద్యమొకటి.

త్రిమ్మరి నువ్వు బువ్వులను తేటియలానెడు తేటిభ్రాంతి జుం
జుమ్మని కొమ్మ నాసఁ జొరఁజూచిన నాసిక చీదరించి "లే!
తుమ్మెదఁ దుమ్మెదన్! దొలగు, దూరకు - నే నువుబువ్వగా" ననన్
గ్రమ్మర వాణి నవ్వె, సఖిగన్గొని తుమ్మెదనెన్ విధాతయున్!

విశాఖమండలములో బొబ్బిలివద్ద పాలతేసుగ్రామమునకు చెందిన మండపాక పార్వతీశ్వరశాస్త్రికూడ గొప్ప విద్వత్కవి. వీరు శతాధికగ్రంథకర్తలు. వీరిరచనలలో శతకములే హెచ్చుసంఖ్యగలవి. పద్యకావ్యములలో రాధాకృష్ణసంవాదము,

బొబ్బిలి మహారాజవంశావళి, ఉమాసంహిత, కాంచీమాహాత్మ్యము, అమరుకము అక్షరమాలికానిఘంటువు ముఖ్యమైనవి. ఇంకను అనేక సంస్కృతగ్రంథములను శతకములను, దండకములను, చూర్ణికలను కూడ వీరు రచించినారు. సమస్యాపూరణమున వీరు అప్రతిమాన ప్రతిభ ప్రదర్శించుచు, విజయనగరము వేంకటగిరి మొదలయిన సంస్థానములను దర్శించి ఆ సంస్థానాధిపతులచేత సత్కారములందుకొనిరి. 'ఆకాలములోని బొబ్బిలిసంస్థానాధిపతి ఆస్థానములో విద్వాంసులై యుండిరి. ఆశుకవిత్వమునందునను, చిత్ర బంధ గర్భకవిత్వములందునను, చక్కని ప్రతిభ ప్రదర్శించిరి. వీరిరచనలలో రాధాకృష్ణసంవాదము, కృష్ణాభ్యుదయము విశేషప్రచారముపొందిన గ్రంథములు. హరిహరేశ్వరశతకములో స్వీయచరిత్రనే పద్యరూపములో చెప్పినారు. ఆకాలములోని భాషావిషయికచర్చలలో వీరు పాల్గొని తమ పాండిత్యప్రకర్షను అనేకవాదములలో ప్రదర్శించినారు.

కవితాపాండిత్యములలో సమాన ప్రకర్షచూపిన మఱియొక విద్వాంసుడు మానవల్లి రామకృష్ణకవి (1866 - 1957). ఈయన చెన్నపట్టణములో జన్మించి ఆంగ్లాంధ్రసంస్కృతభాషలలో అసమానపాండిత్యము సంపాదించినారు. ఆంగ్లములో యం. ఏ. పరీక్ష్యాసుచేసి, అనేకరచనలు ఆంగ్లములోకూడ చేసినారు. వీరికి తమిళము, కన్నడము, మళయాళము ప్రాకృతభాషలలో మంచి పాండిత్యముండుటచేత, అనేక పరిశోధనలు చేసినారు. అముద్రితాంధ్ర, సంస్కృతగ్రంథముల నెన్నిటినో సేకరించి వాటిని స్వీయముగా పీఠికాదివివరములతో ప్రకటించిరి. అట్టివానిలో భరతుడి నాట్యశాస్త్రము అభినవగుప్తవాదుని వ్యాఖ్యానముతో సహా బరోడా మహారాజావారి పోషకత్వముక్రింద మూడుసంపుటములుగా ప్రకటించిరి. తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థపక్షమున భరతకోశమను నాట్యశాస్త్రనిఘంటువును ప్రకటించినారు. ప్రాచీనగ్రంథసేకరణకొఱకు, పరిశోధనకొఱకు తమజీవితమును ధనమును, సర్వస్వమును త్యాగముచేసిన త్యాగమూర్తులు. వీరు సేకరించిన ప్రాచీన

గ్రంథములలో ముఖ్యమైనవి నన్నెచోడుని కుమారసంభవము, వల్లభరాయని క్రీడాభిరామము, మడికి సింగన సకలనీతిసమ్మతము, బద్దెన నీతిశాస్త్రముక్తావళి మొదలయినవి. వీరు స్వతంత్రముగా రచించిన కావ్యములలో ప్రధానములు మృగావతియను కావ్యము, వసంతవిలాసమను ప్రబంధము, పాటలీపుత్రకము అను పద్య కావ్యము, కళింగసేనయను నాటకమును. భాసనాటకములలో కర్ణ భారమువంటివికూడ వీరు తెనిగించిరి.

వీరిసమకాలికులయిన మరొక కవిపండితుడు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు (1874-1951). వీరు కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాలోని కనకవల్లి గ్రామములో జన్మించి, విశాఖపట్టణము లోనే విద్యాభ్యాసముచేసి, 1893లో మెట్రిక్యులేషన్, 1895లో యఫ్. ఏ. పరీక్షలలో ఉత్తీర్ణులైరి. వీరికి కవిగారు అనుబిరుదము వచ్చినది. 1895లో కలాభిలాషకసమాజముపెట్టి నాటకములను ప్రదర్శింపజేసెడివారు. 1898లో ఉపాధ్యాయులుగా పనిచేసి, విద్యార్థులచేత ప్రజాసేవచేయించెడివారు. గ్రంథాలయోద్యమము, అస్పృశ్యతానివారణ, హోమ్‌రూల్ మొదలయిన ఉద్యమములకు మార్గదర్శిగా పనిచేసినారు. ఇంగ్లీషునుండి అనేకకావ్యములను నవీనపద్ధతిలో అనువాదముచేసిరి. వీనిలో తొలిరచన 'పశ్చాత్తాపమహాత్మ్యము' అనునది. ఇది ఇంగ్లీషులోని 'పేరడైజ్ అండ్ పెరీ' కి అనువాదము. ఇట్లు చాల పద్యకావ్యములు, చాటువులు, నాటకములు 'కవి' గారు ఇంగ్లీషు, సంస్కృతభాషలనుండి అనువాదము చేసిరి. వీరియభిమానవిషయము తెనుగుభాషాపరిశోధన. 'నుడికడలి' యనుపేరున వీరు సేకరించిన అచ్చతెనుగుపదముల నిఘంటువు అసమాప్తముగానే ఉండిపోయినది.

కవిగారు నాటకరంగమునకు చేసినసేవగూర్చి మరియొకచోట ప్రస్తావించగలము.

ఈ కాలములోనున్న మరొక కవిపండితుడు జయంతి రామయ్యపంతులు. (1860-1941) వీరు ప్రభుత్వపదవులలో అనేక

మహోన్నతస్థానముల నలంకరించిరి. ఆంధ్రసంస్కృతాంగ్లభాష లలో విశేషకృషిచేసిరి. వీరు 1200 శిలాశాసనములవరకు పరిశీలించి, శాసనపద్యమంజరియని రెండుసంపుటములుగా ప్రకటించిరి. అమరుకకావ్యమునకు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివలె వీరును చక్కని అనువాదముచేసిరి.

పొగరుంగుబ్బలు పొట్టివై పులకలం బూనంగ నే నెంతయున్
బిగికౌగింటనుగూర్చ జీర నడుమున్ వేవీడి జాఱంగ దా
శగలే నింకను మాను మానుమని బల్ దైన్యంబుగా బల్కు నీ
చిగురుంబోడికి మూర్ఛయో, నిదురొకో చిత్తమ్మునం జేరెనో!

రామయ్యపంతులుగారి కృషియంతయును 20వశతాబ్ది ఆరంభములోనే జరిగినది. సూర్యరాయాంధ్రనిఘంటువు, ఆంధ్రసాహిత్య పరిషత్తు రామయ్యపంతులుగారి స్మారకచిహ్నములు.

వీరివలె బహుకావ్యధురంధరులు మహోపాధ్యాయు లనదగిన మరొకరు ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ (1864 – 1933). వీరు సుధానిధి, మనోరమ అను పద్యకావ్యములను, రహస్యదర్పణము, ఆంధ్రపద్యావళి మొదలయినవి క్రొత్తభావములతోకూడిన రీతిని రచించిరి. సుజనప్రమోదిని, కల్పలతయను పత్రికలను ప్రకటించిరి. పార్వతీపురమున సబుకోర్టులో పనిచేయునపుడు కొన్ని ఖండకావ్యములను రచించిరి. 1892లో వానిని 'ఆంధ్రపద్యావళి' యను సంపుటముగా ప్రకటించిరి. 'రహస్యదర్పణము'లో ఆనాటి శాస్త్రరహస్యములను వివరించు అదృశ్యప్రపంచరహస్యములను, క్రిమికీటక జంతు పక్షి యాత్రాది విశేషములను చక్కగా వ్రాసిరి.

నెలతలు చంటిబిడ్డలకు బాల్గుడుపుటే
ప్రకృతిధర్మంబని పలుకరాదు
ప్రకృతశాస్త్రజ్ఞులౌ పండితుల్ డార్విను
మున్నగువారలు కొన్నిచోట్ల

పురుషులు రొమ్మినం బొడమిన పాలతో
శిశుపోషణంబని చెప్పినారు
ప్రకృతిధర్మంబులు ప్రభవించు నశియించు
నభ్యాసపద్ధతి ననుసరించు
మగువలకెగాని చన్నాలు మగల కెందు
పొడమవనుమాట లన్నియు బూటకములు
పురుష లికమీద స్తన్యంబు పొడమునట్లు
రొమ్ము సవరించుకొనుట కార్యమ్ముగాదె॥

—సంఘసంస్కరణము

బిందె చిందెడు కాఫీకి పిడుగుతునుక
కట్టచుట్టల కాల్చెడి పుట్టుభోగి
బుట్టెడాకులు నమలెడి పుణ్యభోగి
నాగరికులన్న వేఱె యున్నారె. వీరె

సమకాలికవిషయములపై (**Anti nautch**) వీరి విసురులు చక్కని చుఱుకలంటించుచున్నవి.

ఆటవెలదులున్న తేటగీతములున్న
మనసు కరగిపోవు మంచుపగిది
ఆటలేక తేట పాటయు లేకున్న
వెలదులున్న జాలు వేవరాలు—

(ఆటవెలదులు తేటగీతములు)

వీరి శీర్షికలు, పద్యములు, భావములు అన్నియును చమత్కారముగా నుండును. "సుజనప్రమోదిని" పత్రికను 1881లో పెట్టి నేటి భౌతిక రసాయన క్రిమి కీటక వృక్ష పక్షి జంతుశాస్త్రములకు సంబంధించిన విజ్ఞానవిషయములను విశదముగా ప్రకటించుచుండెడివారు. వీరిసమకాలికులైన మరొకపండితుడు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు (1862 - 1943). దేవవ్రతచరిత్రమను పద్యకావ్యము రచించిరి. వీరికి ప్రాకృత, సాంస్కృతభాషలయందు

చక్కని ప్రవేశముండుటచేత కళాశాలవిద్యార్థులకు వివిధభాషాతత్వ ములగూర్చి తులనాత్మక పరిశీలనతో బోధించువారట. ఆనందగజ పతికొలువులో ఉండి "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అను మకుటముతో శతకమును వ్రాయుమనగా రాజుగారి పనుపున "సత్యవ్రతి" శతకము రచించిరి. నమ్మాళ్వార్లు రచించిన నాలా యిరప్రబంధములను తిరువాయిమొళికి పద్యరూపమైన ఆంధ్రీకర ణముచేసిరి. తిరిగి వానిని సంస్కృతశ్లోకములతో "ఆంధ్రగీర్వాణ శఠకోపసహస్ర"మున ప్రకటించిరి. దేవవ్రతచరిత్ర ప్రబంధ శయ్యలోనున్న అచ్చటచ్చట పద్యములే నాటకీయ సంభాషణ లతో నడచినవి. వీరింకను పార్థసారథిశతకము, ఆంధ్రసేతుబంధ మహాకావ్యమును రచించిరి. ఇన్ని చేసినను వీరి వినయసంపన్నత, గురుభక్తి సాటిలేనివి.

ప్రతిభలేదు పెద్ద పాండిత్యమును లేదు
శబ్దశాస్త్రవిధులజాడ నెఱుగ
శ్రీ ముడుంబ నారసింహునికృపయె నా
కన్ని గూర్చి కృతికి వన్నెదెచ్చు —దేవవ్రతచరిత్ర

ఇందరుకవులున్నను ఆంధ్రసాహిత్యమునకు ఒక నూతన పథ మును చూపినవారు కందుకూరి వీరేశలింగంపంతులు, గిడుగు రామ మూర్తి, గురజాడ అప్పారావుగారలు. కాని వీరికృషియంతయును 19వ శతాబ్ది చివరిభాగమున ఆరంభించి, 20వ శతాబ్ది ఆరంభములో ఫలితముల నిచ్చినది. పైగా వీరందరును గద్యవాఙ్మయక్షేత్రమున నూతన ఫలసాయము పండించినవారే. వీరిలో గద్యవాఙ్మయ బ్రహ్మయని పేరందిన కందుకూరి వీరేశలింగంపంతులు (1848–1919) పూర్వసంప్రదాయమునననుసరించి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వ చన నైషధము రచించి, గొప్ప ప్రయత్నసాధకుడయ్యెను. దీనిని కొక్కొండ వేంకటరత్నకవి యిట్లు ప్రస్తుతించెను:

అచ్చతెనుగు గబ్బ మలదరించుట కూచి
మంచి తిమ్మనయును, మంచి తెలగ
నయును, లింగనయును నయమున స్వీయ భా
షాభిమానమాన్యులని నుతింతు

వేఱొకచో కందుకూరివారి గద్యవాఙ్మయసేవ పేర్కొం దుము. వీరి సమకాలికులును ప్రత్యర్థియును అయిన కొక్కొండ వేంకటరత్నముగారు (1842 - 1915) బిల్వేశ్వరీయము, సింహా చలయాత్ర, మంగళగిరి, కోరుకొండగూర్చిన మాహాత్మ్యములు, గోదావరీవర్ణనము, గోవిందమంజరివంటివి రచించిరి. వీరు తమ సమ కాలికులైన అనేకపండితులతో వాదములు వేసికొనిరి. తమ "ఆంధ్ర భాషాసంజీవని" పత్రికలో పలువురను విమర్శించుచుండెడివారు. వీరు వెండి, బంగారము అను పేరులతో క్రొత్తవృత్తములను సృష్టించి రచించిరి. "కోరుకొండను" వీరు వర్ణించుచు వ్రాసిన పద్యము అప్పటి తెనుగు పల్లెలతీరులను తెల్లము జేయుచున్నది:

చిటిపొటి కొండలు చిన్నవి పెద్దవి
ఇండ్లు మిద్దెలు దారి కిరుగెలకుల
నారుపోసినయట్లు వారక యెన్నేని
పూర్వాచరణముల పోల్కిదనర
మరికొన్ని సుగృహ హర్మ్యములు నూత్నాచార
ములయట్లు పైపయి మురువుసూప
చైత్యద్రుమంబుచే సత్రంబులుగ వార
మున కొక సంతయె యొనర విపణి

గానధిక్యత నృహరి నికాయమె ఘన
రాజమందిరముగ గడు రాజిలంగ
జానపదజన సహజమెయైన పౌర
కోవిదావాసమునగు కోర్కొండపురము.

వీరేశలింగంపంతులుగారి సమకాలికకవి గురజాడ (శ్రీ)రామ మూర్తిగారు (1851 - 99) కవిజీవితములను, ఇతర చరిత్ర గ్రంథములను రచించిరి.

వీరి చిత్రరత్నాకరము చిత్రమైన పద్యకావ్యము. 'రాజయోగి' అను పత్రికను కాకినాడనుండి ప్రకటించుటచేత వీరికి కాకినాడపంతులని పేరువచ్చినది. 'ఆంధ్రపదపారిజాతము' అను అచ్చతెనుగునిఘంటువు నచ్చువేయించిరి. వీరికంటె వీరిసమకాలికులయిన దేవులపల్లి సోదరకవులు సుబ్బరాయశాస్త్రి(1853-1909)తమ్మనశాస్త్రి (1856-1912)ప్రసిద్ధులుమహేంద్రవిజయముఅనుపేరునవీరురచించిన ఆంధ్రప్రబంధము నవీనభావములను వెదజల్లును. వీరు పీఠికాపురరాజు గంగాధరరామారావుగారియాస్థానమున నుండి, ప్రభువుల కోర్టుదావావిజయమునకై చాల పాటుపడిరి. వీరు మాడభూషి వేంకటాచార్యులశతావధానము చూచి, వారినిమించి శతావధానములుచేసి మద్రాసు, పిఠాపురము నగరములలో పండితులప్రశంసల నందుకొనిరి.

పిఠాపురమున వేకువవేళ వర్ణించు ఒకపద్యము వీరిభావనకుదాహరణము.

> తొలికోడి తానెయై యెలుగెత్తి మూడుభం
> గుల గుక్కుటేశుండు కొనరి కూసె
> ఆలమందలకెల్ల నధినేత తానెయై
> పొంకంబుగా నంది ఱంకెవైచె
> తీర్థంబుదెచ్చు హస్తికి పెద్ద తానెయై
> లంబోదరుడు బృంహితంబొనర్చె
> విహగంబులకు నెల్ల బెద్ద తానై కుమా
> రునికేకి పెలుచ నిస్వనమొనర్చె
> దానె లింగార్చకులకు బ్రాథమికుడనుచు
> బ్రాతరనిలుండు కేతనాగ్రముననున్న
> ఘంట మ్రోయించె వందిమాగధులు తామె
> యగుచు భక్తులు పేర్కొని రపుడు మమ్ము

ఇంకను ఎందరో కవులు, నాటకకర్తలు, గద్యరచయితలు 19వశతాబ్దిమధ్యలో జన్మించి, సాహిత్యమును నవ్యమార్గముల పట్టించిరి. అట్టివారిలో గురజాడ అప్పారావుగారు యుగకర్తయందురు కాని,వారి నూతన పద్యరచన 20శతాబ్దిఆరంభములోకాని రాలేదు. కనుక వారిని మనసమీక్షలోనికి చేర్చుకొనుటకు వీలుండదు. గురజాడవారు కనిపెట్టిన ముత్యాలసరములు, నీలగిరిపాటలను క్రొత్త రచనలు 1909లో వచ్చినవే.

ఈ కాలములో జన్మించిన కవులనేకులున్నను పాశ్చాత్య విద్యాప్రభావమువలన నూతనభావములను వెదజల్లు నూతనకావ్యములరచన చాలకాలమునకు తరువాత వచ్చెను. 1899లో వెలువడిన ఒక నూతనకావ్యమునకు ఒక కావ్యబహుమతి లభించెను. అది అనేకరీతుల అపూర్వమార్గము త్రొక్కినది. తొలిసారి ఒకసామాన్య వనితజీవితమును కథావస్తువుగా తీసికొనెను. శృంగారరసమును తప్పించి, త్యాగమును ఉగ్గడించెడు. మంగళాంతము కావలసిన కావ్య పద్ధతిని తప్పించి విషాదాంతకావ్యమును చేసెను.అది "ముసలమ్మమరణము" అను పద్యకావ్యము. రచించినవారు కట్టమంచి రామలింగా రెడ్డిగారు. (1880 - 1950). ఈ చిన్నికావ్యము సమర్థి రంగయ్య సెట్టిగారు పెట్టిన కావ్యస్పర్థలో నెగ్గెను. చెన్నపురి క్రైస్తవకళాశాలకుచెందిన ఆంధ్రభాషాభిరంజనీ సమాజమువారి బహూకృతి నందుకొనెను. ఇందలికథ, బ్రౌనుదొర ప్రకటించిన "అనంతపుర చరిత్ర" నుండి స్వీకరించి రచించిరట. నాయిక ప్రబంధసుందరివలె కచకుచములతో గమకించు కృత్రిమకాంతగా కాక, రాయలసీమ లోని ఒక రెడ్డివనితవలె గోచరించును.

లేగయై నాకుచు లీలమై మెడ మలం
  చిన గోవుబిండెడు వనరుహాక్షి
బొండుమల్లెలతోట బువ్వుల గోయుచు
  వనలక్ష్మి యన నొప్పు వనజగంధి

బీదసాదులనెల్ల నాదరించుచు గూడు
గడుపార బెట్టెడు కన్నతల్లి
వ్యాధిబాధల నెవరైన నడల రెప్ప
వేయక కాచెడు వినుతచరిత

బిడ్డలెల్లరు తమవారి విడిచి చేర
జంకనిడుకొని ముద్దాడు సదయహృదయ
అమ్మ! నీ కిట్లు వ్రాయంగ నౌనె బ్రహ్మ
కనుచు నూరివారందఱు నడిలియడలి

'ముసలమ్మ' తన ప్రజలకొఱకు జీవితమును ఆనందముతో త్యాగముచేసిన సాధ్వి, త్యాగమయి. ఇట్టికథనే జానపదకవి కామమ్మకథయను పేరుతో కరుణామయముగా రచించెను. కాని ఈ కథ సామర్లకోటలో జరిగిన సతీసహగమనగాథ. ముసలమ్మకథ అనంతపురములో జరిగినది. ఈమె చితికెక్కలేదు. నీటబడి మునిగినది.

కన్నెఱ్ఱవారిన ఖరకరోదయకాల
మల్లన మ్రింగు జాబిల్లి యనగ
జ్వాలదగ్నిశిఖలపై నెలనవ్వుతో బోవు
ధాత్రీమహాదేవి తనయ యనగ
కెందామరలబారు సుందరమగులీల
నల్లనల్లన జొచ్చు నంచయనగ
కాలమహాస్వర్ణకారకుం డగ్నిలో
కరగించు బంగారుకణికయనగ

ప్రళయకాలానల ప్రభాభాసురోగ్ర
రంగదుత్తుంగభంగసంవ్రాతములకు
గలకనొందక దరహాసమలర, మంద
మందగతి బోయి జొచ్చె నమ్మగువ నీట

ఈ గ్రంథమునుగూర్చి మొదటికూర్పునకు వ్రాసిన ముఖపత్రములో కట్టమంచి రామలింగారెడ్డిగా రిట్లు వ్రాసిరి:

"ఒకానొక త్రిలింగదేశీయునిచే వ్రాయబడి బ్రౌన్‌దొరగారిచే ప్రకటింపబడిన "అనంతపురచరిత్రము" అను గ్రంథమునుండి ఇందలి కథం గైకొంటిని. అయినను గొన్నియెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాడ."

"అనంతపురమునకు సమీపమున బుక్కరాయసముద్రము నేటికి ఉన్నది. ఆ యూరిచెరువుకట్టకు "ముసలమ్మకట్ట" యనియే పేరు. అచ్చట నేటేట జనులందరు పొంగళ్ళుపెట్టుచు, ముసలమ్మను గ్రామదేవతగా గొలుచుచున్నారు. ఆ పల్లెలో నీ విషయమైన శిలాశాసన మున్నదట.

ఈ పుస్తకము ముఖ్యముగా స్త్రీలకొఱకు ఉపయోగముగా నుండునని వ్రాసినట్లుకూడ కవిగారి పీఠికలో తెలిపియున్నారు. ఈ చిన్నిపొత్తము ముఖ్యముగా స్త్రీలకొఱకు జేయబడినది. వారి కుపయుక్తముగా నొప్పినయెడల నా ప్రయాస సఫలతనొందినట్లే."

ఇందలికథ - బుక్కరాయసముద్రంలో చెరువుకుసంబంధించిన గాథ. బుక్కరాయసముద్రము పొంగి, వానలు వరదలుగా కట్ట తెగిపడినది. ఆ యూరిరైతులు పోలేరమ్మకు పొంగలివేసి జాతరచేసి అమ్మవారిని ప్రార్థించిరి. అంతలో ఆకాశవాణి పలికినది.

బసిరెడ్డికి గడకోడలు
ముసలమ్మ యనంగ నొప్పు పుణ్యాంగన తా
వెస బలిగాబోయిన మీ
కిసుమంతయు కష్ట మెన్న దేలా కలుగున్

అని ఆమెలఙ్ఞ.

అది విని ముసలమ్మ తనభర్తవద్దకు పోయి, సంగతి విన్నవించినది.

అని, పూసగ్రుచ్చినట్లుగ
వనితామణి దెలిపె దేవివార్తలరీతిఁ
జనముల కష్టముచందము
దనపూన్కిఁ దెలంగు వినయతత్పరమతియై

ముందు భర్త ఆమెకు బలిఅయిపోవుటకు అనుమతిఈయ నిరాకరించును. ఆమె యెన్నియోవిధాల బ్రతిమాలి చివరకు తన నిశ్చయమును నెగ్గించుకొనును. బలిఅగుటకు పయనించును.

లలనాశిరోలలామం
బలరుచు బసుపున జలకమాడి తలిర్చెఁ
దలమీది చెట్లు కురిసిన
లలితసుమపరాగమున వెలయు లతికయనన్

అశ్వపాలుండు గొనిపోవ నల్ల బాలు
నదిని గాంచి, మనోహర నాట్యమొప్ప
మెల్ల మెల్ల నొయారంబుమీఱ గదియు
బాలహరిలీల జనులతో బడతి యరిగె.

ఈ పద్యము హోమరను గ్రీకుదేశకవిచే వ్రాయబడిన "ఇలియడ్" అను కావ్యమునుండి తెనిగించితినని కవియే చెప్పుకొనెను.

ఆమెబలిని వర్ణించి, భరతవాక్యముగా కవి యిట్లు చెప్పెను:

ఇచట నస్తమించి యినుడు పశ్చిమగోళ
మందు వెలుగుగాదె! యట్టె దేవ
భువనమునను బొలుచు మునలమ్మ యాంధ్రభా
షాభిరంజనిం దయగనుగాత!

శివమై, చిన్మయమై, యఖండమయి, యర్చిష్మంతమై, నిత్యమై,
భవపాథోనిధినావయై, మునిజన ప్రాణముంబునై, యద్భుతా
ర్ణవమై, నామవికారరూపరహితప్రాశస్త్యమై, వెల్గువి
ష్ణువిరించీశ్వరనాథతత్త్వము మమున్ శోభిల్లగాజేయుతన్.

విషాదాంతమైన ఈకావ్యము- వీరరసప్రధానమై ఒక వీరనారి నిస్వార్థత్యాగమును నిత్యవిలసితముగా చేసినది. అందులకే ఈ కావ్యమునకు క్రైస్తవకళాశాలవారి ఆంధ్రభాషాభిరంజనీ సమాజము వారు జరిపిన కవితాస్పర్థలో అగ్రతాంబూలము వచ్చినది. నాటికిని నేటికిని ఆధునికాంధ్ర కావ్యవిధానములో అగ్రగణ్యత పొందు చున్నది. అంతవరకు వచ్చిన కవితాసంప్రదాయములను, వర్ణన విధానములను, కవి సమయములను పూర్తిగా మార్చి ఒక విప్లవము నకు అంకురార్పణచేసినది.

ఆంగ్లసాహిత్యప్రభావముతో తెనుగులోవచ్చిన ప్రథమ కథాకావ్యము కట్టమంచి రామలింగారెడ్డిగారు రచించిన "ముస లమ్మమరణమే" యని ఒప్పుకొనితీరవలెను. రామలింగారెడ్డిగారు (1880 - 1951) బి. ఏ. చదువుచుండగానే విద్యార్థిగానున్న కాలములోనే ఒక పోటీకని వ్రాసిన ఈ కావ్యము బహుమతినందు కొన్నది. ప్రబంధఫక్కీని అనుసరించక ఒకసామాన్యస్త్రీజీవితమును కథావస్తువుగా గ్రహించెను. దీనియందు అష్టాదశవర్ణనలును, శృంగారప్రబంధనాయికావిరహతాపముచేవచ్చు ఆపశోపములును కానరావు. కరుణరసప్రధానమైన ఒకకథ కన్నులకుకట్టినట్లు చెప్పి, కవితావేశముతో కావ్యశిల్పముతో తీర్చిదిద్దిన సుందరరచన. దీనిని గూర్చి పింగళి లక్ష్మీకాంతముగారన్నమాటలు:

"ఇరువదియవశతాబ్ది యుదయింపనున్న వేగుచుక్కనక్షత్ర మువలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో ఆవిర్భవించిన నూతనాంధ్రకావ్యము "ముసలమ్మమరణము". శ్రీ రెడ్డి పందొ మ్మిది వత్సరముల యువకుడై యున్నప్పుడు (1889వ - సంవత్సర ములో) చెన్నపురి క్రైస్తవకళాశాలా ఆంధ్రభాషాభిరంజనీ సమాజపు పోషకుడగు శ్రీ సమర్థి రంగయ్యశ్రేష్ఠి ఈ కావ్యముయొక్క పుట్టుకకు కారణభూతుడు. ఉత్తమకావ్యరచనలను ప్రోత్సహించుటకై శ్రీ శ్రేష్ఠి నెలకొల్పిన పోటీపరీక్షలో నెగ్గి, పందెముగెల్చుకొని బహూకరింపబడిన ఈ కావ్యమును, తత్కర్తయైన యువకవిని, సుప్ర

సిద్ధులైన ఆంధ్రకవిపండితు లెందరో ముద్దుగా మెచ్చుకొని బహుగా ఆశీర్వదించిరట.”

“విషాదాంతమైన ఈ కావ్యము సుఖాంతము చేయవలెనని ఆకాలపు పండితులు హెచ్చరికచేసిరట. కాని కవి దీనికి అంగీక రించలేదు.”

“ఇందలి వీరగాథ నూతనకవితాస్వతంత్రరీతులకు ఆనాడు దృష్టాంతముగా పేర్కొనబడినది.”

“సాత్వికముగా కరుణరసస్ఫూర్తిని కలిగించుటలో శ్రీ రెడ్డి సిద్ధహస్తుడు. తఱచి చూచినచో, సాత్వికమైన విషాదచ్ఛాయయే ఈయనకవితాప్రవృత్తికి చోదకము అని తోచును” అని పింగళి లక్ష్మీ కాంతముగా రన్నారు.

నవయుగప్రభాతమునకు వైతాళికులలో అగ్రగణ్యుడు కట్ట మంచి రామలింగారెడ్డిగా రనవచ్చు. ఆధునికయుగప్రభావము వీరిపై ప్రసరించి, ఆంగ్లాంధ్రసాహిత్యములలోని నిగ్గును వీరిచేత నవనీతము వలె పైకి చిలుకునట్లుచేసినది. విమర్శకుడుగా, భావుకుడుగా, సహృద యుడుగా, తత్వవేత్తగా పరిణతిగన్న ఈ తెనుగువిద్యావిశారదుడు తన యౌవనకాలములో తనకు తెలియకుండగనే ఒక నూతన కావ్య రచనావిధానమునకు ఒక నవ్యకవితాశైలికి, ఒక విచిత్రకథనకావ్య పద్ధతికి ఒక విషాదాంతకావ్యరచనారీతికి మార్గదర్శకుడగుట గమ నించదగినది.

ఈ కావ్యరచన అనేకవిధముల నూతనపథములనుత్రొక్కి రానున్నతరములవారికి మార్గదర్శకమైనది. అందుచేత రెండుశతా బ్దులమధ్య యుగసంధివర్షమున ఇది యుదయించుట ఎంతయును దైవికముగా నున్నది. అంతవరకు తెనుగులోవచ్చిన కావ్యములన్ని యును ఒకేరీతి ఒకేత్రోవ పాడినదే పాడరా యనునట్లు ప్రాతపురా ణములను పాడినవి. లేక ప్రబంధకావ్యములలో నేలవిడిచినసాము చేసినవి. ఈ సాహిత్యమును పరికించుచో అవి యాంధ్రదేశముననే కాదు; అవి యెక్కడైనను జరుగవచ్చు ననిపించినవి. అట్టికాలమున

ఈ నూతనభావములతో ఒక మనోహరపథమును ప్రదర్శించిన గౌరవము కట్టమంచివారికి దక్కినది. కాని ఈ యుగమునకు ప్రవక్తలై నూతనయుగోదయము సూచించిన నాయకులు వేరే యున్నారు. దీనినే ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తమ ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము ముగింపుచేయుచు నిట్లనిరి:

"19వ శతాబ్దినుండి ఆంధ్రసాహిత్యము నూతనమైన విశాల రంగమున బహుభంగుల విహరింపజొచ్చినది. దీనికి చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగము, కొమర్రాజు లక్ష్మణరావు, తిరుపతి వేంకటకవులు మొదలగు మహనీయులు నాయకులు."

ఈకాలములో (19వ శతాబ్దిలోనే) సంప్రదాయములు మారిపోయినవి. అందుచేతనే కట్టమంచి రామలింగారెడ్డిగారిట్లనిరి—

"ఆంధ్రసాహితీ పునరుద్ధరణ ప్రభావులైన శ్రీ వీరేశలింగము గారిచే దారిచూపబడిన యనేకులు, ప్రజలయొక్క మేలు నాశించి వారలకు దెలియునట్లు అనేక ముఖ్యవిషయములనుగూర్చి వ్రాయుచుండుటచే, భాషయందలి ప్రీతియు, గౌరవమును, అభిలాషయు, కుతూహలమును మునుపెన్నడు దాల్చియుండనంతవ్యాప్తిని బెంపును వహించుచున్నది. ప్రకృతము కావ్యములు, నాటకములు, ప్రహసనములు ఇత్యాది కృతులతో నివేదింపబడు విషయము లసంఖ్యములు; సర్వజనితములు. ప్రాతమార్గములనే యీ పద్ధతు లరిగి పోవునట్లు గొఱ్ఱెలమందలవలె పోవునవికావు. మఱియు దేశాభ్యుదయమను మహోద్దేశముగలవౌట బౌరుషోద్దీపకములు. నాయికానాయకులు సగమునకుసగము పలాయితులైరి. రాజులు రాణులును ప్రచ్ఛన్నులై యేమూలం దాగిరో యెందడగిరో! వెదకబడువారు లేరు, వెదకువారును లేరు. కలియుగాదినుండి యింతదాక జమకు ఖర్చుకుకాని సాధారణజనులు నేటికిగదా గణ్యులైరి. ఇక ముందు పూజ్యులగుదురుగాక!"

1899లో చెప్పిన ఈ జ్యోస్యము వారికవితలోనే ఫలించినది. ఆ పవిత్రమార్గములో ఎన్ని దీపకళికలు - ఎన్ని నవకాంతికోరకములు - ఎన్ని క్రొత్తకోరికలు; ఎన్ని చంద్రచకోరికలు:

"అక్కజంబుగ నిప్పు డత్యంత దీప్తి
వెలుగుచున్నావు భారతీ! విమలమహిమ
నాంధ్రదేశములో మార్పు లనుభవించి
యేమి చెప్పుదు? కలకాల మింక నెట్లో!" *

ఈ సమయములోనే గురజాడ అప్పారాయనిగొంతులో క్రొత్తస్వరము పలుకుచున్నది. అదియే ముత్యాలసరమైనది. ఆది కవిశోకము శ్లోకమైనట్లు.

ఆకులందున అణగిమణగీ కవితకోకిల పలకవలెనోయ్
పలుకులను విని దేశమం దభిమానములు మొలకెత్తవలెనోయ్

పుత్తడిబొమ్మ పూర్ణమ్మ, లవణరాజుకల, కన్యక మొదలయిన కథాగేయాలలో దేశీయచ్ఛందస్సులలో ఒక క్రొత్తసంగీతమును సాధించినవాడు గురజాడ. తెనుగుకవితకు కావలసిన తీయదనమును తేటదనమును, తీరుతనమును సాధించగోరినచో అది సంస్కృతములోనుండి తెచ్చిన భావములవలనగాని, ఛందస్సులవలనగాని సాధ్యముకాదని ముందే గుర్తించినవాడు గురజాడ. ఈ రహస్యమును గుర్తెరిగి, "గుమ్మడేడే గోపిదేవీ" వంటి పాటలను, "మేలుకోవే జలజనయనా మేలుకోవే జలధిశయనా మేలుకోరాదా" అను మేలుకొలుపులలోని మేలిమిబంగారముతో చక్కని నగలుచేసి వానికి తన మాటలరతనాలతో చికిలీసేతచేసి రాణింపజేసెను. ఇదియే భామినీషట్పదిలో సగమందుకు. గురజాడ వాల్మీకియను వ్యాసమున ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగా రిట్లువ్రాసినారు: "వీరేశలింగము విజ్ఞానశిఖామణి, మేధావి, ఉపస్కర్త, సంస్కర్త కాని, గురజాడవాల్మీకి ప్రతిభముందు ఆయనవైచక్షణ్యము ఒదుగు

*కట్టమంచి రామలింగారెడ్డి - కవిత్వతత్వవిచారం - 63 - 64పుటలు

తుంది. గురజాడవారిరచన కొంచెమే అవుగాక, కాంతాసమ్మితము రసదిగ్ధము. "ఆయనరచన అవిస్తృతమే కాని, సుహృత్సమ్మితము" అందుకే గురజాడ తన ముత్యాలసరములను మెచ్చని విమర్శకుల నుద్దేశించి యిట్లనెను.

మెచ్చనంటా వీవు నీ విక
మెచ్చుకుంటే మించిపాయెను
కొయ్యబొమ్మల మెచ్చు కనులకు
కోమలుల సౌరెక్కునా ?

# 8. గేయ వాఙ్మయము

తెనుగుసాహిత్యములో పదహారణాల తెనుగుతనము కలిగిన ప్రక్రియ గేయరచన. దీనికి మఱే యే యితరభాషలసాహిత్యముల తోడను ప్రమేయములేదు. కవి తానేదైన మధురానుభూతి పొంది నపుడు దానినిగూర్చి గానముచేయును. అదియే ఒకకావ్యమై మూర్తీభవించును. ఏ భాషలోగాని ముందు పాట తరువాతమాట. హృదయస్పందియైన ఈ రసానుభూతికి జననాంతర సౌహృదము కావలెనని కాళిదాసు చెప్పియున్నాడు.

> రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
> పర్యుత్సుకో భవతి యత్సుఖితో పి జంతుః
> యత్ చేతసాభవతి నూనమబోధపూర్వమ్
> భావ స్థిరాణి జననాంతర సౌహృదాని

సుందరదృశ్యములు చూచునపుడు, రమ్యానుభూతితో రస ముప్పొంగును. అది సంగీతమగును. సాహిత్యమగును. సంగీతసాహిత్యములు పరస్పరాధారములు. ఇది గుర్తించియే తెనుగులో వాగ్గేయకారులయినవారు హృదయాకర్షకమైన భావములను కూర్చుటకేగాక, మృదుమధురమైన పదజాలమును ఆ భావవ్యక్తీకరణకు వాడుకచేయుటకుకూడ ముచ్చటపడిరి. కర్ణాటక సంగీతసంప్రదాయ మంతయును అమృతధారలుగా కరడుకట్టినది ఆంధ్రభాషలో. పాటకు ఈ తెనుగుమాటలు ఒదిగినట్లు మఱే యే యితరభాషలోని మాటలును అంత మృదువుగా పలుకవేమో! ఏ భాషకుచెందిన వాగ్గేయకారులైనను, దక్షిణభారతమునందంతటను తమ సంగీత కృతులు చేయునపుడు వానిసాహిత్యమునకు తెలుగుభాషనే వాడి

యున్నారు. తెలుగు అజంతభాషగా వాడుకలోనికివచ్చుట దీనికి మఱింత ఆనుకూల్యముకూర్చినది. అందుచేతనే తెలుగు, యూరపి యనుభాషలలో 'ఇటాలియన్' వంటి దన్నారు.

**"Telugu is rightly called the Italian of the East"**

సంగీతము మార్గదేశిపద్ధతులలో రెండు తెరగులు. అందు లక్ష్యలక్షణమైన సంగీతము "మార్గ" యని పేర్కొన్నచో, దానికి కావలసిన లక్షణగీతములు హెచ్చుభాగము తెలుగుభాషలోనే వచ్చినవి. మొదట, తెలుగుపాటలు పాడుటకు ఆడుటకుకూడ వాడుకొనిరి. అనగా, సంగీతమనగా నృత్యముతో కూడినదనియే ఒక నిర్వచనము. అందుచేత సంగీతములోని సాహిత్యము నృత్యగీతము లకు అనుగుణముగా రూపొందినది. నృత్య సంగీత నాటకములలో గాని, భరతనాట్యప్రదర్శనములలోగాని నృత్యముతో అభినయించు పాటలు, శబ్దములు, జతిస్వరములు, పదవర్ణములు, పదములు, తిల్లానాలు, జావళీలుమున్నగు రచనలన్నియును తెనుగులోనే వచ్చి నవి. ఈ గేయవాఙ్మయమంతయును పారమ్యమందుకొన్నది 19వ శతాబ్దిలోనే.

ఈ రచనలలో కొన్ని కేవలము సంగీతస్వరములకే ప్రాధా న్యమిచ్చినను, కొన్ని రసవంతమైన సాహిత్యమునే సమకూర్చినవి. వాక్యమ్ రసాత్మకమ్ అను నిర్వచనమును నిజముచేసినది గేయ రచనయే. సంగీతమునకు పనికివచ్చు పాటలలో అధికభాగము 19వ శతాబ్దిలో వచ్చుటయేగాక, ఈసమయములో వచ్చినంతమంది వాగ్గేయకారులు మఱియెన్నడును రాలేదు. తెలుగులో గేయరచన చేసినవారిలో తెలుగువారితోపాటు ఇతరభాషలకుచెందిన మళ యాళీలున్నారు; కన్నడులున్నారు; మరాటీవారున్నారు; తమిళు లున్నారు; ఓఢ్రులున్నారు. వీరిరచనలన్నియును సంగీతసరస్వతికి వినూత్నాలంకారములే. సాహిత్యప్రయోజనములని చెప్పదగిన రసానందము సమకూర్చుట, ఉపదేశముచేయుట యను రెండుకార్య

ములను వెంటనే కలిగించునవి గేయములే. సద్యః పరనివృతయే— ఉపదేశయుజే. అవి కాంతాసమ్మితముగా చేయుటలో కూడ గేయరచనదే అగ్రతాంబూలము. అట్టి యుత్తమ గేయకావ్యములరచనకు 19వ శతాబ్ది యొక స్వర్ణయుగమని చెప్పిన అతిశయోక్తికాదు. సారంగపాణి, సభాపతి మున్నగు పదకర్తలును, త్యాగరాజు, శ్యామశాస్త్రి మున్నగు మహాభక్తులును తమ పదములతో, కృతులతో తెలుగువారలను రసానందపరవశ మొనరించిన దీకాలముననే. అలంకారశాస్త్రగ్రంథములలో చెప్పిన నాయికల లక్షణములను అనుసరించుచు పదరచనలో సంభోగ విప్రలంభశృంగారములను పోషించి, అభినయయోగ్యమైన విశిష్టపదరచనలు క్షేత్రయ్య అంతకుముందే రచించియున్నను, 19వ శతాబ్దిఆరంభమునకు దేశమునందంతటను సంగీతమునకు మంచి వాతావరణము అనుకూలముగా ఏర్పడియుండెను. శృంగారరసపోషణచేసిన కవులున్నారు. కేవలము భక్తిరసానందముతో పరవశమంది హరిసంకీర్తనముచేసినవారును కలరు. కాని కొందరు లక్షణకర్తలు పదరచన యొక కవిత్వమా యని యీసడింపుగా అసూయతో పలికినవారును కలరు. "ముదివిటులు, విధవలంజెలు, పదకవితలు" నొకకోవకు చెందినవని ప్రబంధకవులు హేళనచేసినారు. కాని పదములు, గేయములు లక్ష్యలక్షణసమన్వితమై సంగీతమునకు సర్వవిధములుగా ఒప్పున ట్లొక యున్నతస్థాయినందుకొన్న దీ 19వ శతాబ్దిలోనే. ఈ పరిణతి లక్ష్యలక్షణసమన్వితమైన వాగ్గేయకారుల రచనల యందునను ఉన్నది. సహజ భావరసతన్మయతతో సెలయేరువలె తేనంతట అదిగా ఉప్పొంగివచ్చు దేశిరచనలయిన జానపదగేయ వాఙ్మయమునందునను ఉన్నది. ఈ రెండువిధములైన గేయవాఙ్మయస్వరూపములను ప్రాయికముగా పరికించుటయే ఈ యధ్యాయములో మా యుద్దేశము.

తెలుగు వాగ్గేయకారులలో కొందరు రాధాకృష్ణపరముగా, శృంగారపదములు రచించి నాయికాభేదములకు అనువయిన రచ

నలుచేసినవా రున్నారు. ఈ పదములలో ఇష్టదైతము పేరు ముద్రలో వచ్చును. రచన మృదుమధురమైన రసస్ఫూర్తితో అలరారుచుం డును. కొందరు శ్రీరామపరముగా కృతులుచేసి నామసంకీర్తన ముతో భక్తిప్రపత్తు లుట్టిపడజేసిరి. ఇట్టివారిలో అగ్రగణ్యుడు త్యాగ రాజు. ఆయనగూర్చి ముచ్చటించుటకు ముందు త్యాగరాజునకు పూర్వమేవచ్చిన కొందరివాగ్గేయకారులరచనలను పరిశీలించుకొం దము. అప్పటికే ఆంధ్రదేశములో అత్యంత ప్రచారములోనున్న గీత ములు, అధ్యాత్మరామాయణకీర్తనలు. రామాయణకథనంతయును 104కీర్తనలలో పొందుపరచిన కవి మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. యుద్ధకాండలోని మంగళమునకు ముందుగా 46వ కీర్తనలో చిట్టచివరి చరణములో ఇట్లున్నది.

శ్రీశేషాచల వేంకటాఖ్య లక్ష్మీరమణుని పేర
ఈశ బ్రహ్మాది లక్ష్మిసర్వేశిత్వశాలి పేరను
కోశాతీత నిరీశ సత్యజ్ఞానగురుడౌ
విష్ణునిపేరను, కృష్ణునిపేరను, ఈ శుభాధ్యాత్మరామాయణము
తెనుగుకీర్తనలుగ నేర్పరించెన్
సగుణ ముక్తామణులపేరను కౌశలంబునను
యుద్ధకాండము ఇది షట్కాండ మఖండ చిదనుభవి
రుచిరవి, సుబ్రహ్మణ్యకవి
శ్రీరాముని శ్రీమచ్చరితము శ్రీ జ్ఞానప్రసూన వినవే

ఈ గ్రంథము శేషాచలాద్రివాసుడైన తిరుమలై శ్రీ వేకం టేశ్వరస్వామికి అంకితముగా మునిపల్లె సుబ్రహ్మణ్యకవి రచించెను. ఈతని జన్మస్థలము కాళహస్తి. అందుచేతనే ఆద్యంతగీతములలో శ్రీకాళహస్తీశ్వరుని ఈ కవి ప్రశంసచేసెను.

తరుణేందు శేఖరాయ పరమపురుషాయ భవ
హరణాయ శ్రీ కాళహస్తీశ్వరాయ

అని తొలిగీతములోనూ, చిట్టచివరి మంగళగీతములో–

> శ్రీ కాళహస్తి నగరీ శంభుమిత్రునికి
> సౌకర్యశాలికి జయమంగళం సుశ్రీకకుత్స్థాన్వయ సింహాసనస్థునికి
> వివేక కార్య శేషగిరి వేంకటసుబ్రహ్మణ్యునికి
> మంగళం, శుభమంగళం

ఈతడు క్షేత్రయ్యకును త్యాగయ్యకును మధ్య వెలసిన జనరంజకుడైన వాగ్గేయకారకుడు (1760 – 1820). ఈ కీర్తనలలో విశేషము–ప్రతిపదమునను స్ఫురించు అనుప్రాసము – అంత్యానుప్రాసము.

> "వినవే శర్వాణి, అలివేణి నీరజపాణి..."
> "అందముగా నీకథవే రజతాచలసదనా, పరిహసితవినిందితారవింద
> చంద్రవదనా, కుంద బృంద సుందరరదనా,"
> "ఇంతీ, చెంగల్వ పూబంతీ, చెలువల మేల్బంతీ
> గుణములదొంతీ వినవే"

శ్రీరామజననమైనతరువాత, తల్లి కనులలో ఆ సుందరాకారునివర్ణన తెలుపు ఈ కీర్తన చూడుడు.

> శ్రీరాముని గాంచెను, పార్వతీ వినవె మన కౌసల్య
> ఆత్మారాముని గాంచెను!
> తోరమై హర్షాశ్రుపూరము, కన్నులజార,
> భయ సంభ్రమాశ్చర్యముల్ పెనగొనగా
> అల నల్ల రేకులఛాయ మేనిచే, చెలగువాని
> పసిడిచేలముగట్టినవాని, వెలయు నాల్గుభుజములవాని
> కనుగొల్కుల నరుణరేఖలు కలవాని,
> స్వర్ణ కుండలలసిత గండమండలములవాని
> అస్ఖలిత రవికోటిప్రకాశుని రత్నోజ్జ్వలకిరీటమువాని
> అళినీల కుటిలకుంతలములచే ముద్దుకులుకుచుండెడువాని॥

సీతాస్వయంవరసందర్భములో జనకమహారాజు కొలువు కూటమునకు సీతాదేవి ప్రవేశించు ఘట్టములో బేగడరాగములోని "వినీలవేణి" కీర్తనలో

పట్టుచీరకట్టి గట్టిరవికను కట్టుదిట్టముగ గట్టి మృగమదము
బొట్టు నుదుటనునిచి కనుల కాటుకబెట్టి కురులు దువ్వి చట్టముగా
కీల్కొడిచి మరిన్ మట్టుమీర వేడుకచే సరములుచుట్టి, స్వర్ణభూషణములు
మేనను దట్టముగా పూని యొక్క చెలికేల్‌పట్టి జనికునిపట్టి శౌరికి
పట్టంపురాణి నౌదు నేనని బాళితోడ కుందనపుబొమ్మవలె
నెట్టన రాజమరాళకరిగతులనెరా నిరాకరింపుచు నడిచెను. (వినీల)
తాటంకద్యుతి దిక్కులనెల్లను, దీటుకొనగ పాపట బొట్టును సరిసాటిలేని
చంద్ర సూర్యులను సయ్యాటమునను మెరయ, తేటపుముత్యపుసరులు
పతకములు మేటి చిలుకతాళితోడ బెనగొన
మాటికి నందెలు ఘల్లనమ్రోయగ దీటులేని వైఖరిని సీతావధూటి
గుణములపేటి హారకిరీటాది భూషణాఢ్యు శేషగిరీశు రామభూవిభుని
చేరి మణిహాటకమయమాలిక గళమున నిడి హరిన్ వరించితినని చనె
ముదమున

సుబ్రహ్మణ్యకవి రామాయణకీర్తనలేగాక కొన్నిపదములు రచించెనని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు 'భారతి'లో ప్రకటించిన ఒకవ్యాసములో పేర్కొన్నారు. దామెర కుమార వేంకటేంద్రునిగూర్చియును, ఆయనకుమారుడైన కృష్ణస్వామిని గూర్చియును పదములు రచించెనట. వానిలో ఒకటి – ముఖారి రాగము.

పల్లవి: మనసువచ్చితే రమ్మనవే దామరల కుమారవేంకటేంద్రుని
అ.-ప. వనితరో చెలగును పరిపరిగతులను బహుబంధంబుల పెనగుదును నాసామిని

చ॥ సదయుడని మ్రొక్కి సారెకు వానిపై పదములు వినిపింతును
మదిరాక్షి నా సామి మది, రా, నడచి, దక్కి మనవిఅంతయు తెల్పుదు
మృదుపాదములు తమకమునను వానితొడలమీద నుంచుకొందును
కుదురుగ బాగాలొసగి ఆకుమడుపును నేకోరికి సగమందింతును, నాసామిని॥

కోరికలిమ్మని కురులచేకట్టుదు కొట్టుదు విరిసరుల
తీరైన మన్నెహజూరు డనుచు ఊరకె నే నుండను
ఔర మంచిది కాని - లేరా ఓరి యని నేరములెన్నుదును
పేర బిలి చొకసారి పెనగొందు నొకసారి
పెనగొందు - పైకొందును - నా సామిని॥

పురుషుని విరహము వర్ణించు ఒకపదము-

ప॥ చెలియ యీ విరహ మగ్గలమాయె నెట్లోర్తు
చెలిని తోడితేవె...

అ॥ ప॥ చెలగి చంద్రుడు కాయగ నెలమి మరుడేయగ
చిలకలు గూయగ, అళులు రొదసేయగ-

చ॥ సరసముతోడ నా సరణి వీణమీటుచు సరసగతుల వాయించుచు
భరతప్రౌఢిమ మీర భావజ్ఞుడై ధరవెలసిన శ్రీ దామెర వెంకట
ధరణిపాలుని తనయా కృష్ణాయని ననుగూడె-

సుబ్రహ్మణ్యకవి గొప్ప భక్తుడు, ఆధ్యాత్మికనిష్ఠాగరిష్ఠుడు. అయినను శృంగారభావములను జీవితములో అనుభూతిపొందిన వాడని ఈ పదములబట్టి గ్రహించవచ్చును. అంతవరకు తెనుగు దేశములో హెచ్చు ప్రచారములోనున్న క్షేత్రయ్యపదముల ఛాయలు ఇందుకొంతవరకు ప్రతిఫలించును. ఈతనిలోనే కాదు, 18వ శతాబ్ది చివరిభాగములోవచ్చిన పదకర్తలందరియందును ఈ ప్రభావము కనిపించును. త్యాగరాజునకుముందున్న గేయకర్తలలో పచ్చిమిరియమ్ ఆదియప్పయ్య (1740 - 1833) చక్కని రచనలుచేసెను. వానిలో భైరవిరాగములోని 'విరిబోణి' వర్ణము అత్యంత ప్రసిద్ధమైనది.

ఈ కాలమునకు చెందిన మఱొక వాగ్గేయకారుడు మాతృభూతయ్య. రెండవ తులజామహారాజుకాలములో ఉండెనట. ప్రతాపసింహునికొలువులో చేరి, అఖండసన్మానముపొంది, నీతిపదములు, కీర్తనలు రచించుకొనుచు కడపటికాలము తిరుచినాపల్లిలో గడపెనట. ఈతడు పారిజాతాపహరణమను యక్షగానము రచించెను. అందు చల్లనమ్మబోవుగొల్లపడుచు చదువు పద్యమొకటి యీతని కవితాప్రతిభను చూపును.

ముక్కర శుక్రు డిచ్చె నయమొప్పగ కమ్మలు సూర్యు డిచ్చె పెం
పెక్కిన తార హారములు పేర్మిని చందురు డిచ్చె, నింద్రుడున్
మెక్కువలైన కంకణము లిచ్చెను, పాపటబొట్టు శంభుడున్
చక్కని సూర్యచంద్రులను శారద యిచ్చెను - నాదు చల్లకున్

ఇది గొల్లకలాపములోని భావములను స్ఫురింపజేయుచున్నది.

ద్విపద: శ్రీరమ్యమైనట్టి చిక్కనిచల్ల, సారస్యమైనట్టి చక్కనిచల్ల
కూరిమి కొనరమ్మ కొమరైనచల్ల, భారతి గొన్నట్టి బాగైనచల్ల
శ్రీరమ కొన్నట్టి చెలువైనచల్ల, పార్వతి కొన్నట్టి పరువైనచల్ల
నవ్వుచు గొనరమ్మ నాచేతిచల్ల, నల్లావుపితికిన నయమైనచల్ల.

దక్షిణభారత సంగీతచరిత్రలో స్వర్ణఘట్టమనునది (1750 – 1850) మధ్యకాలము. ఈ సమయములో కర్ణాటకసంగీతమునకు కౌస్తుభాభరణములను కైసేసిన త్రిమూర్తు లుద్భవించిరి. వీరి రచనలన్నియును 1800 – 1850మధ్యకాలములోనే విశేషప్రచారములోనికివచ్చినవి. వీరుముగ్గురును త్యాగరాజు, శ్యామశాస్త్రి, దీక్షితులు; ఈ మువ్వురును సమకాలికులు. మువ్వురును తంజావూరులోని తిరువారూరుకు ఏదోవిధముగా సంబంధించినవారే. సంగీతసాహిత్యముల సమ్మేళనము వీరిమువ్వురిరచనలలోను పరిణతినందినది.

త్యాగరాజు :

గాలిలో తేలిపోవు అసంఖ్యాకమైన రాగరాగిణులకు త్యాగరాజు ఒక యాకారమిచ్చి, మాధుర్యమును రాగజీవస్వర

ములను తన సాహిత్యకృతులలో బంధించి అమృత గుళికల నందించెను. 24000కుపైగా రచించిన యీతని కీర్తనలలో వెయ్యి వరకుమాత్రము నేడు లభించుచున్నవి. అవి చాలు, త్యాగరాజు తన యసాధారణప్రతిభతో సాధించిన యఖండవిజయమును నిరూపించుటకు. త్యాగరాజు వచ్చువరకు సంగీతము నృత్యానుకూలముగా అభినయించి ప్రదర్శించుటకు వీలుగా ప్రదర్శితమైనది. ఇందు శృంగారరసమునకే ప్రాధాన్యము. రాధాకృష్ణపరమైన మధురభావ సమ్మిళితమైన వైష్ణవసంప్రదాయరీతిని భక్తిరసముకూడా కలిసియున్నను శృంగారమే హెచ్చుగా ఉండెడిది. ఆసమయమున త్యాగరాజు కేవలము గానముచేయుటకుమాత్రము అనుగుణమైన కీర్తనలను రచించెను. ఇట్టికీర్తనలకు త్రోవచూపినవారిలో ప్రథముడు త్యాగరాజే. అంతేకాదు, సంగీతమును శృంగారమునుండి తప్పించి, "స్వరరాగసుధారస"ముతో రంగరించి, "రాగము తాళము రక్తి భక్తియు జ్ఞానవైరాగ్యము" కావలెనని "సంగీతజ్ఞానమే సారూప్యసాధన"గా గ్రహించెను. "సప్తస్వరసుందరులచే శోభిల్లు మూలాధారస్వరూపుని" సాక్షాత్కారముపొందెను. నిత్య భక్తితత్పరుడై రామనామసంకీర్తనాపరాయణుడై నిరంతర హరిభజనచేసెను. ముక్తకంఠముతో రససిద్ధిపొంది తన హృదయములో ఉప్పొంగి వచ్చు భావపరంపరలకు ఒక నాదస్వరూపమునిచ్చి పాడుకొనెను. అందుచేత వ్యాకరణమునకు,లక్షణములకును తడవుకొనక వ్యావహారికమైన సహజపదజాలమును వాడెను. అందుచేతనే యీయనకృతులలో వాడుకలోనున్న సామెతలును, నుడులును కోకొల్లలుగా లభించును.

"రూకలు పదివేలున్న చేరెడు నూకలు గతిగాని ఓ మనసా
కోకలు వెయ్యున్న కట్టుకొనుట ఒకచేగాని"
"ఊరేలిన తావండుట మూడుమూర తావుగాని
నూరు భక్షణము లబ్బిన నోటి కంతగాని"
"ఏరునిండి పారిన పాత్రకు తగునీరు వచ్చుగాని

సారమౌ కవితల విని వెర్రివాడు సంతోషపడి యేమి పడకేమి ?
తురకవీధిలో విప్రునికి పానకపూజ నెరయజేసి యేమి, సేయకుండేమి"
"ఇరవొందగ భుజియించు సమయమున ఈగతగులురీతి నున్నది"
"సోమిదమ్మ సొగసుగాంఁడ్ర గోరిన సోమయాజి స్వర్గార్హుడౌను"

సమకాలీన సంఘముపైన వేమనయోగివలె విమర్శలుచేసిన జ్ఞాని త్యాగయ్య.

"ఉప్పు కర్పూరమువరకును ఉంఛవృత్తిచే నార్జించి
శ్రీపతిపూజల మరచి చేసినట్టివారివలెనె"
"భ్రమపడి ఇరుగు పొరుగు భక్షింప రమ్మని పిల్వ
అమరుచుకో, పూజ జపము, సాయముచేతుననుచు"
బ్రాహ్మణీకము బాయ నీచుల బ్రతుకాయె నదిగాక
బ్రాహ్మమైన మాటలు నేర్చుకొని బరగేరయ్యా"

తాను రచించిన కీర్తనలకు రాగములను నిర్ణయించుటలో కూడా త్యాగరాజు ప్రత్యేకశ్రద్ధచూపెను. ఈతనికృతులలో భావము రాగము అర్థములు ఒకదానితో నొకటి చక్కగా మిళితమైపోవును. ఉదా: 'సరసాంగి' రాగములోనున్న కృతి.

మేనుజూచి మోసపోకే మనసా
మాయమయమగు చాన॥ మేనుజూచి॥

అట్లే, కళానిధియగు పరమపురుషునితో నాయిక మనవిచేసికొనువిధమున కూర్చిన కీర్తనను 'కళానిధి' రాగములో రచించిరి.

చిన్ననాటనే నా చేయిబట్టితివి
విడనాడుదామనో, ఏలుకొందమనో॥

తొలికీర్తనలలో త్యాగరాజు ప్రాసాంత్యానుప్రాసలను పాటించి శబ్దాలంకారములపైన ఎక్కువ మక్కువ చూపెను.

"బాల కనకమయచేల, సుజనపరిపాల, శ్రీరమాలోల
విధృత శరజాల" "శ్రీదయా నాతో వాదమా, నే భేదమా ఇది మోదమా"

ఇట్టివి చాల యున్నను రానురాను భావప్రధానమైన మాటలకే ప్రాధాన్యమిచ్చి అర్థగాంభీర్యమునే తనకృతులలో హెచ్చుగా ప్రదర్శించెను. ఆనాటి కుహనాభక్తులను చూచి ఆయన నిశితముగా విమర్శించెను.

"తెలియలేరు రామభక్తిమార్గమును
వేగ లేచి నీటమునిగి భూతిఁబూసి, వేళ్లనెంచి వెలికి శ్లాఘనీయులై
బాగ పైకమార్జనలోలురైరే గాని"
"కోసిచ్చేదే గొప్పయనురా కలిలో రాజులకు
దాసులు సేవింపరను ప్రభువులు దయమానిరి పరమెంచగబోయిరి
రాజాంగముకొరకు నాల్గుజాతులరక్షణ పరసుఖమో
రాజసులై సన్మార్గమెరుగక పరాకుసేయ ఘనమో
ఆజన్మము గొలిచే విప్రవరుల కానందము గలదో!"

ఇట్లు నాటి రాజుల రాజసప్రవృత్తిని, విప్రుల హీనగుణమ్మును గేలిచేసిరి. త్యాగరాజు మహాభక్తుడు; ఒకరిని తనియించుటకు రచనచేయలేదు. ఒకరికొఱకు గానముచేయలేదు. ఆత్మానందముకొఱకు, తన యిష్టదైవమైన రాముని కొలుచుటకు ఒక భక్తి సాధనముగా తన సంగీతము నుపయోగించెను. ఎన్నినిధులనిచ్చినను పరులకొలుచుటకు నిరాకరించెను.

నిధి చాల సుఖమా - రామునిసన్నిధి సేవ సుఖమా
దధి నవనీతక్షీరములు రుచో-దాశరథిధ్యానభజన సుధారసము రుచో

అని తర్కించుకొని ఇహసౌఖ్యములనుబంధములలో చిక్కుకొనక.

"కొన్న కాంతలను - కన్నబిడ్డలను
వన్నె చీరలను - వానగుడిసెలను
తిన్నగా గని - దేవలోకమను
తన్నుకోళ్ళలో' - చిక్కవలదని"

మనసునకు వైరాగ్యము బోధించెను.

నామకుసుమములచే పూజించే నరజన్మము జన్మము మనసా॥ శ్రీమన్మానస
కనకపీఠంబున చెలగజేసికాని పరశివరాముని॥
వేదస్వరమను వర నవరత్నపువేదికపై సకలలీలావినోదుని
పరమాత్ముని శ్రీరాముని పాదములను త్యాగరాజహృద్భూషణుని॥
నామకుసుమములచే పూజించే నరజన్మము జన్మము॥

అని యెంచి సంతతము శ్రీరామనామసంకీర్తనాపరుడై, 'రామభక్తిసామ్రాజ్యము'లో విహరించిన ధన్యుడు.

త్యాగరాజు సంగీతబ్రహ్మ; రాగసుధార్ణవమును తరచి అమృతముచిలుకరించిన స్వరనిష్ణుపు ఆధ్యాత్మతత్త్వయోగి. మాట లేవియైనను భాష యేదియైనను - లక్ష్యబద్ధమైన కర్ణాటకసంగీతము నకు అమృతోపమమైన స్వరగుళికలతో స్వరూపమొసగిన నాద బ్రహ్మ. ఆత డొక అవతారమూర్తి. ఆతని కతడే సాటి; సాహిత్య మునకు ఒక కాళిదాసు, సంగీతమునకు ఒక త్యాగరాజు.

త్యాగరాజు, శిష్యవర్గము:

త్యాగరాజశిష్యపరంపరలో పలువురున్నను - ఆయనభక్తి శ్రద్ధల నలవరచుకొన్న సాహిత్యసంగీతవేత్త పట్టణము సుబ్రహ్మ ణ్యయ్యరు. గురువుగారివలె, "అభిమాన మెన్నడు గల్గు రామ, అన్నవస్త్రములకేమి త్రోవయని యెన్నడైన నిన్నడిగినానా" అని తరచు వారు పాడెడివారట. మధ్యపల్లవికిని చరణమునకు జాగా వేసి పాడుచుండుటలో వారిస్నేహితులు చమత్కారముగా నేటిపాట "అభిమానమునకా ?" "అన్నవస్త్రములకా" యని ప్రశ్నించు చుండువారట. పట్నం సుబ్రహ్మణ్యయ్యరుకృతులలో "వరము లొసగి బ్రోచుట నీ కరుదా యెగదా" యని "కోరినవరమొసగు మయ్య కోదండపాణి" యని రచించిన కీర్తనలు బహుజనాభిమాన మును చూఱగొన్నవి. త్యాగరాజుశిష్యకోటిలో వీణ కుప్పయ్యరు, తిరువత్తియూర్ త్యాగయ్య పేర్కొనదగిన వాగ్గేయకారులు. త్యాగయ్యగారు 'సంకీర్తనరత్నావళి' యనుపేరున 108రాగములలో

భక్తిప్రధానమైన కీర్తనలు రచించిరి. 'పల్లవి స్వరకల్పవల్లి' యను సంగీతగ్రంథమునుకూడ పల్లవిస్వరములను పెంచి పాడువిధానమును వివరించుచు వ్రాసిరి.

శ్యామశాస్త్రి :

త్యాగరాజు సమకాలికులలో శ్యామశాస్త్రిలును, ముత్తుస్వామిదీక్షితులును ధాతుకల్పనాదక్షులయిన వాగ్గేయకారులు. శ్యామశాస్త్రి కంచికామాక్షిని, బంగారుకామాక్షిని ప్రస్తుతించుచు దేవీపరముగా అనేకకృతులను రచించెను. అట్లే మధురమీనాక్షి మీద మహనీయమైన కృతులు రచించినారు. అట్టివానిలో విశేష ప్రచారములోనున్న శంకరాభరణకీర్తన నిక్కడ ఉదాహరించుచున్నాము.

ప: సరోజదళనేత్రీ హిమగిరిపుత్రీ నీ పదాంబుజములె
సదానమ్మితినమ్మ శుభమిమ్మా శ్రీ మీనాక్షమ్మా

అ. ప. పరాకుసేయకు వరదాయకి నీవలె నేదైవము లోకములో గలదా
పురాణి శుకపాణి మధుకరవేణి సదాశివునికిరాణి....

చ॥ కోరివచ్చినవారికెల్లను కోర్కెలొసగే బిరుదుగదా అతి
భారమా నన్నుబ్రోవ తల్లి కృపాలవాల నే తాళజాలను॥
ఇందుముఖి కరుణించుమని నిన్నెంతో వేడుకొంటిని - నా
యందు జాగేలనమ్మ మరియాదగాదు దయావతివీవు....॥
సామగాన వినోదినీ గుణధామ శ్యామకృష్ణ వినుతాశుక
శ్యామలాదేవి నీవే గతి రతికామకామ్యద కావవే నన్ను॥

దీక్షితులు:

ముద్దుస్వామిదీక్షితులు త్యాగరాజసమకాలికుడైన ఆధ్యాత్మికపరతంత్రుడై సంగీతసాహిత్యములను భక్తిసాధనలుగా వినియోగించిన పరమభక్తుడు. శ్రీచక్రపూజచేసి, శ్రీవిద్య నుపాసించి దేవీపరముగా నెన్నో రచనలుచేయుటయేగాక, మంత్రశాస్త్రములో

కృషిచేసి, నవగ్రహకీర్తనలు, నవావరణకీర్తనలు రచించి ప్రఖ్యాతుడాయెను. ఈకీర్తనలన్నియును సంస్కృతభాషలోనే రచించెను. ఎట్టియాపురపుసుబ్బరామదీక్షితులు తెనుగునవ్రాసిన సంగీతసంప్రదాయప్రదర్శని, సంగీతశాస్త్రాభ్యాసమునకు అనువైనఅత్యుత్తమగ్రంథము. దీనిగ్రంథకర్త తమిళుడైనను తెలుగుభాష నభ్యసించి వివిధలక్షణములను విరివిగా విస్పష్టముగా గమకతాళాదిచిహ్నములతో సంగ్రహించి ప్రకటించెను. ఇంతటి ప్రామాణికమైన "సంప్రదాయప్రదర్శని" సంగీతమునుగూర్చి ఇంతకుముందుగాని వెనుకగాని రాలేదు. 19వ శతాబ్దిమధ్య వచ్చిన సంగీతవరప్రసాద మిదియని చెప్పవచ్చును. 19వ శతాబ్దిలో తెనుగులో పుట్టినన్ని సంగీత లక్షణగ్రంథములు తక్కిన యేభాషలోను పుట్టలేదు. వీనిలో చెప్పదగినవి తచ్చూరి సింగరాచార్యసోదరుల సంగీతపారిజాతాదిగ్రంథములు, వీణ రామానుజయ్యగారి సంగీతసర్వార్థసారసంగ్రహము, శ్రీనివాసయ్యంగారి గానభాస్కరము. ఇవిగాక ఇంకను ఎన్నో సంగీతలక్షణగ్రంథములు 19వ శతాబ్దిలోనే వచ్చినవి.

మేరట్టూరువారు :

త్యాగరాజు సమకాలికుడైన మేరట్టూరు వేంకటరామశాస్త్రినిగూర్చి ( 1798 - 1855 ) యక్షగానముల ప్రసక్తిలో చెప్పుకొన్నాము. ఈతడు 12 యక్షగానములను రచించుటయే గాక, "చిందు" అను ఒకరకపు గేయములను అద్వైతకీర్తనలను రచించెను. అద్వైతకీర్తనలలో ఒకటి "తోట వేసినాను ఇప్పుడు" అని ప్రారంభమగును. ఈయన రచించిన ఉసేనిరాగస్వరజతి భరతనాట్యప్రదర్శనములలో తరచు నృత్యముతో అభినయించుదురు. "ఏ మాయలాడిరా ఏమని బోధించెరా ?" అని ప్రారంభమగు ఈ స్వరజతిలో ఖండితనాయిక వర్ణితమైనది.

"చిందు"నకు ఉదాహరణముగా వీరిరచన యొకటి, "సంగీతసర్వార్థసారసంగ్రహము" అను లక్షణగ్రంథము ఉల్లేఖించియున్నది

నాదనామక్రియ – ఆదితాళము

పల్లవి : తళుకు బెళుకు కులుకు గల మిటారిరా యేరా నా స్వామి

అ. ప. తళుకు బెళుకు కులుకుగల మిటారి
వలపు దెలుపు సొలపు చూపులదారి
కలిగి చిన్నారి పొన్నారి వయ్యారి
ఘనుడ, మల్లాజేంద్రా నిను గోరి....

చి॥ పగడాలు సొంపు జిగిడాలుఅలరు జాతికెంపుల నగజాలు
చిలుకసకికి కెంజేయనజాలు, చిలుకలకొలికి వాతెర జిగిడాలు
సులలిత నయగుణములుగల యింతిరా, వలరాజుదంతిరా, యిలగల
లలనలలో మేల్బంతిరా, నెమ్మోనికాంతిరా, తెలివగు మెరుపులలో
నడి తంతిరా సొబగైన గొంతిరా -

అని ప్రతిపదానుప్రాసలతో వింత లయవిన్యాసాలతో నృత్య మునకు అనుగుణంబుగా నడచుచుండును.

దొరస్వామయ్య :

శరభోజీ శివాజీరాజులు (1798 – 1855) యక్షగానములు రచించియున్నారు. వీరికాలమునకుజెందిన పుదైయూరు దొరస్వామయ్య (1782 – 1816) అనేకపదములను కృతులను రచించెను. ఇవి 49వరకు ఉన్నవట. ఈయనకు సంగీత నాట్యశాస్త్రములలో చక్కని ప్రవేశమున్నది. అందులకే చిదంబరదేవాలయములో నటరాజస్వామిజరిపిన తాండవవిలాసమును వర్ణించుచు నాలుగుకీర్తనలు జేసెను. వానిలో ఒకటి—

గౌళిపంతు – ఆదితాళం.

ధూర్జటి నటించెను - ప్రదోషసమయమునను
ఊర్జితముగ రజతాద్రిలోన నత్యున్నతమౌ వజ్రమంటపమున
సుర అసురులు కిన్నరు లిరుగడ కొనియాడ - నందీ
శ్వరవరకర మురజరవముతోగూడ—

ఉరగము లసియాడ జడనుండు ఉవిద జడిసి వేడ
మెరయుచు నరచందురు చిరువెన్నెలగాయ ప్రణవనాదము ప్రోయ॥

మురహరు డతిదురమున డమరువు పలికింప
సరసిరుహ భవు పెదవులదరగ కొని పింఢ
వరుసక్రమముగాను బాగుగ నవరసకళలతోను
దరహసిత ముఖాంబురుహమున ముద్దుగార, చిరుచెమటలూర
వర నూపుర మణులు చరణముల ఘలుఘల్లన

అరకాల నమరు నసురునికి గుండె ఝల్లన - మరువై రివగను
సుబ్రహ్మణ్యునిలాగను
కరునను కనికరమునను జూచి కరుణింప - మేను పులకరింప॥

ఈతనికవిత ఉన్నత శ్రేణికి చెందినదనుటకు చిదంబర నట రాజస్వామి తాండవకేళియనంతరము పాడుటకు రచించిన పవ్వళింపు సేవ ఒక ఉదాహరణ:

ఆహిరి - జంపె

పరహంస నాలోన పవళింపవే -
పరమపావన దయాపర దిగంబర చిదం
బరపురమున నటించి బడలితివి చాల॥ పరహంస॥

తనువనే సభను విస్తారంబుగాను
వెనర నే చప్పరము నిర్మించినాను
మనమనే బంగారు మంచంబులోను
ప్రణవమను పూపాన్పు పరచియున్నాను॥ పరహంస॥

ధ్యానమను హేమపాత్రాంతరములోను ఆ
నందమనియేటి దుగ్ధాన్నమిడినాను
నీ నామమనెడి తేనియను బోసేను
పూని భజియించి జో జో పాడినాను॥ పరహంస॥

తెలివియను మాణిక్య దీపంబిదోను
వెలుగు సుబ్రహ్మణ్య వినుత నీకేను

వెలలేని భక్తియను విడెమునిచ్చేను
కలయ నా బుద్ధియొా కాంతినిచ్చేను॥

పలుకుకండచక్కెరలలో పరవశముగా కరగిపోవు భావముల సొగసుతనము అపరూపము.

సభాపతిపదములు:

భాగవతులకు ప్రసిద్ధికెక్కిన 'ఊత్తుకాడు' గ్రామములోనున్న మూవనల్లూరు సభాపతయ్య పదములు రసభావస్ఫూర్తికి కవితావిశిష్టతకును పేరొందినది. 1860ప్రాంతములో రాజమన్నార్గుడి, తంజావూరుప్రాంతములలో పేరొందిన ఈ కవి రాజగోపాలపరముగా అనేకపదములు రచించెను. అవి మంజులపదభరిత శృంగారరసభావములకు ప్రసిద్ధికెక్కినవి.

దారిచూచుచున్నది నీదు ప్రియతరళాక్షియొా చిన్నది
వారిజముఖి నీవు వచ్చువేళను కొని కోరికతో రాజగోపాలసామి॥
వెన్నెలగాయగ వేడ్కమీర మంచి సన్నజాజి విరిసరులును గందము
పన్నీరుచెంబులు పడకింటిలో నుంచి, వన్నెలాడి తలవాకిట నిలిచి॥దారి॥
ఏ వగనైనను ఎందు చప్పుడైన, నీవో యని యెంచి నిలిచి తిరిగిచూచి
ఈ వగచిత్తము నిచట నిలిపినట్టి, భావం బెవరికి బయలుగానీక॥ దారి॥
పచ్చిపచ్చిగా పదములుపాడుచు, వచ్చి రాజగోపాలసామీ నీవు
ముచ్చటలాడుచు ముద్దులువెట్టుచు, గుచ్చి కౌగిటజేర్చి కూడుట దలచి॥ దారి॥

ఈనాటి భావగీతికవలె ధ్వనించు మరొకపదము.

బిలహరి – మిశ్ర

ప. ఈలాగు పాంథుడవు నీవు ఒంటరిగాను యిప్పు డెచ్చటి కేగేవు వేగను
అ. ప. మేలపయోధరములుచేరి యెదుటను మెరయగ గోపాలహరి యనుచును
చ. చెంతనుండెడి గుడిచాటు చేరక, శ్రమముదీరను సుఖమొందగోరక
సుంత యీ తరువున జూచియయిన నిలువక, ఎంతసుఖముచేయు నీ
కొమ్మయనుకోక॥

నీవు కట్టుకోక నిటు బాళితుంచక, నీవేళ భూసురహితము మాటవినక
త్రోవనడచుటకు తోడెవ్వరునులేక, ఈవగ ముందువెనుక యోచింపక
ఎవ్వ రింద రా నెరుగనట్టితావు, జవ్వని నన్నొకతె నిందు గనినావు
అవ్వలనైన నిందు నిలువలేవు, హరిహరి గోపాల యేల భ్రమిసేవు॥

ఇందలిభావములు రవీంద్రునిగీతాంజలిలోని "కేనో పాంథో యీా చంచలతా" వంటి గీతములోనివాయని స్ఫురణకుతెచ్చును. పదకర్తలలో పరిమళరంగని పదములు చక్కని చిక్కని శృంగారరసమునకు ఉదాహరణములైనవి.

ఘంటారవం:— మరవదు నాథునిచిన్నెలు మగువరో యెంతని తెలుపుదు
సరసముజేసెడు వింతలు జాడల నా మనసు
నున్నగ కురులను దువ్వుచు సన్నపుజాజి విరులను
మిన్నగ కొప్పున తురిమిన మెలకువను మనసు
ఎన్నగ పయ్యెద తొలగించి జాతి పన్నీరు చిలికిన
వెన్నుని చక్కదనమ్ము వేమారు నా మనసు ॥

ఇట్టిపదముల నెన్నింటినైన చెప్పవచ్చును. కాయలపేరులతో శ్లేషసూచించు పదమొకటి శోభనగిరిపదములలో రూపొందినది.

చెలియ నీతో పొందు చింతకాయ
తలపెట్టినంతనే దానిమ్మకాయ
అలివేణి నీ పొందు నలుకగుండెనకాయ
యల చందురుడు మింటనంటికాయ
మెలత వెన్నెలబైట మేను కాకరకాయ
కులుకు కుచములమీద గోరువంకాయ

సుబ్బరాయశాస్త్రి :-

తరువాతవచ్చిన వాగ్గేయకారులలో శ్యామశాస్త్రికుమారుడు సుబ్బరాయశాస్త్రి(1803-1862) చక్కనికృతులు రచించెను. ఇవి మధురమీనాక్షీ దేవాలయములో ప్రసిద్ధమైనవి. ఈయనగురువు త్యాగరాజు-నిను వినా గతి గాన అను కళ్యాణిరాగకీర్తన విని

యెంతో మెచ్చుకొన్నారట. రాగభావకీర్తనలలోని సంగీతసాహిత్య ములమేళనము ఈకృతులలోకూడ స్ఫుటముగా కన్పించును.

రీతిగౌళ - చాపు

ప. జననీ నిన్ను వినా త్రిలోకజననీ దిక్కెవరమ్మ జగములోన గా నా
అ. ప. మనసిజ మానసస మ్మోదిని వినవే నా మనవిని విని నన్ను బ్రోవుము
వరదాయకి గాదా ? యొక్కని బ్రోవ నరుదా ? దయరాదా?
వెరనమ్మిన నాతోను వాదా, ? సరసిజభవహరిహరనుతపాదా। ॥ జననీ॥
కరుణానిధి నీవు వేగమె వచ్చి కరుణతో నను బ్రోవు
గిరిరాజకుమారివై నావు పరితాపములనెల్ల పరిహరించేవు॥ జననీ॥
వనజాయతనేత్రి కుమారజననీ కామితదాత్రీ
ఘన పాపలతాలవిత్రి , సనకాదిమునిజన సన్నుతపాత్రీ॥ జననీ॥

స్వాతితిరునాళ్ :

త్యాగరాజుసమకాలికులలో మరొక ప్రసిద్ధ వాగ్గేయకారుడు తిరువాన్కూరు మహారాజు స్వాతితిరునాళ్. ఈయన 1829నుండి 1847వరకు తిరువాన్కూరు పరిపాలనచేసిన సంగీతపోషకుడు. కుల శేఖర పెరుమాళ్ అనికూడ ఈయనకు మారుపేరు. 1813లో జన్మించి 34వ యేటనే కీర్తిశేషుడయ్యెను. ఈయన ఆంగ్ల, పారశీక, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక హిందూస్థానీభాషలలో పాండిత్యము సంపాదించి, సంస్కృత మళయాళ మణిప్రవాళభాషలలోను తెలుగులోను కృతులు రచించెను. ఎందరో సంగీతవిద్వాంసులను తన యాస్థానములో నుంచి పోషించెను. ఈయన రచించిన పదవర్ణములలో "సరసిజనాభ" యను కాంభోజిరాగవర్ణమును, యదుకులకాంభోజిలోని 'సామి నిన్నే నమ్మితిరా' యను వర్ణమును ప్రసిద్ధికెక్కినవి. ఈతడు 21 వర్ణనములు రచించెను. ఇతడు తెలుగులో పదములు జావళీలు కూడ రచించెను.

సైంధవిరాగం - జావళి

ఇటు సాహసములు ఏల నాపై చక్కని సామి
ఇటులు వగలు తాళ నా తరమా॥
ఇక చిన్నదాన నేను మగవానిముఖము నెరు
గక నే నున్నాను వగకాద నీ కిది మేర
గాదె వలపు న్యాయమెరుగు నా సామి
మనసురంజితమయ్యే నీకు తగిన మగువతో
ఈ వగలుంచ వలను వినవేర నా పలుకులు
ఈవేళను వింతలు చాలు చాలు నా సామి॥
సరసిజనేత్రుడ నీ కరుణవల్ల చాల
యౌవనము వచ్చేనాడు మరుకేళిలోనే నిను
లాలింతు సరసపంకజనాభ నా సామి

తూము నరసింహదాసు :

భక్తికీర్తనలనుమాత్రము రచించిన కవులనేకులున్నారు. అట్టి వారిలో రామదాసుకీర్తనలననుసరించి (1812-1878) కీర్తనలుచేసిన తూము నరసింహదాసు ఒకరు. ఆంధ్రదేశములో ఆబాలగోపాలమును భజనసంకీర్తనలుగా పాడుకొనుట మనము విందుము.

"భజనచేసే విధము తెలియండి, జనులార మీరు
నిజము గనుగొని మోదమందండి" - (అందరికి తెలిసిన కీర్తన.)

ఈ భక్తుడు గుంటూరునుండి భద్రాచలమున కేగి, అచ్చట రామదాసుగూర్చి అనేకకీర్తనలు రచించి భద్రాద్రియందే శ్రీరాములవారితో ఐక్యమందినట్లు వీరినిగూర్చిన హరికథలో నున్నది.

ఏకాంతసేవావిలాసము :

త్యాగరాజు సమకాలికుడైన మద్దిరాల వేంకటరాయకవి అనేక భక్తికీర్తనలను (1795-1850) ఏకాంతసేవావిలాసము, ధూపసేవాకీర్తనలు, ఏకాంతసేవయను శీర్షికలతో మూడుభాగములుగా పిఠాపురములోని కుక్కుటేశ్వరస్వామిగూర్చి స్తోత్రములుగా రచించినాడు. ఏకాంతసేవావిలాస మొక నాటకము. ఇందలి దరువులు

చక్కగానుండును. మర్రిచెట్టుక్రింద స్వప్నములో శివుడు పాడుమని కోరెనన్న పాట—మత్తకోకిలనడకలో నున్నది:

ఆకుమడుపులు పంపెరా యిదె అందుకొమ్మిటు చూడు నీ
రాకకే యెదురౌచునున్నది రాజసంబున బ్రోవరా
శ్రీకరంబగు నింటికిన్ దయసేయరా తడవాయెరా
ప్రాకటంబుగ కుక్కుటేశ్వర భామ నిన్ పిలిచిందిరా॥

సవతులకయ్యమును తెలుపు గంగాగౌరీ సంవాదము—

గంగ - ఆటాకత్తెవు నీవు గౌరు
గౌరి - వేల్పుటాటకత్తెవు నీవు గంగా
గంగ - కోపించ లోకులు నవ్వారె గౌరు
గౌరి - నా పంచ జేర నీ వెవ్వారె?
గంగ - పోరెందుకే మనకు గౌరు - చాల
గౌరి - నోరుండె తలగాచు గంగా
గంగ - కలసియుందము మనము గౌరు
గౌరి - మిక్కిలలసినదానవె గంగా ॥

జావళీలు :-

విజయనగరములో ఆనందగజపతికొలువులో గొప్ప సంగీతవిద్వాంసు లుండెడివారు. అట్టివారిలో వీణ పెదగురవాచార్యులుగారు (1794-1822) బొబ్బిలి కేశవయ్యగారితో విద్యాగోష్ఠిజరిపి, గీతములు, వర్ణములు, తిల్లానాలు, స్వరపల్లవులు, శృంగారపదములు, జక్కిళిదరువులు మొదలైనవి రచించిరట. త్యాగరాజుకీర్తనలకు ముందు వీరికీర్తనలే సంగీతసభలలో ప్రచారములో ఉండెడినట. 19 వ శతాబ్ది చివరిపాదములో ప్రసిద్ధికెక్కిన సంగీతరచనలు జావళీలు. శృంగారరసాత్మకమైన ఈ రచనలు, హిందుస్థానీ రాగములలో దురితగతిని నడచుచు నృత్యాభినయములుగా వీలుగా నుండును. ఇట్టివానిని రచించినవారిలో స్వాతితిరుణాళ్ మహారాజు తరువాత, ధర్మపురి సుబ్బారావు, రామ్నాడు శ్రీనివాసయ్యంగారు, తిరుపతి నారాయణస్వామి మున్నగువారు ప్రసిద్ధికెక్కిరి.

శ్రీనివాసయ్యంగారు రచించిన కాపీరాగ జావళీ, "సరసము లాడేటందుకు సమయ మిదికాదురా నా స్వామి" కమాన్ రాగములోని "కొమ్మరో వాని కెంత బిగువే" మంచిప్రచారములో నున్నవి. ధర్మపురి జావళీలలో ప్రసిద్ధికెక్కినవి "స్మరసుందరాంగునికి సరియెవ్వరే', 'అది నీపై మరులుకొన్నది' 'స్మరపాణిసఖుడు' "ఏమందునే ముద్దుబాలామణి" మొదలైనవి. పూంజి శ్రీనివాసయ్యంగారి "నిరుపమాన సామిని నా నిలయమునకు రమ్మనవే" అను జావళీ, తిరుపతి నారాయణస్వామిగారి 'వగలాడిబోధనలను వలచితివో సామి," మరొకరి "చెలి నే నెట్లు సైరింతునే" మంచి ప్రచారములోనున్న జావళీలు. ఇవియన్నియును శృంగారమును కొంచెము హద్దువిడిచి వర్ణించినవనుకారణముచేత ఈకాలమువా రెవ్వరును అంతగా సరకుగొనువారుకారు. అది యాకాలపు అభిరుచులకు తార్కాణమనవలెనేకాని, నేటి గీటురాయితో అప్పటి పాటల మేలిమికి విలువకట్టిన అవి నిలువవు. ఆసమయమున నృత్యగీతములను నట్టువనాండ్రు అభినయించి రాజుల కొలువులలో సన్మానమందుట పరిపాటిఅయినది. ఆ రాజులు రసికులు; శృంగారరసప్రియులు; అందుచేతనే శృంగారరసప్రధానమైన ప్రబంధవర్ణనలను అభిమానించినట్లే, శృంగారప్రధానమైన పదములను, జావళీలను హెచ్చుగా ప్రోత్సహించిరి. "యథా రాజాః తథా ప్రజా" యనునట్లు రాజులచిత్తవృత్తిననుసరించి ప్రజలుకూడ అట్టి పద్ధతి రచనలనే ప్రోత్సహించి రనవచ్చును. అందులకే దాసు శ్రీరాములు, మచ్చా వేంకటకవివంటి విద్వాంసులుకూడ 19 వ శతాబ్ది చివరిపాదమున ఇట్టి శృంగారపదములను, జావళీలను రచించిరని చెప్పిన చాలును. ఇదేధోరణిలో ఆధునికయుగనిర్మాతయని మనము చెప్పుకొను గురజాడవారుకూడ కొన్నిరచనలు చేసియున్నారు. జావళీలవంటి శృంగారపదములను రచించుట ఆకాలములో పరిపాటి.

శృంగారపదముల తెన్ను లిట్లుండగా 19 వ శతాబ్దిలోనే గేయరచనలో మరొక వెల్లువగా వచ్చినవి తత్వములు, వేదాంత

పదములవంటివి. వీనిని సాధువులు, సన్న్యాసులై సర్వసంఘపరిత్యాగము చేసిన సిద్ధులు రచించిన వనవచ్చును. వీరు దేశాటనము చేయుచు అక్కడక్కడ పాడిన పాటలే కాలజ్ఞానతత్త్వములుగా ప్రసిద్ధికెక్కి తెలుగువారి నాలుకలపై నర్తన మొనరించినవి. ఈ తత్త్వములలో పైకొక యర్థమున్నను నిగూఢమైన వేదాంతార్థము ఒక చిన్న కుంభములో పెట్టిన దీపకళికవలె ప్రకాశించుచుండును.

ఇందులో ఉత్తమోత్తమమైన కవిత ధ్వనిప్రధానమై, అన్యాపదేశములతోడను, నర్మగర్భవచనములతోడను ప్రసన్న కలితార్థయుక్తి చెలువారుచుండును. ఇట్టిరచనలలో పోతులూరి వీరబ్రహ్మంగారిరచనలు మొదట దారిచూపినవి. బ్రహ్మంగారి కాలజ్ఞానతత్త్వాలు 17వ శతాబ్దిలోనే పుట్టి, విశేష ప్రచారమును పొందినవి. వీనిలో "తియ్యని మామిడిపండు తినబోతే తీపులు మెండు" వంటి రచనలు అందరికిని తెలిసినవే. బ్రహ్మంగారి తరువాత, దూదేకుల సిద్ధప్ప, మహమ్మద్ హుస్సేన్‌వంటి సిద్ధులు 18వశతాబ్దిలో నున్నవారు. 19 వ శతాబ్ది ఆరంభములో వచ్చినవారిలో నిష్టల ప్రకాశదాసు ముఖ్యులు. ఈయనతత్త్వములలోని కవితా సౌరభమునుగూర్చి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారొక వ్యాసమువ్రాసి ప్రకటించినారు. ఈ పాటలలో మాటలు తేలికగా వినగానే విశేషార్థములు స్ఫురించునట్టివిగా నుండును. "గూటి చిలకేదిరా అన్నా" అను పాట. "గాలిపటమురా జీవ, గాలి నిలచినంతలోనె కూలిపోవు ధరణిలో జాలమేల చేసేవుర" అను పాట విశేషప్రచారములో నున్నవి.

రాములవారిమాట - నవ
రత్నములుంచిన మూట - జయ
రాములవారిమాట - మాకు
దోసెడు వరహాలమూట -

ఆశలన్నింటినీ రోసి, చిత్తము దైవాయత్తముచేయుమను కోరికను వెల్లడించు మరొకకీర్తన ప్రకాశదాసు మనోభిలాష వెల్లడించుచున్నది.

దైవసాహాయ్య మెన్నటికో - రామ
దైవ మొక్కడేయని తలచే దెన్నటికో....
మత్తత మానే దెన్నటికో, నా
చిత్తము హరిపైని చేర్చే దెన్నటికో
ఉత్తములతో పొత్తెన్నటికో, పర
విత్తముపై భ్రమ విడిచే దెన్నటికో
ఆశనురోసే దెన్నటికో భవ
పాశములను కోసివేసే దెన్నటికో
దాసులగూడే దెన్నటికో, నిష్టల ప్ర
కాశూడనని గంతులేసే దెన్నటికో.....॥

ఈ సిద్ధునిగూర్చి అపూర్వ శక్తి- సామర్థ్యములుగలిగిన చిదానందయోగియని అనేకకథలు నేటికిని చెప్పుకొందురు. గోదావరిలో మునుగకుండ పద్మాసనమువేసి కూర్చుండుట, శాపానుగ్రహాశక్తి వీరికి గలవని ఆకాలమువారందురు. అవి యెట్లున్నను - ఇహసుఖముల నరయక, పరమార్థదృష్టితో భక్తిరసగానముచేసిన మహాయోగియనుమాట వాస్తవము.

19వ శతాబ్ది చివరిభాగములో జీవించిన ఎడ్ల రామదాసు 110 కీర్తనలతో 'సాంఖ్యతారకా మనస్కయోగంబనెడు సుజ్ఞానచంద్రిక' అనెడు గ్రంథమును రచించెను. ఈ గ్రంథపీఠికలో తాను "విద్యావిహీనుడైనా, సద్గురుకృపను వచోరచనయందును, కవిత్వమందును ఒకధోరణి కలిగి కొన్నికీర్తనలను మరికొన్నితత్త్వాలను గద్యపద్యాదులతో,సకలజనుల కాహ్లాదకరమగునటుల సులభశైలిని రచించితిని" అని చెప్పుకొనెను.

వీనిలో: "దీనిభావము తెలియవలె నన్నా, నీలోను బ్రహ్మము
పూని కను గొనవలెను విను మన్న"

అని బ్రహ్మతత్త్వమును చెప్పెను. తేలికమాటలతో నిగూఢ మగుతత్త్వమును ఆకర్షణీయముగా వెల్లడించుట యీ తత్త్వముల పరమార్థము.

ఎన్నిమాయలు నేర్చినాడమ్మా యశోద నీ కొడుకు
కన్నిటికి నెఱజాణుడో యమ్మ॥
ఎన్నిమాయలు నేర్చినాడే చిన్నితనయుడు నిన్నరేయి, మా
కన్నెపడుచును జూచి రమ్మని కన్నుసైగలు చేసినాడట॥
వట్టిమాటలు గావు వినవమ్మా ఈ వాడలోపల
యిట్టివానిని జూడలేదమ్మా
ఉట్టిమీద చట్టిలో నా వట్టి పాలిడి అట్టె బోవగ
చట్టి యొడలకొట్టె కృష్ణుడు పొట్టనిండా పట్టినాడట

బాలకృష్ణునిలీలలు వర్ణించు ఈ పాటలో జీవాత్మ పరమాత్మలసంబంధము చక్కగా వర్ణితమైనది. ఇదియే విశిష్టాద్వైతములోని అంతరార్థము. మరొకకీర్తనలో అన్యాపదేశముగా పరమగురు రహస్యమును చెప్పెను.

ఈ యూరి కిదే దారికదా గురురాయలు తెల్పిన దదేకదా !
దారికి యెదురై మూడుశునకములు దాటుచు మిక్కిలి మొరిగెగదా
యెక్కువయిన యేకాక్షరి కుక్కల కెదురుకొనీ మదమణచెగదా !

మరొకపాట వ్యవసాయముతో వేదాంతబోధను పోల్చి అర్థ మగునట్లు రైతుల పరిభాషనే ఉపయోగించెను.

వ్యవసాయము జేసేవారము ఈ యడవిలోపల కాపువారము
నవద్వారపురము వీథివారము నవనీతచోరుని భక్తపరులము
అండ పిండ బ్రహ్మాండము మేము మెండుగ పండించినారము
పుండరీకాక్షుని నామము ఈ పుడమిఅంతట జల్లినారము

ఈ తత్త్వములలో అంతరార్థము బోధపడకపోయినను పల్లవిలోనే పామరులను అలరింపజేయు మాటలుండుటచేత పరమ రహస్యమైన పరమార్థతత్త్వములను సైతము పలుచనిభాషలో నం

దించవచ్చునని నిరూపించెను. అందులకే వీనిలో హెచ్చుగా అన్యాప దేశములతోడను చమత్కారములతో కూడినభాష కనిపించును.

"చూడ చక్కని చిన్నది కడ మేడగదిలో నున్నది" వంటి పల్లవివినగానే పలువురు ఆకర్షణపొందుదురు. ఈతత్త్వములనుకొందరు సిద్ధులు, కొందరు సాధువులు రచించినను పెక్కుతత్త్వములు అజ్ఞాత కవులరచనలుగా జానపదగేయములలోనికి పోయి పల్లెపల్లెలందునను ప్రచారమునందునున్నవి.

నారాయణదాసుగారు :

19వశతాబ్దిచివరిభాగములో వెలువడినయక్షగానములు కొన్ని హరికథలరూపములో కొందరు గానముచేయుటజరిగినది. ఇట్టివారిలో అగ్రేసరులు ఆదిభట్ల నారాయణదాసుగారు. వీరు రచించిన యథార్థ రామాయణము, మార్కండేయచరిత్ర, రుక్మిణీకళ్యాణమువంటి హరికథలు నేటికిని పలువురు హరిదాసులు చెప్పుకొని పొట్టపోషించు కొనుచున్నారు. నారాయణదాసుగారు 1864లో జన్మించి 80 యేండ్లు నిండుజీవనము జీవించినారు. వీరు బహుభాషాకోవిదులు. చిన్నతనము లోనే అఖండ ప్రజ్ఞనార్జించి యద్భుత కావ్యరచనలుచేసినవారు. 19వశతాబ్ది చివరిపాదములో వీరుచేసిన రచనలకు పలుతావులయందు సన్మానములందినారు. తొలుత యక్షగానములను, తరువాత హరి కథలును రచించిరి. అచ్చతెనుగన్న యభిమానము మెండు. దాసు గారు తన బాల్యమునుగూర్చి మార్కండేయచరిత్రలో నిట్లు పాడు కొనిరి.

నాదనామక్రియ - త్రిపుట

ప: చెల్లెబో నిరుపమానందాశ్లిష్టమౌ నా బాల్యంబు

అ. ప॥ గుల్లలు, చిప్పలు, మూటముల్లెలౌ నల్పసంతుష్టి॥

చ॥ కొల్లముగ నాడు చిప్ప చిప్పగోళ్ళు దాగుడుమూతలు
పరవళ్ళు వెన్నెలమళ్ళు గుజ్జనగూళ్ళు నవ్వునోళ్ళు॥

ఈయన కామిగాక మోక్షకామికాడను వాక్యమును నిరూపించి యవ్వనములో యథేచ్ఛగా విహరించెనందురు. కాని ఈయన పరమభక్తుడనుటకు సందేహము లేదని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు చెప్పియున్నారు. 1895 ప్రాంతమున దాసుగారు సూర్యనారాయణశతకము రచించిరి అప్పుడే 1886 – 1896 వరకు ఒకదశలో పురాణపఠనము, అష్టావధానము, సంగీతకచ్చేరీచేయుటలు నేర్చుకొనెను. అప్పుడే వీరు భంగునకు అలవాటుపడి భంగుమీద చెప్పిన పాట:

మాలచ్చి భంగుపాట నీర్పుచ్చుకున్నపూట కడు
హెచ్చు నాదుపాట జగమెల్ల నా కొక ఝూట॥
చెలువైన నోటిచుట్ట యొకచేత పొడుముచిట్ట
తొలుదొల్త నన్నపుటొడ్డు - తెలవారేదాక లడ్డు॥

ఇన్ని వ్యసనములుండియును సంగీత సాహిత్యములలో దిట్టయనిపించుకొనెను. అష్టావధానములో ఆశువుగా బందరులో చెప్పిన పద్యము లిప్పటికిని పలువురు చెప్పుకొందురు విష్ణువుమీద దాసుగారు చెప్పిన నిందాస్తుతి– ఆనాటి 'బుధవిధేయి' పత్రికమీదచురక.

ఆలి యొరులకాయె అత్త నీ పాలాయె
ముడ్పితుడుపులాయె బుధవిధేయి
నేతిబీరకాయరీతి నీ పేరాయె
ఉత్తముండ పూరుషోత్తముండ

దాసుగారు తిరువళ్లూరు రాజాయిపాట విని ఆశువుగా చెప్పిన పద్యము:

జిలుగు రతనాలపేట పూచెండులాట
క్రొంజవులమూట యమృతంపు కొలను మోట
వలపు ముద్దులమూట పువ్విలుతువేట
హాయి నొడఘోయు తేట రాజాయిపాట॥

ఇవియన్నియును ఒకయెత్తు, దాసుగారి హరికథలలో పాటలు మరియొక యెత్తు.

"లేజవ్వనంపు పసందు, నాల్గవజాము గొంబ్రొద్దు దిగిన సందు" చక్కని యుపమానము. అట్లే వీరి గద్యలో-

"ప్రకృతిసంపర్కంబున సగుణులవలె దోచు పురుషులచందంబున గ్రొమ్మొయిళుల నాలిచాయలన్గ్రిన్నట్లుండు కొండలు"

ఇట్లెన్నేని ఉదాహరణములను చూపవచ్చును. దాసుగారు అసాధారణప్రతిభాసంపన్నులు. 40, 50 గ్రంథములవరకురచించిరి. వానిలో సంస్కృతాంగ్ల పారశీకభాషలనుండి అనువాదములున్నవి. ఉమర్ ఖయ్యామ్ అచ్చ తెనుగు, ఇంగ్లీషు, సంస్కృత భాషలలో యథామూలమ్ముగా అనువదించిరి. భగవత్ గీతను వేల్పుమాటయను పేర అచ్చ తెనుగులో వ్రాసిరి. నవరసతరంగిణియను పేరున కాళిదాసు షేక్స్పియరు నాటకములలోని కొన్నిఘట్టములు అనువదించిరి. హరికథలలో వీరు వ్రాసినవి 20 గ్రంథము లున్నవి. స్వతంత్రరచనలలో 'బాటసారి' యను గ్రంథము 1888-89లో రచించిరి. ఇది ప్రబంధరచనలకు అనుకరణగాక ప్రకృతిరమణీయదృశ్యముల వర్ణించుచు చక్కని శైలిలో రచించిరి. ఇందలిపద్యములు మేల్మివలె మెత్తనైనభాషలో వ్రాయబడెనని శ్రీ పనప్పాకము ఆనందాచార్యులు గారును, చందనపుకట్టపై నగిషీయని రెంటాల వెంకటసుబ్బారావు గారు, క్షీరాన్నమువలె నున్నదని కొక్కొండ వేంకటరత్నము గారును ప్రశంసచేసిరి. ఈ కావ్యములో సముద్రయాత్రలో ఓడపగిలి కథానాయకుడు భార్యను, బిడ్డను కోల్పోవును. అప్పుడు పొందిన విషాదము వర్ణించుతీరు తెలుపు పద్యములు చూడుడు :

పాపము దైవ మెంత పొరపాటొనరించెను నన్మిగిల్చె న
య్యో పికవాణి, యో వికసితోత్పలలోచన నిన్ను బాసి యె
ట్లోపుదు జాముక్రింద మనముంటిమి ముచ్చటలాడికొంచు నా
హా పరిపూర్ణ చంద్రవదనా మన కింక ఋణంబుచెల్లెనా ?

వెల్లబాఱిన జాబిల్లి వేగుచుక్క
యును నభంబున వెలయుచు నున్నమాడ్కి
చిన్ని కొమరునితో ముద్దుచెలియ తేలు
చుండె కాబోలు మున్నీట నిండుదొరగి

ఇవియన్నియు నెట్లున్నను - నారాయణదాసుగారి సాహిత్య ప్రతిభ, వారి సంగీతకృతులయందే పరిణతినందుకొన్నదని పలువురి అభిప్రాయము.

ఈయన శ్రీకృష్ణజననము, అంబరీషచరిత్రము, గజేంద్రచరిత్రము, బాటసారి, సారంగధరనాటకములను హరికథలుగా రచించిరి. 1897లో ఆనందగజపతి పరమదించినతరువాత యీాయన ఆ యాస్థానము విడిచి దేశసంచారము చేసెను. కాళిదాసు, షేక్స్పియర్, ఉమర్ ఖయామ్‌వంటి కవుల కావ్యములను అచ్చ తెనుగులోనికి అనువాదముచేసి అందరిమన్ననల నందుకొనెను.

వీరిరచనలలో ముఖ్యమైనవి (1) నవరసతరంగిణి (2) ఉమరు ఖయ్యాం (3) విష్ణుసహస్రనామములు (4) లలితాసహస్రనామములు (5) వేల్పుమాట (భగవద్గీత) (6) ఋక్సంగ్రహము (7) నూఱుగంటి (ఇవియన్నియును అనువాదాలు) స్వతంత్రరచనలలో (1) బాటసారి (2) సూర్యనారాయణశతకము (3) ముకుందశతకము (4) శివశతకము (5) సత్యవ్రతశతకము (6) కాశీశతకము (7) రామచంద్రశతకము (8) సంగీతప్రబంధములు (9) ఆంధ్రనిఘంటువు ముఖ్యమైనవి.

వీరి హరికథలలో మొదటిదయిన అంబరీషచరిత్రము, గజేంద్రమోక్షము 1890లోనే వెలువడినవి. వీరు రచించిన గజేంద్రమోక్షముపై పోతన్నగారిప్రభావము కొంత పడియుండును.

చనిచని కాంచె నుల్లసిత చారుపయోరుహసన్మరందగా
దన మదమత్తభంభరవితానరవ ప్రతిమానగానమా
న నియమితోరుభంగ పఋనాద మృదంగరవానుకూల చ
క్రనివహరాగతాళ రసరమ్య విశాల సరః ప్రధానముల్॥

బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్లు
ఉత్తముని దుష్టకామిని యొడిసినట్లు
ధ్యానవంతుని నిద్దురపూనినట్లు
సమదగజమును మొసలి నావానిపట్టె

వీరి యభిమానకవులు జయదేవుడు. పోతన :

కృతులొనర్చినవారి సంస్కృతమున జయ
దేవు, తెనుగున పోతన నైలిసి యెంతు॥

ఈయనరచించిన స్వతంత్రప్రబంధము బాటసారి (1888 - 89)లో వెలువడెను. మానవజీవిత మొక యాత్రగా భావించి, ఈ యాత్రచేయు బాటసారి ఆత్మయనునట్లు కథకల్పించి వేదాంత పరమైన అంతరార్థముతో రచించిన ఈ కావ్యము చాల రమణీయ మైనది. అన్నింటికంటె వీరిగొప్పతనము పాటలలోని మాటల కూర్పులో చూడవచ్చును.

'హరిశ్చంద్ర' హరికథలో చంద్రమతిపుత్రశోకమును వర్ణించు ఘట్టములో దాసుగారు వ్రాసిన ఒకపాట.

పున్నాగవరాళి - త్రిపుట

1. బాలచంద్రమౌళి పాదముల్విడక - కాలునోర్చి వేగమెరమ్మ కొడుకా
2. అంగము శైత్యపైత్యము లంటనీక - గంగాభవాని నిం గాపాడుగాక
3. పవలు రేయి తాపముబొందనీక - రవిచంద్రములు నిన్ను రక్షింత్రుగాక
4. కోమలమగు మేను కుందింపబోక - భూమిదేవి నిన్ను పోషించుగాక

ఇంక పద్యరచనలోను, ధారలోను తెనుగుపలుకుబడి సొంపుగానుండును. ఉమర్‌ఖయ్యాము అనువాదములో అచ్చ తెనుగు కందపద్యము :

మొదలే తుద, తుదయే మొద
లిది మొద లిది తుదయని యెవ డెరుగదరంబౌ
పదపడి నిండిన చదలున
విదలి కదలి పొదలు దినుసు వేరగుపెట్టుల్.

దాసుగారికి సంగీతమన్న హెచ్చు అభిమానము. ఒకసారి పప్పుల వెంకన్నగారిపాట విని దానినిగూర్చి చెప్పిన చాటుపద్యము:

ఒకసారి పావుర మొదిగివచ్చినయట్లు
వానకోయిలపిట్ట పలికినట్లు
ఒకపరి మేల్పటా నొడిసి త్రిప్పినయట్లు
మించుతో మబ్బు గర్జించునట్లు
ఒకమారు వెన్నెల లొలికి గాచినయట్లు
కొలనిలో జలకేళి సలుపునట్లు
ఒకతూరి గవ్వ గిలికరించినట్టులు
చేడెతో పూలచెండ్లాడునట్లు
చిన్ని నాయన్న నీ పాట వెన్నముద్ద
వేసినట్టులు జువ్వల నెగచినట్లు
నన్నచెంబేలి జాజులు జల్లినట్లు
చిన్ని పూదేనె పైపయి చిందునట్లు

నారాయణదాసుగారు సంగీతసాహిత్యములలో కళాప్రపూర్ణుడయిన ప్రజ్ఞానిధి. ఈయన మరణించినతరువాత చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిట్లు వ్రాసిరి:

బ్రతకదగినంతకాలమ్ము బ్రతికి కులము
వన్నెకెక్కించి జగతికి తన్ను దెలిపి
అరిగె మత్సోదరుండు నారాయణుండు
తనదు పేరిదేవుని జూచు తలపు వొడమి.

గాయకమాత్రుడన్న నటుగా దిత డందమెలర్ప సత్కృతుల్
సేయగలాడు వాక్పటిమచే నుతికెక్కినవాడు భాష లే
వో యయిదారు నేర్చిన మహోదయు డక్కట పోయెనేమి నా
రాయణదాసు ముక్తు డత డిట్టిడు భూస్థలి బుట్టబోడికన్

ఇంకను వా రిట్లువ్రాసిరి:

* "ప్రస్తుత మాంధ్రలోకమున హరికథచెప్పు ప్రతివ్యక్తియు ప్రత్యక్షముగానో పరోక్షముగానో శ్రీ నారాయణదాసుగారి

* ఆంధ్రపత్రిక, 29-1-1945

శిష్యులో ప్రశిష్యులో కాకతీరదు. ఈతనిగానము దాక్షిణాత్య గానముననుసరించునదిన్నీ కాదు. ఉత్తరదేశగానముననుసరించు నదిన్నీ గాదు- ఈ గానములన్నింటిని కలియద్రొక్కి పెట్టిన కషాయ మిది.

శిష్యులలో కొందరు కొంతవరకు అనుకరించినను కొన్ని పోలికలు దాసుగారితో నంతరించవలసినవేగాని, శాశ్వతముగా నిల్చిపోదగి నవి కావు. ఈయన గాత్రమువంటి గాత్రము (అనగా మేఘగంభీర స్వనము) భగవంతుడే గాయకునకును ఇవ్వలేదని నా నిశ్చితాభి ప్రాయము. ఈయనకు గానమునందువలెనే కవిత్వమునందును విశిష్టస్థానము నీయకతప్పదు!'' దాసుగారి ప్రావీణ్యమును తెలుపుటకు ఇంతకంటె ప్రశంస అక్కరలేదు. దాసుగారు తెనుగుసాహిత్య సరస్వతికి ఒక క్రొత్తఅలంకారమును కైసేసినారు. అదియే హరికథ. ఈ కథారచనలోను గానములోను దాసుగారు మార్గదర్శి. అందు చేత ఈయన యుగపురుషుడనవచ్చును.

19 వ శతాబ్దము రెండవభాగములో జన్మించి, తనజన్మ సార్థకముచేసికొని తెనుగుభాషకు, దేశమునకు అవిరళకృషిచేసి కవితోద్యానమునందు నూతన పరిమళపుష్పములను పుష్పింపజేసిన మహనీయుడు నారాయణదాసు. ఎనుబది సంవత్సరములపాటు నిత్యోత్సవముగా సాగిన వీరి నిండుజీవితము తెనుగుదేశములోని సంగీతసాహిత్యపురోభివృద్ధికి తార్కాణమని చెప్పవచ్చును. ఈయన దేశభక్తి, సరస్వతీభక్తితోపాటు ప్రపంచశాంతిని కోరు విశ్వ శ్రేయఃకవి. అందుచేత - తన హరికథాగానమునకు భరతవాక్య ముగా ఈ మంగళగీతము పాడుట పరిపాటి.

సింధురా - చతురస్రగతి.

**సర్వభారతీయాపి, పరస్పర మైత్ర్యా మోదంతామ్**
**ఉర్వీమండల మనవరతం కృత, యుగధర్మావర్తంతామ్**
**వాగ్దేవీకృపయా, నితాంతం॥ వాగ్దేవీ॥**

చ॥ ప్రతివత్సరమీదృగ్గానసభా, పత్తనేషుజాయన్తామ్
సతత మాసేతు శీతనగం, సత్సంగ గుణౌగీయన్తామ్॥ వాగ్దేవీ॥

జానపద వాఙ్మయము :

గేయవాఙ్మయమునందు, లక్ష్యలక్షణములకు సరిపోక అజ్ఞాత కవులరచనలతో నిండిన వాఙ్మయము అనంతముగా నున్నది. ఇది ప్రజాజీవితమును ప్రతిఫలింపజేయు స్వచ్ఛఫలకమువంటిది. అడవి మల్లెలవలె అనాఘ్రాతసౌరభముగల్గిన సహజకవితాసౌందర్య భరితములైన యీ రచనలు మనకు అందుబాటులోనుండక వీని నంతగా శ్రద్ధతో మనము పరికించలేదు. వీనిలోని రసానుభవమునకు తగిన ప్రాధాన్యమీయక లల్లాయి లుల్లాయిపదములని తిరస్కరించి వేసితిమి. కాని నిసర్గభాషారామణీయకతను, నిండురసానుభూతిని పొందగోరినచో నిస్తులానందభరితములైన ఈ జానపదగీతికలనే చూడవలయును. ఇవియన్నియును నిరాడంబరమైన ప్రజలజీవిత మును ప్రతిఫలింపజేయుచు వారిభాషలో వారిభావములను వారి ముఖముగా వ్యక్తపరచునవి. ఈ పాటలకు ఛందస్సువలనగాని, మాటలవల్లగాని కట్టుబాట్లు లేవు. ఒకభావము పొంగి పొరలినపుడు, ఒకరాగము వెల్లివిరిసినపుడు తనంతట యది హృదయముచీల్చు కొని వచ్చును. గాయకుడు ఎలుగెత్తి పాడును, నవ్వును, ఏడ్చును, తలపోసికొనును. అతనితోపాటు వినువారును నవ్వుదురు, ఏడ్చు దురు. ఈ గేయములలో కొన్ని సమకాలికచరిత్రను చెప్పునవి యున్నవి. అందులో ఎవరో ఒక వీరునిగూర్చియో ఒక వీరకృత్య మునుగూర్చియో ప్రశంసయుండును. ఆ వీరుడు మంచివాడు కాన క్కరలేదు. ప్రళయభయంకరుడై ప్రజలను దోచుకున్న బందిపోటు దొంగయైననుసరియే. (గుత్తాల గోపిరెడ్డి) దుష్టపాపములనుచేసి దురంతములుచేసిన దుర్మార్గుడైనను సరే (సర్వాయి పాపన్న),వానిని కీర్తించవలసినదే. ఇవియన్నియును వీరగీతములు – వీరపదములు. కొందరు దాసరులు పాటలుగా పాడుదురు. జంగమువారు కథలుగా

చెప్పుదురు. జక్కులవాళ్ళు జముకులు వేసి పాడుదురు. ఆ పాట విన గానే ప్రజలలో పిరుల యెడల జాలి కరగి పారును. పౌరుషము మేనిలో గగుర్పాటు కలిగించును. అట్టివానిలో తెనుగువారికి చిర పరిచితమైన పాట, పెదబొబ్బిలిరాజుకథ. 1757లో జరిగిన ఈ కథ 1827లో పాటలోనికి వచ్చినది. తెనుగుదేశము మూలమూలలను బొబ్బిలిపాట రోకళ్ళపాటగా ప్రచారమైనది. ఇట్లే దేశింగురాజు కథ, బంగారు తిమ్మరాజుకథవంటివి. తిమ్మరాజుకథలో ప్రజలవిశ్వాసములు, నమ్మకములును ఉన్నవున్నట్లు వర్ణితమైనవి.

> పెనిమిటిమాట విన్నతోడనే పట్టపుదేవికి రామరామ
> నుదుటనున్న కుంకుమబొట్టు నేలవ్రాలింది రామ
> కాలినివున్నా వెండిమట్టెలు బ్రద్దలుఅయినాయి
> చేతినివున్న గాజులు చిట్లిపోయినాయి

తరువాత తిమ్మరాజు శకునములను లెక్కచేయక పెనుగొండకు పోయి, అక్కడ వంచితుడై పోవును. తరువాత తిరుపతిలో జరిగిన యుద్ధములో మరణించును. ఈ వాతావరణమును కల్పించుటకు ప్రజాకవి దుర్నిమిత్తములను వర్ణించెను. ఈ కవులకు అలంకారములు తెలియవు; అష్టాదశవర్ణనలు రావు. నాయికాభేదముల ప్రస్తావించుట ఎరుగరు. మానవునిలో అణగియున్న మాన్యగుణంబులను మానవత చెడకుండ సహజగాంభీర్యముగా మంచిపాటలుగా అనువదింతురు. అవి సూటిగా హృదయములోనికి దూసికొనిపోవును. వానికే యభ్యంతరములును ఆక్షేపణలును పనిచేయవు. మన లక్షణకర్తలు వీనిని సాహిత్యముగా పరిగణింపకున్న నేమాయె! ప్రజాజీవితములో ప్రత్యక్షముగా పలుకరించుచున్న ఈపాటలకు గౌరవము వాటిని పాడుకొనుటయే. పాడినప్పుడు వాటినివినుటయే. వీనికి బహుమతులు లేవు, సన్మానములు లేవు. ప్రశంసలు లేవు, ప్రస్తుతులు లేవు. కనకాభిషేకములు లేవు, గజారోహణములు జరుగవు. కవి యెవరో, ఏనాటివాడో కూడ తెలియదు. పాటమాత్రము ఆ నోట ఆనోట వ్యాపించుచుండును.

తెలంగాణాలో సర్వాయి పాపడికథగూర్చిన పాట యట్టిదే--

> పాపనియొక్క-పేరు చెప్పితే పసిబిడ్డలే పాలు త్రాగరు
> ఊరుపిచ్చిక పొలముబారదు, పొట్టిపిచ్చుక వూరుచేరదు
> గుఱ్ఱాలు గుగ్గిళ్ళు తినవూ వాడిపేరంటే
> గోల్కొండబస్త్రీలు ఒణుకు
> నెల్లూరిబస్త్రీ లొణుకు

ఇట్టి వీరగాథలెన్నో యున్నవి. ఇవిగాక స్త్రీలచరిత్రలను వర్ణించు జాలిగాథలు పాడుకొనుట దేశమంతట వినుచున్నాము. వీనిలో బాలనాగమ్మకథ, కామమ్మకథ, చిన్నమ్మకథ, లక్ష్మమ్మ కథ యిట్టివానిలో ఆనాడు తెలుగు ఆడుపడుచులు అత్తలచేత, ఆడుబిడ్డలచేత,పరపురుషులచేత పడు పలుబాములువర్ణించబడినవి. ధర్మాంగదచరిత్రయను పాముపాటలో అత్తగారిగూర్చి చెప్పిన లోకనీతి యెంత చక్కగానున్నదో!

> అత్తకును శాంతంబు - కత్తికిని మెత్తన
> కలదంటె యిలలోన - కలికిరో వినవె

స్త్రీలు పెండ్లిండ్లకు వేడుకలకు పాడుకొను పాటలలో ఎంతో హాస్యము చమత్కారము ఇమిడియున్నది.

> మా యత్త మా మామ ఊరేగుతుంటె చుట్టపీకలు రెండు చూదొచ్చినాయి
> మట్టగిడసలు రెండు మాట్లాడినాయి కందిరీగలు వచ్చి కతనడిపినాయి
> మా యత్త మా మామ ఊరేగినాక వరిదంచ నొకమరది వండ నొకమరది
> వంటకుండలకాడ కావ లొకమరది పేడకల్లాపుజల్లు పెదబావగారు
> ఇల్లలికి ముగ్గెట్టు యింటిమగవారు

జోలపాటలు, లాలిపాటలు లెక్కకుమిక్కిలియున్నవి. మంగళహారతు లంతకంటెను మిక్కుటము.

"ఘల్లు ఘల్లున కాళ్ల గజ్జెలందెలు మ్రోయ కలహంసనడకల కలికి
యెక్కడికే, జడలోను గంగను ధరియించికొన్నట్టి జగములేలే సాంబశివునిసన్నిధికే
మంచి గతితో, లయతో, ముద్దులుమూటగట్టుచుండును.

స్త్రీలపాటలలో తిరిగి రామాయణ, భారత, భాగవతకథలన్నియును క్రొత్తరూపములుదాల్చి యింపు దళ్కొత్తుచుండును. రామాయణకథలలో "ఊర్మిళాదేవినిద్ర", "రాఘవకళ్యాణము", "సీతయానవాళ్లు" "లంకాయాగము" * "కుచ్చలకథ" మొదలయినవి అశేష ప్రచారముపొందినవి.

స్త్రీలపాటలలో శారదారామాయణము ప్రసిద్ధమైనది. ఇది శారదకాంద్రుడు పాడుదురు. ఇదికూడ తెనుగుతనమునకు సహజమైన అంత్యానియమముతో కూడియుండును. పుత్రకామేష్ఠి మొదలుకొని రావణవధవరకు రామాయణగాథయంతయును వచ్చినది.

> "శ్రీరామచంద్రుని చరితంబు వాల్మీకిరామాయణంబు,
> కథాసారముగా జేర్చి బలుడంబు గులకగానుంచి మృదువగుపదంబు
> చేర్చి కూర్చితి నా శారదపదంబు, సేతురాముని పదంబు
> రామభక్తకవి చెప్పు కథనంబు, విన వినగ వేడుకగును మధురంబు"

అని చివర యీ కవి చెప్పుకొనెను. ఇట్టిదియే పాటలతో కూర్చిన మరొక రామాయణము మోటుగుండరామాయణము. ఇందు బహుప్రచారములోనున్న ఒకపాట ఉదాహరణముగా చూపుదుము:

> మహరాజ దశరథతనయులు దినరాజకులఘనులు
> దినరాజకులఘనులు, శ్రీరామ లక్ష్మణులు
> చనుదెంచి మారీచుల సుబాహుల ద్రుంచి యాగమ్ము
> చేయించి యాగమ్ముసాధించి రీ దినము॥

ఇది రచించిన కవి తాళ్లూరి నారాయణకవి. దీనిని స్త్రీలునూ, భజనకూటములవారును ఎక్కువగా పాడుకొందురు. దీనిలోకూడ అంత్యానుప్రాసము పాటకు దీటుగా చేకూరియున్నది. ఉదాహరణకు మరొకపాట.

---

*"రామాయణపాటలు" ఆంధ్రసారస్వతపరిషత్తువారొక గ్రంథముగా ప్రకటించిరి, ఇది కృష్ణశ్రీసంపాదించిన విపులమైన పీఠికతో వెలువరించిన గ్రంథము.

హనుమంత పోయి రమ్మిక
వాయునందన లేవవోయి
శీఘ్రముగ పోవోయి లేవోయి ఈయవోయి
చండకిరణుడు పొడువకుండ రావలెను దోర్దండ
పొద్దుండ, నిలుచుండక పోయి రమ్మిక॥

ఇట్లే భారతకథలు, భాగవతకథలు పురాణప్రసిద్ధకథలను తీసికొని ఈ జానపదకవులు తమకుతోచిన రీతిని గానముచేసికొనిరి. ఈ కథలలోకొన్ని చోటుల క్రొత్తకల్పనలు వచ్చినవి; మరికొన్ని చోట్ల రామునిపరముగా సీతపరముగా తమ యచ్చటముచ్చట్లు వర్ణించుకొనిరి. గోవిందనామాలలోకూడ రామాయణకథ వచ్చినది. అట్టివి మూడుపాట లున్నవి: పెండ్లిగోవిందనామాలు, శాంతగోవింద నామాలు అడవిఅనే చరగోవిందనామాలు. వీనిలో అప్పటి ఆచార వ్యవహారములు వర్ణితమైయున్నవి. పెండ్లిగోవిందనామములలో రామాదులు జననమందిన తరువాత ఎదిగినవిధము వర్ణించునది.

ఒక్కోమాసమున వత్తిగిలనేర్చిరి
రెండోమాసమున కూర్మమునిలిపిరి
మూడోమాసమున పెదవులవిరిచిరి
నాలుగోమాసమున నవ్వులునేర్చిరి
అయిదోమాసమున ఆటలునేర్చిరి

"లక్ష్మణదేవరనవ్వు" – అను పాట చక్కని కల్పనతో వినువారిమనస్సులో ఉత్కంఠ రేకెత్తించు సన్నివేశము. ఉన్నట్టుండి లక్ష్మణదేవర కిలకిల నవ్వెనట. ఎవరికివారే తమనుజూచియే నవ్వెనని అనుకొందురు.

కలకలనవ్వే లక్ష్మణదేవ రపుడూ - కలతలుపుట్టెనూ కవులందరికినీ
కిలకిలనవ్వే లక్ష్మణదేవ రపుడూ - కిలకిలనవ్వగా ఖిన్నుడయె రాజు

అందరికీ తీరనిసమస్యఅయితే దానికికారణము అకస్మాత్తుగా తన్ను నిండుసభలో ఆవరించిన నిద్రాదేవిని చూచి నవ్వవచ్చినదని

లక్ష్మణుడు చెప్పెను. మున్నొకసారి తనకు పర్ణశాలలో కాపు కాయుచుండగా నిద్రవచ్చి - గోదావరిగలగలతో శ్రుతికల్పి యేడ్చె నట. దానికికారణ మడుగగా నిద్రాదేవి సప్తసముద్రములు నిద్ర మున్నినను ఇతనిపై తనప్రభావము పనిచేయలేదని వాపోయెనట. అప్పుడు లక్ష్మణుడు నిద్రాదేవికి మ్రొక్కి,

> "మాయన్న రఘుపతికి మా వదినకూనూ ఈ పర్ణశాలకు తాను కాపనెను
> పోపొమ్మయోధ్యాపురీనగరునకు వేగ ధవునిబాసినట్టి సతియుండదగడూ
> రాత్రియును పవలును లేవకుండగనూ తనువిడిచి పొందుమీ ధవళాక్షినిద్రా"

అని పంపెనట. ఊర్మిళాదేవి నిద్రలోనుండుటకును, లక్ష్మణ దేవరకు నిద్రరాకపోవుటకును ఇదియే కారణమని మన కవిరాజు కల్పన. ఎంత చమత్కారము, ఎంత చక్కని కల్పన!

ఇట్టి సహజస్ఫూర్తితో కమ్మనితావులజిమ్ము పాటలెన్నో ఈ జానపదగేయములలో నున్నవి. ఇందు భారతగాథలున్నవి; భాగవతగాథలున్నవి. శ్రీకృష్ణుని జననము, కృష్ణుని చల్దులు ఇట్టివెన్నో యున్నవి. లక్ష్మణదేవరనవ్వువంటిదే చమత్కారకథ కలిగిన "పండు పాట" ఖాండవముని ఆశ్రమములో పాండవులున్నప్పుడు మునికి ఆహారమైన ఏకైకఫలమును అర్జునుడు బాణము వేసి పడగొట్టెను. ధర్మజుడు కీడుశంకించి, శ్రీకృష్ణుని వేడుకొనును. పాండవు లొక రొకరే తమహృదయములలో దాగియున్న తీరనికోరికలమాట చెప్పిన పండు ఎప్పటివలె పైకిపోవునని శ్రీకృష్ణుడు చెప్పెను. పాండవులు ఉన్న సత్యము నొప్పుకొందురు. స్త్రీల చంచలబుద్ధిని చూపు చిత్ర మిది. ఇందు నేడు ఋజువుచేసిన మానసిక విశ్లేషణ శాస్త్ర (**Psycho Analysis**) రీతులలోని (**Libido**) (తీరనికోరికలు) ఇచ్చట కల్పనలో ఆకృతిపొందినవి. ఇవి యిట్లుండగా నిగూఢ వేదాంతరహస్యమైన భగవద్గీతలుకూడ స్త్రీలపాటగా భాస్కరుడనురచయిత కూర్చెను. గీతారహస్యమంతయును 24 చరణములలో ఈ కవి యిముడించి చక్కగా చెప్పెను.

ఈ పాట ఆరంభము :

గీతార్థసారాము వినుమూ - నవ
నీతము చేకొనువిధమూ
భూతాదయాపరహేతురతిచే కపి
కేతా మనకు ఖగకేతాను దెరిగించు
జ్ఞాతివధచే పాతకము సా
జాతమే నే నేతెరంగున
జేతునని యుద్ధమొల్లక పురు
హూతసుతు డీరీతి బల్కె-ను॥గీతార్థ॥

ఇట్లెన్నెని ప్రసిద్ధమైన యితివృత్తములు గైకొని జానపదకవి తన జాతీయములతో అనుభవములతో రంగరించి నిత్యానుపానమైన దివ్యగానముగా మలచుకొనుట నేర్చుకొనెను. కాని యిట్టిసాహిత్యమును లక్షణశాస్త్రజ్ఞులు స్వీకరించరు. వీనిలోని రూపసౌందర్యమును, రసమాధుర్యమును తొలిసారి గు రించినవారు తెలుగువారు కారు. తెలుగుదేశము పర్యటించుటకు, తెలుగులోని తీయదనమునకు మురిసిపోయిన పాశ్చాత్యపండితులే. 1814 లో సి. పి. బ్రౌను దొర తొలిసారి మనదేశములో ప్రచారములోనున్న వీరపదము పెదబొబ్బిలిరాజుకథ సేకరించి ముద్రింపజేసెను. బ్రౌనుదొర ఈ పాటలనుగూర్చి చెప్పుచు ఇట్లు నుడివెను.

"Finally there are other ballads (cathalu) of great length framed in a peculiar chant on principles different from all other sorts of poerty. Some of these, as the Bobbilicatha or Ranga Rao Charitra the Nagamma katha and the like are chiefly preserved by oral repitition, without having been until now committed to writing. These are every where popular, though despised, as illiterate, by proffessed scholars."

తరువాత తెలుగుపాటలను సేకరించి, వానినిగూర్చి బోయిల్ దొర ఒకవ్యాసమును ఇండియన్ యాంటిక్వరీ పత్రికలో వ్రాసెను. *

* (1) Asiatic Journal Vol - 34-1841 (2) Indian Antiquary vol. III -874

ఈయన ఆరుపాటలు సేకరించి ప్రకటించుచు, ఇంత తీయనిభాష లోని పాటలు ఎవరైన సేకరించి ప్రకటించవలెనని హెచ్చరిక చేసినారు.

'It is therefore to be hoped that while the treasures of national poetry are being gleaned from so many languages the store of the sweetest dialect of Southern India may not be over looked and that the popular songs of Telugu people may be collected. That such exist, it is the object of the present writer to show, but his fitful gleamings are worthless, except as they may lead other and more gatherers to the field………''

వీరు సేకరించినపాటలలో ఒకటి చాల మనోహరముగా ఉన్నది.

వేగివేగి యెండలైన వెదురుగుమ్మినీడలైన
దూడవాడుమొగడైన వుండవలె కొండనడుమ
యెదురింటి యెట్టిపాప - చూతమన్న కానరాదు
పాపిష్టి తల్లిదండ్రి - బయలెల్లనివ్వరు
ఎత్తుగుబ్బలు ఎట్టిదాని - కోరగుబ్బలు ఎవనిపాలు
అలులేని బాలునికి - ఆరునెలల అరణంఇస్తును
గుబ్బలుండే తీరు సూచి - గుద్దుకొంటే తీరునంచే
గుండెగల బంటు ఐతే - గుండ్లపల్లెకనుమకు రా

బోయిల్‌దొర సేకరించిన ఆరుపాటలలోనున్నదే చారిత్రక గేయము సర్వాయి పాపడుకథ. ఇది బోయల్‌దొర ఒకబోయవాని నుండి సేకరించెనట. ఈ పాటలను సేకరించినవిధానమునుగూర్చి ఈ వ్యాసములోనే బోయల్‌దొర యిట్లు రచించెను.

"The specimens of popular ballads which are now offered are undoubtedly the composition of rural

* The Indian Antiquary vol. III 1874

words. They have been gathered by the road side from rude men that could neither read nor write. The plough man who sang to his team and the carter as he sat between his bullocks have contributed snatches of song, of which they often only half knew the meaning, and which they changed and corrupted into their rough and vulgar tongue. The very simplicity and blindness of the verses are their certificate of genuinenss, and atleast the unskilled rudeness of the singer's thought, and the uncritical patience of the simple listeners."

తెలుగు జానపదగాథలయెడ పాశ్చాత్యులుచూపిన ఈ శ్రద్ధాభక్తులు తెలుగువారికి నేటికికూడ కలుగలేదు. కాని తెలుగు గేయములలోనున్న – అది మార్గకవితకాని దేశికవితకాని – సాహిత్య సౌరభమును అది యెట్టి వైలక్షణ్యముకలిగినను పసికట్టి ఆ పరిమళములను వెదకి యితరులకు చూపినవారు 19 వ శతాబ్దిలో వచ్చిన పాశ్చాత్యపండితులే. ఆనాటి నవయుగోదయమునకు, కాంతినిచ్చి నలువేసిన ఈ సీమదొరలు, మన భాషమీద మనసాహిత్యముమీద అభిమానము కలుగజేసి, మన నిధినిక్షేపములను మనము గుర్తించునట్లు చేయగల్గిరి. గేయములలోని కవితాసౌందర్యము రసస్ఫూర్తి ఒకరుకాదన్న ఒకరు లేదన్న లేకపోదు. అది యెవరికివారు స్వయముగా గుర్తుపట్టి ఆస్వాదించవలెను.

ఇవిగాక స్త్రీలు పాడుకొనుటకు వీలయిన పతివ్రతగాథలు కూడ వీరపదములుగా రచించి పాడుకొనుట ఆంధ్రదేశములో ప్రచారములోనున్నది. ఇట్టిపాటలలో బాలనాగమ్మకథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మకథ, కామమ్మకథ, బాలసన్యాసమ్మకథ, మొదలయినవి వెండితెరకుకూడా ఎక్కినవి బాలనాగమ్మపాటలో సంతానము లేక భూలక్ష్మీదేవి పడు దుఃఖమును వర్ణించుఘట్టము.

"ఎక్కేటందుకు పల్లకీలు గలవు
ఏలేటందుకు భూములు గలవండి
సంతులేని వారియిండ్లు - కందులుకొట్టినకళమ్ము"

సహగమనమును నిషేధించినతరువాత, కామమ్మయను పతివ్రత తనభర్త మరణించినతరువాత 'సతీ'ధర్మము నెరవేర్చ సంకల్పించెను. అప్పటి కాకినాడ కలెక్టరు అనుమతించలేదు. ఆమె చెన్నపట్టణము వెళ్ళి పెద్దదొరలనద్దనుండి అనుమతితెచ్చుకొని, అగ్నిప్రవేశముచేసెను. ఈమె బెస్తకులమున పుట్టిన గుణవంతురాలు. భర్త మారయ్య. ఈమె సహగమనగాథ యీ పాటలో చక్కగా వర్ణితమైనది. ఇదే కామమ్మకథ. ఇవిగాక అద్భుతకథలు వర్ణించు ధర్మాంగదచరిత్ర పాముపాట, కాంభోజరాజుకథ చాల ప్రసిద్ధికెక్కిన పాటలు.

ధర్మాంగదచరిత్ర ప్రబంధకావ్యములధోరణిలో ధర్మపురి క్షేత్రమహిమ వర్ణించునట్టిదిగా నున్నది. భర్త పాముగా మారిన కారణముచేత ఆతనిని తలపైనిడుకొని దేశదేశములను పర్యటనము చేయును. చివరికి, ధర్మపురిలోని గంగలో స్నానముచేయగానే ఈ పాము నవమన్మథాకారుడుగా మారిపోవును. ఈ పాట రచించినవారు పూరి నారాయణరాజు. విజయనగరమును పూసపాటి విజయరామగజపతి ఏలుచున్న కాలమున జీవించియున్న కవి. 19వశతాబ్దమువాడు. ఇందు లోకోక్తులు చక్కగా పేర్కొని పాటగా పాడినాడు.

వీరశైవమతమును ప్రబోధించు పాటలనేకము వచ్చినవి. బాలనాగమ్మపాట, కాంభోజరాజుకథ యీ కోవలోనికి చేరినవి. కాంభోజరాజుకథ రచించినకవి జంగము సుబ్బయదేవర. దీనియందు శివభక్తితోపాటు నాగపూజకూడ ప్రాధాన్యమువహించుట గమనింపదగును. ఈ కథలో మరొకవిశేషము – పాటతోపాటు వచనములుకూడా చేర్చి చంపుకావ్యధోరణిలో రచించుట.

ఇవిగాక పెండ్లిసమయములలోను, వేడుకవేళలయందును స్త్రీలు పాడుటకనువయిన పాటలనేకము లున్నవి. వీనిలో కారుణ్యమయి అయిన నారీమూర్తిహృదయభావన ప్రతిపదమునను స్పందించుచుండును. వీనిలో సున్నితమైన హాస్యముతోపాటు లలితమనోభావ

ములతో కూడిన మధురశృంగారము పలుకరించుచుండును. ఇట్టివానిలో లాలిపాటలు, ఉయ్యాలపాటలు, నలుగుపాటలు, సువ్విపాటలు అలకలు, వియ్యాలవారిపాటలు, బూజము బంతిపాటలు, శోభనపు పాటలు, తలుపుదగ్గరపాటలు మృదుమధురభావములతో తేటమాటలతో తియ్యనై యుండును. ఈ పాటలలో నాయకీనాయకులు రాధాకృష్ణులు, సీతారాములు. పార్వతీపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు. ఈ కవులదృష్టిలో వీరు ఆదర్శదంపతులు. వీరిని పాత్రలుగా పెట్టుకొని తెనుగువారియిండ్లలోని అచ్చటముచ్చటలు, తెనుగు దంపతుల సరససల్లాపములు కనిపించుచుండును. చమత్కారవచో రచన తెలిసిన ఒక జాణపలుకు.

స్త్రీ: ఒకరీకి చేయినిచ్చి - ఒకరీకి కాలునిచ్చి
ఒకరీకి నడుమునిచ్చి - కూకున్నవోయి రాజా, కూకున్నవోయి

పురు : ఎవరికీ చేయినిచ్చి - ఎవరీకి కాలునిచ్చి
ఎవరీకి నడుమునిచ్చి - కూకున్నవోయ్ జాణ, కూకున్నవోయి

స్త్రీ : గాజులక్కు చేయిచ్చి - అందెలక్కు కాలునిచ్చి
వడ్డాణానికి నడుమునిచ్చి - కూకున్నవోయి రాజా కూకున్నవోయి

ఇటువంటి చమత్కారసంభాషణల నెన్ని అయినా చూపవచ్చును. అప్పగింతలపాటలో హాస్యము నుదాహరించు ఒక సందర్భము.

అత్తమామలుగాని ఆడుబిడ్డలుగాని - లేరమ్మ నీ దెంత పున్నెమోగాని
మగడొక్కడేగాన మనసుకెక్కినయట్లు మర్దించి నీవశము చేసికోవమ్మా
భర్తను వంచుకోగల భార్యగౌరవ మెన్న రారాజునకునైన రమణించలేదు
ఇవియెల్ల మరువక ఏమాత్ర మలయక-సుఖపడుచుండు మో సొగసుపూదీవ

కాళిదాసు శాకుంతలములో కణ్వమహర్షి చేత చెప్పించిన మాటలకంటె కరుణాత్మకముగా జాలిగొలుపుచు, తల్లిదండ్రుల పరివేదనమును ప్రదర్శించు మరొక అప్పగింతలపాట.

సెలవిచ్చి మాయమ్మ - సెలవిచ్చినామమ్మా
చెలగి మీ యత్తింట - బుద్ధిగా నుండమ్మా
ఎవ్వరేమాడిన ఎదురాడకమ్మా
నాతోటిచేసిన మంకుపోరెల్ల
ఎరుగని అత్తింట్లో చేయబోకమ్మా
అరటాకువంటిది ఆడజన్మంబు

పుట్టింటివారిపై స్త్రీలకు మక్కువ యెక్కువ. వారిని తరుచు విమర్శించుట పురుషులకు సహజము. సుభద్రసారెయను పాటలో

| | |
|---|---|
| అర్జునుడు: | పున్నమ్మినాడైనా బూరెలొండుకొని |
| | పురుషడ రమ్మన్ని పిలువరు మీవాళ్ళు |
| | పరకటపత్తా - పండిన్నాడైన |
| | పచ్చాకమ్ములబట్ట పెట్టరు మీవాళ్ళు |
| సుభద్ర: | మావాళ్ళు పేదవాళ్ళు మా కేమి గలదు |
| | పెట్టగలవాడైన పెండ్లాడరాదా |
| | ఇవ్వగలచోటైన వియ్యమందరాదా |

తెనుగు దాంపత్యజీవనములో ఇటువంటి సరససంభాషణములు తరచు వినిపించుచునేయుండును. ఇవిగాక నిగూఢ వేదాంత తత్త్వములును, భగవత్ గీతాసారమును పాటలుగా స్త్రీలు పాడుకొనుట మనము పల్లెపట్టులలో ఈనాటికిని చూడగలము.

పనిపాటులు చేసికొనునపుడు, అనేకస్త్రీలు కూడి ఒకకథను పాటగా పాడుకొనుట వినుచుందుము. ఇట్టిపాటలు తుమ్మెదపదములు, చందమామపదములు, ఉయ్యాలపాటలు యేలపాటలు అను పేరున ప్రసిద్ధికెక్కినవి.

ఒక్కసింహాచలము అంగళ్లలోను - చందమామా
లక్కటివ్వారీలో లచ్చిమిదేవి - చందమామా
లచ్చిమికి గట్టించు రతనాలమేడ - చందమామ

ఏదో యొక యూతపదముతో, పనిపాటులకు పోవునపుడో, ఊడ్పులాడ్చునపుడో, కోతలుకోయునపుడో స్త్రీ లీ పాటలు పాడు

కొందురు. పవిత్రప్రేమకు కట్టుబడి సంఘపుశాసనములకు తట్టుకో లేక బలియయిన పవిత్రజీవులగాథలను వర్ణించు కరుణరసప్రధాన మైన పాటలుకూడ గలవు. ఇట్టివానిలో గొప్పది చంద్రమ్మపాట. ఒకపాలేరును ప్రేమించినపడుచు కులములోని ఆంక్షలకు తాళలేక ఆత్మబలిచేసిన యితివృత్తము. చాల జ్వాలిగా వర్ణితమైనది ఇంకను నిర్మలప్రేమను వర్ణించు కథాగీతములలో ప్రసిద్ధికెక్కినది చల్ మోహనరంగా పదము.

చంద్రమ్మపాట: మంచిమనసై తేను మాలోడిమాటేల
కులమెన్నుకోలేదురో వెంకయ్య గుణమునే చూశానురో
వెంకయ్య : నిన్నుపెళ్లాడితే నిలువనీయరు నన్ను
కులముతక్కువయని కొట్టవస్తుండారు
ఎందుకొచ్చిన బ్రతుకే చంద్రమ్మ నే నింక బ్రతుకలేనే
గుడికివెళ్లబోతే గుండెచెదురుతాది
నువ్వొకతెవే వెళ్ళవే చంద్రమ్మ నువ్వొకతెవే వెళ్ళవే
ఆడనున్నా సామి ఈడనూ ఉన్నాడు,
ఈడనున్నాసామినే చంద్రమ్మ ఏను కలుసుకొందునే
ఇద్దరము కలిసి ఏకముగ ఉండేము
ఏడులోకాలు మనకాడనే ఉంటాయి
ఎక్కడకి వెళ్ళవద్దే చంద్రమ్మ ఇక్కడనే ఉండిపోదామే

చంద్రమ్మపాటలోకంటె కవితాసౌందర్యముగల గేయము "చల్ మోహనరంగా"

కంటికీ కాటూకబెట్టి, కడవా దంకనుబెట్టీ
కళ్లనీళ్లు కడవనిండెను గదరా చల్ మోహనరంగా
నీకూ నీవారు లేరు నాకు నావారు లేరు
ఇద్దరికి జోడు కుదిరెను కదరా॥
నీరుమల్లితోటలోన మల్లెపూల తెప్పకట్టి
తెప్పమీద తేలిపోదము పదరా॥
నెలవంకదొన్నెలోన, కలమోదనలబుపాలు

కలిసి నీ నోట నిడుదును గదరా
మనమనసు లొక్కటైతే, మాయపెండ్లి యేల మనకు
మంగళసూత్ర మేమిటికి ప్రియుడా!
ఇద్దరికీ ప్రేముంటే, ముదమైన నగ లవేలా
మన ప్రేమే కోటి నగలు గదరా!

దీనికి అనేక పాఠాంతరములు గలవు. కాలక్రమాన ఎవరికి వచ్చినరీతిని వారు క్రొత్తపంక్తులు చేర్చి యీ పాటను వాడుకొన్నట్లు తోచును. ఇందలి సహజభావసంపద, రసపారవశ్యము జానపదగేయసాహిత్యములోని మాధుర్యమును ప్రతిపంక్తియందును ప్రతిధ్వనింపచేయుచున్నవి ఈ జానపదగేయసాహిత్యములో హెచ్చుభాగము 19 వ శతాబ్దిలోనే వచ్చినదని యీ పాటలలోని అంతస్సాక్ష్యమునుబట్టి నిరూపించవచ్చును.

మొత్తముమీద 19 వ శతాబ్ది గేయవాఙ్మయమును సింహావలోకనముచేసినచో తెనుగుమాట తేటదనమునకును తెనుగుపాట తీయదనమునకును తీరుతెన్నులు దిద్దిన స్వర్ణయుగ మీ శతాబ్ది యనవచ్చును.

# 9. నాటకములు

పద్యగద్యముల సమ్మేళనముతో చదువుకొనుటకేగాక దృశ్యకావ్యముగా ప్రదర్శించుటకు వీలయిన రచనము నాటకము. అది 19వ శతాబ్ది ఉత్తరార్థమునకాని అభివృద్ధికాలేదని కొందరి భావన. అది సరియైనదికాదు. అంతక్రితముకూడ తెలుగునాటకరంగ మున్నది. అదియే భాగవతప్రదర్శనముగాను, వీథినాటకాభినయము గాను చెన్నొందినది. అది విశిష్టమైన సంప్రదాయము. అది తెనుగు వారి ప్రత్యేకత. అది సంపూర్ణముగా వికసించి పరిణతిపొందిన కాలము 19వ శతాబ్దమే. అదికాక, సంస్కృతసంప్రదాయములను అనుకరించిన నాటకములు 1860లోనే వచ్చినవి. అవి రంగస్థలమున ప్రదర్శనపొందినను పొందకపోయినను నాటకకళ తెనుగుదేశమున ఒక మహోన్నతశ్రేణి నందుకొన్నమాట నిజము.

మొట్టమొదట తెనుగులోవచ్చిన స్వతంత్రనాటకము కోరాడ రామచంద్రశాస్త్రిగారు రచించిన "మంజరీ మధుకరీయము". కవి గారు మొత్తము 31 గ్రంథములను రచించిరి. వానిలో సంస్కృత గ్రంథములు 22. ఆంధ్రీకరణములు 7; స్వతంత్ర ఆంధ్రగ్రంథములు 2; ఉన్మత్తరాఘవము, ముద్రారాక్షసము, శాకుంతలము, వేణీ సంహారము, ఉత్తరరామచరితము. వీనియన్నింటిలోను స్వతంత్ర రచన ఈ మంజరీమధుకరీయమే. 1860లో ఈ నాటకము రచించి రని వీరికుమారులు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు పేర్కొని నారు. నాట్యశాస్త్రలక్షణములబట్టి యిది 'నాటిక' యనవచ్చును. ఇందలిసంభాషణలును, పద్యములును సంస్కృతనాటకములపద్ధతి ననుసరించును. ఉన్మత్తరాఘవమును అనువాదముచేసి 1891లో ప్రక

టించిరి. ఇందలి శైలి కొంచెము సరళముగా సాగినది. ఉదాహరణ కొక పద్యము:

ఎవనికి మంత్రి వసంతుం
డెవనికి మలయానిలుండు హితసైన్యవిభుం
డెవనికి ననుచరు లళులగు
శివజేత సుమాస్త్రి డతడు చిరజయమొందున్

ఉన్మత్తరాఘవమును శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు గారుకూడ అనువాదముచేసి 1899లో ప్రకటించినారు.

1860ప్రాంతములో మతుకుమల్లి నృసింహకవి శ్రీకృష్ణ జలక్రీడామహోత్సవము అను నాటకమును రచించినారు. కాని ఇది వీథినాటకముపద్ధతిని అనుసరించెను. 1880కిముందుగానే మాడభూషి వేంకటాచార్యులుగారు 'వామన' నాటకమును రచించిరి. ఇవి యేమియును ప్రదర్శనభాగ్యమును పొందలేదు. శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు నరకాసురవ్యాయోగమును 1881లో ప్రకటించిరి. ఇదికూడ సంస్కృతనాటకమునకు అనువాదమే. ఆకాలములో వావిలాల వాసుదేవశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నము పంతులు, కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, ముడుంబై రామానుజాచార్యులుగారలు నాటకములు రచించిరి. వానిలో ఎక్కువ భాగము సంస్కృతనాటకములనుండికాని, ఆంగ్లమునుండికాని అనువాదములే. ఏవియును ప్రదర్శనయోగ్యములుగా లేవు. ఇంతలో ధార్వాడనుండి ఒకసమాజము వచ్చి కొన్ని నాటకములను ఆంధ్రదేశములోని ప్రధాననగరములలో హిందుస్థానీ, మరాటీభాషలలో ప్రదర్శించెను. దుస్తులు, తెరలు, అభినయము ఆనాటి పండితపామరులను ఎక్కువగా ఆకర్షించెను. వానినిచూచి కందుకూరి వీరేశలింగంపంతులుగారు, ఆ ధార్వాడవారు ప్రదర్శించిన డేరాలలోనే నాటకములు ప్రదర్శింపజేసిరి. ఇందు పాల్గొన్న నటులు, పంతులుగారి విద్యార్థులే. ఆవిధముగా ప్రదర్శనయోగ్యమైన తొలినాటకము రచించినవారు కందుకూరి వీరేశలింగముగారే. అయినను 1860

నుండి 1880వరకు ఆంధ్రనాటకచరిత్రకు ప్రథమదశయనియే చెప్ప వచ్చును. ఈ కాలములో నాటకరచనలో గుర్తింపదగిన విధానము మూడుతెఱగులుగా సాగినదనవచ్చును. స్వతంత్రనాటకములరచన, సంస్కృతనాటకానువాదము, ఆంగ్లనాటకానువాదములు, ఒకేనాటకమును పలువురు అనువాదముచేయుటకూడ ఒక విశేషమే. ఉదాహరణకు శాకుంతలనాటకమును కందుకూరి వీరేశలింగంపంతులు, పరవస్తు రంగాచార్యులు, కోరాడ రామచంద్రశాస్త్రి మున్నగువారు చేసిరి. అట్లే ఉత్తరరామచరితమును వావిలాల వాసుదేవశాస్త్రిగారును వేదము వేంకటరాయశాస్త్రిగారును, జయంతి రామయ్యపంతులుగారును మరికొందరును రచించిరి.

వీరేశలింగంపంతులుగారి ప్రథమనాటకరచనము "బ్రాహ్మవివాహము". దీనినిగూర్చి పంతులుగా రిట్లువ్రాసిరి. "నా నూతన మార్గానుసారముగా సంభాషణరూపమున బ్రాహ్మవివాహము వ్రాసి, హాస్యసంజీవని మొదటిపత్రికలో కొంత ప్రకటించితిని. కులాచారవిషయములలోను, రాజకీయవ్యవహారములలోనుగల అనేక దురాచారములను వినోదకరముగా సంభాషణరూపమున వెల్లడి చేసి తన్మూలమున దురాచారములను మాన్పుటకయి ఈ పత్రిక పెట్టితిని" పంతులుగారు "వ్యవహారధర్మబోధిని" అనుపేరున మరొక నాటకము పత్రికలో ప్రకటించిరి. దీనినిగూర్చి 3-8-1880 తేదీని చెన్నపురినుండి వల్లూరి జగన్నాథరావుగా రిట్లువ్రాసిరి.

"I see you are mercilessly exposing the faults of the young Rajahmundrians. Harsh expositions will sometime, do more harm than good, while they lower the whole community in the estimation of foreign nations... think not that vernacular papers are left unnoticed by the authorities. If you will pardon me, I will point out that some of the passages in your 'Vyavahara dharmabodhini' are too sweeping and condemnatory. You have over drawn the picture altogether. The plot and design are no doubt admirable."

తెలుగునాటకములలో ప్రదర్శనభాగ్యముగాంచిన ప్రథమ నాటక మిదే. ఆ ప్రదర్శనమునుగూర్చి పంతులుగా రిట్లు వ్రాసిరి.

"వ్యవహారధర్మబోధినిని నా మిత్రులు కొందఱును, విద్యార్థులు కొందఱును జేరి, 1880 వ సంవత్సరమున శ్రీ విజయనగరము రాజాగారి బాలికాపాఠశాలలో మొదట ప్రయోగించిరి. అందు న్యాయాధికారుల యొక్క దుశ్చర్యలు పరిహాసరూపమున ప్రకటింపబడినవి. వానిని బ్రదర్శించుటవలన నందభివర్ణింపబడిన దోషములుగలవారి మనస్సులకు గొంత నొప్పిగలిగినను, ఇటువంటి రూపకములను బ్రదర్శించుట కదియే మొదలయినందున నూఱుల కొలది జనులువచ్చి చూచి యానందించిరి."

1880లో ధార్వాడ నాటకసమాజమువారు రాజమహేంద్రవరములో నాటకప్రదర్శనలిచ్చినారు. 1881 లో ఒక నాటకసమాజమేర్పడినట్లు వావిలాల వాసుదేవశాస్త్రిగారు రచించిరి. 1880 కడపటిభాగములో నీ రేశలింగముగారు, రత్నావళియును 'చమత్కారరత్నావళి'యును రచించిరి. ఈ రెండవది షేక్స్పియర్ (Comedy of errors) పుస్తకమునకు అనువాదము. 1880 లోనే వ్రాసిన స్వతంత్రనాటకము 'వివేకదీపిక'. దీనియందు స్త్రీపునర్వివాహము విషయమైన చర్చ సంభాషణాపూర్వకముగా పంతులుగారు ప్రతిపాదించిరి. 1880 లోనే షేక్స్పియరునాటకము మఱొకటి Merchant of Venice పంతులుగారు అనువాదముచేసిరి. అది అసంపూర్ణము; ఆ సంవత్సరములోనే గురజాడ శ్రీరామమూర్తిగారు కూడ ఈ నాటకమును అనువాదముచేసిరి.

పంతులుగారు రచించిన నాటకములన్నింటికంటెను ప్రసిద్ధమైనది అభిజ్ఞానశాకుంతలము. ఇన్నినాటకము లుండగా – ఇన్ని యనువాదములుండగా పంతులుగారి శాకుంతలమే నాటికిని నేటికిని పలుతావులలో అనేకసమాజములవారు ప్రదర్శించుచునచ్చిరి. ఇందలి సంభాషణలును పద్యములును మనోహరముగానుండి అందఱికును సుబోధకముగా నుండును. పంతులుగారు దీనిని 1875 లోనే

అనువదించుటకు మొదలుపెట్టి 1883 లో గాని పూర్తిచేయలేదు. పంతులుగారి శాకుంతలమునాటకములోని యీ పద్యములు చాల మందికి కంఠస్థమైనవి.

చల్లనివై శ్రమంబుడుపజాలిన తామరపాకు వీవెనల్
మెల్లన గొంచు వీచుదునె మిక్కిలి శీతలమైన వాయువున్
సల్లలితారుణాబ్జసదృశంబగు నీ చరణద్వయంబు నో
పల్లవపాణి! నా తొడలపై నిడి మెల్లగ పట్టువాడనో

పంతులుగారు మొత్తము 16 నాటకములను వ్రాసిరి. ఇందులో బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మబోధిని, తిర్యగ్విద్వన్మహాసభ, మహారణ్యపురాధిపత్యము అను నాలుగును ప్రహసనములవంటివి. ఏ నాటకములకు అనువాదములుగాని స్వరచిత కల్పనలే యనవచ్చును. రత్నావళి, అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, ప్రబోధచంద్రోదయము ఇవి సంస్కృతనాటకములకు అనువాదములు. వీనిలో రత్నావళి, శాకుంతలము ఎన్నిచోట్లలోనో ప్రదర్శితమైనవి. చమత్కారరత్నావళి, వెనీసువర్తక చరిత్రము, రాగమంజరి, కళ్యాణకల్పవల్లి అను నాలుగును ఆంగ్లము నుండి అనువదితములు. వివేకదీపిక - ప్రచారమునకు వ్రాసిన ఒక సంభాషణము. మిగిలిన మూడును నాటకసమాజముల ప్రదర్శన నిమిత్తము రచించిన పౌరాణికనాటకములు. ఇవి ప్రహ్లాద, దక్షిణగోగ్రహణము, సత్యహరిశ్చంద్ర అనునవి. పంతులుగారు ప్రహసనములనేకములు రచించిరి. వానిలో పదివరకు ఇంగ్లీషులోనున్న ప్రహసనములను అనుసరించి వ్రాసినవి. పంతులుగారు నవీన గద్యవాఙ్మయయుగకర్త లనుటలో - "నాటకమునకు" కూడ నాందీ - ప్రస్తావన చెప్పినారు.

వీరి సమకాలికులయినవారిలో - కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రదర్శనయోగ్యమైన అనేక నాటకములు రచించిరి. వీరివద్ద ఆకాలములో విద్యార్థిగానున్న కొండా వేంకటప్పయ్యగారు వీరినిగూర్చి తమస్వీయచరిత్రలో యిట్లువ్రాసిరి. "...శాస్త్రిగారు

కొన్ని నాటకములు తెలుగున వచనశైలిని వ్రాసి వానిని ప్రదర్శించ వలెనని కుతూహలపడుచు, వారు అందుకు నాటకపాత్రలుగ మార్చ తలచినవారిలో నన్నుగూడ చేర్చి ప్రోత్సహించిరి.

అదివరకు దేశములో వీథినాటకములు సామాన్యముగ నాడు చుండిరి. చాలవరకు ఈ నాటకములలో దరువులు పాడుచు, నృత్యముచేయుచుండుటచేత సంగీతము ప్రధానముగనుండెను. ఈ నాటకబృందములలో చాలవరకు బ్రాహ్మణులే చేరియుండిరి." అని వ్రాసినారు. అప్పుడు 1881 లో ధార్వాడు నాటకసమాజము గుంటూరు వచ్చెను. అప్పటికే సుబ్రహ్మణ్యశాస్త్రిగారు హిందూ నాటకసమాజమును స్థాపించిరి. 1874 లో విజయనగరములో ఆనంద గజపతితండ్రి విజయరామగజపతి వారికాలములోనే జగన్నాథవిలాస సభయను సమాజమున్నది. 1879 లో ఆనందగజపతిగారు దీనిని తమఆధ్వర్యములోనికి తీసికొని, సంస్కృతము నాటకము లాడించెడి వారట. శాకుంతలములో దుష్యంతపాత్ర మహారాజావారే ధరించెడివారట.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1880లో గుంటూరులో ఉండగనే 31 నాటకములు రచించిరట. కాని అవి యన్నియును అంతరించి పోగా 13 మాత్రము మిగిలినవట. వీనిలో గయోపాఖ్యానము, కీచక వధ, హరిశ్చంద్రోపాఖ్యానమును ఉన్నవి. కాని చిలకమర్తివారు రచించిన గయోపాఖ్యానమునాటకము మంచి ప్రఖ్యాతినార్జించినది. తెలుగునాటకములలో ఇంత ప్రచారముపొందిన నాటకము మరొ కటిలేదు. ఇప్పటికి రెండులక్షలప్రతులు చెల్లెనని చెప్పినచో అది అతిశయోక్తికాదు. రామయామాత్యునికథననుసరించి తమనాటక మును వ్రాసితిమని చిలకమర్తివారు తెలిపిరి. సుబ్రహ్మణ్యశాస్త్రి గారి నాటకములలో కీచకవధయును, ద్రౌపదీవస్త్రాపహరణమును మిగుల ప్రసిద్ధిపొందినవి.

చిలకమర్తివారు ఇమ్మానేని హనుమంతరావుగారి ప్రోత్సా హమున రాజమహేంద్రవరము విచ్చేసి తొలుత వచననాటకములనే

రచించిరి. అట్టివానిలో కీచకవధ మొదటిది. చిలకమర్తివారు వావిలాల వాసుదేవశాస్త్రిగారిశిష్యులు. 1828లో వారు - గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, ప్రసన్నయాదవము, కీచకవధవంటి నాటకములు రచించిరి. వీనిలో ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు నాయకపాత్రలును, టంగుటూరి ప్రకాశంపంతులు గారు నాయికపాత్రలును ధరించువారు. వీరికిముందుతరములో వావిలాల వాసుదేవశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు, కందుకూరి వీరేశలింగంపంతులుగార్లు అనేక సంస్కృతనాటకములను అనువాదముచేసినారు. వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారము రాజమహేంద్రవరములో తొలిసారి ప్రదర్శితమైనది. దీనియందు కవిగారుకూడ స్వయముగా ఒక పాత్రధారణచేసినారు. వావిలాల వాసుదేవశాస్త్రిగారు 'సీజరుచరిత్రము'ను ఆంగ్లమునుండి, బ్లాంకు వర్సులోనికి అనువాదముచేసినారు. ఆనాడు స్టేట్సుమనుపత్రిక ఒక ముఖ్యవార్తగా నిది ప్రకటించెను.

"The literary and scientific world may be interested to learn that shakespeare's julius ceasar has been translated into Telugu by Vavilala Vasudeva Sastry. The curator of books informs us that this is the first attempt at a metrical translation of Shakes peare into the language"

ఈ నాటకములో ఆంథోని గంభీరసంభాషణమునకు అనువాదము చూడుడు.

సద్ధితులు రోమనులు, స్వదేశస్థులార!
చెవులనెరవిండి వినగ నా చెప్పుదాని
వచ్చితిని నేను సీజరు బాతిపెట్ట
గాని వానిని నుతియింపగాను గాదు

1892 లో మృచ్ఛకటికకూడ వీరు అనువాదముచేసినారు. వీరిసమకాలికులయిన ఆదిభట్ల నారాయణదాసుగారు తమ పసి

ప్రాయముననే రెండునాటకములు రచించిరి. ఒకటి సారంగధర నాటకము. రెండవది దంభపురప్రహసనము. ఈ నాటకములను 1890 లో రచించి విజయనగరములో రెండుసారులు ప్రదర్శింపజేసి రట. దంభపురప్రహసనములో విజయనగరము పురపాలకసభ్యుల గూర్చి రచించినది. నాటకమంతయు పద్యములతోనే నడచెను. ఉదాహరణమునకు వేసవిని వర్ణించు పద్యములో ఆనాటి విజయ నగరముస్థితి వర్ణితమాయెను.

కాలువకంపులన్ పరగు గాడుపు లెల్లెడ దేళ్లుకుట్టుగ
గ్గోలుగ నేడ్చు నేడుపులు కుక్కలవేలుగ, దోమకాటులున్
ప్రేలెడి సోదెబూచులును రేగు మశూచులు, పొక్కుపుండ్లునుం
గాలెడి నిండ్లు కల్గి నరకంబయి వేసవి వచ్చె నిచ్చటన్....

వేడినెత్తురు త్రాగి వింత ఘత్తున జోగి
పరుగుపరుగున పాట పాడె దోమ....

ఈసమయమున రాయలసీమలో బళ్లారి సరసవినోదినీసభ బయలుదేరి ఆంధ్రనాటకపితామహులు ధర్మవరం రామకృష్ణమా చార్యులుగారు అనేకనాటకములు రచించిరి. వీరినాటకములతో తెలుగురంగస్థలమున ఒక నూతనశకనే ప్రారంభమైనది. వీరు కొంతవరకు సంస్కృతనాటకములను, మరికొంతవరకు ఆంగ్లనాట కములనుఅనుసరించి మధ్య పద్యగద్యములతో, సంభాషణలతో పార్శీ మెట్లతోకూర్చిన పాటలతో పండితపామరజనరంజకముగా తయారు చేసిరి. దానిని తమ నాటకసమాజముచేత ప్రదర్శింపజేయుటచేత దానికి ఒక క్రొత్తశోభ, మరొక వింతప్రచారమును వచ్చి వందలు వేలు జనములు వచ్చిచూచిరి. ఈ నాటకములను గుంటూరు తీసి కొనిపోయిహరిప్రసాదరావుగారు తమసమాజముచేతప్రదర్శింపజేసెడి వారు. అట్టివిధముగా సారంగధర, చిత్రనళీయము, చంద్రహాసవంటి నాటకములు అత్యంత ప్రసిద్ధిలోనికి వచ్చినవి. కృష్ణమాచార్యులు గారు తెలుగు కన్నడభాషలలో నాటకములు రచించి బళ్లారిలో

తమసమాజముచేత ప్రదర్శింపజేసెడివారు - తెలుగు నాటకరంగము లకు ధర్మవరంవారే పితామహులనిపించుకొను ఖ్యాతిబడసిరి.

వీరి ప్రథమరచన చిత్రనళీయము 1866లో వెలువడినది. మొత్తము 28 నాటకములను వీరు రచించిరి. వీనిలో 14 మాత్రము అచ్చుఅయినవి. రెండు కన్నడములోను ఒకటి (హరిశ్చంద్ర)ఆంగ్ల ములోకూడ రచించిరి. చిత్రనళీయము, విషాదసారంగధర,పాదుక, ప్రహ్లాద, చంద్రహాస - ఈ నాటకములు విశాఖపట్టణమునుండి బళ్ళారివరకు అన్నిముఖ్యనగరములలోను ఆకాలమున ప్రదర్శితమగు చుండెడివి.

వీరికి సంస్కృతభాష వచ్చినను, ఆంగ్లనాటకపద్ధతినే అనుస రించి అంకవిభజన, రంగవిభజనచేసి, కథాసంవిధానమునందునను పాత్రపోషణమునందునను నూతనమార్గము లవలంబించిరి. మనదేశ మున నాటకములన్నియును మంగళాంతములగుట సంప్రదాయము. అట్టిది తప్పించి వీరు విషాదసారంగధర చంద్రహాసవంటి విషాదాంత నాటకములుకూడ రచించి క్రొత్త ప్రయోగములుచేసిరి. వీరికి సంస్కృతసమాసములతోకూడిన సుదీర్ఘసంభాషణము లెక్కువ ప్రియము. సారంగధరలోని చిత్రాంగిస్వగతము రాజునకేకపుత్రు డేయని ప్రారంభించునది తెనుగునాటకములలోని ప్రసిద్ధస్వగతము లలో నొకటి. తెనుగునాటకములలో పాటలు ప్రవేశపెట్టినవారిలో వీరే ప్రథము లనవచ్చును. రాగములపేరులతో శ్లేషచేసి రాగ మాలికాపద్యములు పాడించుట వీరే ప్రవేశపెట్టిరి వీరిననుసరించి ప్రతినాటకమునందును రాగమాలికాపద్యములుపెట్టుట పరిపాటిఅయి నది. తెలుగునాట వీరి చిత్రనళీయములోని బాహుకునిపద్యములు నక్షత్రమాలయని రంగస్థలమున చిరప్రఖ్యాతి నార్జించినవి. కృష్ణ మాచార్యులుగారి సమకాలికులు బళ్ళారివాస్తవ్యులయిన కోలా చలము శ్రీనివాసరావుగారు. వీరు నాటకకళయన్న అభిమా నముతో చరిత్రపరిశోధనచేసి ప్రపంచనాటకచరిత్రను(The dramatic History of The World) ఆంగ్లభాషలో రచించిరి. సునందనీపరి

ణయము, సుఖమంజరీపరిణయము అను నాటకములు తెనుగులో రచించిరి. చరిత్రకథలనుగైకొని నాటకములు వ్రాసినవారిలో వీరే ప్రథములని యందురు. రామరాజు, చాంద్‌బీబీ, ప్రతాపాక్బరీయము వీరిరచనలు. తళ్ళికోటయుద్ధముతో విజయనగరరాజ్యపతనమును వర్ణించు వీరి రామరాజునాటకము బళ్ళారి రాఘవాచార్యులుగారి నటనాసామర్థ్యమువలన అత్యంత ప్రసిద్ధిగాంచినది. విషాదాంతనాటకములలో షేక్‌స్పియరుచూపిన మెలకువలు, రామరాజునాటకరచనలో కనిపించును.

ధర్మవరము హరితరువాత ఎక్కువ నాటకరచనలో కృషిచేసినవారు వేదము వేంకటరాయశాస్త్రిగారు (1853 - 1929). వీరు రచించిన నాటకములలో అత్యంత ప్రసిద్ధిపొందినది ప్రతాపరుద్రీయము. ఇందలికథ చరిత్రాత్మకమైనను, చరిత్రదృష్టిలో అందలిసన్నివేశములు నిజముకావని, కొందరందురు. ఇది స్వతంత్రనాటకము. తెలుగుదేశములో అత్యంత సమాదరణపొందిననాటక మిదియే. ఇంకను వీరు రచించిన స్వతంత్రనాటకములు ఉషాపరిణయము, బొబ్బిలియుద్ధము. 'ఉష' అంత మంచినాటకము కాదని వీరిసమకాలికులైన గురజాడ అప్పారావుగారు తమమిత్రునికివ్రాసిన లేఖలో సూచించిరి. పాత్రోచితమైన సంభాషణలు రచించుటగూర్చి, తురకపాత్రలచేత తెలుగు - హిందూస్థానీ కలిసిన తురకభాష మాటలాడించుటగూర్చి వీరికిని, గురజాడవారికిని వాదప్రతివాదములు జరిగినవి.

వీరు బహుభాషాకోవిదులు, పండితులు. ఇంకను వీరు సంస్కృతమునుండి నాగానందము, శాకుంతలము, ప్రియదర్శిక, మాళవిక, ఉత్తరరామచరిత్ర, రత్నావళి, విక్రమోర్వశీయము అను వాదములుచేసిరి. వీటియన్నింటికంటె ప్రజల ఆదరాభిమానము చూఱగొన్న నాటకములు ప్రతాపరుద్రీయమును, బొబ్బిలియుద్ధమును. ఇది పెదబొబ్బిలిరాజు గేయకథ ఆధారముగా రచించినదని కవిగారే చెప్పుకొన్నారు. మల్లమదేవి బాలుని వప్పగింతలుసేయు ఘట్టము చాల జాలిగా వర్ణితమైనది. వేంకటరాయశాస్త్రిగారు

నాటకసమాజమును స్థాపించి, నటకులకు శిక్షణనిచ్చినారు. వీరు వాడిన పాత్రోచిత వ్యావహారిక భాషమూలమున గ్రాంథికవాదులు వీరిని 'గ్రామ్యశాస్త్రి' యని పిలచిరి. కాని వీరుమాత్రము వ్యావహారభాషను నీచగ్రామ్యమని నిరసించి పెద్ద వాగ్వాదము నడిపించిరి. అయినను వ్యావహారిక భాషోద్యమమునకు 19 వ శతాబ్దిలోనే వెలుగుచూపిన వేగుచుక్కవంటివారని వ్యావహారిక భాషావాదులు మన్నించిరి.

1897 లో బాలీవాలాథియేటర్ అను పేరుగల పార్సీకంపెనీ ఆంధ్రదేశములో పర్యటనముచేసినది. మిఱుమిట్లుగొలుపు దుస్తులతో, వైర్ - వర్కుతో, విద్యుద్దీపములతో నాటకములు ప్రదర్శించి తెనుగుప్రేక్షకుల కన్నులు జిగేలుమనిపించెను. ఈ నాటకములను జూచి మన రంగస్థలమున పార్సీమట్లు పాడుట, హార్మోనియమ్ తబలా ప్రవేశపెట్టుట, వైర్ - వర్కుచేయుట, స్త్రీలు స్త్రీపాత్రలు ధరించుట, కొందరు కుటుంబములవారు (సురభినాటకసమాజము - వనారస గోవిందరావు మున్నగువారు) వృత్తిగా నాటకములుప్రదర్శించుట ప్రారంభమైనది. రాజమహేంద్రవరములో చింతామణి నాటకసమాజము, హిందూనాటకోజ్జీవనసంఘమును వచ్చినవి. వానికొరకు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రదర్శనయోగ్యమైన నాటకములెన్నో రచించిరి. వారు అనేక సంస్కృతనాటకములకు అనువాదములుకూడ చేసిరి. అయినను ప్రసన్నయాదవము, గయోపాఖ్యానమువంటి నాటకములే హెచ్చు ప్రఖ్యాతిపొందినవి. వీరి తొలి రచనలు కీచకవధ (1889) గయోపాఖ్యానము 1890. వీరి సమకాలికులే పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు 40 నాటకములకుపైగా రచించిరి. అవియన్నియును 20వ శతాబ్దిలో వచ్చినవే. పానుగంటి వారు నాటకసంస్కరణోద్యమము ప్రవేశపెట్టి, నృత్తములు పాటలును లేని నాటకములను రచించిరి. వీరు హెచ్చుగా షేక్స్పియరు నాటకపద్ధతి కథానిర్మాణమును, పాత్రచిత్రణమును గావించుటచేత, ఆంధ్రషేక్స్పియరు అని కొందరందరు వీరిరచనలలో సున్నితమైన

హాస్యముతోపాటు సుబోధకమైన సంభాషణలు రామభక్తిని పర మార్థచింతనమును ప్రబోధించును. వీరి పాదుకాపట్టాభిషేకము, రాధాకృష్ణ, కంఠాభరణము మొదలైనరచనలు రంగస్థలముపైన చాలసారులు ప్రదర్శితమైనవి. కాని. ఈ నాటకములన్నియును 20 వ శతాబ్దిలో వచ్చినవే. పానుగంటివారితరువాత కొంతకాలమునకు వచ్చిన వేంకట పార్వతీశ్వరకవులలో (1881-82) బాలాంత్రపు వేంకటరావుగారు ధనాభిరామమును 1897 లోనే రచించిరి. కాని తరువాత చాలకాలమునకు బందరు డి. వి. సుబ్బారావుగారు ప్రదర్శించిరి. విశాఖపట్టణములో మారేపల్లి రామచంద్రశాస్త్రికవి గారు పలునాటకములను స్వయముగా రచించిరి. ఒకసమాజమును పెట్టి నటులకు తరిఫీదునిచ్చి, నాటకములను ప్రదర్శింపజేసిరి. వీరు నలనాటకము (1891), కిరాతార్జునీయము, గయనాటకము (1896), సావిత్రీవిజయము (18 6), విజయవిలాసము (1896), పాండవ జననము (1897), కుమారాస్త్రవిద్యాసందర్శనము (1897), భాను విజయము (1898), ద్రౌపదీస్వయంవరము (1899), కన్యక (1900) రచించిరి. తరువాతకూడ అనేకనాటకములను రచించిరి. జగన్మిత్ర నాటకసమాజములో వీరును సెట్టి లక్ష్మీనరసింహముగారును రాజా విక్రమదేవవర్మగారును కలిసి నాటకప్రదర్శనముల నిప్పించువారు. సెట్టి లక్ష్మీనరసింహముగా రా కాలములో కొన్నినాటకములను స్వయముగా వ్రాసి జగన్మిత్రసంఘమువారిచేత వేయించిరి. అట్టి వానిలో రుక్మిణీపరిణయము చాల ప్రసిద్ధిగాంచినది. విక్రమదేవవర్మ గారు (1869-1951) కొన్నినాటకములను స్వయముగా రచించి, నాటకములలో సంస్కరణ రావలెనని ఆకాలములో పరిశ్రమచేసిన వారని చెప్పవచ్చును. నాటకములలో పాత్రోచితభాష వాడుట మంచిదనియును, అనింద్యగ్రామ్యమును వ్యవహరించవచ్చుననియును వీరి యభిప్రాయము.

"ప్రాణాపహారకమగువిషము సన్నిపాతరోగి కొసంగబడు నపుడు హితకరమగునట్లు కావ్యానర్హమగు గ్రామ్యభాష నాటకము

నందు పాత్రోచితముగా వాడబడునపుడు పూజ్యమేయగును. గ్రామ్యభాష నియమములేనిదయి యొక్కొక్కమండలమున నొక్కొక్కవిధముగా వాడబడుచుండుటవలన నాంధ్రులకందఱకుం దెలియమి నది ప్రయోగయోగ్యముకాదని కొందఱమతము. విమర్శింపగా నొకభాషకును మఱియొకభాషకు నుండునంత భేద ముండక యీషన్మాత్రభేదముండుటం జేసి, కవి నిజమండలప్రచలిత గ్రామ్య భాషను వ్యవహరించినచో, నది యక్కాలపు జనసామాన్యమునకు తెలియకుండునా? కాబట్టి యట్టివాదము నిరర్థకము" అని వ్రాసిరి. కావ్యములలో వ్యాకరణవిరుద్ధములైన ప్రయోగములు కూడదనిరి.

నాటకములలో విప్లవాత్మకప్రయోగమును గురజాడ అప్పారావుపంతులుగారే చేసి కన్యాశుల్కమునాటకమును 1897లోనే రచించి ప్రదర్శింపజేసిరి. ఆనందగజపతిఆదరణక్రింద విజయనగరములోనున్న నాటకసమాజమువారు, ఒకపాఠశాల వార్షికోత్సవ సందర్భములో ఈ నాటకమును ప్రదర్శించి కృతకృత్యులైరట.

"కన్యాశుల్కము" రచించుటలో అంతవరకునున్న అనేక సంప్రదాయములను కట్టుబాటులను గురజాడవారు ఉల్లంఘించి క్రొత్తమార్గమును త్రొక్కిరి. ఈ మార్గములలో అత్యంతప్రధానమైనది నాటకమంతయును వాడుకలో నిత్యవ్యావహారికములోనున్న భాషలోనే రచించి మెప్పుగొనుట. ఆ భాషలో తెలుగుతో ఆంగ్ల భాషనుకూడ కలిపి గిరీశంవంటి పాత్రద్వారా ఆనాటి ఇంగ్లీషు చదువుకొని ఆడంబరముగా "బట్లరింగ్లీషుముక్కలు వాడుట ఫ్యాషన్‌గా పరిణమించిన పద్ధతిని గేలిసేయుట. నాటకవిభజనములో అంకవిభజన మార్చి, రంగవిభజనమునే పాటించుట, వీర, శృంగార రసములతోకూడిన కథకుగాని, పురాణకథలకుగాని, చరిత్రకథలకు గాని ప్రాధాన్యమీయక, సమాజసమస్యలకే ప్రాధాన్యమిచ్చుట. ఆనాటి సంఘదురాచారములలో నొకటియయిన "కన్యాశుల్క" మును, నరమాంసవిక్రయమును, "వృద్ధవివాహము" లను హేళన చేసి అప్పటికి సంఘవిద్రోహచర్యయనదగు స్త్రీపునర్వివాహమును

ప్రోత్సహించుట, సమకాలికజీవనమును కేవలము అతిశయోక్తిగా కాక ప్రకృతిసిద్ధముగా ఉన్నదున్నట్లు చూపి నాటకములలో తొలి సారి (Realism) వాస్తవికతను ప్రవేశపెట్టుట, స్త్రీపాత్రలను భోగ వస్తువులుగా కాక వారి సహజ గుణదోషములతో స్వాభావికసంభా షణలతో చక్కనిరీతిని చిత్రించుట, ఆనాటి కులీనసంఘములోను, ఇతరజాతులలోను గల ఆచారవ్యవహారములను నమ్మకములను, మనుష్యులప్రవర్తనలను అత్యంత సహజముగా రంగస్థలముపైన ప్రవేశపెట్టుట. వ్యవహారిక భాషలోనూ విజయనగరములో వాడుకలోనున్న భాషనే తీసికొని అది సర్వజనాంగీకారము చేయుట. ఇట్టివి యెన్నో క్రొత్తతెన్నులు తొక్కి "కన్యా శుల్కము" ను తెలుగులోని ఉత్తమనాటకముగా చేసిన మహ నీయకృషి గురజాడవారికే చెల్లినది. ఈ నాటకమును కొన్ని మార్పులతో 20వ శతాబ్దిలో (1904) తిరుగవ్రాసిరి. అప్పటికి ప్రథమరచన ఎంతో రూపాంతరము పొందినది. గురజాడవారు కన్యాశుల్కమునకుముందు కొండుభట్టీయమని మరొక నాటకము రచింప ప్రయత్నముచేసి, దానిని పూర్తిచేయలేదు. అదియే కన్యా శుల్కమునకు తొలిప్రయత్నమందురు. ఇదిగాక ప్రాచీనమర్యాద ననుసరించి బిల్హణీయముకూడ వీరు వ్రాసిరి. ఈయనకు సంస్కృ తము, ఆంగ్లము లెస్సగా వచ్చును. ఆంగ్లభాషలోకూడా చక్కని రచనలుచేయువారు. ఆంగ్లభాష క్షుణ్ణముగా తెలిసినవాడగుటచేత ఆ సాహిత్యమును జీర్ణింపచేసికొని అందలి యుత్తమసాహిత్యమార్గ మున తెనుగున నూతనరచనలుచేయుటకు ప్రయత్నముచేసెను. ఆ ప్రయత్నములలో అత్యంత ఫలప్రదమైనదియే కన్యాశుల్కనాటక రచనము. గురజాడ నూతన వచనరచనలో ఎట్లు మార్గదర్శకుడైన దియును వివరించుచు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఇట్లు వ్రాసిరి.

"నేటి ఆంధ్రవాఙ్మయమును ప్రధానముగ వచనవాఙ్మయ మని చెప్పనొప్పును. నవయుగమున ముఖ్యముగ తెనుగున సర్వ

జనసులభగ్రామ్యమైనట్టిదియు శాస్త్రీయవిషయములను స్పష్ట
ముగా తెలియజేయ సమర్థమైనట్టిదియు, స్వతస్సిద్ధమగు భాషా
సంప్రదాయములు మాఱకుండ నూతనపదజాలమును ఇముడ్చికొన
గలిగినదియునగు శైలి యావశ్యకమైనది. ఆంగ్లేయభాషాసంపర్క
మున నొక్క పాశ్చాత్యభాషావాఙ్మయసంప్రదాయములు ఆ భాష
మూలమున మనకు పట్టుబడినవి. వాని ననువదించుటకు పూర్వనిబం
ధనలుగలిగిన తెనుగు వచనరచన యేమాత్రమును సరిపోలేదు.
నూతనభావవ్యక్తీకరణమునకు నూతనశైలి అవసరమయ్యెను. అట్టి
శైలిని సులభమగు గ్రాంథికరీతిగ శ్రీ వీరేశలింగము వెలయించెను.
ఆ గ్రాంథికశైలిని శిష్టజనవ్యవహారమునయున్న సరళ మధుర రీతిని
శ్రీఅప్పారాయకవి యేర్పరచి అట్టిరచనకు మార్గదర్శకుడయ్యెను *

తెలుగునాటకములో పాత్రచిత్రణకు ఒకజీవము తొడిగి
నూతనత్వము తెచ్చిన రససిద్ధుడు అప్పారాయకవీంద్రుడు. సామాన్య
జీవితములలో మనకు నిత్యమును కనిపించు సన్నివేశములనుండి
యును, సంభాషణలనుండియును చక్కని సున్నితమైన హాస్యమును
సృష్టించి, సభ్యత చెడకుండ ఈ కన్యాశుల్కములో ప్రదర్శించిన
మేధావి. శిష్ట వ్యావహారికభాష (చలిత్ భాష)లో సాహిత్యము
వచ్చుట ఒక ఉద్యమముగా ఫలించుటకుపూర్వమే గురజాడవారు
ఆ భాష కొక రూపకల్పనచేసి యీ భాషతో యెట్టి విశిష్టభావము
లైనను చెప్పవచ్చునని నిరూపించినారు. ముందు, హాస్యముకు
తప్ప, ఇతరరచనలకు వ్యావహారికభాష నప్పదేమోయనువారికి,
కవితాప్రధానమైన ప్రాచీనయితివృత్తమును తీసికొని ప్రౌఢముగా
'బిల్హణీయము' నాటకములో వ్యావహారికభాషలోనే సంభాషణలు
నడిపించిరి. ఒక ప్రహసనములేకాక ఎట్టిరచనలయినను వాడుక
భాషలోచేసి రసవంతముగాచేయవచ్చునని బిల్హణీయము, అనుపౌరా
ణికనాటకమునునిదర్శనముగాచూపించినారు. ఈవాడుకభాషప్రజలను
మేలుకొలిపి సూటిగా వారిహృదయములలోచొచ్చి, వారిని విషయ

*అప్పారాయగ్రంథావళి-వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి ప్రచురణ-1వసంపుటి 11వపుట

ప్రలుబ్ధులను చేయగలదని గురజాడవారి విశ్వాసము. వీరేశలింగము గారు గ్రాంథికభాషను సుబోధకమైన తేటతెనుగుగా రూపొందిం దించి జనసామాన్యమునకు అందుబాటులోనికి తెచ్చిరి. అట్టిభాషను జీవత్ భాషనుచేసి దానిలో జనుల నిత్యజీవితమును, వారి సుఖ దుఃఖములు వారియేడ్పులు, నవ్వులు, వారి కుతంత్రములు కుత్సిత ములు, వారి యాలోచనలు భావములు ఇవియన్నియును సంభాష ణలలో స్వతస్సిద్ధశైలిలోనికి అనువాదముచేసి, నాటకపాత్రలు నిర్జీవ వేషధారులుగా కాక, నిత్యమును మనకు సంఘములో కనిపించు సజీవవ్యక్తులుగా తమ నాటకములలో ప్రవేశపెట్టిన నాటకకర్త గురజాడ అప్పారావుగారు. ఈయనచేతులలో నాటకమొక సాహిత్య కళాస్వరూపమే కాదు, సంఘదురాచారఖండనాయుధముగాకూడ ప్రయోగింపబడి అద్భుత మంత్రశక్తిగా పనిచేసినది.

ఈ సమీక్షనుబట్టి - 19 వ శతాబ్దిలో నాటకసాహిత్యములో వచ్చిన మార్పులను మూడు ప్రధానఘట్టములుగా విభజింప వచ్చును. అంతవరకు దేశములో వీధినాటకములు, తోలుబొమ్మలు, జంగంకథలువంటివియున్నను, నిజమైన నాటకమనునది 1860 లోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. తెలుగులోని తొలినాటకము కోరాడ రామచంద్రశాస్త్రి మంజరీమధుకరీయమే అయినను - అది ప్రదర్శనపొందిన ప్రథమనాటకము కాలేదు. వావిలాల వాసుదేవ శాస్త్రిగారి నందకరాజ్యము తొలి సాంఘికనాటకము. సీజరుచరిత్ర తొలి యాంగ్లానువాదము. పరవస్తువారి శాకుంతలము(1866) తొలి సంస్కృతానువాదము. అయినను తొలిసారి ఆంధ్రరంగస్థలమున ప్రదర్శనపొందిననాటకము కందుకూరివారి 'వ్యవహారబోధిని' యను సాంఘికనాటకమే. మొదటిదశతో 1860-1880 వరకు కొన్ని సంస్కృ తానువాదములు, కొన్ని యాంగ్లానువాదములు, కొన్ని స్వతంత్ర నాటకములును వచ్చినవి. అవి యంత రంగస్థలప్రదర్శనయోగ్యములు కాలేదు. రెండవదశలో(1880 - 90) ఆంధ్రదేశమున అనేకనగరము లలో నాటకసమాజములవతరించినవి.ఆసమాజములన్నియునునూతన

నాటకములను రచింపజేసికొని వాటిని ప్రదర్శించినవి. ఆంధ్రనాటక పితామహు లనదగిన ధర్మవరపు రామకృష్ణాచార్యులుగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, కందుకూరి వీరేశలింగంపంతులుగారు పలునాటకములను రచించి వానిని ప్రదర్శింపజేసిరి. ఇట్టివానిలో నేటికిని ప్రసిద్ధమైనవి ధర్మవరమువారి చిత్రనళీయము, సారంగధర, వేదమువారి ప్రతాపరుద్రీయము, బొబ్బిలి, నడ్డాదివారి వేణీసంహారము, కందుకూరివారి రత్నావళి, శాకుంతలము. 1890 – 1900 మధ్యకాలములో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కొన్ని నాటకములు రచించి వానికి యెక్కడలేని దేశప్రఖ్యాతి తెచ్చిరి. వానిలో 'గయోపాఖ్యానము'' ప్రసన్నయాదవము' లోకప్రసిద్ధమైన జనప్రియత నందుకొన్న నాటకములు. ఈ కాలముననే కొన్ని నాటకములను రచించినవారు తిరుపతి వేంకటకవులు. సుకన్య, పాండవజననము ఉద్యోగవిజయములవంటి నాటకములనేగాక విక్టోరియావిజయము వంటి నాటకములను సైతము తిరుపతి వేంకటకవు లాకాలములో రచించిరి. కాని, అవి నాటి కంత ప్రచారముకాక 20వ శతాబ్ది ఆరంభములోనే హెచ్చుప్రచారములోనికి వచ్చినవి. తిరుపతి వేంకటకవులు పది పన్నెండునాటకములు రచించినను వానిలో పాండవోద్యోగముమాత్రము అత్యంత ప్రచారమునొందినది. కారణము అందలి పద్యముల సారళ్యము, పాత్రల కలహప్రియత్వమును భారతగాథలోని ప్రసిద్ధసన్నివేశములును. శ్రీకృష్ణరాయబారమున

> జెండాపై కపిరాజు ముందు సితవాజిశ్రేణియుఁ గూర్చి నే
> దండంబుఁ గొని లోలుస్యందనముపై తా నారి సారించుచున్
> గాండీవంబును బూని ఫల్గుణుడు మూకన్ జెండుచున్నప్పు డొ
> క్కండున్ నీ మొఱ యాలకింపడు కురుక్ష్మానాథ సంధింపగన్

అను పలుకు పద్యముతో ప్రారంభమైన రాయబారపద్యములు విశేషప్రచారమునందినవి. పాండవవిజయములో సుయోధనుడు సరోవరమున దాగియున్నప్పుడు భీమునిచేత పలికించుపద్యము కవితా వైశిష్ట్యమునకు తార్కాణము.

ఈ నాటకములరచన 19వ శతాబ్ది చివరిభాగములోనే వచ్చినను ప్రచారముపొందుట 20వ శతాబ్దిలోనే. అట్లే పానుగంటివారి బహువిధనాటకములుకూడ. ఇవియన్నియును నాటకము నొక వినోదసాధనగా జేసి, సాహిత్యమును జనసామాన్యమునకు చేరువగా తెచ్చుటలో తోడ్పడినవి. నిరక్షరకుక్షులయినను నిసర్గ గ్రామవాసులయినను ప్రసిద్ధనాటకములలోని పద్యములను పట్టుతప్పకుండ పలుకుట మనదేశమున పరిపాటియైనది. పద్యములేగాక గద్యసంభాషణలు సైతము కంఠస్థముచేసి అడిగినప్పుడు చెప్పు ఏకసంథగ్రాహులున్నారు. అంతగా పద్యములవలె మనోహరముగా మనస్సునకు హత్తుకొని పోయిన సంభాషణములు గురజాడవారి 'కన్యాశుల్కము' లో నున్నవి. ఈ నాటకసంభాషణములును స్వగతములును నేటికిని పలువురు విద్యావంతులకు చదువురానివారికికూడ కంఠోపాఠమే. గిరీశంగారి స్వగతము, మధురవాణి లొట్టిపిట్టల హాస్యసంభాషణములోని నవ్వు, వేంకటేశము చదువు, లుబ్ధావధానుల కోర్టువ్యాసంగము, అగ్నిహోత్రావధానుల ఛాందసము, రామప్పంతులు వాక్యము, బైరాగిమఠములోని సిద్ధుడు, శిష్యుడి చిలిపిపాటలు, కరటకశాస్త్రి వేదపాఠములు, బుచ్చెమ్మ అమాయకప్రశ్నలు - ఇవియన్నియును ఆంధ్రప్రేక్షకలోకమునకు చిరపరితములు.

* 19వ శతాబ్ది చివరిదశలో వచ్చిన కన్యాశుల్కమురచన ప్రదర్శన ఆనాటి నాటకరసికులకు పెద్ద విశ్రాంతికలిగించిన విచిత్ర ప్రయోగమని చెప్పవచ్చును. ఈ శతాబ్దిసాహిత్యములో వచ్చిన నూతనపరిణామములలో తెనుగురంగస్థలము అభివృద్ధియొకటి. ఆరుబయట వీధిలో ఉత్సవసందర్భములలో వీధిభాగవతులు ప్రదర్శించు నాటకములనుండి, నవీననాటకశాలలో అన్నిహంగులతోకూడిన ప్రదర్శనశాలల నేర్పరిచి, తెఱలతో, వివిధదృశ్యములతో, పాత్రో

* ఈ యధ్యాయము వ్రాయుటలో తోడ్పడినగ్రంథములలో స్రవంతిలో పోణంగి శ్రీరామ అప్పారావుగారి ప్రథమాంధ్ర నాటకకర్త అను వ్యాసములు ముఖ్యము.

చిత వేషధారణముతో వింతవింత రంగుదీపాలమధ్య, తెర - వర్కు మొదలైన రంగస్థలసౌకర్యములతో నాటకము ఒక వాస్తవిక జీవిత దృశ్యము అనునదిగా మార్చుటకు ప్రయత్నము జరిగినది. తేలిక సంగీతమునకు, పద్యములకును, పాటలకును, అవకాశమువచ్చినది. ఈ పద్యనాటకములు 17, 18వ శతాబ్దపు 'గ్రాండ్ ఆపెరా'ను స్ఫురింపజేయునని Alex Moore అను పాశ్చాత్యప్రయోక్త తెలుగు నాటకములను చూచి వ్యాఖ్యానము చేసెను. పద్యరచనము తెలుగు భాషకు ప్రత్యేకము. ఈ పద్యములను భావయుక్తముగా అర్థమగునట్లు సముచిత సంగీతముతో పాడుట తెనుగువారిసొమ్ము. ఇట్టి విశిష్టసంప్రదాయమునురూపొందించి తెనుగునాటకమునకుఒకవిశిష్ట లక్షణములను సమకూర్చిన పరిణామము 19వ శతాబ్దిలోనే జరిగినది. నాటకమను కళాసంప్రదాయమును పద్యగద్యములతో రసాత్మకముగా చేసిన విశిష్టసృష్టి యీ శతాబ్దపు వరప్రసాదము.

19వ శతాబ్ది నాటకచరిత్ర సింహావలోకనము చేసినచో ఒక విషయము స్పష్టపడును. పాశ్చాత్యప్రభావముచేత ప్రారంభమైన నాటకప్రదర్శనాపద్ధతి ఒక రూపముదాల్చి 1880నాటికి తెనుగుదేశములో స్థిరపడి, అనేకనాటకములు వచ్చుటకు కారణమైనది. రచనలోను, అభినయములోను, ప్రదర్శనములోను, నూతనప్రమాణములందుకొని 19వ శతాబ్ది పూర్తియగునప్పటికి ఆంధ్రదేశమంతటను గొప్ప చైతన్యమేర్పడినది. ఊరూరను నాటకసమాజములు స్థాపించి క్రొంగ్రొత్తనాటకములు ప్రదర్శించుటయును, అనేక కవులు క్రొత్తక్రొత్తపోకడలతో నాటకములు రచించుటయును జరిగినది. ఇట్టి ప్రయత్నములఫలితముగా హరిప్రసాదరావు, ఈమని లక్ష్మణస్వామి, బళ్ళారి రాఘవవంటి ప్రముఖనటులు తయారగుటకు అవకాశమేర్పడినది. అయితే, ఇవన్నియును వినోదముకొఱకు అమెచ్యూరు నాటకసంఘములు చేసిన ప్రయత్నములే. వృత్తినాటకసమాజములు అంతవరకును రాలేదు. వృత్తిసమాజమును స్థాపించుటకు ఇతరవిషయములలోవలెనే, జమీందారులు, ధనవంతులు

మొదలయినవారు కృషిచేసి, జీతములనిచ్చి పోషించి నటులను సమాజములను క్రమశిక్షణతో తయారుచేసిరి. వీనిస్థాపన జరిగిన పిమ్మటనే నాటకకళ హెచ్చు ప్రగతి సాధించినది. కవులను రప్పించి – తమపోషకత్వముక్రింద నూతననాటకములు నూతనగీతికలును రచించుటకు ప్రోత్సహించిరి. సాహిత్యమనునది ఒక ప్రయోజనము కొఱకు వినియోగించవచ్చునని కవులు తలంచిరి. నాటకము ప్రయోజనాత్మకమైనదని, శక్తివంతమైన యీ సాయుధబలముచేత నేమైనను సాధించగలమని కందుకూరి, గురజాడ ప్రభృతులు ఆచరణ రూపముగా నిరూపించుటకు రంగభూమి తోడ్పడినది.

# 10. వచనవాఙ్మయము - పూర్వరంగము

ఆంధ్రవాఙ్మయమునకు 19వ శతాబ్ది యొసగిన విశిష్టమైన ఉపాయనము గద్యవాఙ్మయము. అంతవరకు తెనుగులో గద్యరచన లున్నను అవి యెవ్వరికిని అర్థముకాని ప్రాచీన ప్రబంధపద్యములను గద్యములుగా మాత్రము మార్చినపద్ధతిలో నడచినవి. వానియందు కూడ అనుప్రాసలతో శ్లేషలతో ఆనాటి గద్యరచయితలు 'అమందానందకందళితహృదయారవిందులై రే' కాని సర్వజనసుబోధకమగు శైలిని వ్రాయుటకు ప్రయత్నించలేదు. ఆ కాలమున మనదేశమునకు వచ్చిన ఆంగ్లేయపండితుల ప్రోత్సాహమునలన అప్పటికే దేశములో ప్రచారములోనున్న కొన్ని వచనరచనములను సేకరించుట జరిగినది. ఈ వచనగ్రంథములలో స్థానికచరిత్రలును, కైఫీయతులును ముఖ్యములు. అప్పటి వచనసారస్వతమునకు ఉదాహరణముగా ఆ శతాబ్ది ఆరంభమునుండి చివరవరకు వచ్చిన అనేక వచనగ్రంథములను పరిశీలనచేయుదము. ఆ రచనలలో పూర్వరంగమునందు మన దేశసంప్రదాయపద్ధతులలో నడచిన గద్యవాఙ్మయమును పరామర్శ చేయుదము. ఈ గ్రంథసముదాయము అసంఖ్యాకము. దీనియందు వ్యావహారికభాషలో వచ్చిన రచనలునుఉన్నవి; కేవలము గ్రాంథిక భాషలోవచ్చిన రచనలును ఉన్నవి. ఈ గ్రంథములన్నియును ఎప్పుడెప్పు డేవిధముగా వచ్చినవో గమనించునపుడు వానిలో భాష, కథావస్తువు, విషయవివరణ, కథనవైఖరి మొదలైనవి ఒక వింత లక్షణములను పాటించి ఆమార్గమున పోయినట్లు మనము గ్రహించవచ్చును. ఉత్తరరంగములో ఆధునికయుగోదయమైనపద్ధతి పరిశీలించినచో ఆధునికయుగనిర్మాత కందుకూరి వీరేశలింగముగారితో ప్రారంభమైన నవోదయము మరొకమార్గమున నడచినట్లుతోచును. ఈ పూర్వరంగములో ప్రాచీనసంప్రదాయములను అనుసరించి

వచ్చిన గ్రంథములప్రసక్తినే తీసికొందుము. వీనిలో వేదాంతగ్రంథ
ములు వచ్చినవి. మతప్రచారకగ్రంథములు వచ్చినవి. కథలపుస్తక
ములువచ్చినవి. యాత్రాచరిత్ర లున్నవి. లేఖలున్నవి. డైరీలున్నవి.
భాషావిమర్శలున్నవి.పరిశోధనగ్రంథములున్నవి. శాస్త్రీయగ్రంథము
లున్నవి. వాని అన్నింటియందును ఒక ప్రయత్నము ప్రస్ఫుటముగా
కనిపించుచున్నది. అంతవరకు సంస్కృతము, ఆంధ్రము అభ్యసించి
వానియందు పాండిత్యము సంపాదించినవారికిమాత్రము అవగాహన
యగుభాష తొలిసారి అందరికిని అందుబాటులోనికి వచ్చునట్లు
సులభమైన సుబోధకమైన శైలిలో చెప్పుట జరిగినది. కొందరు
దానిని శిష్టవ్యావహారికమైన వాడుకభాషచేసిరి. మరికొందరు వ్యాక
రణబద్ధమైన గ్రాంథికభాషచేసిరి. లక్ష్యముమాత్ర మొకటియే.
సాధ్యమైనంతమందికి ఒకేసమయమున బోధపడునట్లుచేయుట. ఈ
ప్రయత్నములో ముద్రణాయంత్రములు, గ్రంథప్రచురణసంస్థలు,
గ్రంథాలయములు చాలవరకు తోడ్పడినవి. తెలుగులో అచ్చు
అయిన మొదటిగ్రంథము 1806 లో చెన్నపురినుండి వెలువడినది.
తరువాత సిరాంపూర్ మిషన్‌తరఫున బైబిలు అనువాదముచేసి
ఫాదర్ కేరీవంటివారు ప్రచురించిరి. తెలుగులో తొలుదొల్త
1746 లో రెవరెండు బెంజమిన్ షూల్జ్ జర్మనీకిచెందిన ప్రష్యా
లోని మాగ్డిబర్గురాష్ట్రములోని "హాలీ" గ్రామమునుండి అచ్చు
యంత్రములు టైపులు పోతపోసి ప్రత్యేకముగా తయారుచేసి అచ్చు
వేసెను. ఆ పుస్తకముపేరు 'నూరు జ్ఞానవచనాల బైండుపుస్తకము."
1812 లో న్యూటెస్టమెంటు అనుపేరున దేవునియొక్క సమస్తమైన
వాక్యమును డెస్‌గ్రేంజన్ అను క్రైస్తవబ్రాహ్మణునిచేత తర్జుమా
చేయబడినదియని ముఖపత్రమున అచ్చువేయించిరి. 1819లో తొలి
సారి ద్వాత్రింశత్సాలభంజికలను (విక్రమాదిత్యునికథలు) రావిపాటి
గురుమూర్తిశాస్త్రిగారు అనువాదముచేసిరి. 1829లో వేమనపద్యము
లను సి. పి. బ్రౌనుదొరగారు ఆంగ్లనువాదముతోసహా ప్రక
టించిరి. బ్రౌనుదొరగారు తెలుగుగ్రంథములను, అనేకములను

సేకరించి వాని వివిధపాఠాంతరములను పరిశీలించి లేఖకదోషములను సవరించి. నిర్దుష్టమైన ప్రతులు తయారుచేయించి వానిలో కొన్ని గ్రంథములు ప్రకటింపజేసిరి. అట్టివానిలో స్వారోచిషమనుచరిత్ర 1851లో సవ్యాఖ్యానముగా జూలూరి అప్పయ్యగారి వివరణముతో బ్రౌను దొర ప్రకటింపజేసెను. ఈ శతాబ్దిలోని అందరివిద్యార్థులకు పాఠ్యపుస్తకమైన "నీతిచంద్రిక" 1853 లోను 'బాలవ్యాకరణము' 1858 లోను వచ్చినవి.

## మొదటి ముద్రితాంధ్రగ్రంథములు -

1812 న్యూ టెస్టమెంటు; దేవునియొక్క సమస్తమైనవాక్యము. ఇది డెస్గ్రేంజన్ అనే క్రైస్తవబ్రాహ్మణునిచేత తర్జుమాచేయబడినది.

1814 తెనుగువ్యాకరణము - డాక్టరు క్యారీదొర

1816 తెలుగువ్యాకరణము - ఏ. డి. కామ్బెల్

1817 తెలుగువ్యాకరణము : చార్లెస్ ఫిలిప్ బ్రౌను

1818 క్రొత్తనిబంధనలు : ఎడ్వర్డు ప్రిట్ చెన్

1819 ద్వాత్రింశత్సాలభంజికలకథలు - (విక్రమాదిత్యునికథలు) రావిపాటి గురుమూర్తిశాస్త్రి

1821 తెలుగునిఘంటువు - డంకన్ కామ్బెల్ - చెన్నపురి

1929 వేమనపద్యములు - సి. పి. బ్రౌనుగారి ఆంగ్లానువాదముతో

1835 'ట్రాక్టుస్' ఇది క్రీస్తుమతబోధిని - బళ్ళారిమిషన్

1836 తెనుగువ్యాకరణము : రావిపాటి గురుమూర్తిశాస్త్రి

1839 వసుచరిత్ర - లూకాచేత వ్రాయబడిన ఏసుక్రీస్తుశుభసమాచారం

1840 మత్తయిచేత వ్రాయబడిన శుభవర్తమానము

1841 నలచరిత్ర ; వి. టి. రాఘవాచార్యులు.

1843 లూకాచేత వ్రాయబడిన శుభవర్తమానము

1844 మోసేచేత వ్రాయబడిన రెండవపుస్తకము

1845 బోధనకీర్తనలపుస్తకము

1845 Telugu selections in the translation and grammatical analysis— by J. C. Morris.

1851 స్వారోచిషమనుచరిత్ర : (సి. పి. బ్రౌనుదొరగారి కోరికపై జూలూరి అప్పయ్యగారి వ్యాఖ్యానముతో ముద్రితము)

1852 "ఆంగ్లాంధ్ర నిఘంటువు" : సి. పి. బ్రౌనుదొర విరచితము
వ్యాక్యావళి: (Exercises in Indian vernaculars, prepared under the direction of C. P. Brown)
1853 చిన్నయసూరిగారి నీతిచంద్రిక
1854 నిఘంటువు - (A dictionary of the mixed dialects and Foreign works used in Telugu.) C. P. Brown
1855 విజయవిలాసము
1858 చిన్నయసూరిగారి తెలుగువ్యాకరణము,
1873 తెలుగువ్యాకరణము - A. H. Arden
1807 లో తెనుగు బైబిలును వ్రాసిరి - 1811లో మరియొక బైబిలు వ్రాయించిరి. (క్రొత్తనిబంధన)
1746 Sri Rampur— Rev. Benjamin Schulzius in Prussia— Makdelem of—Hali.
సూరుజ్ఞానవచనాల బైండుపుస్తకము.

1812 లో ఫోర్టుసెంటుజార్జి కాలేజీ స్థాపించి సమర్థులయిన పండితులను రప్పించి వారిచేత బ్రౌనుదొరవంటివారలు అనేక గ్రంథములు రచించి ప్రకటించిరి. ఆ కాలేజీలో ఒక భూగోళ శాస్త్రజ్ఞుడుకూడ ఉండువాడు. ఈతనిని కాలేజసిద్ధాంతియని ఏనుగుల వీరాస్వామయ్యగారు పేర్కొన్నారు. "ఈ కాలేజీ స్థాపించేనాటికి తెనుగులో అచ్చుపుస్తకాలు లేవు. అప్పటికి దేశీయులవిద్య అధోగతిలో ఉండేది. అప్పటికిఉన్న వీధిబడులలో పాఠాలు చెప్పడానికి ఉపయోగించే పుస్తకాలు లేవు. క్రొత్తగా తెలుగునేర్చుకొనే దొరలకు పుస్తకాలు అవసరమైనందువల్ల యీ బోర్డువారు ఉపయుక్తమైన తెలుగుపుస్తకాలు సంపాదించడానికి ప్రారంభించినారు. బందరులో మామిడి వెంకయ్యగారి 'ఆంధ్రదీపిక' పేరు క్రయముపొందిన మొదటిపుస్తకము. దీనికి వారు 1000 వరహాలిచ్చారు." — అని ఆంధ్రపత్రికలో (28-11-43) దిగవల్లి వేంకటశివరావుగారు ఉల్లేఖించినారు. వీరే తెలుగులిపిలో పుస్తకాలు అచ్చువెయ్యడం 1806 లోనే ప్రారంభమైనా 1830 వరకూ అభివృద్ధిపొందలేదు. అని వ్రాసినారు. ఆకాలములో చెన్నపురిలోను, వివిధ ముఖ్యనగరముల

లోను అచ్చుకూటములు వెలసినవి. 1883 నాటికి భారతీయులు మన దేశములో స్థాపించిన 'ప్రెస్సులు' 8. ఇవియేగాక, జమీందారులు తమపోషణక్రిందగాని, తాము స్వయముగాగాని ముద్రణాయంత్రములను తెప్పించి అనేక నూతనగ్రంథములను ప్రకటింప జేసిరి. అట్టివారిలో పిఠాపురము, వేంకటగిరి, పోలవరము, ఏలూరు జమీందారులు అచ్చుకూటములుపెట్టి ప్రకటించిన గ్రంథము లనేకములు. చెన్నపురిలో యద్దనపూడి సంజీవయ్య, బహూరు త్యాగరాయశాస్త్రి, గట్టుపల్లి శేషాచార్యులు మున్నగువారు చాలగ్రంథములను ప్రకటించిరి. ఆకాలమున చెన్నపురి హాషక్ మన్ పేటలో లెక్కకు మిక్కిలియైన అచ్చుకూటములుండి ప్రాచీనగ్రంథములనే గాక యక్షగానములను, వీధినాటకములను, గేయములను, వచనగ్రంథములను అనేకము ప్రకటించినవి. తరువాతవచ్చిన గ్రంథప్రకాశకులలో ముఖ్యులు వావిళ్ళ రామస్వామిశాస్త్రులుగారు. వీరిసంస్థ నాటినుండి నేటికిని ముచ్చటయిన అచ్చులో ప్రాచీనపుస్తకములను అచ్చువేయుచునేయున్నది.

1850 ప్రాంతములో "బ్రహ్మవిద్యావిలాస" మనుపేరుతో వనపర్తిలో శ్రీ రాజా ప్రథమరాజేశ్వరరావు బహిరీ బల్వంత్ బహద్దరుగారు ఒక తెనుగు ముద్రాయంత్రమును స్థాపించిరి. "సాహిత్యవిద్యాముకురము" అనుపేరున గద్వాలలో కాణాదము పెద్దన్నగారు మరొకప్రెస్సు స్థాపించి అధ్యాత్మరామాయణము ముకుందవిలాసము మున్నగు గ్రంథములను 1875నాటికే ముద్రించిరట.* ఆ గ్రంథముద్రణముచేయు ముద్రణాయంత్రములు, ప్రచురణ సంస్థలతోపాటు ఆకాలములో ఒక్కొక్క ప్రచురణసంస్థపక్షమున ఒకపత్రికకూడ వెలువరించుట పరిపాటి. అట్టివానిలో సాహిత్యచర్చలును, అముద్రితగ్రంథప్రకాశనమును విరివిగా జరుగుచుండెడివి. వానిప్రసక్తి ఉత్తరరంగమున చర్చించుదును.

---

*గోలకొండపత్రిక - 26-5-43

19వశతాబ్దిలో వచ్చిన వచనగ్రంథములలో తత్వశాస్త్రగ్రంథములు అధికము. ఇవి యెక్కువగా వాడుకభాషలోనే వెలువడినవి. 'వేదాంతసారసంగ్రహము', 'అజ్ఞానధ్వాంతచండభాస్కరము', 'సిద్ధాంతసారము' 'వాసుదేవమననము' అనుగ్రంథములలోని భాష సరళమై శిష్టవ్యావహారికములోనే నడచినది. ఇందు వీరశైవమతమునుగూర్చిన గ్రంథములును, వైష్ణవమతప్రచారగ్రంథములును అధికముగా వచ్చినవి. ఉదాహరణముగా "అసురాంశల బుట్టినవారి లక్షణముల చెప్పేము. శ్రుతులకు విపరీతార్థములు కల్పింతురు. విష్ణుదూషణచేతురు. విష్ణుభక్తులను ద్వేషింతురు. వారితో వాదించబోవద్దు. వారు చెప్పే శ్రుతిస్మృతీతిహాసపురాణాలయొక్క విపరీతార్థాలు నీవు యెల్లకాలము దిద్దుకొనేసరిపొయ్యీని. నీవు దిద్ది చెప్పితివాయనా వారు సమ్మతిపడనేపడరు. సమ్మతిపడరా విశేషమార్గాన నడవనేనడవరు."

ఈ సంప్రదాయముననుసరించి వేంకటగిరి మహారాజావారు శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్రభూపాలురు అనేక తత్వగ్రంథాలు వ్రాసినారు. వారు "మనస్సాక్ష్యము' మనుగ్రంథమును వ్రాయుచు ఇట్లనిరి.

"వ్యాకరణశిక్షితముగా వ్రాసితే కొందరికి తాత్పర్యము భిన్నమగునని యెంచి, యీ గ్రంథాభిప్రాయము అందరికి చక్కగా తెలియవలెనని వాడుకగానుండుమాటలలో వ్రాసినాడను."

తత్వగ్రంథములవలెనే వ్యవహారసిద్ధమైన శాస్త్రగ్రంథములు కూడ వ్యావహారికభాషలోనే ఈ శతాబ్దిలో వెలువడినవి. అల్లాడి రామచంద్రశాస్త్రిగారి సిద్ధాంతశిరోమణి (1837) మరియొకశాస్త్రజ్ఞుని భూగోళదీపిక (1843) వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారి వ్యవహారదర్పణము (1851) భూపాలీయమనికూడ దీనికి మారుపేరు. ఇట్టిగ్రంథములలో విరివిగా వాడుకభాషతోనే సరళముగా సులభబోధకముగానుండునట్లు ఆయా శాస్త్రవిషయములను విపులముగా తెలియజేసియున్నారు.

తెలుగులోని కథాసాహిత్యములోని అధికభాగము 19వ శతాబ్దిలోనే వచ్చినది. ఇంగ్లీషువిద్య ప్రారంభముచేసిన క్రొత్తలో బడులలో ఆంగ్లవిద్యతోపాటు తెనుగుపుస్తకములు చదువుకొను పాఠకులకొఱకు వాచకపుస్తకములుగా ఈ కథలు ఉపయోగించు చుండెడివి. పాఠకులలో తరువాత కథ ఏమైనదను ఉత్కంఠ ప్రేరేచుటకు వీలుగా, కథనము సాగెడిది. భాష సరళముగా నుండెడిది. కథలు పంచతంత్రము, హితోపదేశము, విక్రమార్కకథలు, బృహత్కథ, కథాసరిత్సాగరము మొదలగు ప్రాచీనగ్రంథములనుండి సేకరించినవే అయినను రుచికరముగా పాఠకులకు వినోదముకలిగించునట్లు రసవంతమైన సన్నివేశములతోడను, పాత్రచిత్రణముతోడను, ప్రకృతివర్ణనములతోడను అలరారుచుండెడివి. విశాఖపట్టణములో నున్న గోడే నారాయణ గజపతిరాయనింగారు 1811లో ఇంగ్లీషులో ప్రకటితమైన 'చార్‌దర్వీష్' కథలు బహుజనోపకారంకముగా తెలుగులోనికి యెఱ్ఱమిల్లి మల్లికార్జునుడు అను బ్రాహ్మణునిచేత అనువాదముచేయించి ప్రకటించినారు. ఆ గ్రంథపీఠికలో వారిట్లు వ్రాసిరి. "వ్యాకరణపద్ధతిగా గ్రంథముచేసేయెడల సర్వజనసాధారణము కాకపోవడమేకాక దేశీయ భాషాచమత్కారము బోధపడక, విరసమౌనని తోచి స్త్రీపురుషులు వకరితోనొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేపముగా జాతీయరసముతో ఈ గ్రంథముసేయ నిశ్చయించడమైనది"

1819లో విక్రమార్కునికథలును, 1834లో పంచతంత్రకథలును పోర్టుసెంటుజార్జి కళాశాలలో ప్రధానోపాధ్యాయులగు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు రచించిరి. అవి యెన్నోసారులు పునర్ముద్రణపొందినవి. కాంభోజరాజుకథలు, తాతాచార్యులకథలు తెనాలిరామునికథలు, శుకసప్తతికథలు, బేతాళపంచవింశతి, పలుకని పద్మాక్షికథలు మొదలైన గ్రంథముల ప్రచురణతో కథాసాహిత్యము యెడల ప్రజలఆసక్తి అమితముగా పెరిగినది. 1820లో చెన్నపట్టణములో ఉపయుక్తగ్రంథప్రచురణ సంఘము (The Madras text

book vernacular society) ఏర్పడినది. బడులలో పాఠ్యపుస్తకములను నిర్ణయించుపని వీరే చేయువారు. ఈ సంఘయాజమాన్యమున అనేక గ్రంథములు, వాచకములు విజ్ఞానశాస్త్రములును వెలువడినవి. అప్పుడే పుదూరు సీతారామశాస్త్రిగారు బాలుర చదువుకొనుటకు వీలయిన పెద్దబాలశిక్ష వ్రాసి ప్రకటించిరి. నాటికిని నేటికిని బాలురకు పఠనయోగ్యమైన పుస్తకములలో దీనికున్న ప్రచారము మరి దేనికిని లేదు. పెద్దతరగతులలో బోధించుటకు "మహాపురుషులజీవితములు" "ఇంగ్లాండుదేశచరిత్ర" "భూగోళము" మొదలయిన బడిపుస్తకములు 1820నుండి 18_6వరకు వ్యావహారికభాషలోనే పండితులచేత వ్రాయించి ప్రకటించిరి. ఈ బోర్డునకు కొంతకాలము రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు అధ్యక్షులు. వారితరువాత పరవస్తు చిన్నయ సూరిగారికి ఈ పదవి లభించెను. వీరికాలములోకూడ "మహమ్మదు చరిత్ర (1856) జానుబిన్యనుచరిత్ర (1856) అమెరికాను కనిపెట్టిన చరిత్ర (1856) మొదలయినవి వాడుకభాషలోనే వెలువడినవి. కాంచీపురము పచ్చయప్పమొదలియారుగారి విద్యాశాలలో సంస్కృతాంధ్రపండితులుగానున్న వైయాకరణము రామానుజాచార్యులుగారును, చిన్నయసూరియును కలిసి భారతములో ఆది పర్వము పరిష్కరించి 1847లో ప్రకటించినారు. ఇందు ఒకవైపు పద్యమూలమును మరొకవైపు దానికి సరియైన వచనవివరణమును కలవు. ఇది వ్యావహారికభాషలోనే యున్నది. 1857లో మద్రాసు విశ్వవిద్యాలయము స్థాపన జరిగినతరువాత అందు తెలుగుశాఖకు ప్రధానోపాధ్యాయుడైన చిన్నయసూరి 'నీతిచంద్రిక' 'బాలవ్యాకరణము' వంటి గ్రంథములను రచించి వ్యాకరణలక్ష్యలక్షణసమన్వితమైన గ్రంథములనుతప్ప పాఠ్యపుస్తకములుగా స్వీకరించలేదు. దానితో తెనుగు వచనరచనావిధానమే మారిపోయి వ్యావహారికములో మన నిత్యజీవనమునందు విను భాషకు విరుద్ధమైన కృతకభాష గ్రంథస్థమగుట, అది గ్రాంథికభాషయగుట పరిపాటియైనది. అయినను ప్రజాభిమానమును చూఱగొన్నది వ్యావహారికభాషయే.

1837–70 మధ్య రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు రచించిన పంచ
తంత్రము నాలుగుముద్రణలగుటయే దీనికి తార్కాణము. ఇది
1870 లో తిరిగి గ్రాంథికభాషలోనికి అనువాదముపొందినది. ఈ
వచనగ్రంథములలో గ్రాంథికభాషకును వ్యావహారభాషకును బహి
రంగముగా వివాదలు జరుగకపోయినను ప్రాచీనసంప్రదాయము
లను, గ్రంథములను అభిమానించు సంస్కృతపండితులును, పూర్వ
సంస్కారప్రియులును గ్రాంథికభాషలో తమరచనలు సాగించుచు
వచ్చిరి. వారు తమ పాండిత్యప్రకర్ష ప్రగల్భముగా ప్రకటించుటకు
వచనగ్రంథములను రచించిరే తప్ప అవి పలువురు చదివి అందలి
సారస్యమును గ్రహించవలెనని ఉద్దేశించలేదు. ప్రాచీనసంప్రదా
యములను అనుసరించి సంస్కృతభాషాపాండిత్యము సంపాదించినను
పాశ్చాత్యభాషాసంపర్కమువలన ఒక విశాలదృష్టి నలవరచుకొన్న
మరికొందరు రచయితలును వారిపోషకులును, వచనము అందరకు
సుబోధముగా గ్రాహ్యమగు భావవాహికగా ప్రయోజనకారికావలె
నని ఉద్దేశించిరి. తమ యభిప్రాయములను ప్రచారముచేయుట కిది
యొక ప్రజలసాధనముగా నుపయోగించుకొన్న మతప్రచారకులును,
రాజకీయప్రచారకులును కలరు. ఏ ప్రచారమును లేకుండ, పలువు
రొకసారి చదివి యిందలి భావార్థములను గ్రహించి, యీ సాహి
త్యమువలన రంజనపొందవలయునని ఉద్దేశించినవారు కలరు. అట్టి
వారు నిజమైన కళాభిరుచితో కథలును యాత్రాచరిత్రలును రచిం
చిరి. ఈ వచనగ్రంథసంపుటములలో పుంఖానుపుంఖములుగా
వెలువడిన గ్రంథసముదాయములో అవియే కొంతవరకైనను నిలచు
నవి, ఏకొంచెమైనను సాహిత్యలక్షణము లలవరచుకొన్నవి.

ఈ కథలలో మనకు పరిచితమైన సంస్కృతనాటకములకథలను
దండిదశకుమారచరిత్రను చెదలువాడ సీతారామశాస్త్రిగారు విసం
ధులుచేసిన శైలిలో రచించినారు. ఆంగ్లభాషలో బాలసాహిత్య
ములోఅత్యంతప్రచారములోనున్న గ్రిమ్సు ఫెయిరీటేలు్సు (Grimm's
Fairy Tales) దక్కనుపూర్వకథలను పేరున పసిపిల్లలకు స్త్రీలకుకూడ

తెలియునట్లు తేలికభాషలో రచించిరి. వీరు చిరకాలము నార్మల్ స్కూలునందును, ప్రెసిడెన్సీ కాలేజీలోను, ఆంధ్రపండితులుగా ఉండి పనిచేసినారు. వేంకటగిరిసంస్థానములోనున్న యెనమచింతల సంజీవరాయశాస్త్రిగారుకూడా ప్రౌఢ ప్రబంధవచనశైలిలో దండి దశకుమారచరిత్రను అనువాదముచేసిరి. ఇంకను అనేకకథలు స్వతంత్రముగా రచించినవారును ఉన్నారు. తెనుగులో అంతకుముందే పురాణములుగాను, పద్యకావ్యములుగాను, ద్విపదకావ్యములుగాను ప్రచారములోనున్న కథలను సులభమైన శైలిలో వచనగ్రంథములుగా రచించినవారును ఉన్నారు. ఇట్టివానిలో కథలే ప్రజలకు ఎక్కువ ప్రీతిపాత్రమైనవి. వానిలో "బెషీ"యను క్రైస్తవమతబోధకుడు సరళవ్యవహారశైలిలో పరమానందగురువులకథలు రచించెను. (1861). పెర్సివలు అను ఇంగ్లీషురచయిత ప్రపంచప్రఖ్యాతమైన అరేబియన్‌నైట్సుకథలు 1862లో రచించెను. తడకమళ్ళ వేంకట కృష్ణారావుగారు కామరూపకథయును, కంచుకంధరచరిత్రమును (1864 - 66)లో రచించిరి. 1879లో తెలుగువెలుగు ముగుదకత యనుపేరున శ్రీమదాంధ్ర కవితావేదినీవిలాసము రచించెను. ఇది ప్రౌఢభాషలో రచించబడినది. ఇది తెనుగుకవిత్వమునుగూర్చి చెప్పునవలవంటి రచన. ఇందలికథ కేవలము కల్పితమే. శృంగారలతిక యను రాజకన్యక తుందుడను రాజకుమారుని మోహించుట, వారికి సమాగమము కాక ఇరువురు ప్రాణములు విడిచి పిశాచరూపములు ధరించుట, ఒక యోగివలన వారల పూర్వవృత్తాంతము తెలిసికొనుట, కిమిడియనుపట్టణమున సకలకళాధురంధరుడను రాజునకు చంపకామోదయను కూతురు కలుగుట, ఆమెకు తెలుగువెలుగు యను పేరుపెట్టుట, ఆమె కవితాచమత్కృతులచే నందరిని మెప్పించుట, చీరాజుకుంచియుదంతము ఇట్టివి యన్నియును ఈ గ్రంథమున గలవు. అక్కడక్కడ పద్యములుకూడా నున్నవి. 1881లో చార్‌దర్వేష్‌కథలను రచింపజేయుటగూర్చి ముందే చెప్పియున్నాము. 1893లో దాసు శ్రీరాములుగారురచించిన అభినవగద్య

ప్రబంధము, చిలకపాటి వేంకటరామానుజశర్మగారి చమత్కార కథాకల్లోలిని [1897] భోజకాళిదాసకథలు ఇవి యున్నవి. 1898లో గురుజాడ (శ్రీ)రామమూర్తిగారు కళాపూర్ణోదయమును వచనముగా రచించినారు. 1893లో చిత్రరత్నాకరమను మరొక మనోహరమైన కథలసంపుటి రచించినారు. 1889లో యవనయామినీవినోదములు అనుపేరున (Arabian nights) ప్రకటించినారు. ఇది చక్కని శైలిలో నుండి పలుమారు విద్యార్థులకు పఠనీయగ్రంథమైనది. వనప్పాకం ఆనందాచార్యులవారి మంజువాణీవిజయము (1895) కొమాండూరి అనంతాచార్యులవారి సత్యసేనవిజయము (1897) సోమశర్మాభ్యుదయము (1894) పలుకని పద్మావతికథ (1894) తేటతెనుగులోవచ్చిన మంచికథలు. పోకల వేంకటనరసింహనాయని గారు కమలావతీపరిణయమును షేక్స్పియరురచించిన సింబలైను కథ ననుసరించి వ్రాసినారు. ఇంకను - వకుళాభరణపరదేశి, సుగుణాకరమహారాజుచరిత్ర, శుకమహారాజుచరిత్ర, విచిత్రపతివ్రతల కథలు మొదలైనవి ముఖ్యముగా పేర్కొనదగినవి కస్తూరిరంగయ్య అనునతడు గులేబకావళి రచించి తేలికభాషలో ప్రకటించెను. దీనికే మరొకపేరు పుష్పలీలావతికథ.

అప్పటికి వచ్చిన శృంగారప్రబంధములకును, కావ్యములకును వచనరూపములో వచ్చిన కథలు మఱికొన్ని యున్నవి. వానిలో పాటూరి రామస్వామిశాస్త్రి 1840లో శుకసప్తతికథలు, 1840లో సింగరాజు దత్తాత్రేయులు, వేంకటసుబ్బయ్య కలిసి రామాయణమును వచనముగా రచించిరి. అంతవరకు తెలుగులో ప్రచారములో నున్న రంగనాథరామాయణమను ద్విపదకావ్యము నాధారముగా తీసికొని సాంద్రీసుదొరవారి కోరికగా పైడిపాటి పాపయ్య గోనబుద్ధారెడ్డి రామాయణమును వచనముగా రచించెను. పాటూరి నరసింహశాస్త్రి సోదరుడు హరిశ్చంద్రకథను, రంగనాథ రామాయణములోని ఉత్తరకాండను వచనగ్రంథములుగా రచించెను (1840). పాటూరి రంగాశాస్త్రులు (1841) చేమకూర వెంకన్న

రచించిన విజయవిలాసమును ఆధారముగా గైకొని వచనగ్రంథముగా రచించెను. ఈ పాటూరు సోదరులు ఫోర్టుసెంటుజార్జి కాలేజీలో తెనుగుమున్షీలుగా పనిచేయుచు ఈ వచనగ్రంథములరచన గావించిరి. అయ్యలరాజు నారాయణకవి విరచితమైన హంసవింశతి పద్యకావ్యమును వచనముగా ధూర్జటి లక్ష్మీపతి రచించెను. 1842 లో వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రించి వర్తమానతరంగిణి పత్రికలో ప్రకటించెను. ఇది 1865 లో తిరిగి ముద్రణపొంది అశేష ప్రచారమునందినది. 1842 లో వెలువడిన మరొక కథల సంపుటి కీరబహత్తరి లేక తోతీనామా యను చిలుకకథలు. ఇందు 52 కథలు సంపుటీకరించి వాటిని కలుపుటకు చక్కని కథావిధానము నుపయోగించెను. 1843 లో వచ్చిన దిలారామకథలో ఢిల్లీ పాచ్ఛాకూతురు దిలారామ అమరావతీరాజుకుమారుని వివాహము చేసికొనుట ప్రధానకథ. రాజకుమారుడును, మంత్రికుమారుడును కలిసి దేశాటనముచేయుట, రాజకుమారుని కష్టములనుండి మంత్రికుమారుడు పలుమారులు రక్షించుట ఇందు వర్ణించబడినది.

పిఠాపురములోనున్న వాడ్రేవు వెంకయ్యఅను కవి- 1847లో సింహాసన ద్వాత్రింశికయను ప్రబంధమును ఆధారముగాతీసికొని 32 బొమ్మలకథలు రచించెను. విక్రమార్కునిచరిత్రకు సంబంధించిన యీ కథలను కొఱవి గోపరాజు చక్కని ప్రబంధముగా 18 వ శతాబ్దములో రచించి ప్రసిద్ధుడాయెను. ఇందు సమకాలికసంఘములోని ఆచారములును సంప్రదాయములును వర్ణితమైనవి. 1848 లో బేతాళ పంచవింశతికథలు వచ్చిన మరొక కథాసంపుటము ప్రజలలో మంచి వ్యాప్తిలోనున్నది. ఇది కథాసరిత్సాగరమునుండి కథలు తీసికొని సులభమైన తెలుగువచనములో తిరుగవ్రాసినది. సి. పి. బ్రౌనుదొర స్వయముగా 1855 లో కొన్నికథలు సేకరించి తాతాచార్యులకథలనుపేరున ప్రకటించిరి. తెనుగు మూలముతోపాటు, ఆంగ్లానువాదమునుకూడ ప్రకటించిరి. ఇందు గిరిన్మయూరే అనుకథ

గద్యచింతామణిలో ఉదాహృతమైనది. దీనికి ఆంగ్లములో పీఠిక వ్రాయుచు బ్రౌనుదొర ఇట్లు తెలిపెను.

"The ancdotes collected in this volume were chiefly related to me by a Telugu brahmin named Tatachari in the year 1842. He was a tall stout man of about 50 years of age; A humourist thoroughly versed in Sanskrit learning, eloquent most modest and humble and died in my employ. He was a poet and a logician skilled in Medicine and Astronomy. I read some of the Telugu poems with him and in the course of amusing Conversation, he related to me the tales now preserved."

ఈకాలములో వచ్చిన మరొకరకపు వచనగ్రంథములు యాత్రాచరిత్రలు. వానిలో అతిప్రసిద్ధమైనవి ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర. రైల్వేలు లేనికాలములో ఓడలపైన ప్రయాణముచేసి, అనేకనగరములలో మజిలీలుచేయుచు మద్రాసునుండి కాశీప్రయాణముచేసి యీ యాత్రజరిపిరి. ఆకాలములో (1780-1836) చెన్నపురికి పేరుతెచ్చిన తెనుగుప్రముఖులలో ఏనుగుల వారొకరు. చెన్నపురినుండి 1830 లో కాశీయాత్ర వెళ్ళినపుడు దినచర్యరూపముగా వ్రాసినదే యాత్రాచరిత్రము. దీనిని వీరి మిత్రులు కోమలేశ్వరపు శ్రీనివాసపిళ్లెగారు రచ్చ చేయించినారు.

ఆకాలములో గంజాము, పూరీ, బారువ, స్వర్గపురము, కళింగపట్టణము మున్నగు ఓడ రేవులద్వారా చక్కని విదేశీవర్తకము సాగుచుండెననియు ఈ రేవులకు చేరువగానున్న గ్రామములలో చేనేతపరిశ్రమ వృద్ధిలోనుండెననియును, వేటపాలెములో వేయిమంది నేతగాండ్రు చేనేతవృత్తిచేసి జీవించుచుండిరనియును తెలిపియున్నారు. మనదేశములో నేసిన బట్టలు తోపుసెల్లాలు, రుమాలాతానులు (**Hand Kerchifs** అనులుంగీలు) చీరెలు మొదలయినవి విదేశములకు విరివిగా ఎగుమతియగుచుండెడివని వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్రలో చెప్పినారు.

ఈయనసమకాలికుడైన కోలా శేషాచలకవియను చెన్నపురి నివాసి సైనికాధ్యక్షుడైన సింప్సన్‌దొరవారి కార్యాలయములో గుమాస్తాగా పనిచేయుచు 1846లో మేనుండి 1847 జనవరివరకు ఉదకమండలమున నున్నప్పుడు జరిగిన విశేషములను దినచర్యగా వ్రాసి, నీలగిరియాత్ర యను వచనకావ్యముగా రచించినాడు. 1847 లోనే ఇది విరచితమైన నీతిచంద్రికకంటె ముందు వెలువడినది.

"నా విడిదలయగు నిలుసొచ్చిన యనంతరంబ నెచ్చట గూర్చుండిన నెచ్చట గ్రుమ్మరిన నెద్ది యంటిన నా సర్వాం బతి శీత లంబయి గోచరించె. అంత కొంతతడవునకే చలి మొలతెంచె. మార్గశిరమంబు నవ్విడిదల ప్రవేశించు సమకాలంబునన, శీతంబు గోచరింపదయ్యెదని తోచెను. మరునాడు నాకును, నా బాసటయై వచ్చిన శ్రీనివాసమొదలారికిని స్వదేశమునుండి కొంపోయిన చలి తొడవు లొడళ్ళం దొడిగికొనవలసివచ్చె. అగ్ని యొక్కటిదక్క యన్నిపదార్థంబు లతిశీతలంబులై యున్నయవి"

ఈ శేషాచలకవి చింతాద్రిపేట నివాసి. తన నివాసస్థలమగు చింతాద్రిపేటను వర్ణించుచు ఒక సీసమాలిక చెప్పెను. చెన్నపురి లోని వివిధప్రాంతములను వర్ణించుచు 'చెన్నపురివిలాస'మను పద్య కావ్యము వేరే వచ్చియున్నది. నీలగిరియాత్రను ఈ కవి విశాఖ పట్టణమునందలి జమీందారులలో నొకరైన గోడే శ్రీ వేంకటజగ్గ నృపాలునకు అంకితముచేసిరి.

ఈ కాలములో పౌరాణికగ్రంథములును వేదాంతగ్రంథము లునుకూడ వచ్చినవి. ముదిగొండ బ్రహ్మయలింగారాధ్యులు 13000 శ్లోకములుగల ఖండమును తీసికొని ఏడుకాండలుగా వచనములో రచించెను. దీనికి శివరహస్యఖండమని పేరు. ఇది 1852లోను, 18 96లోను రెండుముద్రణములు పొందినది. ఏడుకాండలతోకూడిన యీ గ్రంథములో 240 యధ్యాయములు గలవు. ప్రతియధ్యాయ మునకును వచనభాగమును సంగ్రహముగా తెలుపు పద్యములుకూడ నుండుట ఒక విశేషము.

ఆంగ్లభాషలో ప్రచారములోనున్న 'లేఖలు' కూడ వచనములోనే వెలువడి, నాటి వచనవాఙ్మయమును పెంపొందింపజేసినవి. ఇట్టివానికి మూలపురుషులు బ్రౌనుదొరగారే. వీరు రచించిన లేఖలు 10 సంపుటములవరకు గలవు. వీనివలన సమకాలిక సాహిత్యచరిత్ర, సాంఘికచరిత్ర వెల్లడికాగలవు. ఆనాటి పత్రికలలో పొగడ్తలు చాల అతిశయోక్తులుగా నుండెడివి. చిన్నప్రయోజనముకొఱకు ఇంద్రునితోను చంద్రునితోను సరిపోల్చి స్తుతిపాఠములు కురిపించుట ఈ లేఖలయందు గమనించవచ్చును. అప్పటి భాష తెలిసికొనుటకు ఒకలేఖలోని భాగము నుదాహరించుచున్నాము. ములుపాక బుచ్చయ్యశాస్త్రి వ్రాసిన లేఖలో ఇట్లున్నది.

"తమ సెలవుప్రకారము కృష్ణారెడ్డి పంపించిన వసుచరిత్ర ప్రతిపదార్థప్రకాశిక తమరు అంగీకరించినదీ లేనిదీ తెలియలేదు. ఇక్కడనైతే బహుమంది పెద్దలు బహుదేశములవారు వ్రాసికొని పోతూవున్నారు. తమపేరిట కృతిగనక తనంతనే విస్తరిల్లుతూ వున్నది. నేను తమకు సుకృతంగా పాఠశాలపెట్టి అనేకమందికి ఆంధ్ర గీర్వాణ వ్యాకరణ కావ్య నాటకాలంకారాది గ్రంథములు అభ్యసింపచేస్తూయున్నాను. ఇంత పర్యంతరము తమరు యిప్పిస్తూ వచ్చిన ద్రవ్య ముపయోగించి కాలయాపనచేస్తూవుంటిమి. ఇప్పుడా ద్రవ్యము సరిపోనందున అశనాచ్ఛదనాలకు నానాశ్రమపడుతూ వున్నాను. లోగడ సముఖాన మనవిచేసుకున్నప్రకారము ఈ ఘటము వున్నంతవరకు అన్నముయిచ్చి కాపాడితే తమకు బహు పుణ్యము వస్తూవున్నది – తమరు వుపేక్షచేసినపక్షమందు యీ వార్ధకములో బహుకష్టపడేను" ఈ ధోరణిలో నుండును. ఇట్టిలేఖలను సేకరించి బ్రౌనుదొరవారు తెలుగుజాబులపుస్తకము అని 15-6-1821లో ప్రకటించినారు. ఇట్టివి ఇంకను ఎన్నో లేఖలు అప్రకటితములయినవి కొన్నినగరములలో రాజులవద్దను పండితుల వద్దను భద్రముగా సమకూర్చి యుంచెడువారు.

## సి. పి. బ్రౌనుదొరగారి పేర వ్రాసిన మరి రెండు లేఖలు

మహారాజశ్రీ మేస్తరు సి–పీ - బ్రౌన్ యిస్కా.యరు దొరగారి సముఖానకు—

శ్రీమంతు శ్రీ దుర్గాప్రసాదునాయుడు బహాదరుగారు అనేకసలాములుచేసి చాయంగలవిన్నపములు తమ తాలూకు పుస్తకములుప్రతివ్రాయించడంనిమిత్తము 1832జూలై ఆషాఢశు12 ఇందువాసరం తారీఖున నేను వ్రాసుకున్న వుత్తరంప్రకారం తమరు దయచేయించినారు గనుక సదరహీ పుస్తుకములును పత్రికలు వ్రాయించి మాత్రుకలు తిరిగీ పంపిస్తినీ. దాఖలు చింతగించకర్తలు నేను యిదివరకున్నూ తమదర్శనంచేయకపోవడమునకు వుండే సంభిలినింభిలినింజచేత పితృసమానమైన తమయొక్క మహాదను గ్రహముతో చంద్రచకోరన్యాయంగా నిరీక్షిస్తూవున్నాను — నేనున్నూ అమావాస్య వెళ్ళించి దరిశనానకు వస్తూవున్నాను. సన్నిధానమందు వుండేసమయమందు వుంచిన వాత్సల్యతే సర్వదా వుంచుతారని నమ్మివున్నాను. దివ్యచిత్తమునకు తేవలెను.

ది 13 అక్టోబరు ఆన 1832 – సం శనివారం

ది॥ శ్రీ॥ దుర్గాప్రసాదనాయుడు

శ్రీమదనంత కల్యాణగుణ గణవిరాజితులయిన అవ్యాజ పరోపకారనిరతులయిన సర్వతంత్ర స్వతంత్రులయిన శ్రీమన్మహారాజరాజశ్రీ రాజమహేంద్రవరంజిల్లా కోర్టుజడ్జిగారయిన మేస్తరు – సి. పి. బ్రౌన్ దొరవారిసముఖానకు తమపండితుడు పత్యం అద్వైతశాస్త్రులు అనేకసలాములుచేసి వ్రాసుకున్న విజ్ఞాపన-

తమరు ది2 ఆగష్టు తారీఖునచల్లాసుబ్బన్న మారీఫత్తున దయ చేసిన ఆజ్ఞాపత్రికె ప్రవేశమయి అందువల్ల యావత్సంగతులు తెలిసి అపరిమితమైన ఆనందమును పొందినాను. సరస్వతికి ప్రస్తుతమందు తమరు వకరే నివాసస్థానంగా కనపడుతూవున్నారు గనుక యెక్కడ

యేయే విద్యలు దాచపడివున్నవో అవిఅన్నీ తమఅంతట తాన్నే తమసన్నిధికి వస్తూవున్నవి-యీలా రావటమువల్ల ఆయా విద్యలకు అభివృద్ధిన్ని అవుతున్నది. యిప్పడిసమయంలో యీ విద్యలగురించిన అభివృద్ధి తమవలె చేయించేవారు, నేను యెరిగివున్నంతమట్టుకు యెవరూ కనుపడలేదు. యిందునగురించి జరిగించిన ప్రయాసవల్ల తేలిన పరిష్కారగ్రంథములు ఆకల్పాంతమున్ను తమయొక్క కీర్తులను విస్తరింపచేస్తూవుంటవి. ఆ గ్రంథములు చూచిన విద్వాంసులందరున్ను తమరు ఆచంద్రతారార్కకముగా పుత్రపౌత్రులతోడి అభివృద్ధినిపొందవలెనని సదా యీశ్వరప్రార్థన చేస్తూవుంటారు. ఆ గ్రంథములలో యేమైనా కావలసివున్నపక్షమందు కోరితే దయచేయిస్తామని వ్రాయించినారు గనుక చాలా సంతోషించినాను. తమరు ఆ పుస్తకాలజాబితా పంపించినతరువాత అది చూచుకుని అందు నావద్దలేని పుస్తకములు యేమేమి వున్నవో ఆవైనం కనుక్కొని అప్పుడు తెలియచేసుకుంటూవున్నాను. చల్లా సుబ్బన్న తీసుకవచ్చిన వోఢ్రాక్షరములతో వున్న కావ్యము పేరు సంస్కృతపు రాఘవపాండవియ్యము - యీ గ్రంథం మనదేశములో లేదు, పూర్వమందు నేనే వోఢ్రదేశమునుంచి తెప్పించినాను యీ అక్షరములు యీదేశములో యెవరికీ సాధ్యంకాక యిది తెనుగుచేసి పంపించగలందులకై శ్రీకాకుళానకు అయిదుసంవత్సరముల కిందట పంపించివుంటిని. యిప్పుడు బందరులో వోఢ్రం బాగావచ్చిన వక మనిషి వున్నాడు గనుక ఆయనచాత తెనుగుఅక్షరములతో వ్రాయించడముకై యిప్పుడు తిరిగి ఆ పుస్తకం తెప్పించినాను గనుక, యిది అంతా తెనుగుచేయించి తమసముఖములోకి పంపించుకుంటూవున్నాను, యిదిన్నీ యీ రాఘవపాండవియ్యము నిమిత్తమయిన్నీ - దీనివ్యాఖ్యానంనిమిత్తమైయిన్నీ జగన్నాథసమీప దేశవర్తియైన పీతాంబరదేవుగారు అనే జమీందారు పేర ఆయనతాలూకు వకీలు ఈ గ్రామంలోవుండగా ఆయన చేత వుత్తరం వ్రాయించినాను-ఆగ్రంథములు వ్రాయిస్తూవున్నాను.

కొద్ది దినములలో పంపిస్తానని ఆ జమీందారువకీలుపేర తిరిగి వుత్తరంవ్రాసినాడుగనుక కొద్దిదినములలో ఆపుస్తకములున్ను వస్తవి. అవి రాగానే అవిన్ని తమసముఖంలోకి పంపిస్తూవున్నాను.

ఇది ద్వ్యర్థికావ్యమున్ను చమత్కారకావ్యమున్ను గనుక యిది చూడవలెనని బహుదినములుమట్టుకు కోరికకలిగేవున్నందున దీన్నిగురించి బహుప్రయత్నం చేయడమైనది. దైవకటాక్షంవల్ల కొద్దిదినములలో సాధ్యమయ్యేటట్టే తోస్తూవున్నది.

మరిన్నికొన్ని తర్కపుస్తకములు గౌడాక్షరములుతోవున్నవనిన్ని అవి తెనుగునవ్రాయించవలసిన దనిన్ని వ్రాయించినారు. ఆ గౌడలిపి వచ్చినబ్రాహ్మడు ప్రస్తుతమందు యిక్కడలేడు. గుంటూరుతాలూకాలోవున్నాడు. అతణ్ని పిలిపించి ఆసంగతి తమ పేరవిన్నపము వ్రాసుకుంటూవున్నానుగనుక అప్పుడు ఆపుస్తకములు పంపించవచ్చును. మహారాజశ్రీ మచిలీపట్నంజిల్లా కలకటరుగారు చిరంజీవులగు రామలింగశాస్త్రులుకు వుయ్యూరుతాలూకా హెడ్డాపుపోలీసుపని దయచేయించినారు. గనుక ప్రస్తుతమందు ఆపనిలో వున్నాడు. అతణ్ణి పూర్వం తమరు తాలుకామునసపుగా అపాయంటు చేసినారుగనుక తిరిగి ఆలాటితాలూకా మునసఫుపని ప్రసక్తించినపక్షమందు జ్ఞాపకం వుంచి అతనియందు సంపూర్ణానుగ్రహపూర్వకముగా ఆపని అతనికి దయచేయించవలెనని ప్రార్థిస్తూవున్నాను. ఈ వుత్తరం తీసుకవచ్చిన శ్రీమతి లక్ష్మీనారాయణ మహారాజశ్రీ కలెక్టరు బోర్డువారివద్ద సరిటిఫికెట్టు పుచ్చుకొని వచ్చినారు. తమసన్నిధియందు ప్లీడరుపనిలో ప్రవేశించవలెనని కోరుతూవున్నాడు గనుక చిత్తవృత్తిప్రకారం శలవు దయచేయించవలెను.

నాకు సమస్తవిధాల ప్రాపకులు తమరే గనుక సదా సన్నిధియందువున్నట్టుగానే భావించి నాయందు సంపూర్ణానుగ్రహంవుంచి సంరక్షణ చెయ్యవలెనని కోరుతూవున్నాను.

చిత్తానకు తేవలెను.

ది25 ఆగుస్టు ౙన1838 స॥

ద. వ. అద్వైతశాస్త్రులు

కల్నల్ కాలిన్ మెకంజీదొర (1754 - 1821) ఈస్టిండియా కంపెనీలో ఇంజనీరింగుశాఖలో చిన్నవుద్యోగిగా చేరి చివరికి సర్వేయరు జెనరలు పదవిలోనికి వచ్చెను. సర్వేయరుజెనరలుగా నెల్లూరు, గుంటూరు, రాయలసీమ, మైసూరుప్రాంతములలో పర్యటనముచేసి, దేశపటమును, నైసర్గికపటమును తయారుచేసిరి. మెకంజీ, వివిధప్రాంతములలో పర్యటనచేయునపుడు, ఆయాచోట్లనున్న సుందరశిల్పములు, శాసనములు, నాణెములు, ప్రాచీనపుస్తకములు ఆయనదృష్టిని ఆకర్షించినవి. వీనిని చదువుటలోనూ వీని చరిత్ర తెలిసికొనుటకును ఏలూరువాస్తవ్యుడైన యువకుడు, కావలి వేంకట బొర్రయ్య ఈయనకు చాల తోడ్పడెను. కాని బొర్రయ్య చిన్నవయస్సులోనే మరణించెను. ఆతనితరువాత కావలి వేంకట లక్ష్మయ్య మెకంజీదొరపనులకు సాయపడెను. మెకంజీ చరిత్రపరిశోధనకు పనికివచ్చు తాళపత్రగ్రంథములు వ్రాతప్రతులు సుమారు 1568 సంపాదించెను. వీనిలో తెలుగు, సంస్కృతము, తమిళము, కన్నడము, మళయాళము, ఒరియాభాషలన్నింటిప్రతులును ఉన్నవి. ఇవిగాక 2070 స్థానికచరిత్రలు, వృత్తాంతములు, 8076 శాసనపాఠములు, 79 దేశపటములు, 2630 బొమ్మలు, 6218 నాణెములు నున్నవి. మెకంజీరికార్డులలో కైఫీయతులు ముఖ్యమైనవి. వానిలో ఒకటి కళింగకైఫీయతునుండి ఒకభాగము.

## పూసపాటిరాజుల పూర్వోత్తరం

మాధవవర్మ అనే రాజుకొమారుడు పూసపాడులో కాపురం వుండేవారు. పయిన వ్రాసిన మాధవవర్మ బెజవాడ కనకదుర్గయొక్క అనుగ్రహంవల్లను బెజవాడతఖ్తుయెక్కి ఆ రాజ్యం ప్రభుత్వంచేస్తూ వుండగా యితనియొక్క సుగుణాలకున్ను తనయందుగల భక్తితాత్పర్యములకున్ను సంతోషించి కనకదుర్గ బెజవాడలో యేడుఘడియలు స్వర్ణవర్షం కురిపించినందున, యీ

ధనంఅంతా పోగుచేసి తనకు కావలసినంత తీసికొని తతిమ్మాధనం బెజవాడకొండదొలిపించి రహస్యకృత్యంగా స్థాపితం చెయ్యించినాడు.

పునహా విజయరామరాజుసంగతి యేమంటే, యుద్ధంతీరిన మూడేదినములుకు విజయరామరాజుగారు కోటలో ఢేరా వేయించుకొని రాత్రి పడుకొనివుండగా రంగ్గారావుబావమరిది తాండ్రి పాపయ్య వచ్చి రెండుదినములనుంచి సమయందొరికితే తనప్రాణమయినా పోగొట్టుకొని రాజును పొడిచిపారవెయ్యవలెనని సమయావలోకనచేస్తూవున్నాడు. గనుక విస్తారంగా యనభై వేలఫౌజు వున్నదిగనుక, అనుకూలంకాకవుండి మరునాడు రాత్రి ఝాము ప్రొద్దుపోయినతర్వాతను కోటదేవిడీలోకి వచ్చి మేము ఆనందరాజు గారిదగ్గిరనుంచ్చి వుత్తరాలు తెచ్చినామని మమకంపెట్టి రాజుగారిని అగుపర్చవలెనంటే, పారాయిచ్చే శిఫాయిలు రాజుగారు నిద్రపోతూవున్నారు. ఇప్పుడు నాల్గుఘడియలుకు లేస్తారు. అప్పుడు ఇత్తురుకాని అనేవరకు ఆమాటకు పాపయ్యగారు, ఆనందరాజు బహుచెడ్డవాడు. ఆలస్యంఅయితే మాకు ఆజ్ఞవచ్చును, ఇప్పుడు లేపియిస్తేనే కాని లేకుంటే మమ్ము తలలుకొట్టిస్తాడు గనుక మా ప్రాణాలు పొయ్యేటప్పుడు మీప్రాణాలుకూడా తీసుకపోతాము గాని, మరివకటిగాదు. కనుక యిప్పుడు లేపి వుత్తరాలు యివ్వక కాని అనుకూలంకాదని అన్నారు. ఆమాటలుకు పారాజమీదారుడు కాపుడు తెలియక నాల్గుఘడియలకు నిద్రలేస్తారు. అదిపర్యంతరం యిక్కడ వుండుమని కోటలో జాగా చూపించినాడు. మరినాల్గుఘడియలకు పారాశిఫాయిలు మరిచినతర్వాతను నల్లగొంగడి ముసుకగా కప్పుకొని రాజుపడుకున్న డేరాదగ్గిర పోయి కత్తిరించి లోపలికి జొచ్చి నిద్రపోతూవున్న రాజును లేపి, నీవు యవరని అడిగితే, నేను తాండ్ర పాపయ్యను. బొబ్బిలివారిపులిని అని చెప్పేవరకు

రాజు గ్రహించి తనకు మృత్యువయితేకదా, అని యంచి పక్కలో కత్తివేసుకుంటూ నిద్రపోతూవున్నట్టుగానే వున్నారు మునుపే పాపయ్య పదిలంచేసివున్నాడు గనుక పాపయ్య వచ్చినత్రోవ మంచిదిగా రాజు అవతలికిపోయి చెట్టుమీద చరబెట్టియున్న ఈ తెలు లాగితే యీ తెలు ములికిరాక వుత్త కఱ్ఱమాత్రం వచ్చింది. ఆకఱ్ఱతో పాపయ్యమెడ వంగదీసి పొడిచినాడు. ఇంతలో పాపయ్య వంగిన పాటున తనచేతిబాకుతీశి కడుపుచీరినాడు. ఈతీరున రాజు పాపయ్య, పాపయ్యసేవకుడు ముగ్గురు పరలోకగతులైనారు. రాజు డేరా చుట్టూపారావున్నది. నాల్గుఅడుగులుపారా లోపలికిపోతే ప్రాణాలు తప్పును. పిలిచినగాని వత్తురు ఇన్నిటికి మృత్యువు సన్నిపాతమైనందున యించిటి అతనికి తోచలేదు...

తదనంతరం యీసంగతి ఆనందరాజుకు తెలిసి అధైర్యాన్ని పొందక తల్లినిమొదలయినవారిని వోదార్చితండ్రికి పరలోకక్రియలు నిర్వర్తించి పట్టాభిషేకంచేసుకొని రాజ్యమున్ను తనవశీకృతం చేసుకొని బహు ధూర్తవంతుడై పందువారికి తనకు గిట్టకపోయ్యే వరకు బందరుపర్యంతరమున్న తరుమగొట్టి బంద్దరుకోట తీసుకొని కలకత్తాలోవున్న యింగ్లీషువారికి యిప్పించి గంజాంమొదలుకొని బందరుపర్యంతరం మూడుసంవత్సరములు రాజ్యంచేసి పెద్దాపురం రాజు వత్సవాయ జగపతిరాజును కదనరంగమందు సమయించి ఆయనభార్య శాపంవల్లను రాజమహేంద్రందగ్గర గతించినాడు"

తదనంతరం విజయరామరాజు సీతారామరాజుగారు అధ్యక్షులయినవెనుక సదరహిబ్రవాసిన వెంకటరంగ్గారావును చిన్నవాణ్ణితీసుక వచ్చి ఖయిదులోవుంచిరి గనుక అతను శానాదినములు వకానొక సమయంలో తప్పించుకొని హైదరాబాదుపోయి నవాబుదర్శనం చేసుకొని తమదేశానకు కుంఫిణీవారికి సనదుతెచ్చుకునేవరకు పూసపాటివారిపనులు నీరసంలోవచ్చె గనుక కుంఫిణీవారు తిర్గి సంస్థానం దయచేసినందునతిర్గి సంస్థానంవున్నదనిపించి కొన్నిదినములు రాజ్యంచేసి గతించినాడు" రిమార్కులలో.

ఆకాలములో కైఫీయతులును చరిత్రలును సేకరించి కల్నల్ మెకంజీదొర కొన్నింటిని ప్రకటించెను. 1802 - 1813 వరకు ఇట్టి కైఫీయతులెన్నో వచ్చినను వానికి సాహిత్యమున గౌరవస్థానము లభింపక వానిని 'రికార్డులు'గా మూలత్రోసివేసిరి. మెకంజీదొర వద్దనున్న కావలి వేంకటబొర్రయ్యగారు కాంచీపుర మాహాత్మ్యమును వచనరూపములో రచించినారు. ఇట్లే చాల స్థలపురాణములును భక్తులచరిత్రలును వచనగ్రంథములుగా వచ్చినవి. భక్తులకథలను సేకరించి పరవస్తు శేషాచార్యులకుమారుడు జియ్యరుసూరి కృష్ణపాదుని భక్తిసారము అనుగ్రంథమునసరించి వ్రాసెను. 1840 - 1895లో బెంగుళూరు సెంట్రలుకాలేజీలో ఈయన తెలుగు పండితుడుగా పనిచేయుచుండెను. మరియొక భక్తికథాత్మకమైన వచన గ్రంథము భక్తలీలామృతము. ఇది ద్రవిడదేశమున ప్రసిద్ధికెక్కిన శివభక్తులయిన యరువత్తుమూవురు నాయనారులచరిత్రలను సంగ్రహముగా తెలిపెను. ఇది ఓమండూరి శ్రీనివాసదొరస్వామయ్య 1880లోనే రచించినను, 1900లో గ్రంథముద్రణ జరిగినది. ధనాల దేవరాజసుధీ రచించిన 'భక్తవిజయము' వీటియన్నింటికంటె ఎక్కువ జనప్రియత పొందినది. ఈ గ్రంథములో ఎక్కువగా పాండురంగ భక్తులజీవితచరిత్రలు సంపుటీకరించబడినవి. ఈ గ్రంథము నేటికిని మంచి ప్రచారములోనున్నది.

ఇంక పౌరాణిక వచనగ్రంథము లనేకమువచ్చినవి. ఆ కోవకు చెందిన కారుమంచి సుబ్బరాయలునాయనివారి దశావతారచరిత్ర సంగ్రహము 1861లో ముద్రితమై మంచి ప్రసిద్ధిలోనికివచ్చెను. మార్కండేయపురాణమునసరించి తిమ్మరాజు లక్ష్మణరాయకవి 1876లో ఒక వచనసంగ్రహమును ప్రకటించెను. ఈత డింకను మత్స్యకూర్మపురాణములను, ఇతర పురాణసంగ్రహములను 1876, 1877లో ప్రకటించెను. వీరితోపాటు పువ్వాడ వేంకటరావుగారు కలిసి ఇతరపురాణసంగ్రహములు ప్రకటించిరి. నేలటూరి వేంకట

సుబ్బశాస్త్రి హరిశ్చంద్రోపాఖ్యానమును, 1882 కాళ్ళకూరి భోగ రాజామాత్యుడు సావిత్రిచరిత్రను (1887) ప్రకటించిరి

నోరి గురులింగశాస్త్రులుగారు 1897లో వచనభాగవతమును సరళ శైలిలో వ్రాసి ప్రకటించిరి. అదేసమయమున దేవరాజసుధీ పోతన భాగవతముననుసరించి వచనముగా భాగవతమును తిరుగవ్రాసెను. ఇది అత్యంత ప్రచారములోనున్నది. 1899లో వాగ్వల్లిపత్రికాధిపతి కొమాండూరి వేంకటరామానుజశర్మ హరివంశమును వచనగ్రంథముగా రచించిరి. ఇదేకాలమున బ్రహ్మాండపురాణము నొక మంచి వచనగ్రంథముగా చెప్పిరి. దక్షిణదేశములోని క్షేత్రమహిమలను తెలియజేయు "క్షేత్రమహిమసంగ్రహము" చాల ప్రచారములో నున్న గ్రంథము. తిరుక్కుండము కస్తూరిరంగయ్య 1895లో శ్రీరంగ మాహాత్మ్యమును, లాడ్ గోవిందదాసు, పూరీజగన్నాథమాహాత్మ్య మును వల్లభాచార్యచరిత్రమును 1900లో ప్రకటించిరి. 1858 లో కొన్ని శాస్త్రగ్రంథములును రాజకీయగ్రంథములును ప్రభుత్వము వారు అనువాదముచేయించి ప్రకటించిరి. పరవస్తు చిన్నయసూరి, కర్నూలు నరహరి గోపాలకృష్ణమసెట్టిగారి పర్యవేక్షణక్రింద రాజకీయశాస్త్రగ్రంథమును, న్యాయశాస్త్రగ్రంథమును రచించిరి. ప్రసిద్ధ రాజనీతిశాస్త్రగ్రంథమయిన కామందకము నాధారముగాగైకొని 1860 లో తడకమళ్ళ కృష్ణారావుగా రొక అనువాదముచేసిరి. బాదరాయణకృతమైన బ్రహ్మసూత్రములకు 2545 సూత్రములను పద్యములిచ్చి తెలుగువివరణతో పొందుపరచిన వచనరచన 1864 లో వచ్చినది. వేదాంతగ్రంథములలో ఆంధ్రశారీరకము, బ్రహ్మసూత్రార్థసంగ్రహము, దుర్భాక వేంకటచలశాస్త్రిగారి 'కర్మోప న్యాసము' (1892) కొంచెము ప్రచారములో నున్నవి.

గ్రంథకర్తలపేరులు తెలియక, ప్రాచ్యలిఖితగ్రంథాలయమున అనేక గ్రంథములున్నవి. అద్వైతవేదాంతమునకు సంబంధించిన గ్రంథములు శైవసిద్ధాంతమునకు సంబంధించిన గ్రంథములును, విశిష్టాద్వైతమునకు సంబంధించిన గ్రంథములును ఎన్నో వెలువడినవి.

ఇవియన్నియును ఆయా మతరహస్యములను వెల్లడించునవే కాని, సాహిత్యగౌరవమును పొందగల్గినవి కావని కొందరియభిప్రాయము.

ఈ పూర్వరంగములో ఉదహరించిన వచనసాహిత్యమును గమనించినచో ఒక్కసంగతి వ్యక్తమగును. దీనియందు, జనసామాన్యమునకు అవగాహనయగునట్లు రచనజరిగినను, దీనియందు సృజనాత్మకమైన రసప్రకటనము (creative literature) పాలు తక్కువే. ప్రయోజనములకు పనికివచ్చు మతగ్రంథములును, వేదాంతసూత్రరహస్యములును, తర్కశాస్త్రములును వెలువడినవే గాని, నూతనకల్పనలతో చదువరులకు రససిద్ధికలుగజేయు రచనములు హెచ్చుగా రాలేదు. ఈ 19 వ శతాబ్దిలో వచ్చిన వచనరచనలలో విషయమునుబట్టి వైవిధ్యము గోచరించుచున్నది దీనికి అనేక సంస్కృత గ్రంథములనుండియును, ఆంగ్ల గ్రంథములనుండియును, ఇతర భాషాగ్రంథములనుండియును చేసిన అనువాదములు అనుకరణలుకారణమనవచ్చును. మరొకవిశేషము తెనుగులో నేపద్యకావ్యములయందునను, ప్రబంధములందును, ద్విపదలయందును నిబద్ధమైయున్న కవితాభావములను సరళమైన తేటతెలుగువచనములోనికి అనువాదముచేసి వానిని బహుజనబోధములు చేసిరి.

ప్రజలకు ప్రయోజనకరమైన శాస్త్రములు, విజ్ఞానగ్రంథములును, అధికముగా వచ్చినవి. వీనిమూలముగా ఒక క్రొత్త పరిభాష, ఒక క్రొత్త నుడికారము తెలుగువచనములోనికి వచ్చినది. తొలిసారి ప్రజలు తమ సుఖదుఃఖములను ఒకరితో చెప్పుకొను వాడుకభాష గ్రంథస్థమై, సాహిత్యస్థాయి నందుకొనుట జరిగినది. ఇట్టి సారస్వతములో బహుజనుల నాకర్షించినది, జనప్రియత చేకూర్చుకొన్నదియును కథాసాహిత్యమే. అది పంచతంత్రము కానిండు, పలుకని పద్మాక్షి కథలు కానిండు; చిలుక చెప్పిన కథలు కానిండు, శృంగారకాదంబరి కానిండు. దశకుమారచరిత్ర కానిండు, దక్కనుపూర్వకథలు కానిండు. యవనయామినీ వినోదకథలు కానిండు, యాత్రాచరిత్రలు కానిండు, వీనియన్నింటియందును ఒక

మనోజ్ఞమైన కథాసరళి, ఒక యుత్కంఠ ప్రేరేచు సంవిధానమును రూపొందినవి. కథలో కథఅల్లుకొనిపోవుట కేవలము భారతీయులకు చెందిన సంప్రదాయమే. ఇది మనదేశమునుండి, దేశదేశములకు వ్యాపించి అరబ్బీ, పారశీకభాషలలోనూ, యూరపియనుభాషలందు నను పరివ్యాప్తిగాంచినది. కథలో కథమలచుతీరు తెనుగువారిదే. ఈ ధోరణిలో కాశీరామేశ్వరమజిలీలు, కాశిమజిలీకథలును వచ్చినవి. వీనిలో కొన్ని అముద్రితములుగానే ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరీలో మద్రాసులో నున్నవి.దానిలోని పద్ధతిని అనుసరించి మధిర సుబ్బన్నదీక్షితులు (1860 -1930) వేరొక కాశీమజిలీలు రచించి 12 భాగములను ప్రకటించిరి. 19వ శతాబ్ది ఉత్తరార్థములో వెలువడిన కాశీమజిలీకథలే వీరికీ కల్పనచేయుటకు ఉపకరించినవి. 20వ శతాబ్దిలో సుబ్బన్నదీక్షితులుగారు రచించిన పుస్తకము లనేక ముద్రణలు పొందినవి. దీనినిబట్టి తెలుగువారికి కథావాఙ్మయము యెడల ప్రీతి అభిరుచి వెల్లడియగుచున్నది. ఈ కథలలో రాజులు, రాజకుమారులు, అప్సరసలు, దేవకన్యలు, గంధర్వకన్యలును ప్రముఖపాత్రలువహించినను, కొంత నీతిబోధ కొంతయుక్తి కొంత సమకాలికజీవనచిత్రణము కనిపించును.

"యాత్రాచరిత్రలు, లేఖలవంటి గ్రంథములలో ఆకాలము లోని దేశస్థితిగతులు, జనుల ఆచారవ్యవహారములు, వస్త్రభూష ణాద్యలంకారములు, వివాహాదికార్యములలో అనుసరించు లాంఛన ములు మొదలయినవి వెల్లడియగుచున్నవి. వీనియన్నింటిలోను శృంగారమే ప్రధానరసమైనను ఎడనెడ వీరరసోచితమైన సాహస కృత్యములవర్ణనమును. హాస్యరసమును ప్రదర్శించు సన్నివేశము లును కనిపించి నవరసములను చిప్పిలజేయుచుండును. అవియే ఈ కథలను నేటికిని నాటికిని అంత రసవంతముచేసినవి.

ఆంగ్లమునుండి తెలుగులోనికి బైబిలువంటి గ్రంథములను అనువాదము చేయుటలో ధన్వాడ అనంతం, మల్లాది వేంకట రత్నం మున్నగువారు పాల్గొన్నారు. (1853) ఆకాలములో బంద

రులోనున్న నోబిల్ అనే మిషనరీ నోబిల్‌కళాశాల పెట్టి అనేక విద్యావంతులకు మతదీక్షయిచ్చి మార్పించిరి. ఆకాలములో బైబిలులోనున్న భాషకు ఉదాహరణ.

"ఒకనికి యిద్దరు కుమాళ్ళు కలరు. వాండ్లలో చిన్నవాడు తండ్రిని చూచి, వో తండ్రీ! నాకువచ్చేవంతు యివ్వమని చెప్పినందున వాడు తమపుత్రులకు జీవనోపాధి పంచిపెట్టెను. కొన్ని దినములైనతరువాత చిన్నకుమారుడు సమస్తం కూడజేసుకొని దూరదేశానకు వెళ్ళిపోయి అక్కడ దుర్మార్గులయందు నడచి ఆ స్తిక్రయముచేసుకొనెను. అయితే అంతా సరిపడినతరువాత ఆ దేశమందు మహాక్షామం కలిగివుండెను. అయినందున వానికిలేమి వచ్చెను"*

ఈవిధముగా తెలుగుభాషలో ఇంగ్లీషుభాష పలుకుబడులు కలిసిపోయి ఒక విలక్షణమైన వాక్యరచన యేర్పడినది. 1827లో ఇంగ్లీషుపండితులును వారివద్ద తయారైనవారలు వాడుకచేసిన భాష మరొకరీతిగా నున్నది.

"తమరు - అబద్ధములులేకుండా శోధించుమని మావద్ద యిచ్చిన శబ్దమంజరియొక్క ప్రథమ ద్వితీయభాగములైన అక్షరగుచ్ఛము, సంధివృంతము - ఈ రెంటినిన్ని మేము నల్గురమున్ను బాగా శోధించితిమి. ఇందులో మాకు చూడగా అబద్ధములు లేవనిన్ని, యిది బాలులకు చదువ నుపయోగించుననిన్ని తోచుచున్నది" ఇది యొకరీతి. ఎన్నోరీతుల పలుకుబడులు పోకడలును పోయిన యీ తెలుగువచనము ఆ కాలపు ఆంగ్లపండితులను చకితులను చేసెను. వ్యావహారికభాషకును గ్రాంథికభాషకును గల అంతరము వారిని దిగ్భ్రాంతులను చేసెను. వారు తెలుగుభాష చదువుకొను సమయములో పద్యవాఙ్మయముతప్ప గద్యవాఙ్మయము పూర్తిగా మృగ్యమనునట్లు తోచినది. పామరులయిన ఒక బండివానివద్దనో, ఒక పల్లెటూరిరైతువద్దనో, ఒక పడవవానివద్దనో ఒక పల్లెవానివద్దనో విన్న

* బ్రౌను బైబిలుపరివర్తనం - ఆంధ్రపత్రిక 22-1-45

పాటలుమాటలు, ఏ బాటసారియో మాటకారియో చెప్పినకథలువారిని యెక్కువగా ఆకర్షించెను. అట్టికథలు గ్రంథస్థముచేసి యీ భాషాభిమానులు ప్రకటించిరి. ఈ కథలు పరిశీలించినచో ఆనాటి తెలుగు జనుల సాహస త్యాగములు, ఔదార్య ప్రేమగుణములును వెల్లడి యగును. క్రొత్తగా విదేశాలనుండివచ్చి తెనుగు నభ్యసించిన ఇంగ్లీషువారిని గూర్చి కోలవెన్ను రామకోటేశ్వరరావుగా రిట్లు చెప్పిరి:

"They were inevitably dazzled by the splendour and variety of the treasures laid bare to their view. They compared them with their own much to the disadvantage of the later. They were impressed almost by the total absence in Telugu of a great prose literature and the singular lack of variety in its literary forms"

ఇది 1812కి పూర్వకథ, అప్పుడు మద్రాసులో కళాశాల, 1857లో మద్రాసువిశ్వవిద్యాలయము స్థాపించినతరువాత ప్రచురించిన అనేకగ్రంథములలో వచనరచనమున కొక స్థాయి యేర్పడినది. కాని అవి నూతనసాహిత్యప్రక్రియలలో, వినూతనభావప్రకటనములో ఎట్టి పరిణతినొంది క్రమక్రమముగా నెట్లు వికాసమునొందిన దియును వేరొకరంగములో గమనించవచ్చును. ఇట్టి పరిణామము 19వ శతాబ్ది ఉత్తరార్థములో హెచ్చుగా పరిస్ఫుటమైనను, 1840 నుండి 1900వరకు అవిచ్ఛిన్నముగా సాగుచునేయున్నది. అది ఉత్తర రంగమున పరిశీలింతము.

---

*ఈ యధ్యాయరచనలో తోడ్పడిన గ్రంథములలో నిడదవోలు వేంకటరావుగారి ఆంధ్ర వచనవాఙ్మయము, తెలుగు విజ్ఞానసర్వస్వము - సంస్కృతి సంపుటములో - తెలికిచర్ల వేంకటరత్నముగారి వచనవాఙ్మయచరిత్ర పేర్కొనదగినవి. వారికి నా కృతజ్ఞతలు.

★

# 11. వచనవాఙ్మయము - ఉత్తరరంగము

19వ శతాబ్దిలోని పాశ్చాత్య విద్యావిజ్ఞానప్రభావములవలన వచ్చిన వాఙ్మయవికాసమును గమనించిన అది చాల ఎక్కువగానే కనిపించును. ఇది ముఖ్యముగా పాశ్చాత్యవాఙ్మయరీతుల ననుసరించి బయలుదేరిన సాహిత్యప్రక్రియలను గుర్తించుట, వానియందు చేసిన నూతనప్రయోగములవలన, ఆ ప్రయోగములవలన సాధించిన సత్ఫలితములవలనను స్పష్టముగా అభివృద్ధి సాధించినట్లు వ్యక్తమగుచున్నది. ఈవిధముగా వచ్చిన వచనవాఙ్మయరచనలలో నవల అగ్రగణ్యమైనది. తెనుగులో అంతకుముందు కథలును, ఆఖ్యాయికలును అనేకము వచ్చినను, పాశ్చాత్యపద్ధతిననుసరించి వచ్చిన "నవల" 19వ శతాబ్దిలోనే ప్రారంభమైన దనవచ్చును. తెనుగులో మొట్టమొదటి నవలయనునది ఎవరు వ్రాసిరనువిషయమై అనేక అభిప్రాయభేదములున్నను - ప్రప్రథమ నవలారచన కందుకూరి వీరేశలింగంపంతులుగారిదేయని ఒప్పుకొని తీరవలెను. అంతక్రితము కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు రచించిన మహాశ్వేత తొలినవల యనువా రున్నారు. ఇది నవల కానేకాదు. బాణభట్టుని కాదంబరిలోని ఒకకథకు తెనిగింపు. ఇది నవలయనిపించుకోదు. నరహరి గోపాలకృష్ణమ్మసెట్టిగారి "రంగరాజచరిత్ర" 1872లో ప్రకటించియున్నారు. ఇది నవలయని తెనుగులోని తొలినవలయని కొందఱి అభిప్రాయము. ఇందలికథ "నవల" లోని సాహిత్యము వలెకాక ఒక జీవితచరిత్రను పోలియుండును. 1878లో వీరేశలింగం పంతులుగారు "రాజశేఖరచరిత్ర" అను నవలను ప్రకటించిరి. ఇదియే తెనుగులోని ప్రథమనవల యనవచ్చును. ఇది ఆంగ్లభాషలో గోల్డుస్మిత్ రచించిన వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డుకు అనుకరణమని కొంద

రనుచున్నారు. ఈ నవలనే 1887లో జె. రాబర్టు హచ్చిసన్ అను నతడు అనువాదముచేసి ఇంగ్లీషులో ప్రకటించెను. అది ఒక మేలి రచనగానే నాటి లండన్‌టైమ్సుపత్రిక ప్రశంసచేయుచు ఆయాంగ్లాను వాదముపైన సమీక్ష ప్రకటించెను. అదియునుగాక, నీలాద్రిరావు అక్రమచర్యలును, బైరాగి సువర్ణవిద్యయును, సుబ్రహ్మణ్యము ఛాందసబుద్ధియును, కృష్ణజగపతి యౌదార్యము ఇవియన్నియును తెనుగుకుటుంబములలో కనిపించునవియే. సువర్ణముచేయుట; అంజనముచేయుట, భూతచికిత్సఇట్టియాచారములు తెనుగుదేశమునకు సంబంధించినవే. అందుచేత వీరేశలింగముపంతులు నవలారచనమునకు నూతన మార్గదర్శియనుమాటలో పొరపాటులేదు వీరేశలింగముపంతులు అనేకవిధములుగా యుగనిర్మాతయును, గద్య వాఙ్మయబ్రహ్మయు నని చెప్పవచ్చును. దీనికి పలువురు ఆక్షేపణలు తెలుపుచుందురు కాని, ఆ యాక్షేపణలు నెగ్గునవి కావనవచ్చును. వీరేశలింగముగారు ఇతర వచనకావ్య రచనలందువలెనే నవలారచనలో కూడ ప్రప్రథములు. నవల కాకపోయినను అధిక్షేపణకావ్యముగా రచించిన మహాకకథ 'సత్యరాజాపూర్వదేశయాత్రలు' అనునది. ఇందు చెన్నపురి నగరములో తెనుగువారు పొందు మోసములును, ఆడుమళయాళములో స్త్రీలుచేయు రాచరికమును చాల చిత్రముగా వర్ణితమైనవి. ఇది కొంతవరకు గలివర్స్ ట్రావెల్స్ అనుగ్రంథమును ఆధారముగా చేసికొన్నను, ఇందలి సన్నివేశములును భావములును పంతులుగారి స్వాంతములే. సతీహితచర్యవంటి 'పత్నీహితచర్య' యనుగ్రంథము నొకటిసృష్టించి, అందులో వీరు చెప్పు నీతులువింతగానుండును. ఆ కాలములో సంఘదుర్నీతికి బలియైన స్త్రీలకష్టములను చిత్రించుటకు కొంచెము తలక్రిందులుచేసి ఈ యాడుమళయాళమును వీరేశలింగము సృష్టిచేసి హేళనచేసెను. వీరేశలింగము తాను తొలినవలను వ్రాయుటయేగాక, అట్టినవలలు అనేకము తెలుగులో వచ్చుటకు దోహదముచేసినారు. వీరు చింతామణియను పత్రికపక్షమున

ఉత్తమ నవలారచనకు పోటీలుపెట్టించి, 1892 - 99 వరకు బహుమతులు ఇప్పించినారు. ఈ పోటీలలో నాలుగు సంవత్సరములు వరుసగా చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రథమబహుమతులను గెలుచుకొన్నారు. చిలకమర్తివారు నవలారచనలో వీరేశలింగము గారిబరవడినే అనుకరించితి మని తమ స్వీయచరిత్రలో చాల చోటుల చెప్పుకొన్నారు. చిలకమర్తివారి నవల "రామచంద్రవిజయము" కోనసీమలోని కొబ్బరితోటలను గోదావరీతీరప్రాంతసీమలను చక్కగా వర్ణించును. సున్నితమైన హాస్యము, ఉత్తమ పాత్ర చిత్రణము, స్థానికప్రదేశవర్ణనము ఈ నవలలో ప్రత్యేకవిశేషములు. ఇదిగాక చిలకమర్తివారు అహల్యాబాయి, హేమలత, కర్పూర మంజరి మొదలైన చారిత్రకగాథలతో కూడిన నవలలు రచించినారు. వీరే రమేశచంద్రదత్తు బెంగాలీలోను, ఆంగ్లములోను రచించిన "**Lake of Palms**" అను నవలను అనువదించి 'సుధాశరత్చంద్ర' మను పేర ప్రకటించిరి. వీరిరచనలలోని కొన్నినవలలు 'చింతామణి' బహుమతులందుకొన్న వే. 1881లో చింతామణిపత్రిక స్థాపించినతరువాత, 1893 లో నవలలపోటీ ప్రారంభమైనది. దీనికి న్యాపతి సుబ్బారావుపంతులు, వీరేశలింగముపంతులు, వావిలాల వాసుదేవశాస్త్రి గారలు పరీక్షకులు. ఆ సంవత్సరము ఖండవల్లి రామచంద్రుడు రచించిన ధర్మవతీవిలాసమునకు మొదటిబహుమతి, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి సంజీవరాయచరిత్రకు రెండవబహుమతి లభించినవి. వీరే బంకించంద్రుని చంద్రశేఖరము అను నవలను తెనిగించిరి. ఖండవల్లి రామచంద్రునికి తిరిగి 1894 లో 'మాలతీరాఘవము' అను నవలకు రెండవబహుమతి లభించెను. 1888 లో కూనపులి లక్ష్మీనరసయ్యగారి బక్షీయనునవలకు ద్వితీయబహుమానము లభించెను.

తరువాత 19వశతాబ్ది అంతమగుటకుముందు కొన్నినవలలు వచ్చినవి. తిరిగి నవలారచన మంచి వృద్ధిలోనికివచ్చుటకు 20వశతాబ్ది ప్రథమపాదములో (1911 - 12) వచ్చిన విజ్ఞానచంద్రిక ఆంధ్రప్రచా

రిణి, వేగుచుక్కగ్రంథమాలవంటి సంస్థలు చక్కని ప్రోత్సాహ మిచ్చినవి. 1900లోనే బంకించంద్రుని కపాలకుండల, దొరస్వామి యనునతడు అనువదించి ముద్రించెను.

ఇంక చరిత్రగ్రంథములలో తెనుగుదేశచరిత్ర తొలుత వ్రాసినవారు తిరుమలబుక్కపట్టణము రాఘవాచార్యులవారు. వీరి రచనకు తెనుగురాజులచరిత్రయని పేరు. 1881లో శాసనాధారము లతోకూడిన చరిత్ర వచ్చెను. రెండుసంపుటముల ఈ చరిత్ర గ్రంథము అముద్రితముగానే యుండిపోయినది. 1879లో మామిడి సారంగపాణి మచిలీబందరుచరిత్రను, 1885లో ఒడయరు వీరనాగయ గారు చాణక్యచరిత్రను వ్రాసిరి. 1894లో తోలేటి వేంకటసుబ్బయ్య గారు వీరేశలింగకవిచరిత్ర రచించిరి. కవులచరిత్ర వ్రాసిన గురజాడ శ్రీరామమూర్తిగారు రావువంశీయులచరిత్ర (1895) బెండపూడి అన్నమంత్రిచరిత్ర (1896) అప్పయ్యదీక్షితచరిత్ర (1897) తిమ్మ రసుచరిత్ర (1898) మాధవవిద్యారణ్యచరిత్ర, రాయనిభాస్కర మంత్రిచరిత్ర (1899) రచించిరి. 1899లోనే విశ్వాసము వేంకట రమణయ్యగారు శివాజీచరిత్రమును రచించిరి. ఇదియే శివాజీగూర్చి తెలుగులో వెలువడిన ప్రథమరచన. దీనితరువాతవచ్చిన మరొక శివాజీచరిత్ర కొమర్రాజు లక్ష్మణరావుగారు రచించిరి. భాషాపరిశోధ నలవిషయములో తొలుత వావిలాల వాసుదేవశాస్త్రిగారు 'ఆంధ్ర భాషనుగూర్చిన యుపన్యాసము' అనునది రచించిరి. (1881) ఇది ద్రావిడభాషావ్యాకరణము రచించిన కాల్డువెలు పండితుని పరిశ్రమ పైన విమర్శనములను చర్చించెను. దీనివెనుక టి. యమ్. శేషగిరి శాస్త్రిగారు మద్రాసువిశ్వవిద్యాలయములో తమ భాషాపరిశోధనలు రెండుగ్రంథములుగా ప్రకటించిరి. అర్ధానుస్వారతత్వమునుగూర్చి ప్రకటించిన తొలిగ్రంథము 1893లోను, ఆంధ్రశబ్దతత్వముగూర్చి 1896 లోను ప్రకటించిరి. ఆ సంవత్సరముననే కా. గోపాలరావు నాయుడుగారు ఆంధ్రభాషాచరిత్రసంగ్రహము అను ఉపన్యాస

మును ప్రకటించిరి. పరవస్తు రంగాచార్యులవారు వర్ణనిర్ణయమును 1900లో ప్రకటించిరి.

ఆనాటి భాషాచర్చలలో పరిఘా - పరిఖా శబ్దవిచారము, రేఫద్వయవిచారము, "జ్ఞ" కార - 'క'కార వివేచనము, ప్రాసాది స్థలముల శబ్దస్వరూపములచర్చ ముఖ్యము లనవచ్చును. భాషావిషయములో జయంతి రామయ్య పంతులుగారుకూడ కొంత కృషి చేసిరి. వీ రనేక శాసనములను ప్రకటించినారు.

ఇంక సాహిత్యచరిత్రలోను, విమర్శనలోను తొలిప్రయత్నములు కవులజీవితచరిత్రల రచనములే యనవచ్చును. మెకంజీ దొరకు సహాయకుడుగా పనిచేసిన కావలి వెంకటబొఱ్ఱయ్యగారిసోదరుడు కావలి వేంకటస్వామి ఆంగ్లములో దక్కనుకవులచరిత్ర వ్రాసిరి. దాని తరువాత 1893లో గురుజాడ శ్రీరామమూర్తిగారు కవులచరిత్ర ఒకటి ప్రచురించిరి. 1896లో పోలవరము జమీందారయిన కొచ్చర్లకోట వేంకటకృష్ణారావు బహద్దరుగారు 'ఆంధ్రభాషాభివృద్ధి'నిగూర్చి యొకవ్యాసమును ప్రకటించిరి. 1898లో 'భాస్కరోదంత'మను పేర భాస్కరరామాయణ కర్తృత్వమును గూర్చి కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిలవా రొక పెద్ద విమర్శనగ్రంథమును ప్రకటించిరి. 1899లో వెన్నేటి రామచంద్రరావుగారు 'మనువసుప్రకాశిక'యను విమర్శనగ్రంథమును మనుచరిత్ర వసుచరిత్రల గూర్చి ప్రకటించిరి. దీనిపైన బ్రహ్మయ్యశాస్త్రిగారు విమర్శ చేయుట, మరియొక ప్రతివిమర్శ వచ్చుట, దానిపైన మరల ప్రతి విమర్శలు వచ్చుట, ఇదియంతయును జరిగినది. ఆకాలములోని విమర్శలలో కవికర్తృత్వమునుగూర్చియును కాలమునుగూర్చియును, జన్మించిన స్థలములగూర్చియును హెచ్చు వాదప్రతివాదములు జరిగెడివి. కావ్యరచనలో గుణదోషములవిమర్శ, యతిప్రాసలప్రయోగములు దీనినిగూర్చి హెచ్చు చర్చలు జరుగుచుండెడివి కాని, కావ్యములలోని సౌందర్యము గ్రహించి రసాస్వాదనచేయుదృష్టి అంతగా కనిపించెడిదికాదు. ప్రకటించిన గ్రంథములకు పీఠికలు

వ్రాయుటలో కొందరు విమర్శనము సాగించెడివారు. ఇట్టివారి వచన రచనశైలి నాతి కఠినమై బహుజనసుబోధకమై యుండెడిది. ఈరకపు వ్యాఖ్యాతలలో శతఘంటము వేంకటరంగశాస్త్రులు, దండిగుంట సూర్యనారాయణశాస్త్రులు, పురాణం హయగ్రీవశాస్త్రి, నోరి గురులింగశాస్త్రులు (1853 - 1913) తంజనగరము దేవప్పెరుమాళ్ళయ్య (1872 - 1934) మొదలయినవారు ముఖ్యులు. (వీరి పేరే దేవరాజసుధీ) వీరందరును కవిజీవితములు రచించి పీఠికలు ప్రకటించునపుడు కావ్యగుణదోషవిచారణకూడ కొంత చేయుచుండెడివారు. ఇట్టివారిలో ఎక్కువమంది కళాశాలలలోనో పాఠశాలలయందో పండితులుగా పనిచేయుచు తమకు తీరికగలకాలములో యథాశక్తి వాఙ్మయసేవచేయుచుండెడివారు.

కందుకూరి వీరేశలింగముగారుకూడ మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను, రాజమహేంద్రవరము కళాశాలలోను కొంతకాలము ఆంధ్రపండితులుగా పనిచేసినవారే. ఆకాలములోనే కవిజీవితములను వారు ప్రకటించినారు. పంతులుగారి సమకాలికులైన వేదము వేంకటరాయశాస్త్రిగారు (1853–1929) మద్రాసులోని క్రిస్టియన్‌కళాశాలలో పండితులుగానుండి, బహుకావ్యవిమర్శలను ప్రకటించిరి. కొన్నికావ్యములకు (విజయవిలాసము మొదలైనవి) ప్రతిపద్యమునకును అర్థవివరణముతోడను, టీకాతాత్పర్యముతోడను సంస్కృతకావ్యపద్ధతిని అనుసరించి వ్యాఖ్యానములనుకూడ ప్రకటించిరి. వీరు ప్రకటించిన గ్రంథములలో 'ఆముక్తమాల్యద' చక్కని గ్రంథము. కల్లూరి వేంకటరామశాస్త్రిగారు బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికను వ్రాసి తమ యపారపాండిత్యమును వెల్లడించిరి (1857–1928). అప్పుడు వీరిరచనలపై వాదప్రతివాదములు పెరిగినవి. పాడి వేంకటస్వామిగారు ఆంధ్రధాతురత్నాకరమును రచించి పరిశోధనకు ఒకత్రోవచూపిరి. ఆంధ్రులలో కాంగ్రెసుఅధ్యక్షపదవి నధిష్ఠించినవారిలో ప్రథములైన పనప్పాకం అనంతాచార్యులవారును, వారికుమారులు శ్రీనివాసాచార్యులుగారును 'శ్రీవైజ

యంతి' పత్రిక పెట్టి, భాషావిమర్శలను, ప్రబంధములను రచించి ప్రకటించినవారే. చెన్నపట్టణములో ఓ. వై. దొరస్వామయ్యగారు అనేకకథల పుస్తకములు ప్రకటించుటయేగాక, బంకించంద్రుని ప్రఖ్యాతనవలలు ఆనందమఠమును కపాలకుండలను అనువాదము చేసిరి. రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారును, పి. చెంచయ్యగారును కలిసి ఆంగ్లములో తెనుగుసాహిత్యచరిత్రను రచించిరి. నూతనదృక్పథముతో తెలుగుసారస్వతపరిణామములో వచ్చిన దశలకు సరియైన విలువలుకట్టి, నిష్పాక్షికముగా విమర్శించిన యీ గ్రంథమువంటిది ఆంగ్లములోనేకాదు, తెలుగులోనే యింతవరకు రాలేదు. భుజంగరావుగారు, ఏలూరులో 'మంజువాణి' పత్రిక పెట్టించి, నందిరాజు చలపతిరావుగారిచేత పత్రికలు, పుస్తకములు ప్రకటింపించుచుండువారు. చలపతిరావుగారు ఆకాలములోనే స్త్రీల పాటలును, కాశీరామేశ్వర మజిలీలనుపేరున కథలును ప్రకటించిరి. చలపతిరావుగారు రాజ కళింగగంగుఅను నాటకమును, భుజంగరావుగారు ఉపన్యాసదర్పణమను వ్యాసగుచ్ఛమును ప్రకటించిరి.

యాత్రాచరిత్రలు వ్రాసినవారిలో బొబ్బిలి మహారాజావారు పేర్కొనదగినవారు. పోతకమూరి జానకమ్మగారు ఇంగ్లాండు దేశము వెళ్ళి, అచ్చట చూచిన చిత్రములను 'ఇంగ్లండుచిత్రములు -యాత్ర' యనుపేరున 1876 లోనే ప్రకటించిరి. ఏనుగుల వీరాస్వామయ్యగారేకాక, మానవల్లి త్యాగయ్యగారు మరొక కాశీయాత్రను (1886) ప్రకటించిరి. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారొక కాశీయాత్రాచరిత్రను, లాడ్ గోవిందదాసుగారు మరొకటి 'కాశీత్రోవ' యనుపేరున ప్రకటించిరి. ఇది 1898 లో ముద్రితమైనది. అంతఃపురోపన్యాసములనుపేరున ఆచంట సుందరరామయ్యగారు కొన్నివ్యాసములను 'చింతామణి' పత్రికలో ప్రకటించిరి. ఇట్టివానిరచనకుకూడ కందుకూరి వీరేశలింగముగారే మార్గదర్శకులు. లేఖావాఙ్మయములో బ్రౌనుదొరగారి జాబులు తరువాత, పూండ్ల రామకృష్ణయ్యగారి 'అముద్రితగ్రంథచింతామణి' పత్రికలో

వెలువడిన లేఖలను సేకరించి 'అముద్రితగ్రంథచింతామణిజాబులు' అనుపేరున ఒక గ్రంథముగా ప్రకటించినారు. ఈ పుస్తకము చూచిన ఆకాలములో పండితులు తమయభిప్రాయములను తంతి వార్తలమూలముగా తెలిపెడివారని గ్రహించవచ్చును. సాహిత్య విమర్శయన్న అంత కుతూహలము, అంత శ్రద్ధ.

ఆకాలములోవచ్చిన సాహిత్యవిమర్శకులలో నాగపూడి కుప్పుస్వామయ్యగారు భాగవతోత్తరరామాయణ గ్రంథములకు విపులమైన పీఠికలను, పారిజాతాపహరణముపైన పరిమళోల్లాసము అను చక్కని విమర్శనమును ప్రకటించిరి. మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు స్వదేశసంస్థానచరిత్రమును, పూండ్ల రామకృష్ణయ్య గారు పార్వతీశ్వరకవి జీవితచరిత్రయును రచించిరి. వీరే శివాజీ చంద్రగుప్తులచరిత్రను, బలిజేపల్లి లక్ష్మీకాంతముగారు చీనాచరిత్ర యును, అశోకుడును, చిలుకూరి వీరభద్రరావుగారు తిమ్మరుసు తిక్కన శ్రీనాథ జీవితచరిత్రలును రచించిరి. వీరిలో కొందరు 19వ శతాబ్ది చివరిభాగములోను, మరికొందరు 20వ శతాబ్ది యారంభము నను తమ నూతన రచనలుచేసిరి.

ఈ నూతనరచనలన్నింటికిని క్రొత్తమార్గము చూపిన ప్రతి భావంతుడు ఆంధ్ర గద్యవాఙ్మయబ్రహ్మ కందుకూరి వీరేశలింగము పంతులుగారే యని ఎన్నోసారులు ప్రస్తావించుకొన్నాము. ఆయన కవి, పండితుడు, చరిత్రకారుడు, విమర్శకుడు, సంఘసంస్కర్త, విద్యావేత్త. పిల్లల వాచకపుస్తకములనుండి పెద్దల కవులచరిత్ర వరకు వారు స్పృశింపని సాహిత్యవిభాగము లేదు. నవల, కథ, చరిత్ర, నాటకము, ప్రహసనము, జీవితచరిత్ర, సాహిత్యవిమర్శ మున్నగువానికి ఆయన క్రొత్తత్రోవలు చూపించినారు. పంతులు గారుచేసిన మహోన్నతసేవ వివిధరంగములలో వ్యాపించి, భాషను, భావములను, ప్రజల మనోవైఖరులను సంస్కరించి అభ్యుదయపథ ములవైపునకు నడిపించినది. వారుచేసిన బహుముఖసేవ త్రిపథగామి నివలె మొనలేని సత్ఫలితముల నొసగినదని మనము చెప్పుకొన

వచ్చును. ఒకటి భాషాకాశములో, రెండవది వివిధసాహిత్యక్షేత్ర ములలో, మూడవది పరభాషావాఙ్మయములోని మంచిని గ్రహించి మనసాహిత్యరంగమున దానిని ఫలింపజేయుటలో వారి యసమాన కృషి గొప్ప ప్రయోజనములను సాధించిన దనవచ్చును. భాషలో పంతులుగారొక సుబోధకమైన శైలిని తమరచనల కుపయోగించి, పుస్తకము లధికసంఖ్యాకులకు 'తేటతెల్ల'ముకావలెనను లక్ష్యముతో తమ నూతనభావములను వెదజల్లుటకు సారస్వత మొకసాధనగా నుపయోగించుకొనిరి. ఇంక వివిధసాహిత్యరంగములలో ఒరవడులు పెట్టుటలో నాటకరచనకు పూనుకొని, ప్రదర్శనయోగ్యమైన నాటకములు రచించిరి. సమకాలిక సమాజస్థితులపైన నాటి ప్రజలదృష్టి ప్రసరించునట్లుచేసి, వానిని హేళనచేసి తన నాటకములను ప్రహసనములను రంగస్థలముపై ప్రదర్శించి నాటిసంఘములో ఒక చైతన్యమును సంచలనమును తెచ్చిన సంస్కర్త. అట్లే 'నవల'లో సమకాలికజీవనమును చిత్రించి, దానిపై నర్మగర్భముగా పాఠకులలో సంస్కరణము తెచ్చుటకు ప్రయత్నించిన మార్గదర్శి. ఇట్టినవలలు ఆంగ్లములో డికెన్సు రచించి కొన్ని సాంఘికప్రయోజనములను తన రచనలమూలముగా సాధించెను. పంతులుగారు చరిత్రలు వ్రాసిరి. వానిలో విక్టోరియామహారాణి చరిత్ర,జీససుచరిత్ర, బ్రహ్మసమాజ చరిత్ర, వితంతువివాహోద్యమచరిత్ర చెప్పదగినవి. ఇంతేకాక, స్వీయచరిత్ర రచించి రెండుసంపుటములుగా ప్రకటించిరి. పూర్వ సంప్రదాయములను నిర్భీతిగా విమర్శచేయుట, నూతనాభిప్రాయములను వెదజల్లుట, నాటి రాజకీయ, సాంఘిక, విద్యా విజ్ఞానరంగములలో కరుడుగట్టిపోయిన మూఢవిశ్వాసములను, మూర్ఖకార్పణ్యములను పటాపంచలుచేయుటకు ఆయన కలము వజ్రాయుధమువలె పనిచేసెను. కావుననే వారికి ప్రతిపక్షులు, విమర్శకులు ఎందఱో బయలుదేరిరి. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, కొక్కొండ వేంకట రత్నముపంతులు, వేదము వేంకటరాయశాస్త్రి మున్నగువారలు పంతులుగారిరచనలను తీవ్రముగావిమర్శించినవారే.అయినను లెక్క

చేయక పంతులుగారు నిష్కామయోగిగా ఫలితములనాశింపక తమ కార్యదీక్షను వీడక తమ నిరంతరసమరమును కొనసాగించుచునే యుండిరి. ఆ పోరాటములో వారొక పెద్ద సంచలనముకలుగజేసిరి. అందుచేతనే తమ స్వీయచరిత్రలో వివిధమార్గములకు తాము చూపిన తొలివెలుగులగూర్చి చెప్పియున్నారు. "తెనుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటినాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటిచరిత్రము నేనే రచించితిని. స్త్రీలకై మొదటి వచనపుస్తకమును నేనే రచించితిని."—స్వీయ చరిత్ర.

ఇవిగాక పంతులుగారు పరిశోధనచేసి ముద్రించిన గ్రంథములనేకములు. ఆ పుస్తకప్రచురణమునకు తాము సంపాదించి ప్రకటించిన 'చింతామణి' "వివేకవర్ధని" వంటి పత్రికలుపకరించినవి. పంతులుగారు వ్యాకరణసూత్రములను ఉల్లంఘించలేదు. అట్లని ఇనుపగుగ్గిళ్లవంటి కొఱకరాని కొయ్యలవంటి పదములతో తన రచనాచక్రమును బిగించలేదు. వారు వచనవాఙ్మయబ్రహ్మలనుటకును, గద్యతిక్కనలనుటకును ముఖ్యకారణములు భాషాభివృద్ధిమార్గములకు వారు వేసికొన్న పథకములే యనవచ్చును. 'వివేకవర్ధని' పత్రిక ప్రారంభించునపుడు పంతులుగారే స్వయముగా తమ నియమములగూర్చి తెలిపియున్నారు.

"నే నేర్పఱచుకున్న భాషాభివృద్ధిమార్గము తెలుగుభాషలో మృదువైన సులభశైలిని, సలక్షణమైన వచనరచనచేయుట!" అందుచేత వీరేశలింగకవి వచనశైలిలో తేటతనము, సూటితనము, నీటుతనముతోపాటు సునిశితమైన చురక కనిపించును. ఆయనవచనరచన జీవంతమై, దివ్యశక్తితో కలకలలాడుచు దీపించుచుండును. పంతులుగారి సాహిత్యసేవ ప్రవర్తిల్లిన అనేకగ్రంథములను రకములబట్టి విభజించిన వారి గ్రంథసంపుటములలో ఈ క్రిందివర్గములు తేలును. (1) నవలలు (2) కథలు (3) ప్రసిద్ధ స్త్రీపురుషజీవితచరిత్రలు

(4) నాటకములు (5) ప్రహసనములు (6) గ్రంథవిమర్శనములు (7) చారిత్రకగ్రంథములు (8) పత్రికావ్యాసములు (9) శాస్త్ర గ్రంథములు (10) ఉపన్యాసములు (11) మతచర్చలు (12) వాచకపుస్తకములు. ఇన్ని విభాగములయందును పంతులుగారు రానున్న తరములవారికి మార్గదర్శకులైరి. ఈ విభాగములన్నింటి యందును పంతులుగారి యడుగుజాడలననుసరించి, అదేరకపు కృషి చేసినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారు. 19వశతాబ్ది పూర్తికాకుండనే చిలకమర్తివారిన్నిశాఖలలోను తమ ప్రయోగ ములుప్రారంభించి, రామచంద్రవిజయమువంటి నవలలు, నీతికథలు, గురునానకువంటి జీవితచరిత్రలు, బలవంతబ్రాహ్మణార్థమువంటి ప్రహసనములు, విమర్శలు, చరిత్రగ్రంథములు, వ్యాసములు, శాస్త్రగ్రంథములు ఇట్టివెన్నియో రచించిరి.

పంతులుగారు స్త్రీవిద్య నభివృద్ధిచేయుటకు స్త్రీలచరిత్ర ములు, బిడ్డలశిక్షణ, సతీహితచర్యవంటి వ్యాసములు, ఆరోగ్య సూత్రములు మొదలైన అనేకవిషయములనుగూర్చిన గ్రంథములు రచించిరి. నాటకరచనలో సంస్కృతమునుండి ఆంగ్లమునుండి అను వాదములును అనుకరణలుచేయుటయేకాక స్వతంత్రముగాకూడ కొన్నిరచనలుచేసి వానిని రంగస్థలముపైన ప్రదర్శింపజేసినారు. ప్రహసనములలో సమకాలిక సంఘాచారములను వెక్కిరించుచు 58 వరకు రచించిరి. వీనిలో అపూర్వబ్రహ్మచర్యము, విచిత్రవివా హము, ఆచారము, మహాబధిరప్రహసనము, బలాత్కార గానవినోదము మున్నగునవి చమత్కారముగా సున్నితమైన హాస్యముతో నవ్వించు నట్టివిగానుండును.

గ్రంథవిమర్శనలో - వీ రున్నతస్థాయిలో లక్ష్యములను మాత్రము చర్చించి ప్రత్యర్థు లెంతగా తన్ను దూషించినను వారి స్థాయిలోకి దిగజారక తనవిమర్శలను ఉత్తమశ్రేణిలోనే ఉంచిరి. విగ్రహతంత్రవిమర్శనము చక్కగా రచించెను. ఈయనరచనలను విమర్శించువారు అసూయతో కిట్టక చేసిన దూషణలను తిరస్కార

రము లని వానినిబట్టి పరామర్శచేసిన వెల్లడికాగలదు. చరిత్రలో స్వదేశసంస్థానచరిత్రలును, స్వీయచరిత్ర, ఆంధ్రకవులచరిత్రయును పేర్కొనదగినవి. ఆంధ్రకవులచరిత్రలో 10 వ శతాబ్దినుండి 19 వ శతాబ్ది పూర్తియగువరకు మూడువందల కవులచరిత్రలను వ్రాయుటలో ఆ కవుల గ్రంథములన్నియును, అవలోడనచేసి, చక్కగా నిష్పక్షపాతముగా విమర్శచేయుట పంతులుగారికే చెల్లినది కాని, ఇతరులకు సాధ్యముకాదు సాహిత్యవిమర్శన యెట్లు జరుగవలయునో ప్రదర్శించుటకు ఇది మేలుబంతి; దీనిననుసరించియే నేటికిని కొందరు కవులు వ్రాయుచున్నారు.

స్వీయచరిత్ర లంతవరకు పద్యములలో వచ్చినవేకాని, సులభమైనవచనములో ఇంత చనవుగా అన్నివిషయములను తెలుపు పద్ధతిలో రాలేదు. పంతులుగారిబరవడిననుసరించి రాంభొట్ల కృష్ణమూర్తిగారు, వల్లూరు జగన్నాథరావుగారు, రాయసం వేంకటశివుడుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును తమ స్వీయచరిత్రములను రచించిరి. పత్రికారచనలో పంతులుగారి "వివేకవర్ధని" "హాస్యసంజీవని" పత్రికలు లోకప్రసిద్ధములైనవి. ఈ వారము పత్రిక చదివి పూర్తిచేసినపిదప వచ్చేవారము పత్రిక యెట్లుండునోయను కుతూహలముతో ఆనాటి పాఠకులు నిరీక్షించుచుండువారట.

శాస్త్రీయగ్రంథములలో ప్రాచ్య పాశ్చాత్యశాస్త్రముల నుండి పంతులుగా రనేకగ్రంథములను ప్రకటించిరి. పరిభాషకోసము వెదకులాడకుండగనే ప్రాచీనులు వాడిన పరిభాషాపదములనే విరివిగా వాడినారు. ప్రాచీనవిజ్ఞానమునకు సంబంధించిన తర్కశాస్త్రము, వ్యాకరణము, అలంకారసంగ్రహము, కావ్యసంగ్రహము, జ్యోతిశ్శాస్త్రము మొదలైనవిప్రకటించినారు. జంతుశాస్త్రముప్రకృతిశాస్త్రము శారీరకశాస్త్రముకూడ తెలుగులోనికి ప్రపథమముగా పంతులుగారే తెచ్చినారు. ఉపన్యాసములలో పంతులుగారు వివిధసందర్భములలో చేసినవానిని సంపుటీకరించి ప్రకటించియున్నారు. ఇందలి విషయవైవిధ్యము అపారము. రాజకీయములు, కాంగ్రెసుమహాసభ, సంఘ

సంస్కరణ ఇట్టి వెన్నో విషయములగూర్చి ఉపన్యాసములిచ్చిరి. ఈ యుపన్యాసకళలో 1870లో ఆరితేరిన ప్రముఖులు విశాఖపట్టణ వాస్తవ్యులయిన పండితులు పరవస్తు రంగాచార్యులుగారు, మద్రాసు వాస్తవ్యులైన కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు, ఆచంట వేంకటసాంఖ్యాయనశర్మగారు. హిందూమతప్రాశస్త్యమునుగూర్చి అనేక వాదప్రతివాదములు బహిరంగసభలలో జరుగుచుండెడివి. ఆంధ్రసాహిత్యమున ఉపన్యాస మొక ప్రత్యేకకళగా గుర్తించి అది యొక ప్రత్యేకశాఖగా వృద్ధినొందించిన మహావక్త కందుకూరి వీరేశలింగముపంతులుగారు. ఆనాటి రాజమహేంద్రవరముపౌరులు ప్రత్యక్షముగా వారి వాగమృతమును గ్రోలి ధన్యులైనారు.

పంతులుగా రాంధ్ర వచనవాఙ్మయమునకు చేసిన సేవ బహుముఖవ్యాప్తమై, పరిధులులేక తనప్రభావమును అనేకతరములపై ప్రసరింపజేయుచున్నది. వారు రచించిన గ్రంథములు నూటయిరువదిపైనన్నను, వీనిలో ఒక వైవిధ్యముతోపాటు భాషను ప్రజలను సముద్ధరించవలెనను దీక్ష, పట్టుదల సమగ్రముగ వ్యక్తమగుచున్నవి. వీరేశలింగముపంతులుగా రొక వ్యక్తికాడు, ఒక ఉద్యమము; ఒక పరిశోధకుడు కాడు, ఒక మహాసంస్థ; ఒక సంస్కర్తకాడు, ఒక మహాశక్తి; ఒకపురుషుడు కాడు, ఒకయుగప్రవక్త. వివిధరంగములలో పంతులుగారి సేవను అనుసరించిన కవులు, పండితులును ఉన్నారు. వారి సముష్టివ్యవసాయఫలితమే బహువర్ణములతో వికసించి కలకలలాడుచున్న తెలుగు గద్యవాఙ్మయపుష్పవనము.

చరిత్రపరిశోధనలో కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు చూపిన మార్గమును చిలుకూరి వీరభద్రరావుగారు అనుసరించిరి. 19 వ శతాబ్ది అంతమునకుముందే వీరభద్రరావుగారు తమ తొలి చరిత్రరచనలు ప్రకటించుటకు ప్రారంభించిరి తొలుతలో స్యూయెల్ దొర రచించిన forgotten empire అను గ్రంథము నాధారముచేసికొని జీర్ణకర్ణాటరాజ్యచరిత్రమును రచించిరి. 1892లో వీరేశలింగకవి సంగ్రహచరిత్రను ప్రకటించిరి. 'దేశోపకారి' 'విబుధ

రంజని పత్రికలకు సంపాదకులుగా నుండిరి. 1897 లో ముద్రాలయమును స్థాపించి, పలు రచనలుచేసిరి. అయినను వీరి 'యాంధ్రుల చరిత్ర' 1910 లో 'విజ్ఞానచంద్రిక' వచ్చువరకును వెలువడలేదనవచ్చును. వీరి సమకాలికులే నడకుదుటి వీరరాజుగారు. (1871–1937) వచనరూపమున అనేక పురాణములు వెలయించుటయేగాక, విమర్శలనేకము ప్రకటించిరి. అముద్రితగ్రంథములయిన ఎల్లనార్యుని విష్ణుమాయానాటకము, మద్దిరాల వెంకటరాయకవి 'ఏకాంతసేవావిలాసము' పరిష్కరించి విపులపీఠికలతో ప్రకటించినారు.

వచనరచనములో పంతులుగారివలె వివిధరంగములలో కృషి చేసినవ్యక్తి వావిలకొలను సుబ్బారావుగారు (1863 – 1939). వీరి రచనలకన్నింటికంటెను పిల్లలు చదువుకొనుటకు వీలయిన తేలిక భాషలో వ్రాసిన "ఆర్యకథానిధులు" తెనుగుభాషకు అలంకార ప్రాయములు. ఇందు నలచరిత్ర, సావిత్రి మొదలయినవి బహుజన సమాదరణకు పాత్రమైనవి. వీరు రచించిన 'సులభవ్యాకరణము' దురవగాహమైన వ్యాకరణమును సులభబోధకముచేసినది. వీరురచించిన 'శ్రీకృష్ణావతారతత్వము' భక్తిరసపూరితము. సుబ్బారావుగారు సాహిత్యసేవచేసి, సాహిత్యమును సారూప్యసాధనముగాచేసికొని తాము భవసాగరమును తరించుటయేగాక ఇతరులను తరింపజేసినారు.

వ్యాకరణములో అసాధారణ ప్రజ్ఞచూపినవారు తాతా సుబ్బరాయశాస్త్రిగారు (1867 – 44). వీరికి 25 యేండ్లప్రాయముననే పండితచక్రవర్తియను బిరుదు లభించినది. నాగేశభట్టు రచించిన "శబ్దేందుశేఖరము" అను వ్యాకరణముపై వచ్చిన విమర్శలన్నింటికిని బదులుచెప్పుచు శాస్త్రిగారు, 'గురుప్రసాదము' అను ఉద్గ్రంథమును రచించిరి. వీరు పూర్వాచారపండితులయినను, సంఘసంస్కరణమన్నను, తెలుగులోని నూతనోద్యమములన్నను జాతీయ భావములన్నను ప్రీతిచూపెడువారు. వారిశిష్యులలో ముఖ్యులైన పేరి వేంకటేశ్వరశాస్త్రిగారు, హరిశాస్త్రిగారును వీరిగ్రంథములకు

అనుబంధములను ప్రకటించిరి. వఝల చినసీతారామశాస్త్రిగారును దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారును వీరిశిష్యులలో ముఖ్యులై తెనుగువ్యాకరణముమీద మంచి పరిశోధనచేసి ఉద్గ్రంథములను ప్రకటించినవారు.

వ్యాకరణములనేకములు తెనుగువారు రచించినవి వచ్చినను వానిలో ముఖ్యముగా నిలుచునవి చిన్నయసూరి బాలవ్యాకరణము, బహుజనపల్లి సీతారామాచార్యులుగారి ప్రౌఢవ్యాకరణమును. ఈ కృషిలో తెలుగుభాష నభ్యసించునపుడు పాశ్చాత్యపండితులు పడిన శ్రమయును, తత్ఫలితముగా తెలుగుభాషను సులభముగా నేర్చుకొనుటకు వీలుగా పాశ్చాత్యులకు వీలుపడునట్లు పలువురు ఆంగ్ల పండితులు చాల వ్యాకరణములు రచించినారు. ఈ వ్యాకరణపరిశోధనమంతయును 1812 – 1870 మధ్యకాలములోనే జరిగినది. వీనిని పరిశీలించినచో మన తెనుగువారి దృక్పథమునకును, ఈ పాశ్చాత్యపండితుల దృక్పథమునకును చాల తారతమ్యము కనిపించును. మన తెనుగుపండితులు వ్యాకరణరచనలో సంస్కృతభాషా వ్యాకరణములను, తల్లక్షణములను అనుసరించి కొన్ని ముఖ్యమైన సూత్రములను చేసి యీ కట్టుబాట్లతో నుండవలెనని వివిధపరిచ్ఛేదములను రచించి భారతప్రయోగములను కొన్ని, ప్రబంధముల ప్రయోగములను కొన్ని స్వీకరించిరేకాని, దినదినాభివృద్ధి యగుచున్న భాషలో ఎప్పటికప్పుడు పెరుగుచున్న శబ్దకోశమునుగాని, వాక్యప్రయోగములనుగాని, ధాతుస్వరూపములనుగాని స్వీకరించలేదు. వాడుకలో నిత్యవ్యవహారములో తెనుగుజనులు మాటలాడుచున్న భాషను పూర్తిగా విస్మరించిరి. అందుచేత మన తెలుగువ్యాకరణములలో కనిపించని అనేకప్రయోగములు వాక్యములును ఈ యాంగ్లపండితుల వ్యాకరణములలో అంగీకృతమైనవి. ఈ కృషిలో ప్రథముడు డాక్టరు విలియమ్ క్యారీ 1814లో తెలుగుభాషకు వ్యాకరణమువ్రాసి ప్రకటించెను. అందు ఈతడొక యభిప్రాయమును ప్రకటించెను. అదియే తరువాతవారికి మార్గదర్శకమా

యెను. ఉత్తరభాషలవలెగాక దక్షిణాదిభాషలయిన తెలుగు, కన్నడము, తమిళము, మళయాళమువంటిభాషలలో చాలపదములు సంస్కృతమునుండిగాక మరియేదోభాషనుండి స్వీకరించినట్లు తోచునని.

దీనితరువాత బిషప్ కాల్డువెల్ ద్రావిడభాషావ్యాకరణమున దక్షిణభాషలపైన తులనాత్మక పరిశీలనచేసి, తెలుగు ద్రావిడభాష నుండి వచ్చినదని నిరూపించెను. (1855 - 56)

అతనిపరిశోధనకుముందు, తెలుగు సంస్కృతజన్యము కాదని చూపుటకుగాను ఎ. డి. క్యాంప్‌బెల్ వ్యాకరణములో వ్రాసిన ఉపోద్ఘాతములో చెప్పెను.

"It has been generally asserted, and indeed believed, that the Teloogoo has its origin in the language of the Vedums and many of the most eminent oriental scholars have given their authority in support of this opinion. It is not without much deference, therefore, that I venture publicly to state my inquiries have led me to contrary conclusion" - (1849 - page XV)

కాంబెల్‌దొరయొక్క యభిప్రాయము తెలుగుభాషాపరిశోధనకు క్రొత్తమార్గము చూపినది. ఈ యభిప్రాయము బలపరచిన మరొకపండితుడు ఫ్రాన్సిస్ ఎల్లిస్.

ఈ యెల్లిస్ బహుభాషావేత్త. క్యాంబెల్‌దొర సూచనప్రాయముగ చెప్పినదానిని తెలుగుభాష సంస్కృతభాషనుండి పుట్టినది కాదనియు, తమిళము మొదలైనభాషలతోనే దాని కెక్కువ సంబంధము పోలిక కలదని నిరూపించెను. 1817 లో విలియమ్ బ్రౌను జెంటు వ్యాకరణమును రచించెను:

1840 లో సి. పి. బ్రౌను చక్కని వ్యాకరణమును రచించెను. ఇది 1857 లో మలిముద్రణము పొందెను. తెలుగు చదువుకొనుటకు పాశ్చాత్యపండితుల కా గ్రంథము హెచ్చుగా ఉపకరిం

చెను. ఈ వ్యాకరణములో వ్యావహారికభాషగూర్చి బ్రౌనుదొర యిట్లు వ్యాఖ్య జేసెను:

"Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities". (A grammar of the Telugu language by C. P. Brown page II)

హిందూవ్యాకరణవేత్తలు వ్యావహారికభాషయెడల అశ్రద్ధ చూపిరని యీతనిఅభియోగము. ఈతనితరువాత, వ్యాకరణములను నిఘంటువులను రచించినవారు జె. సి. మారిస్ (J. C. Morris) తరువాత హెన్రీమారిస్ ఒక సులభవ్యాకరణమును రచించెను. ఇందులోనే తెలుగుభాషలోని మాధుర్యమునుగూర్చి ప్రశంసించెను.

"Telugu is singularly melodious. It is the sweetest and most musical of all the Dravidian tongues and it sounds harmonious even on the lips of the most illiterate. It has justly been called the Italian of the East; and though Tamil may perhaps be a richer language, and more wealthy in clasical literature, Telugu confessedly bears the palm for its exquisite melody and grace.'

బ్రౌను వ్యాకరణముతరువాత పేరుగాంచిన వ్యాకరణమును రచించినవాడు ఆర్టెన్‌దొర. ఈతని తెలుగువ్యాకరణము(A progressive grammar of the Telugu language) 1873లో అచ్చయినది. విశాఖపట్టణమునకుచెందిన రివరెండు ఎ. రిక్రాజ్ ఒక సంక్షిప్తవ్యాకరణమును రచించి 1869 లో ప్రచురించెను.

ఈవిధముగా ఈ పాశ్చాత్యపండితులు తెలుగు భాషాపరిశోధనలో గొప్ప కృషిచేసిరి.

వ్యాకరణములలో తెలుగువారుచేసినకృషిని సమీక్షచేయ దలచినచో చిన్నయసూరి బాలవ్యాకరణముతరువాత హరికారికలు (శేషు కృష్ణమూర్తిశాస్త్రి) వచ్చినవి. వానినిగూర్చి ఏది ముందు ఏది వెనుక యను వివాదములో చిన్నయసూరివ్యాకరణము ప్రథమమని నిర్ధారణఅయినది. త్రిలింగలక్షణవిశేషము అను పేరున ప్రౌఢవ్యాకరణమును బహుజనపల్లి సీతారామాచార్యులుగారు రచించినారు.

వ్యాకరణములకంటె నిఘంటురచనలో పాశ్చాత్యపండితులు మరింత హెచ్చు కృషిచేసినారు. బ్రౌనుదొర తెలుగునుండి ఇంగ్లీషు లోనికిని, ఇంగ్లీషునుండి తెలుగులోనికి అర్థములనుచెప్పు నిఘంటువులు రచించెను 1821 లో తన నిఘంటువును ప్రకటించెను. ఇంగ్లీషు-తెనుగు నిఘంటువు 1852 లో మఱియొకటి ప్రకటించెను. తెనుగులోవచ్చిన విదేశీపదములగూర్చి బ్రౌను 1854 లో మఱియొక నిఘంటువు తయారుచేసెను.

(A dictionary of mixed dialects & foreign words used in Telugu)

అంతకుముందే మచిలీపట్టణమునకు చెందిన మామిడి వెంకయ్యగారు ఆంధ్రదీపిక 1816 నాటికి పూర్తిచేసిరట. దీనిముద్రణ 1848 లో మద్రాసులో గావించినట్లు బ్రౌనుదొర తన నిఘంటువులో పేర్కొనెను. 1852 బ్రౌనుదొర నిఘంటువునకుముందు జె. సి. మారిన్ ఒక నిఘంటువును రచించెను. దీనిని 1835 - 1839 మధ్య మద్రాసు కాలేజీబోర్డువారు ప్రకటించిరి. బ్రౌనుకు తోడ్పడిన ఇతర నిఘంటువులు ఎ. డి. కాంబెల్ రచించిన తెలుగునిఘంటువు, విల్సన్ దొర రచించిన సంస్కృతనిఘంటువును.

తరువాత 1933 లో ఎ. గెలట్లీ రోమన్‌లిపిలో తెలుగు నుండి తెలుగుఅర్థములను తెలియజేయు నిఘంటువును తయారుచేసి 1935 లో ప్రకటించెను. ఈతడు - వ్యావహారికాంధ్రమును మెచ్చుకొనెను.

"ఇదియేమి డిక్షనరీ, గిక్షనరీ" యని చమత్కారముగా చెప్పెను. ఈ గ్రంథము 20వ శతాబ్ది రెండవపాదములో వచ్చినది. తెలుగువారు సేకరించిన నిఘంటువులలో లోకోత్తరమైనదియును, ప్రామాణికమైనదియును బహుజనపల్లి సీతారామాచార్యులు గారి (1828 - 1891) శబ్దరత్నాకరము. దీనికాధారము చిన్నయ సూరి సేకరించిన ఒక పెద్ద నిఘంటువని యందురు. అంతకుముందు వచ్చిన నిఘంటువులను శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ నవ్యసాహిత్యవీధులలో పేర్కొనియున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1 | ఆంధ్రనామసంగ్రహము | - | పైడిపాటి లక్ష్మణకవి |
| 2. | ఆంధ్రనామశేషము | - | అడిదము సూరకవి |
| 3. | ఆంధ్రభాషార్ణవము | - | నుదురుపాటి వెంకనార్య |
| 4. | వేంకటేశాంధ్రము | - | గణపవరపు వేంకటకవి |
| 5. | సాంబనిఘంటువు | - | కస్తూరి రంగకవి |
| 6. | దేశ్యనామార్థకోశము | - | రామాయణము కృష్ణయామాత్యుడు |
| 7. | విశిష్టాంధ్రము | - | చాత్రాతి లక్ష్మీనరసు |
| 8. | ఆంధ్రపదాకరము | - | పూసపాటి వీరపరాజు |
| 9. | సర్వార్థసారసంగ్రహము | - | అమలాపురపు సన్యాసికవి |
| 10. | ఆంధ్రదీపిక | - | మామిడి వేంకయ్య |
| 11. | ఆంధ్రదీపిక | - | చుండూరి రంగనాయకులు శ్రేష్ఠి |
| 12. | బ్రౌణ్యనిఘంటువు | - | సి. పి. బ్రౌను |
| 13. | అక్షరగుచ్ఛము | - | పరవస్తు చిన్నయసూరి |
| 14. | తూము రామదాసుకవి | - | (1870) |

ఆంధ్రదీపికనుగూర్చి సి. పి. బ్రౌను ఇట్లు వ్రాసెను.

"The Deepika is a dictionary of Telugu explained in Telugu written by Mamidi Venkaiah, at Masulipatam ... It gives mere selection of words used in Telugu poetry; the ordinary Telugu of common life is but slightly noticed"-1852

పాశ్చాత్యప్రభావమువలన వచ్చిన మరొక అభివృద్ధి పత్రికా ప్రచురణ. 19వ శతాబ్దిలో పత్రికాప్రచురణ ప్రారంభమైనది. మత ప్రచారమునకు సాధనలుగా పత్రికలు ప్రారంభించిన మిషనరీలే ఈ విషయములో మార్గదర్శకులైరి. వంగదేశములో ప్రారంభించిన "తత్వబోధిని" వంటి పత్రికలు దేశభాషాపత్రికలకు ఆదర్శవంతము లయినవి. ఆకాలములో 'సత్యదూత' 'రవి' వంటి క్రైస్తవపత్రికలు తెనుగులో ప్రారంభముచేసినారు.

కలకత్తాలో ఫోర్టు విలియమ్ కాలేజీ ప్రారంభించినక్రొత్తలో కేరీ, మార్షమనువంటివారలు 1818 లో సమాచారదర్పణ్ అను బెంగాలీ వారపత్రిక ప్రారంభముచేసిరి. 1821 లో సంవాదకౌముది, 1831 లో ఈశ్వరచంద్రవిద్యాసాగరులు సంవాదప్రభాకర్ అను పత్రిక, అక్షయకుమారదత్త 'తత్వబోధిని' (1843) పత్రిక ప్రారంభించి దేశభాషలలో పత్రికాప్రచురణకు విఘ్నేశ్వరపూజచేసిరి. ఆకాలములో తెలుగులో కొన్నిపత్రికలు వచ్చినవికాని, అవి యంత యభివృద్ధిమార్గమున లేవు. వానిని గూర్చి సి. పి. బ్రౌను దొర యిట్లు వ్యాఖ్యచేసెను: 1806 లో ప్రారంభమైనను 1830 వరకు అంత అభివృద్ధికాలేదని వీరియభిప్రాయము.

"Among the Telugus, printing commenced about the year 1806, but made little progress until 1830. There are at least eight such presses at work, besides those which are under the management of Englishmen. Native newspapers, both Telugu and Tamil exist but are ill supported unless they deal in vituperation regarding points of religion or caste"

తెలుగులోని మొదటిపత్రిక 1835 లో బళ్లారి క్రైస్తవ సంఘమువారిచే ప్రకటించబడినది. ఇందులో వ్యావహారికభాషనే వాడుకచేయువారట. 1840 లో 'వృత్తాంతిని' యను పత్రిక గ్రాంథిక భాష ఉపయోగించెడిది. (1842 - 50) వరకు వెలువడిన వర్తమాన

తరంగిణి - వార్తలను ప్రచురించిన తొలివార్తాపత్రిక యనవచ్చును. ఇది వాడుకభాషలోనే వచ్చినది. దినవర్తమాని (1861-68) ఇదే పద్ధతిలో వచ్చిన వారపత్రిక. రివరెండు షర్కి (1862-67) లో 'హితవాది' యను పత్రిక ప్రకటించెను. ఇందు సామినేని ముద్దు నరసింహులునాయుడుగారు వ్యాసములను, అనేకము ప్రకటించిరి. 1863-67 లో శ్రీయక్షిణి యను పక్షపత్రిక సుబోధకమైన గాంధిక శైలి నుపయోగించెను. క్రైస్తవమతప్రచారకులేగాక హిందూమతమునకు చెందిన "తత్వబోధిని" మద్రాసు వేదసమాజమువారు ప్రకటించిరి. ఋగ్వేదమును "స్వర" ములలిపితో తెలుగుఅర్థములతో ప్రకటించిరి. ఈ చర్చలు తనకు మంచిగా ఉపయోగించినవని కందుకూరి వీరేశలింగముగారు తెలిపియున్నారు.

సాహిత్యవిమర్శలకు నూతనగ్రంథప్రచురణములకు ప్రాధాన్యమిచ్చిన పత్రికలు అనేకము వచ్చినవి. బహుజనపల్లి సీతారామాచార్యులుగారి సంపాదకత్వముక్రింద సుజనరంజని (1864 - 67) పత్రికలో చిన్నయ్యసూరిగారి తొలిరచనలు ముద్రించబడినవి. కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు 1871-1899 ఆంధ్రభాషా సంజీవని పత్రికలో సాహిత్యవిషయప్రకటనకు ప్రాముఖ్యమిచ్చిరి. వీరేశలింగముపంతులుగారు "వివేకవర్ధని" ప్రకటించి పత్రికాసంపాదనలో నూతనమార్గము చూపిరి. ఇంకను "సత్యవాదిని" "చింతామణి" "హాస్యసంజీవని" పత్రికలలోకూడ వీరేశలింగముగారు తమ రచనలను ప్రకటించిరి. ఈ సమయములో వచ్చిన నెల్లూరుపత్రిక అముద్రితగ్రంథచింతామణిగూర్చి యిదివరకే చెప్పుకొన్నాము (1885). దీని సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారు అంతవరకు అముద్రితమైయున్న అనేకగ్రంథములను ప్రకటించిరి. మద్రాసు నుండి గట్టుపల్లి శేషాచార్యులుగారు ప్రారంభముచేసిన (1894) శశిలేఖపత్రిక ముందు వారపత్రికగా వచ్చి, తరువాత ద్వివారపత్రికగా, తరువాత కొంతకాలము దినపత్రికగా నచ్చినది. బెజవాడలో దేశగుప్తం శేషాచలపతిరావు కృష్ణావృత్తాంతిని అనుపత్రికను 1896లో

ప్రారంభముచేసిరి. మద్రాసునుండి ఎ. పి. పార్థసారథినాయుడు గారు ప్రకటించిన ఆంధ్రప్రకాశిక (దినపత్రిక) (1886) ఇరవై అయిదుసంవత్సరములు అవిచ్ఛిన్నముగా వచ్చినది

ఈ పత్రికలన్నింటిలోనూ జరిగిన విశేషములు అప్పటి సాహిత్యవిమర్శలును, వాదప్రతివాదములును. వానిలో అముద్రిత ప్రాచీనగ్రంథములును, నూతనరచనములును, లేఖలును, విమర్శలును సమీక్షాగ్రంథములును అనేకము వెలువడినవి. నాటి సాహిత్యవికాసమునకు ఈ దేశభాషాపత్రికలు ఎంతో దోహదము చేసి ఆరోగ్యవంతమైన భాషాచర్చలకు సాహిత్యసమీక్షలకు హెచ్చు ప్రోత్సాహమిచ్చినవి.

ఈ పత్రికలపేరులనుబట్టియే ఆకాలములో పాఠకుల యభిరుచులను మనము గ్రహించవచ్చును.

## * ఆకాలములో వచ్చిన పత్రికల పట్టిక

| సంఖ్య | పేరు | చోటు | సంవత్సరము | సంపాదకుడు |
|---|---|---|---|---|
| 1. | సుజనరంజని | మద్రాసు | 1845 | చిన్నయసూరి |
| 2. | శ్రీయక్షిణి | బళ్లారి | 1850 | |
| 3. | ఉపాధ్యాయోపకారి | గుంటూరు | 1861 | శ్లాండర్ |
| 4. | శారద | అత్తిలి | 1865 | ఆచంట సూర్యనారాయణ రాజు |
| 5. | విబుధరంజని | ఏలూరు | 1864 | దామరాజు రామచంద్రరావు |
| 6. | గ్రంథప్రదర్శని | విశాఖపట్టణము | 1896 | శ్రీనివాస జగన్నాథశాస్త్రి |
| 7. | జనవినోదిని | చెన్నపట్టణము | 1880 | ? |
| 8. | మహారాణి | ,, | 1880 | వి. కష్ణమాచార్యులు |
| 9. | లోకరంజని | | 1889 | కాకర్ల సుబ్బారావు |
| 10. | శారద | బుచ్చిరెడ్డిపాలెం | 1870 | యడవల్లి కామశాస్త్రి |
| 11. | వర్తమానతరంగిణి | నెల్లూరు | 1895 | బెజవాడ బాలకృష్ణారెడ్డి |

* ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలు - భారతి 1929 మే

| | | | | |
|---|---|---|---|---|
| 12. | వాగ్వల్లి | నెల్లూరు | 1895 | సి. కె. రామానుజశర్మ |
| 13. | సూర్యాలోకము | చెన్నపట్టణము | 1895 | జి.సి.వి. శ్రీనివాసాచార్యులు |
| 14. | సుమనోభిరంజని | ? | 1888 | కృష్ణమూర్తి |
| 15. | కళాభివృద్ధి | విశాఖపట్టణము | 1890 | పన్యాల వెంకట రంగనాథస్వామి |
| 16. | విద్యార్థికల్పభూజము | నెల్లూరు | 1882 | ఉ, రామచంద్రరావు |
| 17. | ఆంధ్రభాషాసంజీవని | రాజమండ్రి | ? | కొక్కొండ వేంకటరత్నము |
| 18. | వివేకవర్ధని | ,, | 1878 | వీరేశలింగంపంతులు |
| 19. | చింతామణి | ,, | 1894 | ,, |
| 20. | సుజనమనోల్లాసిని | చెన్నపట్టణము | 1890 | ఎ. ముత్తయ్య |
| 21. | హిందూజనసంస్కారిణి | ,, | 1892 | మన్నవ బుచ్చయ్య |
| 22. | యథార్థవాది | విశాఖపట్టణము | | గ, కూర్మయ్య |
| 23. | తెలుగుహార్టు | విజయనగరము | | వేంకటరామయ్య |
| 24. | ఆంధ్రప్రకాశిక | మద్రాసు | 1870-95 | ఎ. పి, పార్థసారథి |
| 25. | శశిలేఖ | మద్రాసు | 1894 | గట్టుపల్లి శేషాచార్యులు |
| 26. | జ్ఞానోదయ | ఏలూరు | 1890 | దాసు కేశవరావు |
| 27. | దేశాభిమాని | గుంటూరు | 1896 | దే. శేషాచలపతి |

పత్రికలతోపాటు గ్రంథములప్రచురించు సంస్థలుకూడ అధికముగా ఆకాలమున వచ్చినవి. 'శశిలేఖ' పెట్టిన గట్టుపల్లి వారు గ్రంథమాలగా వాల్మీకి రామాయణమును తెలుగులిపిలో ప్రకటించిరి. వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారు 1812లో ముద్రణాలయమును పెట్టి పలుగ్రంథములను ప్రకటించిరి. ఈవిధముగానే మద్రాసులోనుండి అనేకగ్రంథములను ప్రకటించిన ప్రముఖులలో వేమూరు వేంకటకృష్ణమ్మశెట్టిగారొకరు. వీరి యానందముద్రాక్షరశాల భారతము, భాగవతమునంటి ఉత్తమకావ్యములను ప్రకటించెను. ఏలూరులో మంజువాణీముద్రాక్షరశాల, కాకినాడలో సుజనరంజనీ సరస్వతీ ముద్రాక్షరశాల పుస్తకప్రచురణలో గొప్ప కృషిచేసినవి.

ఈ ముద్రాక్షరశాలలలో కొందరు ప్రసిద్ధ పండితు లుండు

వారు. అనేక ప్రాచీనగ్రంథములను పరిశోధనచేసి వానిపాఠాంతరములు పరిశీలించి చక్కని వ్యాఖ్యలతోడను, పీఠికలతోడను ఈ గ్రంథములను ప్రకటించుటకు తోడ్పడువారు. ఇట్టిపండితులలో నాగఫూడి కుప్పుస్వామయ్య, తేవప్పెరుమాళ్ళయ్యగారలను గూర్చి ముందే ప్రస్తావించియున్నాము. తేవప్పెరుమాళ్ళయ్యగారు రామాయణ, భారత, భాగవతములు, భగవద్గీత వచనగ్రంథములుగా రచించుటయేగాక, మను వసుచరిత్రలకు ఉపోద్ఘాతములను రచించిరి. నన్నెచోడుని జీవితచరిత్రమొకటి రచించిరి. ఆకాలములోని పండితకవి అయిన వేదము వేంకటరాయశాస్త్రిగారు మద్రాసులో జ్యోతిష్మతీముద్రాక్షరశాల పెట్టి, ప్రకాశకులుగానుండి తమగ్రంథములను తాము ప్రకటించుకొనుటయేగాక, అనేక ప్రాచీన సంస్కృతాంధ్రకావ్యములను టీకాతాత్పర్యముతో విపులవ్యాఖ్యానము రచించి ప్రకటించిరి. 'విజయవిలాసము' 'ఆముక్తమాల్యద' 'మేఘదూత' ఇట్టిగ్రంథములలో బహుజనసమాదరమును చూఱగొన్నవి. ఇవి ఆ కాలములో పలువురు పండితులును విద్యార్థులును చదివి అమితలాభమును పొందిరి. ప్రాచీన సంస్కృతకావ్యములపై ప్రాచీనవ్యాఖ్యాతలుచేసిన విమర్శలధోరణిని శ్రీ వేంకటరాయశాస్త్రి, నాగఫూడికుప్పుస్వామయ్యగారు అనుసరించుట గమనించవలసిన అంశము. 19వ శతాబ్దిలో తెనుగు సాహిత్యములో వెలువడిన మరొకరకపు శాస్త్రగ్రంథములు అలంకారశాస్త్రమునకు సంబంధించినవే. ఈ కాలములో పండితులు పలువురు సంస్కృతము తెలిసినవారగుటచేత సంస్కృతములోనే కావ్యాలంకారశాస్త్రములను వ్యాఖ్యానములతో చదివి యర్థముచేసికొనువారు. కొంతకాలమునకు మన తెనుగుభాషలో ముద్రణసౌకర్యము లభించగానే 1840–1890 వరకు, మధ్యకాలములో గుజిలీప్రతులుగా అనేక సంస్కృతాలంకారశాస్త్రములను తెనుగులిపితో ప్రకటించి దేశమునకు మహోపకారముచేసిన గ్రంథప్రకాశకులున్నారు. 19వ శతాబ్దిలో చావలి రామశాస్త్రిగారు అలంకారముక్తావళిని కువలయానందమును ప్రక

టించిరి. శ్రీ లక్ష్మీధరదీక్షితులు రచించిన సూత్రములతోడను 'వృత్తుల' తోడను కలిపి మరియొక అలంకారముక్తావళి ప్రకటించినారు. శ్రీ బుక్కపట్టణం శ్రీశైలనరసింహాచార్యులుగారు లక్షణమాలికావ్యాఖ్యతోసహా అలంకారేందుశేఖరము రచించినారు. రసమంజరిపైన వ్యాఖ్యను శ్రీరంగశాయికవి 'ఆమోదము' అను పేరున ప్రకటించెను. శ్రీకృష్ణసుధి కావ్యకళానిధియను పేరున ఒక యలంకారగ్రంథమును ప్రకటించెను. మల్లాది లక్ష్మణసూరి కావ్యప్రకాశికావ్యాఖ్య రచించెను. శ్రీ ముడుంబై నరసింహాచార్యులవారు కావ్యాలంకారచూళిక ప్రకటించిరి. అర్థాలంకారవివరణమిందు కలదు. మల్లాది లక్ష్మణసూరి, ధర్మసూరి రచించిన సాహిత్యరత్నాకరమును 'మందరము'అను పేరుతో గల వ్యాఖ్యతోసహా ప్రకటించెను. ఛందోలంకారవిషయములను వివరించుచు, 'మాధుర్యమంజరి' యను పేరున దీనిపైన టిప్పణియును ప్రకటించెను. శ్రీ చర్ల వేంకటశాస్త్రి 19వశతాబ్దిలోనే మరొకకావ్యలక్షణమురచించిరి. తిరుమలబుక్కపట్టణం శ్రీనివాసాచార్యులుగారు రసమంజరి, కొల్లూరు రాజశేఖరకవి సాహిత్యకల్పద్రుమమును, శాంతలూరి కృష్ణసూరి సాహిత్యకల్పలతికను రచించిరి.

కందుకూరి వీరేశలింగముగారు కూడ అలంకారసంగ్రహము, కావ్యలక్షణసంగ్రహమును రచించిరి. వేదము వేంకటరాయశాస్త్రిగారు కావ్యాలంకారచూడామణి, అలంకారసారసంగ్రహము, సాహిత్యదర్పణమువంటి గ్రంథములు యథామూలముగా అనువాదముచేయుటయేగాక, ఉదాహరణశ్లోకములకు వచనరూపముగ అనువాదములుకూడ ప్రకటించిరి. 19వ శతాబ్దిచివర అలంకారశాస్త్రములను అధ్యయనముచేసి తమ అమూల్య పరిశోధనాఫలితములను తెనుగుపాఠకులకు అందజేసిన కవిపండితులలో ముఖ్యులు ఆంధ్రధ్వని రచించిన అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. రామకృష్ణకవులు రచించిన ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము, తాడూరు లక్ష్మీనరసింహకవి రచించిన రసమంజరి (భానుదత్తునికృతికి

తెనుగు) (నాయికా నాయకుల లక్షణము వివరించునది) చంద్రాలోకము, మేడేపల్లి వేంకటరమణాచార్యులు రచించిన సంస్కృతాలంకారచరిత్రము, కువలయానందమూలకారికలను ఆధారముగాచేసికొని టి. శ్రీనివాసాచార్యులుగారు రచించిన సాహిత్యచింతామణి, అక్కిరాజు ఉమాకాన్తముగారి చంద్రాలోకము, ఈ గ్రంథములు కూడ ముఖ్యముగా పేర్కొనదగినవి. 18 వ శతాబ్ది చివరనున్న గణపవరపు వేంకటకవి, నందరాజయశోభూషణము, ప్రతాపరుద్రీయము, రసమంజరి రచించిరి. ఇంకను ధనంజయుని దశరూపకము, భరతుని నాట్యశాస్త్రము మున్నగునవి ప్రకటించుటకు పలువురు కృషిచేసిరి. అధికవ్యయప్రయాసలకోర్చి ప్రాచీనగ్రంథములను సేకరించిన మానవల్లి రామకృష్ణకవిగారును వేటూరి ప్రభాకరశాస్త్రిగారును పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారును చేసిన విశిష్టప్రయత్నము ఆంధ్రు లెన్నటికిని మరవరానిది. తెలుగు సాహిత్యవేత్తలు సంగీత కావ్యాలంకారశాస్త్రములను క్షుణ్ణముగా తెలిసినవారనియును, రసగ్రహణపరీక్షలో నారితేరినవారనియును, ఈ పరిశీలనవలన వ్యక్తమగుచున్నది. కాని యీ కావ్యలంకారశాస్త్రపరిజ్ఞానమును సంస్కృతకావ్యపరిశీలనకే వినియోగించిరి కాని, సమకాలీన ఆంధ్రసాహిత్యపరిశీలనకు వినియోగించలేదని వెల్లడియగుచున్నది.

వచనవాఙ్మయములోని ఈ యుత్తరరంగములో మనము చేసిన సింహావలోకనములో పాశ్చాత్యవాఙ్మయప్రభావమువలన వచ్చిన సాహిత్యరూపములనే తీసికొన్నాము. పాశ్చాత్య సాహిత్యవిమర్శనలు కావ్యవిమర్శచేయునపుడు అందలి సౌందర్యమును ఆస్వాదనచేయుటకు అనుసరించిన విధానములో 19వశతాబ్ది చివరిభాగమువరకు ఎవ్వరును అవలంబించలేదనియే చెప్పవచ్చును. కావ్యసౌందర్యమును ఆస్వాదించుటలోను రసగ్రహణమునందును మమ్మటుడు, జగన్నాథుడు, భామహుడు, అభినవగుప్తపాదులు మున్నగువారు చూచినవిధము వేరు. ఆంగ్లములో జాన్సన్, మేథ్యూ

ఆర్నాల్డువంటి విమర్శకులు కావ్యసౌందర్యమును పరీక్షించినవిధము వేఱు. ఈ రెండుపద్ధతులను ఏమఱచి, కేవలము కవులజన్మతిథులను, జన్మస్థలములగూర్చి చేయువిమర్శలను, పదములఅర్థభేదములగూర్చి, శబ్దములప్రయోగరీతులగూర్చి చర్చలు జరుపుటే విమర్శయైనదికాని కావ్యగుణదోషములను రసదృష్టితో పరిశీలించుప్రయత్నము జరుగ లేదు. తెలుగుసాహిత్యములో పద్యకావ్యములుకాని, గద్యకావ్య ములుకాని చక్కగా పరిశీలించి వానియందలి ప్రత్యేకవిశేషములను, కథాసంవిధానమును, పాత్రచిత్రణమును, సమకాలిక జీవితరూప చిత్రణమును పరికించు ప్రయత్నమే జరుగలేదు. ప్రాచీన కావ్య లక్షణములనుబట్టి, అలంకారచర్చ, నాయికానాయకవర్ణనము, ఔచిత్యానౌచిత్యవిచారము, వ్యాకరణప్రయోగములపరీక్ష, రస చర్చ, స్థాయీభావగుణవిమర్శ ఇట్టివి చేసి, సాహిత్యసుమములను ఏరేకున కా రేకు విప్పి కింజల్కముల పరిగణనగా పరిణమించినదే గాని, అందలి ఆమోద మాధుర్యమునుచూచి యొకరసానుభూతిగా గ్రహించిన సాహిత్యవిమర్శకులు 19వశతాబ్ది చివరవరకు రాలేదు. అప్పుడే కట్టమంచి రామలింగారెడ్డిగారు విద్యార్థిగానుండి కవిత్వతత్వ విచారము అను విమర్శవ్యాసములను ప్రకటించిరి. ఆ వ్యాసప్రకటన ముతో (1899) తెనుగుసాహిత్యరంగములో ఒక సంచలనమే బయలు దేరినది. వచనవాఙ్మయవిమర్శనచేయుచు అందుకట్టమంచివారుప్రారం భముచేసిన విమర్శనపద్ధతినిగూర్చి పింగళి లక్ష్మీకాంతముగారీ విధ ముగా తెలిపియున్నారు.* "అసలు స్వతంత్రవాఙ్మయశాఖగా పరి గణింపదగిన వచనావిర్భావము మనభాషలో అధునాతనమేయని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఆంగ్లేయులు మన కొసగిన విద్యా సంస్కారమువలన మనభాషకు కల్గిన మేలు ఏమైన ఉన్నయెడల అది యిదొక్కటే. వారిభాషలో ఉన్నంత కావ్యవైవిధ్యము మన భాషలో పూర్వము లేదు. వారి వాఙ్మయము చదివి, ఆ సారము

---

*(రెడ్డిగారి వ్యాసమంజరికి రచించిన పీఠికలో — గౌతమవ్యాసములు— 178—179 పుటలు.

గ్రహించినపిమ్మటనే మనవారు తదనుకరణముగా, నవలలు, కథానికలు, వ్యాసములు మొదలగు నానా వచనగ్రంథములను రచింప మొదలిడిరి.

ఈనూతన గద్యగంగావతరణమునకు చిన్నయసూరి భగీరథుని వంటివాడు. దానినానాముఖాప్రతిహతప్రవాహగతికి కారణభూతుడు శ్రీ వీరేశలింగముపంతులు. వచనప్రపంచమున పంతులు త్రొక్కని దారిలేదు. ధారాళమును, తేటతెల్లమును అయిన శైలిలో ఆయన వ్రాసిన శతాధికవచనములు, ఆయన గద్యతిక్కనబిరుదమును సార్థకముచేసెను. ఆ రచనలన్నిటిలో కవులచరిత్ర చిరస్థాయియై, ఆయన కీర్తిని చిరస్థాయిగా కాపాడగలదు. పూర్వకవుల జీవితాంశములను చారిత్రకపరిశోధనపూర్వకముగా నిర్ణయించు తలంపుతో ఆయన సల్పినకృషి అనన్యసాధ్యము. కాని ఆయన ఆశించిన ముఖ్యప్రయోజనము ఆయాకవుల కాలనిర్ణయముమాత్రమే. ఆ కవులగ్రంథ విమర్శనము నెడ ఆయనకు అంత దీక్షలేదు. ప్రసంగవశమున గ్రంథ గుణమునుగూర్చియు ఏకొలదిపాటి ప్రశంసయేని యున్నను, అది విమర్శన మనిపించుకొనదగిన ట్లుండదు. యథార్థమైన ఆంధ్రకావ్య విమర్శ ప్రారంభము కవులచరిత్రపుట్టుకకు తరువాత జరిగినది. ఆ మహారంభమునకు ప్రథమాచార్యుడుగా పేర్కొనదగినవాడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి" "శబ్దసాధుత్వనిర్ణయమే గ్రంథవిమర్శ మనెడి భ్రమతో విద్వాంసు లొకరితోనొకరు వాగ్యుద్ధములుచేయు దినములలో భావుకులదృష్టిని శాబ్దికచర్చనుండి తాత్త్వికమీమాంసకు మరల్చిన రసికుడు శ్రీ రెడ్డి. కావ్యమునకు శబ్దము ఆధిభౌతికాంశముమాత్రము. అది బాహిరము. దాని ఆధ్యాత్మికాంశము తద్గతకళాసౌందర్యము. అది ఆంతరము. విమర్శమార్గమును బాహిర జగత్తునుండి అంతరజగత్తుకు కొనిపోయిన ప్రథమాంధ్రవిమర్శ గ్రంథము శ్రీ రెడ్డికృత కవిత్వతత్త్వవిచారము"

కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారములో తిక్కన భారతరచనావిధానమును, తెలుగుప్రబంధములలో

విశిష్టరూపముగా మలచిన కళాపూర్ణోదయమును విమర్శచేసిరన వచ్చును. వీరు చూపిన మార్గమును ఇటీవల రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారును నండూరి బంగారయ్యగారును తదితరులును అనుసరించిరని తోచును. ఈ విమర్శతో మన సాహిత్యపాఠకుల దృక్పథమే మారిపోయి, ప్రాచీనకావ్యములయెడలగాని, ఆధునికకావ్యముల యెడలగాని తెనుగువారి యభిప్రాయములు క్రొత్తత్రోవలు త్రొక్కినవి. క్రొత్తయందములు గుర్తించినవి.

19వ శతాబ్దిచివర వేటూరి ప్రభాకరశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవినంటివారలు వివిధప్రబంధములకు వ్రాసిన ఉపోద్ఘాతములయందునను, వ్యాఖ్యానములయందునను క్రొత్తదృక్పథమును క్రొత్తవిమర్శనావైఖరిని ప్రకటించిరి. ప్రభాకరశాస్త్రిగారి మనుచరిత్ర విమర్శనమును, రామకృష్ణకవిగారి నన్నెచోడుని కుమారసంభవ విమర్శనమును ప్రత్యేకవిశిష్టతను గడించుకొన్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన శ్రీనాథునికవితపైన విమర్శ యీ శ్రేణిలో వచ్చిన ఉత్కృష్టగ్రంథము. ఈ పద్ధతి నూతనవిమర్శనుంచి ఉన్నతస్థితినందుకొని ఉత్తమపథమువైపు ముందంజవేసినది 20వ శతాబ్ది ఆరంభములోనే యనవచ్చును.

19వ శతాబ్దిలో సాహిత్యము విస్తృతమై, గ్రంథముల సంఖ్యాధిక్యముగా రూపుచెందినమాట నిజమేకాని, వానిలోని గుణదోషవిచారణచేసి అందలి విశేషములను పాఠకులకు పరిచయము చేయగల నిష్పక్షపాతదృష్టిగల విమర్శకు లెందరోగాని లేరు.

★

# 12 ఉపసంహారము

తెలుగుసాహిత్యరంగమున నూఱుసంవత్సరముల యనంతరము ఒకతెర జాఱినది; అది మఱియొక తెరలేచుటకొఱకే యని స్పష్టపఱచినట్లే మరియొక దృశ్య మారంభమయినది. గతశతాబ్దములో జరిగిన సాహిత్యచరిత్ర, యీ శతాబ్దారంభమునకు ఆముఖముగా పరిణమించినది. అందులకే రానున్న సాహిత్యనాదయమునకు 19 వ శతాబ్దిలో వచ్చిన నూతనభావప్రకటనము నాందీప్రస్తావన అయినది. ఈ శతాబ్ది వాఙ్మయచరిత్రను వివిధరచనలలో వివిధసాహిత్యప్రక్రియలలో సమీక్షచేయుటకు ఈ గ్రంథమూలముగా ఒకప్రయత్నము జరిగినది. ఈ ప్రయత్నములో ఆ యా కాలములలో వచ్చిన కవులు, వారు రచించిన కావ్యములు, వారు చేసిన పరిశోధనలు, వారు సేకరించిన గ్రంథసముదాయము వీనిని కేవలము పేర్కొనుటమాత్రమే జరిగినది. ఇట్లు పేరుల చెప్పుటలో కూడ సమగ్రముగా ఆకాలములో వచ్చిన సాహిత్యమునంతను తెలుపుటకీ చిన్నసమీక్షలో సాధ్యముకాలేదు. కావున ప్రాయికముగామాత్రమే యీ గ్రంథములపేరులు చెప్పుట జరిగినది. ఈ గ్రంథస్థవిషయములను విమర్శగా సమీక్షచేసి, విడివిడిగా దేనికది పరిశీలించుటకు ఇది సమయమునుకాదు; ఈ చరిత్రకు ప్రస్తుతమును కాదు. ఈ యుగములోని సాహిత్యమును సమాలోకనము జేయుటలో వివిధ విమర్శకులు, చరిత్రకారులు, సాహిత్యవేత్తలును విభిన్నసందర్భములలో వెల్లడించిన యభిప్రాయములను పొందుపఱచి వానిని ఉల్లేఖించినాము. కొన్నిటిని సంగ్రహముగాను, కొన్నిటిని యథాతథముగాను ఉద్ధరించి యీ సమీక్షలో వినియోగించినాము. దీనికికారణము ఒకచరిత్ర చెప్పునపుడు జరిగిన సంఘటన

లను ఉల్లేఖించి, పూర్వాపరసందర్భములు తెలిపి, వానిపైన అభిప్రాయము చదువరులకే విడిచివేయవలెనని యీ సమీక్షాకారుని ఉద్దేశము.

విమర్శ ఎవరుచేసినను 'విషయీ' ప్రధానమే (Subjective). అనగా ఒక గ్రంథముపైనగాని ఒక సాహిత్యయుగముపైనగాని ఒక విమర్శకుడు తనసమీక్షను తెలుపునపుడు తన వ్యక్తిగతాభిప్రాయమును తెలుపుచున్నాడు కాని, దానిలోని విలువలుకట్టి విషయప్రధానమైన విమర్శలుచేయుటలేదు. ఈ విమర్శకు విలువవచ్చుట వస్తుగుణమునుబట్టిగాక, వ్యక్తిసంస్కారముపైన, ఆతని యర్హతపైన, ఆత డేర్పరచుకొన్న మానదండములపైన ఆధారపడి యుండును. మన విమర్శకులు తెనుగు సాహిత్యపర్యావలోకనముచేయునపుడు అట్టి మానదండములనుగాని సాహిత్యప్రమాణములనుగాని ఉపయోగించినట్లు తోచదు. విషయపరిశీలన చేయక వ్యక్తిగతవిద్వేషములతోడనే యీ విలువలుకట్టుట జరిగినది. ఏదియేమైనను, కొన్ని చారిత్రకాంశములు, సత్యసంఘటనలను ఎవ్వరును కాదనలేరు. ఈ గ్రంథమునందొనరించిన సాహిత్యసమీక్షలో ఆ ఘట్టములకే ఒకప్రాధాన్యము, ఒకవిశిష్టత యేర్పరచు ప్రయత్నము జరిగినది. ఈ దృష్టితో గతశతాబ్ది సాహిత్యచరిత్ర చూచినచో కొన్నివిశేషములు జరుగుటచేత తప్పనిసరిగా వాటి ప్రభావము సమకాలీన సాహిత్యముపైన ప్రసరించినదని స్పష్టమగును. సాహిత్యము సమకాలీనజీవితముపైన వ్యాఖ్యాగోచరించును.

ఆంధ్రదేశమంతయును ఒకయేలుబడిలోనికి వచ్చి, గంజాంవద్దనుండి కాళహస్తివరకు, శ్రీశైలమునుండి శ్రీరంగమువరకు ఒకమాట, ఒకపలుకు, ఒకతలపు, ఒక నెనరుతో తెనుగుపాఠకులూ నురచయితలును పనిచేసిరి. జాతినంతను ఒకేభాషతో ఒకేఐకమత్యముతో బంధించివేసినది సాహిత్యము. పర్లాకిమిడిలో ప్రబంధరచనముచేసినను, తిరువయ్యూరులో దివ్యసంకీర్తనముచేసినను, తంజావూరు నాయకుల

దర్బారులో ఒకతరళాక్షి నృత్యముచేసినను, విజయనగరవీథులలో ఒక విరహి వియోగగీతిక పాడినను, ఆ పాటలో, ఆమాటలో, ఆ యాటలో ఒక తెనుగు తేటఊటలూరించినది. ఆపలుకులో ఒక తెలుగు తనము ప్రతిరసజ్ఞుని హృదయమును స్పందింపజేసినది. తొలిసారి, విభిన్న రాజ్యములలో విభిన్నపరిపాలనావర్గముల క్రింద చెదరిపోయిన తెలుగువారికి భాషమూలముగాను, సాహిత్యమూలముగాను అభిప్రాయసామరస్యము కుదుర్చుకొనుటకు ఒక ప్రాతిపదిక లభించినది.

ఆనాడు స్థాపించిన విద్యాలయములున్నచోట పండితులును విద్యావంతులును ప్రబలిరి. వారికి నూతనభావములు కావలసివచ్చినవి. ఆ నూతనభావపరితృప్తిపొందుటకు నూతన కావ్యరచనచేయవలసినవారైరి. దానితో నూతన యుగోదయమైనది.

ఈవిషయమునే త్రివేణిపత్రికలో కోలవెన్ను రామకోటేశ్వరరావుగారిట్లు తెలిపియున్నారు

*The period from 1840 to 1900was marked by the increasing activity of a band of scholars who in addition to original productions of great value helped to conserve all that was best in Telugu literature and brought it in their reach of an ever growing circle of readers.

ఈసంగతినే ఆచార్య కురుగంటి సీతారామయ్యగారు తమ నవ్యసాహిత్యవీథులలో 19వశతాబ్ది సింహావలోకనము ముగించుచు ఇట్లనిరి:

"ఈవిధముగా 20వశతాబ్దము ప్రథమసంవత్సరాలవరకు భాషా సారస్వతాలలో పరివర్తనము కలుగుతూవచ్చినది. వెనుకటి శతాబ్దము చూస్తే ఉన్న నిరుద్యోగానికీ, యీ యభివృద్ధికీ తారతమ్యము చెప్పనలవికాకుండా ఉన్నది. భాషాసేవకులు బయలుదేరినారు. ప్రచురణము బాగా సాగుతున్నది. పత్రికలు స్థాపింపబడినవి.

---

* K. R. in Triveni - Jan. 1929.

నవలలు, నాటకాలు తలెత్తినవి. తెలుగుశైలికి సౌలభ్యమలవడి నది. స్వీయచరిత్ర బయలుదేరినది. వచనరచన విరివిఅయినది. అభివృద్ధితోపాటు అసంతృప్తి బీజాలుకూడా దేశీయుల హృదయక్షేత్రాలలోపడినవి."

పాశ్చాత్యవిద్య అభ్యసించినవారిలో ఉద్యోగములపై వ్యామోహము ప్రబలినది. దానితోపాటు తెనుగుభాషపైన ఒక నిరసనము వ్యాప్తిచెందినది. ఒకవైపు సంస్కృతము చదివిన పండితులవలన తెలుగునకు నిరసనము, మరియొకవైపు తెలుగుచదవక ఆంగ్లముమాత్రమే అభ్యసించినవారివలన తెలుగునకు నిరసనము. అట్టిదశలో తెలుగుచదివిన విదేశీయులవలన తెలుగులోని ఉత్కృష్టత బయటపడినది. తెలుగుచదివిన తెలుగువారిదృష్టి తెలుగుసాహిత్యముపైన గౌరవముగా మారుటకు ఒక శతాబ్దముపైగా పట్టినది. అట్టిసమయములో గ్రాంథిక - గ్రామ్యభాషావిభేదములు, కృతకగ్రాంథికభాషలోని సారస్వతదృష్టి కొంతవరకు తెనుగుసాహిత్యమహోదయమునకు ప్రతిబంధకములైనవి. కాని ఆ యవాంతరములు గ్రహణములవలె తాత్కాలికములే - రాహుగ్రస్థచంద్రునివలె తెనుగుసాహిత్య మీ తాత్కాలిక ప్రతిబంధకములనుండి బయలువెడలి - 19వశతాబ్ది చివరిపాదము పూర్తికాకుండగనే తన గౌరవస్థానమును తెలుగుహృదయములలో పునఃప్రతిష్ఠచేసికొన్నది.

పాశ్చాత్యవిజ్ఞానప్రభావమువలన మఱియొక మార్పు 'సైన్సు' వలన వచ్చిన హేతువాదము. ఈ విజ్ఞానమునకు ప్రత్యక్షప్రమాణము ప్రయోగరూపముగా ఋజువైన సిద్ధాంతములే. శ్రుతి పురాణేతిహాసములును ఋషిప్రోక్తము, వేదవిహితము, ఆత్మానుభూతి, దివ్యదృష్టి యను భావములు పనిచేయవు. వానిని ప్రమాణములుగా విజ్ఞానవేత్తలు స్వీకరింపరు. అందుచేత పాశ్చాత్యవిజ్ఞానమును నేర్చుకొన్న విద్యావంతులు కొందరు నాస్తికులై భగవత్ విశ్వాసములనే ప్రశ్నింపమొదలిడిరి. మరికొందరు మూలతత్వ మొకటి యున్నను ఆ మహాశక్తిని అవగాహనచేసికొనుశక్తి మానవునకు లేదని వాదించు

వారు కలరు. ప్లేటో, అరిస్టాటిల్ మొదలైన తత్త్వశాస్త్రజ్ఞుల విజ్ఞానము, మార్క్సుదృక్పథము అప్పుడప్పుడే కొంచెముగా మనదేశీయుల విజ్ఞానములపై పనిచేసి వారి యాలోచనలలో ప్రశ్నల నుదయింప జేసినవి. రాజకీయములకును మతమునకును ముడిపెట్టక, మతసంపర్కములకు అతీతముగా ఆర్థిక రాజకీయసంస్థలు వికాసము పొందవలెనని యొకతరగతిప్రజలు వచ్చిరి. మతము మానవుని మందకొడిగా జేసి ఆలోచనలుచేయకుండ మత్తుజల్లిన యొక నల్లమందని వీరి అభిప్రాయము. అందుచేత గుడులు, గోపురములు పూజలు పునస్కారములు, ఉత్సవములు ఊరేగింపులు, మ్రొక్కుబడులు జాతరలు మొదలయినవి మానవులలో స్వతంత్రజిజ్ఞాసను నాశనము చేసి, వారిని మూర్ఖవిశ్వాసపరులనుగా మార్చివైచినవని వీరి యభిప్రాయము. అందుచేతనే విగ్రహారాధనము, మ్రొక్కుబడులు మొదలైనవి కూడదని ప్రార్థనాసమాజములు పెట్టి ఆస్తికతాప్రచారముచేసినవా రున్నారు. దేవుడిమాటే పైకి రానీయకుండ దివ్యస్థలములను ప్రజోపయోగసంస్థలుగా విజ్ఞానకేంద్రములుగా చేయవలెననువారున్నారు. ఈ విజ్ఞానశాస్త్రవ్యాప్తివలన మానవుని మూలసిద్ధాంతములు, విశ్వాసములు, భక్తిప్రపత్తులును సడలిపోయినవి. నూతనవిశ్వాసములు, నూతనభావబంధములు, నూతనారాధ్యదేవతలు, నూతనసిద్ధాంతములు ప్రచారమైనవి. వీటిని ప్రచారము చేయుటకు సాహిత్యము శక్తివంతమైన ప్రబలసాధనముగా పనిచేసినది.

ఆంగ్లేయభాషాప్రభావము ఒక తెనుగుభాషమీదనే కాక ఇతరభాషలపైన సైతము పనిచేసినదని గమనించియున్నాము. దీనినే ఖండవల్లి లక్ష్మీరంజనముగా రిట్లు పేర్కొనిరి. "అన్ని యెడలను ఆంగ్లేయవాఙ్మయము ఆకాశమునుండిపడు వర్షమువలె చదువువారి మానసక్షేత్రములలో ఎడతెరపిలేక నాటినుండి నేటివరకును కురియుచునేయున్నది. ఈ రచయితల మానసక్షేత్రములలో నింకి క్రొత్తరూపమున నవ్యకావ్యములు నూతనసాహిత్యప్రక్రియలు అను

చెలమలు, బావులు, నదులు మొదలగువానిరూపమున తెనుగునాడంతయు నిండినది. ఈ మార్పు వాఙ్మయములోని గ్రంథజాతులయందును, ఆ గ్రంథములవిషయములోను రచనాపద్ధతియెడలను, గ్రంథరచనయుద్దేశమునను, కవులదృష్టియందును కన్పట్టును. వార్తాపత్రికలు, ముద్రణయంత్రములు నెలకొనుటవలన గ్రంథవిమర్శనలు, పండితులవాగ్వాదములు ఉపన్యాసములు మొదలైనవి ప్రచురించుట జరిగినది. ఆంగ్లేయవిద్యాప్రభావమున జరిగిన సాంఘికపరిణామమును వాఙ్మయమున పూర్తిగ ప్రతిబింబించినది*

ఆంగ్ల వాఙ్మయమును చూచి భాషయెడలను భావములయెడలను నూతనత్వముచూపు ప్రయత్నము ప్రారంభమైనది. ఇట్లు చూపుటలో ఏ ప్రతిబంధకములును లేక కొన్ని స్వేచ్ఛలు తీసికొనుట, లక్ష్యలక్షణములకట్టుబాటులను అతిక్రమించుట సంభవించినది. ఇట్టిది భాషాప్రయోగములో జరిగినది; భావవ్యక్తీకరణములో జరిగినది; సాహిత్యప్రక్రియల నెన్నుకొనుటలో జరిగినది. ఆంగ్లసాహిత్యములో షెల్లీ, కీట్సు, బైరన్‌వంటి కవులు ప్రారంభముచేసిన రొమాంటిక్ కవితాప్రచారముతో నూతన భావలహరి మన తెనుగు హృదయములలో ప్రవహించినది. ఆ భావములు రూపములుదాల్చి తెనుగులో ముక్తఛందస్సులతో, ముచ్చటయిన పలుకుబడులతో ముందెన్నడును పరిచయములేని క్రొత్తరీతులుగా వ్యక్తమగువరకును ఈ యాంగ్లసాహిత్యప్రభావముద్ర పూర్తిగా మన సాహిత్యముపై పడలేదు. అందుచేత, యీ ప్రభావము మన తెనుగుమదులలో నింకించుకొని దీనిసారముతో నూతనఫలితములు తెచ్చుటకు మఱికొంతకాలము పట్టినది. ఈ నూతనస్వరూపము సాక్షాత్కారమగుటకు 20వశతాబ్ది ప్రథమపాదముకూడ పూర్తికావలసివచ్చినది. 19వ శతాబ్ది చివరిభాగమున మొదలుపెట్టిన ప్రయోగములే మరింత

---

*ఆంధ్రవిజ్ఞానసర్వస్వము - ఆంగ్లభాషాప్రభావము - తెలుగువాఙ్మయము ఖండవల్లి లక్ష్మీరంజనముగారివ్యాసము. 642 - పుట.

బలముతోడను ప్రోత్సాహముతోడను 20వశతాబ్ది ప్రథమపాదములో కొనసాగినవి.

19వ శతాబ్దిలో నూతనోద్యమము ప్రారంభమైనది. అది అన్ని ముఖములనుచాలఉత్ధృతముగానే మొదలుఅయినది. ఎక్కువ ఫలప్రాప్తి కాంచినదిమాత్రము గద్యవాఙ్మయరంగములోనే. ఆ వాఙ్మయములోనే అనేక సాహిత్యప్రక్రియలు ప్రయోగమాత్రములుగా గాక పరిపక్వసిద్ధిపొందిన కృషిఫలములుగానే బయటికి వచ్చినవి. నాటి సాహిత్యలత పూచిన తొలిపూవులయినను కమ్మని పరిమళములతో తెలుగునాడునంతను ముంచెత్తినవి. ఈనాటికిని కొందరు మహనీయు లానాడు తొలిరచనలుగా రచించిన కావ్యములును గ్రంథములును చరిత్రలో మఱచిపోని ఉత్తమశ్రేణిలో అజరామరముగా నిలిచిపోయినవి. దేశమునకు, భాషకు । అత్యంత ప్రయోజనకరమైన నిఘంటువులు, వ్యాకరణములు, పరిశోధనా గ్రంథములు, చరిత్రలు మొదలైనవి ఆనాడే ప్రచురించినను నేటికిని తెలుగుసాహిత్యమునకు కల్పలతలవలెఉపయోగించుచున్నవి. మానవులేగాక మానవుని మేథస్సునకు పనికల్పించిన మరలు సైతము మరచిపోరాని మహనీయసేవ భాషకును, సాహిత్యమునకును చేసినవి. అదియంతయు ఆనాటి గద్యవాఙ్మయమున అక్షరసిద్ధిపొంది చిరంజీవిగా నిలచిపోయినది.

తెలంగాణాలో పరశురామపంతులవారు సీతారామాంజనేయసంవాదము వినిపించినను, కాళహస్తిలో మునిపల్లె సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మరామాయణము గానముచేసినను, విజయనగరములో నారాయణదాసుగారు యథార్థరామాయణ హరికథా కాలక్షేపముచేసినను, వేంకటగిరిలో గోపీనాథము వేంకటకవి వాల్మీకిరామాయణమునకు తన తెనుగుసేత వినిపించినను, కోనసీమలో గోదావరిగొడ్డున చేరిన పురంధ్రులు వేడుక గోవింద నామాలు పాడినను ఒకేహృదయము భిన్నభిన్నకంఠములతో ప్రతిధ్వనించునట్లు వినిపించెను. సాహిత్యము కేవలము వినోదముకొఱకు,

వేడుకకొఱకుమాత్రమే కాదు, ఆత్మతృప్తికొఱకు, పరమాత్మవివేచనకొఱకు, పరమార్థలక్ష్యసిద్ధికొఱకు వినియోగించిన ముక్తిసాధనగా తెనుగువారానాడు ఉపయోగించిరి. తెనుగునాట నాడు నాడుల, సీమసీమల, కవితకు పెండ్లిపందిళ్ళు కప్పించినారు. కొందరు సమర్థులైనకవులు వివిధసంస్థానములలో పర్యటనచేసి అవధానములు చేసి, ఆశుకవిత్వప్రదర్శనములిచ్చి ఆ యా సంస్థానములలో సన్మానములందుకొనిరి కనకాభిషేకములు, గండపెండేరములు, గజారోహణములు, హస్తపూజలు, ఆనాడు సంస్థానములలో తఱచు కవులకు జరిపించు సన్మానమహోత్సవములు.

ఈ కవులను సన్మానముచేయు జమీందారులు, పోషకులు రానురాను అంతరించిపోయిరి. కవి ఒకరిని ప్రశంసచేయుటకుగాని, ఒకరిని తృప్తిపఱచుటకుగాని రచనలుచేయుట మానివేసినాడు. తన కవిత్వము తనయానందముకొఱకు; తనగ్రంథరచనము తనసంతోషముకొఱకు; అనగా సాహిత్యమునకు ఒక ప్రయోజనము ఆశించలేదు. సంఘశ్రేయస్సుకొఱకు విశ్వశ్రేయస్సుకొఱకు కావ్యరచన జరుగవలెనను ప్రధానలక్ష్యము కవులకు సాహిత్యవేత్తలకును మరింత ముఖ్యమైనది. సాహిత్యమునకు సాంఘికప్రయోజన ముండవలెననియును, యీ రచనలవలన ప్రజలలో చిత్తసంస్కారము రావలెననియు ఒకభావవిప్లవము తేవలెననియు క్రొత్తఆశయము ప్రచారములోనికి వచ్చినది. ఈ లక్ష్యముతో నూతనరచయితలు తమరచనలుచేయుటకు ప్రయత్నముచేసిరి. ఈ ప్రయత్నముచేసినవారే హెచ్చుగా నుండిరి. సాహిత్యమునకు రససిద్ధితోపాటు ప్రకృతి ప్రయోజనము కల్పించిరి.

క్షీణించుచున్న జమీందారీ వ్యవస్థతోపాటు, అంతరించిపోయిన సామంతవర్గముతోపాటు వారినాశ్రయించుకొన్న వందిమాగధులవంటి పండితవర్గమును, కవులును అంతరించిపోయిరి. శృంగారలాలసులు, భోగప్రియులు అయిన పోషకుల అభిరుచులను తృప్తిపరచవలసిన అవసరము పోయినది. కొందరిదృష్టి ఆధ్యాత్మిక

చింతనవైపు, మరికొందరిదృష్టి విజ్ఞానశాస్త్ర పరిశోధనవైపు మరలినది. మన ప్రాచీనశాస్త్రములలోగాని ఆధునిక పాశ్చాత్య విజ్ఞానములోగాని నిజము తెలిసికోవలెనను జిజ్ఞాస ప్రబలినది. అంతవరకు మన దేశసంప్రదాయములకు, తత్వశాస్త్రమునకు, విశ్వాసములకు భావచింతనలకు విరుద్ధమైన విజ్ఞానముతో, సంస్కృతితో సంపర్కము కలిగినది. పాశ్చాత్యవిద్య మనలో వివేచనా దృష్టిని సత్యాన్వేషణాసక్తిని కలిగించినది. మన ఆలోచనలు మారిపోయినవి. ఏదయినను, విస్సన్న చెప్పినదే వేదముగా విశ్వసించు రీతి పోయి, తర్కవితర్కములతో తర్జనభర్జనచేసి ప్రత్యక్ష ప్రమాణములకు నిలిచిన సత్యమునుకాని నమ్మరాదను చైతన్యము మనలో కలిగినది. దీనికి విరుద్ధముగానున్న భావములను, ఆచారములను తీవ్రముగా విమర్శించుటకు మనవారు వెనుదీయలేదు. తరతరాలుగా, యుగయుగాలుగా మనలో మనసంప్రదాయములలో స్థిరపడిన మూలస్తంభాలు కదలిపోయినవి. మతవిశ్వాసములను పునాదిమీద నిర్మించిన మన సంస్కృతిశిఖరములు కూలిపోయినవి. వానిపైన శాస్త్రము, చింతన, మానవత, సత్యము అను క్రొత్తపునాదులపైన క్రొత్తకోవెలలు కట్టుకొన్నాము. ఈ నూతన దేవాలయనిర్మాణమునకు పునాదులు 19వ శతాబ్దిలో పడి, ఆ శతాబ్ది చివరభాగములో నిర్మాణము ప్రారంభమై ఒక రూపముకూడ యేర్పడినది.

మన ప్రాతనమ్మకములను పడద్రోయుటకు పాశ్చాత్యవిద్య, అన్యమతప్రచారమువంటివి కొంత పనిచేసినవి. ఇంతలో తిరిగి భారతీయసంస్కృతికి మరొక ఉత్కృష్టగౌరవమును కలిగించుటకు మఱికొందరు పాశ్చాత్యవిద్వాంసులు తోడ్పడిరి. వారు మనగ్రంథములు సేకరించిరి; వాని నధ్యయనముచేసిరి; అందలి క్రొత్తఅందములను కనుగొని వానిని తిరిగి మనకు పరిచయముచేసిరి. ఈ పునఃపరిచయముతో మనసంప్రదాయములయెడల మనసాహిత్యముయెడల, మన సంస్కృతియెడల మనయభిప్రాయము విలువ మారినది. ప్రాతనీరు పోయి, క్రొత్తనీరు వచ్చినది. ఇదియే మన సాహిత్యక్షేత్రమున జరి

గిన నూతనాలయనిర్మాణము. అట్టి పునర్దర్శనములో మన సాహిత్యము, భాష, కావ్యప్రపంచము నవీనకాంతులతో గోచరించినవి. ఈ సాహిత్యము నూతనప్రయోగములతో మనలను కొంత దిగ్భ్రాంతులనుచేసినమాట నిజమే. క్రొత్తలో మనకనులను మిఱుమిట్లు గొలిపినది. పాశ్చాత్యభావసంఘర్షణముతో మన ప్రాచీనభావములకు ఒక విలువ పెరిగినది. ఆ విలువలు గుర్తించుటకు క్రొత్త గీటురాళ్ళు కావలసివచ్చినవి. మేలిమిబంగారుతో క్రొత్త పోతలుపోసి, చికిలీసేతచేసిన క్రొత్తనగలు మనము చేసికొన్నాము. దీనికి నమూనాలు మనకు విదేశీసంప్రదాయములనుండి వచ్చిననుసరే. విదేశములనుండి తెచ్చిన సాహిత్యబీజములు మన ప్రాతనేలలలో వేసి క్రొత్తనీరుతో తడిపి, మడులుకట్టి, పూవులు, కాయలు కాసి ఫలించునట్లు చేసికొన్నాము. దీనితో మన సాహిత్యవిధానమే మారిపోయినది. కాని భూసారము మారిపోలేదు. ప్రాతరకపు పైరులును వేయుచున్నాము; క్రొత్తరకపుపైరులను వేయుచున్నాము. సాహిత్యక్షేత్రములో జరిగిన యీ నూతనకృషి తెనుగు దేశమునకు పేరు హెచ్చింపచేయునదికాని, తగ్గింపజేయునది కాదు.

## ఎవరు యుగకర్త?

1800నుండి 1900వరకు ఉన్న శతాబ్దికాలము తెనుగు సాహిత్యములోనేగాక, ఇరుగుపొరుగు దేశిసాహిత్యములలోకూడ ఇట్టి క్రొత్తవ్యవసాయము జరిగినట్లు గమనించినాము. కాని యితర భాషలలో ఈ నూతనయుగోదయమునకు ఆ యా భాషలలో ఎవరో యొకరిని యుగకర్తగా పేర్కొని ఆతడు తెచ్చిన నూతనసంస్కరణములను సంస్మరించుచుందురు. తెనుగుసాహిత్యము విషయములో మాత్రము ఇట్టి యుగపురుషు డెవరనునది ఇంతవరకు తేలలేదు. 19వ శతాబ్దిలో వచ్చిన వాఙ్మయము నికృష్టతరగతికి చెందినదనువారున్నారు. గేయరచనలు, యక్షగానములు, వచనవాఙ్మయము అసలు సాహిత్యమేకాదు పద్యవాఙ్మయమే వాఙ్మయమనువా

రున్నారు. పద్యములనే అభిమానించువారున్నను ఈ కాలమున వచ్చిన ప్రబంధరచనలు, ద్విపదలు, శతకములు, చాటువులు, అనేకార్థకావ్యములు, ఆశుకవిత్వములును ఉత్తమకవిత్వము కాదనువారున్నారు. ఇది యిట్లుండగా, 19వశతాబ్ది ఆరంభమునుండియును నాలుగైదుదశలుగావచ్చిన సాహిత్యపరిణామమును గమనించినచో కొందరు మహాపురుషులు, క్రొత్తప్రయోగములుచేసినవారు కనిపింతురు. అట్టివారిలో యుగారంభమున జీవించియున్న ప్రముఖులలో త్యాగరాజు మనదృష్టికి ధ్రువతారగా కనిపించును. త్యాగరాజు రచనలను సాహిత్యముగా పరిగణించు సాహిత్యవేత్తలు అంతగా లేరు. అయినను తెనుగుభాష పలుకుబడిలో, తేనెలోనిండిన యీ పుట్టనుండి తీయదనములను పిండుటలో యీ మహాపురుషుడు సాధించిన విజయము నిరుపమానము. కవిత్వము భావతన్మయత్వమును ప్రకటించు సాధన, అన్నచో యీ సాధన త్యాగరాజునకు ఉపయోగించినట్లు మరియెవ్వరికిని ఇంత దివ్యముగా ఉపయోగించలేదు. భావము, రాగము, శక్తి భక్తి, జ్ఞానవైరాగ్యములకు తన సంగీతములో తనసాహిత్యములో సామరస్యముకల్పించి ఒక ముక్తిమార్గము నాదేశించెను. హృదయోన్ముక్తమైన భావలత్వముతో సౌందర్యసాధనయే కవిత్వమైనచో, జీవితవిమర్శనమే కవిత్వమైనచో రసాత్మకమైన వాక్యము కావ్యమైనచో త్యాగరాజు కవి; అతడు రచించినవి మహోత్తమకావ్యములు. త్యాగరాజు తన సంగీతరచనలతో స్వరశాస్త్రములో, సంగీతశాస్త్రలక్షణములలో స్వరబంధములుగామాత్రము నిలిచి రేఖలకు జీవస్వరములిచ్చి, మాటలిచ్చి, భావమిచ్చి, దానితో రసస్ఫూర్తికల్గించి ఒక అపూర్వసృష్టిచేసిన మహావ్యక్తి. 'జగమేలే పరమాత్మ, ఎవరితో మొఱలిడుదు,' అన్నపుడు పలుకుచున్నది ఒకపేదగాయకుడు కాడు, ఆభేరి రాగస్వరములలో విరిసిపోయిన ఒక స్వరమాలిక కాదు. 'నగుమోము గనలేని నా జాలి తెలిసి' యని పలవించు ఒక బెదురుగుండెఆక్రోశము. అది భక్తునిహృదయాంతరాళమునుండి పలికినది. నీలో నాలో అట్టి సన్ని

వేశములో మూగవోయిపడియుండు జాలిబ్రతుకు, ఆతనిచేత యెలుగెత్తి పలికించినది. నీవే తప్ప నితఃపరం బెరుగ అన్నట్లు పరమాత్మునిశరణుజొచ్చినది. ఇది విశ్వమానవతకు సంబంధించు అనుభవము. ఇది నిజమైన కవిత. ఇట్టికవిత త్యాగరాజులో గానమైనది; స్వరరూపముదాల్చినది. ఇట్టియాక్రోశమే నాడు వాల్మీకిమహాముని చేత ఒక హృదయవిదారకదృశ్యము చూచిన కార్పణ్యములో శాపము పెట్టించినది. శోకమై, శ్లోకమైనది.

మానిషాద ప్రతిష్ఠాంత్వమ్ అవధీః అగమ శాశ్వతీః సమాః
యత్ క్రౌంచ మిధునాదేకమ్ అవధీః కామ మోహితమ్

ఈ శ్లోకమే రామాయణసంగ్రహగాథయై శబ్దించినది. ఇట్టి పుణ్యశ్లోకులయిన కవులు యుగమున కొక్కరుమాత్రము పుట్టుదురు. త్యాగరాజు అట్టికోవలోనివాడు. మన విమర్శకులును, లాక్షణికులును ఆతనిని కవిగా గుర్తించిననేమి, గుర్తించకున్ననేమి, అతడు పరమయోగి, సర్వసంఘపరిత్యాగి, స్వరబ్రహ్మ - స్వరరాగ సుధారసపాయి.

ఈతనిని యుగపురుషుడుగా గుర్తించనివారు సామాన్యులను గుర్తింతురా ? కాని 1800 ఉదయించగానే మొదటిపాదములో అడుగుపెట్టిన విదేశీపండితులు, అధికారులు చేసిన సేవను ఎవ్వరును కాదనలేరు. మన దేశీసాహిత్యమును, సంస్కృతిని పల్లెపట్టులనుండి, పట్టణములనుండి, తాళపత్రములనుండి కవితకట్టలనుండి యుద్ధరించి కృషిచేసిన కల్నల్ మెకంజీతరువాత సుమారు 40 సంవత్సరములు తెనుగుదేశములో నుండి, తెనుగువారితో కలిసిమెలసి, తెలుగువారి సుఖదుఃఖములను పంచుకొన్న న్యాయమూర్తి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుదొర చేసిన యపారసేవ తెనుగువారు విస్మరించగలరా ? 1814 - 1855 వరకు ఆతడు తెనుగుగ్రంథములు ప్రకటించి, తెనుగులో స్వయముగా నూతనరచనలుచేసి కథలు కావ్యముల వంటివి ఆంగ్లభాషలోనికి అనువాదముచేసి, పదములు, శబ్దములు ప్రయోగములును సేకరించి నిఘంటువులు తయారుచేసి, వ్యాకరణ

ములను రచించి, ఎంతో మహోపకృతి చేసినాడు. ఆతడు సేకరించిన గ్రంథములు 2440 వ్రాతప్రతులకు మించియున్నవట.

సి. పి. బ్రౌను తెలుగుభాష అభివృద్ధికి చేసిన కృషివలననే ఆధునికకాలములో ఈ సాహిత్యమునకీ ప్రతిపత్తులు కలిగినవని ఎ. హెచ్. ఆర్డెన్ వ్రాసిన ఒకవ్యాకరణములో తెలిపెను.

బ్రౌనుదొరచేసిన యీ యుపకృతికి ప్రతిగా తెనుగువారీతనిని యుగోదయకర్త యని చెప్పవచ్చును. అంతటి కృతజ్ఞత తెనుగువారిహృదయములో లేదు. అందుచేత బ్రౌనుదొరను యుగకర్తగా ఎవ్వరును ఒప్పుకోలేరు. అయినను మన 19వ శతాబ్ది పూర్వార్థములో బ్రౌనుదొరగారిప్రభావము సమస్త సాహిత్యప్రక్రియలందునను కనిపించుచునేయుండును.

అర్థశతాబ్ది దాటినది. యుగోదయము మరొక మలుపు తిరిగినది. మరొక యుగపురుషుడు సాహిత్యనవోద్యమమునకు కర్తగా ఏతెంచెను. ఆతడు భాషానుశాసనకర్త; వచనరచనాధురీణుడు, నిఘంటుపదసేకరణకుశలుడు, అధ్యాపకుడు, అనువాదకుడు, పండితుడు, కవి పరవస్తు చిన్నయసూరి. 1857లో మద్రాసువిశ్వవిద్యాలయముస్థాపనము, మద్రాసుపాఠ్యపుస్తకసంఘస్థాపన, వీనితో నూతనగ్రంథప్రచురణములకు దోహదముచేసెను. అంతవరకు పరిపరివిధముల పఱతెంచుచున్న భాషాప్రయోగములకు లక్షణముకల్పించి అతిసులభమైన బాలవ్యాకరణము రచించెను. నాటికి నేటికి తెనుగునకున్న వ్యాకరణదీప మదియే. చిన్నయసూరి నీతిచంద్రిక నిలువకపోవుగాక, నిఘంటువు పైకిరాకపోవుగాక, శబ్దానుశాసనములు నిలువకపోవునుగాక; అనువాదగ్రంథములు లెక్కలోనికి రాకపోవచ్చును. తెలుగునకు తొలివ్యాకరణము రచించిన ఆంధ్రవాగనుశాసనుడు; నన్నయభట్టు ఆంధ్రశబ్దచింతామణి తరువాత, అంతకంటె సులభమైనవ్యాకరణము చిన్నయసూరి విరచితమైన బాలవ్యాకరణమే. సంస్కృత హిమగిరిశిఖరములపై తపస్సుచేసి శంకరునికృపచే, తెనుగువచన గంగావతరణమునకు కారకుడైన చిన్నయ

సూరి, నిజముగా భగీరథుడే! ఆయనతరువాత మరెన్ని వ్యాకరణ ములువచ్చినను చిన్నయసూరి బాలవ్యాకరణమును మించలేవు. అంతక్లుప్తముగా సూత్రప్రాయముగా చెప్పినవి లేవు. అదిగాక నీతి చంద్రిక గ్రాంథికవచనరచనకు ఒక ఒరవడియందురు. ఈ రెండు కారణములచేత చిన్నయసూరిని కొందరు యుగకర్త అందురు. సృజనాత్మకమైన సాహిత్యరచనచేయకపోవుటచేత, చిన్నయసూరి యీపదవికి తగడని మరి కొందరిమతము. చిన్నయసూరితరువాత యుగకర్తలనదగినవారు తిరుపతి వేంకటకవులు. వీరు ప్రబంధయుగమునకు భరతవాక్యమును, నవీనయుగమునకు నాందిని పాడి, రెండు యుగములమధ్య ఒక వంతెనవంటివారని ఒక తరగతి విమర్శకుల యభిప్రాయము. ఈ యభిప్రాయముతో చాలమంది ఏకీభవింతురు తిరుపతి వేంకటకవులు ప్రాచీనపద్ధతి ప్రబంధములు చెప్పిరి; పురాణములను అనువదించిరి; చాటువులు చెప్పిరి; శతకములు చెప్పిరి; ఆశుకవిత్వప్రదర్శనముచేసిరి. నానారాజ సందర్శనముచేసి సాహిత్య దిగ్విజయయాత్రలు చేసికొనివచ్చిరి. వారిపరంపరగా ఎందరినో శిష్యప్రశిష్యులను తయారుచేసిరి. అందులకే వీరి శిష్యులలో ఒకరైన విశ్వనాథ సత్యనారాయణగా రిట్లు నుడివిరి.

> "తనయెదయెల్ల మెత్తన కృతిప్రతిపద్యము నంతకంటె మె
> త్తన తనశిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
> త్తనయయి శత్రుపర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేం
> కన గురువంచు చెప్పికొనగా నది గొప్ప తెలుంగునాడునన్॥

కాని వీరికవిత్వములో నూతనపద్ధతులుగాని, భావములుకాని అలవడలేదు అనువారున్నారు. అయినను - వీరుచేసిన రచనలెల్ల ఉపజ్ఞామహిమను గలిగి, సరళసుందరశైలిచే మనోహరములై, నవీన కాలమును, సంఘమును చిత్రించుటకు వలయు కావ్యభాషను క్రొత్త తరము కవులకు సృష్టించి యొసగెను" "వీరు కవిత్వాన్ని ఒక్క ఉద్యమంచేశారు; వీరివిద్యాకుటుంబము చాల విస్తరించియున్నది." ఈప్రశంసలచేత పలువురు వీరి కవితామహోద్యమమును ప్రశంసచేసి

యుండుటచేత ఇది తిరుపతి వేంకటకవులయుగమని 19వ శతాబ్ది చివరిపాదమును పిలుచువారున్నారు. అదికూడ అంతగా సముచితము కాదని ఆక్షేపణ తెలుపు విమర్శకులు లేకపోలేదు. తిరుపతి వేంకటకవులు యుగకర్తలయినను కాకపోయినను 19వ శతాబ్ది చివరిభాగమున ఆవరించిన పెనుచీకటులమధ్య విరిసిన వేగుచుక్కలలో ఒకరనుటకు సందేహములేదు. వీరు యుగప్రవక్తలనిగాని, యుగనిర్మాతలని కాని చెప్పుటకు నూతన కావ్యమహోద్యమములను వీరు సాహిత్యప్రకృతులలోగాని, భావములోగాని, భాషలోగాని తేలేదని చెప్పిన చాలునేమో. ఆంధ్రదేశమున సను స్త్రాంతములజనముల భక్తిగౌరవములను, అభిమానసమాదరములను అందుకొని కింకపీంద్ర ఘంటాపంచాననులై కాలుపెట్టినచోట కనకాభిషేకములు చేయించుకొన్న కవితల్లజులనుటకు ఏసందేహమును ఉండకూడదు. కవితాలతాంగి కాలిగజ్జెల ఘులంఘులలతో కళ్యాణకింకిణి మ్రోయించిన కవిద్వయము తిరుపతి వేంకటకవులు.

వీరితరువాత, 19వ శతాబ్ది కంతటికిని నవయుగోదయభానుడని, గద్య వాఙ్మయబ్రహ్మయని, గద్యతిక్కనయని పలువిమర్శకులు చూపుచున్న బహుముఖ ప్రజ్ఞానిధి కందుకూరి వీరేశలింగం పంతులు. పట్టినదిబంగారముచేయు పరుశవేది వారి సాహిత్యహస్తములలో నున్నది. అందుచేత అనువాదములుచేసినను, స్వతంత్ర రచనములు చేసినను, నూతన కావ్యప్రక్రియలలో ప్రయోగములు చేసినను పూర్వమార్గముల ననుసరించినను వీరేశలింగంపంతులు ఒకమహోన్నత సృష్టిచేసెను.

వీరేశలింగంపంతులుగా రానాటి యుగపురుషుడు. తెనుగు వారి ఆశయములు, ఆదర్శములు, లక్ష్యములు, లక్షణములు, కోరికలు చేరికలు పూర్తిగా ప్రతిబింబింపచేయు యుగప్రతినిధి. వీరేశలింగం తెనుగువారి సంస్కరణోద్యమమునకు, రాజకీయలక్ష్యములకు, ఆర్థికస్వామ్యపథమునకు, స్వతంత్రభావములకు, ప్రజాస్వామ్యహక్కులకు ప్రాతినిధ్యమువహించి పోరాడిన మహాపురుషుడు. ఆయ

నకు దృష్టిలో స్త్రీపురుష భేదములు, పేదసాదతరగతులు, అగ్రనీచ కులభేదములు లేవు. అందరును సమానులే. ఈశ్వరునిపుత్రులు. అందరికిని దేవుని ప్రేమ పంచుకొనుటకు హక్కున్నది. సంఘములో తక్కువగా, అథమురాలిగా చూచిన స్త్రీకి యీ యాచారశృంఖలల నుండి విముక్తికలిగించినారు. భాషలో, భావములో, విప్లవము తెచ్చిన ఉద్యమనాయకుడు. సంఘముతో, దురాశాపరులతో, దుష్ట ఛాందసులతో దుర్దమసంఘర్షణసాగించి, మానప్రాణహానికి వెలి వక నిలిచిన కర్మయోగి. ధర్మక్షేత్రే కురుక్షేత్రే యనునినాదముతో శ్రీకృష్ణునివలె కర్మయోగమును తెనుగుపార్థునకు ఉపదేశముచేసిన యీ మహావ్యక్తి యుగకర్తకాక మరెవ్వరు కాగలరు?

వీరేశలింగకవియుద్యమము ఆయనతోడనే గతించిపోయినది. సాహిత్యము సంస్కరణసాధనగా, విప్లవచర్యగా విమర్శకహేతిగా వినియోగించుకొనుట వీరేశలింగం తరువాత మరియెవ్వరికిని చేత కాకపోయినది కావున యీతడు యుగకర్త కాడనువారున్నారు. అంతేకాక పంతులుగారు గద్యవాఙ్మయమున కృషిచేసిరికాని, సాహిత్యములో రసప్రధానమైన పద్యవాఙ్మయములోచేసిన కృషి వారికీ యుగకర్తపదవిసిద్ధింపజేయదనువారున్నారు. అట్లయిన ఇంకను చివరికిపోయి మరొక యుగపురుషుని ఎన్నికచేయవలసియున్నది. 19వ శతాబ్ది చివరిపాదములో దేశములో భాష, వాఙ్మయము అవ్యవస్థలోనున్నవి. అట్టి సమయములో ప్రాచ్యపాశ్చాత్య వాఙ్మయములోని సారమంతయు నాకళించి స్వతంత్రముగా నాలోచించి తత్త్వజిజ్ఞాసచేయుచున్న మహావ్యక్తి ఉద్భవించినాడు. ఆయన గురజాడ వేంకటఅప్పారావుగారు. ఆకాలములో ప్రబలిన అవ్యవస్థతొలగించుటకు గురజాడవారు నూతనభావములను ప్రసారముచేయుటకే కాక నూతన తత్త్వప్రచారమునకు అనువయిన భాషనుకూడ నిర్ణయించుకోవలసివచ్చెను. తన రచనాపద్ధతిలో పరిణతిదాల్చిన ఒక ప్రత్యేకత అలవరచుకొన్నతరువాత గురజాడ నాటకము, కథ, ఖండకావ్యము మొదలైన నూతన వాఙ్మయరూపములను చేపట్టి,

చేసిన చిన్నకృషిలోనే అత్యద్భుత ప్రతిభచూపించినాడు. ఆయన కూడ వీరేశలింగముగారివలె సంఘసంస్కారి. కులమతభేదములను ఆమోదించలేదు. సంఘమునకు ఎదురీదిన విప్లవకారి.

ఎంచిచూడ ప్రపంచమందున
మంచిచెడ్డలు రెండుకులములు
మంచియన్నది మాలఅయితే
మాల నే నవుదున్—— అన్నారు.

కవితారచనలలో ముత్యాలసరమను నవీన సృష్టిచేసి, అంత వరకు కావ్యప్రపంచమున ఎవ్వరును చూడని క్రొత్తసొగసులు చూచినాడు. పూర్ణిమగూర్చి, కన్యకగూర్చి, లవణరాజుకలగూర్చి ఆయన గానముచేసెను. భావము క్రొత్త, చెప్పుతీరు క్రొత్త, భాష క్రొత్త. నవ్యాంధ్రసాహిత్యప్రవర్తకుడుగా గురజాడరచనలలో గోచరించు యుగప్రభావము దేశభక్తి.

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్

అని నూతన యుగోదయశంఖము పూరించి "ఈసురోమని మనుషులుంటే, దేశ మెట్టుల బాగుపడునోయ్" అనిప్రబోధముచేసి దేశీయులను కర్మవీరులుగా కావ్యరంగమునకు దుముకునట్లు చేసిన కావ్యవాది. "తెలుగు భాషాసాహిత్యాలతో దాదాపు అరశతాబ్దం పాటు అవిరళంగా కృషిచేసి, తను కన్నవీ విన్నవీ, అనుభవించినవీ ఎన్నో సన్నివేశాలను సమ్యగ్దృష్టితో తనరచనలలో ప్రతిఫలింపజేసి, తనస్థాయిని అందుకోలేని సమాజంలో ఆందోళనపడుతూ కూడా సహజమైన సౌజన్యాన్నిగాని స్వారస్యాన్నిగాని కోల్పోని మొక్కవోని దీక్షతో తనసాహితీలక్ష్యసాధనకోసం తపించిన మహాపురుషుడు ఈయన"—అబ్బూరి రామకృష్ణారావు.*

*(తెలుగుభాషాసమితి-సంస్కృతిసంపుటములో 1097-98పుటలో)

ఈయన సాహిత్య మొక యుగసంధిలో వచ్చినందున 19 వ శతాబ్దిలో యీాయన ప్రభావము పొడసూపినదనుటకు వీలు లేదు. రానున్న నవ్యసాహిత్య మహోదయమునకు గురజాడ అప్పా రావుగారు వైతాళికులేకాని 19 వ శతాబ్దికి యుగకర్తలు కారేమో అని కొందరి యభిప్రాయము.

తమ సాహిత్యప్రభావమును 19 వ శతాబ్దిపైన ప్రసరింపజేసి నను చేయకున్నను, 19 వ శతాబ్ది అంతముగులోపున జన్మించిన మహనీయులలో అనేకులు తరువాతవచ్చిన నవ్యసాహిత్య వికాసము నకు తోడ్పడినవారలే. అట్టివారిలో అగ్రగణ్యులు గిడుగు రామ మూర్తిపంతులుగారు. కృతక, వ్యావహారిక భాషావివాదములో సహజమైన జీవత్ భాషకు ప్రాముఖ్యమిచ్చి వ్యాకరణకర్తల స్వార్థ సూత్రబంధనములనుండి తెలుగు భాషాసరస్వతిని విముక్తిచేసిన గిడుగుపిడుగు మహోత్తమసేవ తెనుగుసాహిత్యము చిరస్థాయిచేసి కొన్నది.

వారితరువాత నూతనకవిత్వభావములతో ప్రకృతినారాధిం చినకవులైన కట్టమంచి రామలింగా రెడ్డివంటివారు, ఖండకావ్యముల లోని - ప్రకృతికవితకు నాంది పలికిరనవచ్చును. కవితారచనలో గద్యరచనలో నవీనవిమర్శలో క్రొత్తమార్గములు త్రొక్కిన రెండు రచనలును 19వ శతాబ్ది భరతవాక్యముపాడుటకు ముందుగానేవచ్చి నాటి తెనుగుసహృదయులలోవిభ్రాంతికల్పించినవి. ఆ రెండుగ్రంథము లును కట్టమంచిరామలింగా రెడ్డిగారి కథాకావ్యము ముసలమ్మ మర ణము, నూతనవిమర్శగ్రంథము కవిత్వతత్త్వవిచారము. ఈ రెండు గ్రంథములును 19వ శతాబ్ది సాహిత్యచైత్రయాత్రలో గమ్యస్థానము నకు కొనిపోవునుకాని నవీనమార్గములో కనిపించు దీపస్తంభముల వంటివి మాత్రమగును. ఇవి నవ్యసాహిత్యచరిత్రలో శాశ్వతస్థానము నందుకొన్నవి. వీటిరచయిత కట్టమంచి రామలింగా రెడ్డిగారు. సాహిత్యరంగములో యుగకర్తయనుటలో చాలమంది యంగీక రించక తప్పదు.

ఏదియెట్లయినను, తెనుగులో అందరును అనుయాయులే కాని వారికి ప్రముఖనాయకుడు లేడనువారికి యీసింహావలోకనము కొంతనిజమును వెల్లడించిన ఈ ప్రయత్నము ఫలసిద్ధికాంచినట్లు భావింతుము. ఆధునిక కవిత్వమున ప్రతిధ్వనులేకాని ధ్వనులులేవని కొందరిభావన.

ఈ సింహావలోకనములో – 20 వ శతాబ్దిలో నవీనమార్గము ననుసరించిన కవులప్రసక్తి లేదు. 19 వ శతాబ్ది పూర్తియగుటకు ముందు జన్మించిన కవులపైన 19 వ శతాబ్ది ప్రభావము అంతో యింతో పనిచేసియైనఉండవచ్చును. కావున వారు నూతనపథములో నూతనకాంతులు వెదుకుకొననక్కరలేకుండనే ఒక సుందర తేజః కిరణములను ముందే కనుగొన్నారు. అదియొకతొలిసంజ. రానున్న సూర్యోదయములోని ఉషఃకిరణాలు ప్రసరించి అంతవరకు అలమి యున్న చీకటులను తరిమివేసినవి.

తూర్పు బలబల తెల్లవారెను.

"ప్రాచీనంలోనే యుగపరంపరగా విస్పష్టమైన మార్పులు కలుగుతూ వొచ్చినపుడు, ఈనాడు, ప్రతిదేశములోని విజ్ఞానమూ, ఏ దేశంలో ఏ వ్యక్తికైనా యింతసులభంగా అందుబాటులోనికి వొస్తూవున్నప్పుడు ఆధునిక సారస్వతంలో కలిగిన మార్పుకన్న రాదగిందే యెక్కువ ఉన్నదేమో అనిపిస్తూవుంది." 1935లో ముద్దుకృష్ణ వైతాళికులకు పీఠికముగించుచు పలికినమాటలు 19వ శతాబ్దికి భరతవాక్యముగా చెప్పిన సముచితముగా నుండునేమో !

19వ శతాబ్దిచివర ఒక తెరపడినది. అందు చీకటితెరలలో మెలగిన ఉషఃకిరణములు తదనంతరము రానున్న నవోదయమునకు ప్రాంజలి ఘటించినవి. ఈ యుదయము – మహోదయముగా పరిణమించి సాహిత్యరంగమునంతను తేజోవంతము చేయుచున్నది. బాలభాస్కరుడు మధ్యాహ్నమార్తాండుడై చండకిరణములను ప్రసరించినాడు. 20వశతాబ్ది అర్ధభాగమున ప్రొద్దువాలినది. క్రమక్రమముగా సాహిత్యగగనేందిర సువర్ణకాంతులతో శోభింపబోవుచున్నది. ఈ

యరుణకిరణములను అలముకొనకమున్నే, 19వ శతాబ్ది కడసంజలో పొడసూపిన తొలిరేకల తెలివి యెట్లు తెల్లవారినదియును సింహావలోకనము చేసికొనవలయును. ఈ సమీక్షలో మన విజ్ఞాననేత్రమునకు సాక్షాత్కరించునది, తెనుగుసరస్వతీ కటాక్షమే. ఈ యుషః కిరణములలో మన కింతవరకు దర్శనమిచ్చినది తెనుగుసాహిత్యసరస్వతి అనన్యగ్రస్వరూపము మాత్రమే. ఆమె విశ్వరూప సందర్శనమపేక్షించు సహృదయులు మరింత శ్రద్ధాభక్తులతో మరింత చక్షుస్ఫూర్తితో, మరింత సమ్యగ్దృష్టితో నామెను సమీపించవలయును.

ఈ గ్రంథమునుపరికించినచో ఒక్క విషయముస్పష్టమగును. 19వ శతాబ్దిలో సాహిత్యసృష్టిచేసిన గ్రంథకర్తలు తమ సమకాలికుల వలన తీవ్రవిమర్శలకు గురిఅయినను ఒక విశ్వాసముతోడను ఆశాభావముతోడను తమరచనలు చేసినారు. వారుకూడ భవభూతివలెనే ఇట్లు తలంచియుందురు.

> ఉత్పత్స్యతే మమతుకోపి సమానధర్మా
> కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ

సమాప్తి

## ఈ గ్రంథరచనలో నాకు తోడ్పడిన గ్రంథములు

ఆధునికాంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహము - జయంతి రామయ్యపంతులుగారు
ఆంధ్రకవితరంగిణి - శ్రీ చాగంటి శేషయ్యగారు
ఆంధ్రకవులచరిత్రము - కందుకూరి వీరేశలింగముగారు
ఆంధ్రరచయితలు - మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు
ఆంధ్రవచనవాఙ్మయము - నిడదవోలు వేంకటరావుగారు
ఆంధ్రవాఙ్మయచరిత్రము - వంగూరి సుబ్బారావుగారు
ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము - డా. దివాకర్ల వేంకటావధానిగారు
ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము - కవిత్వవేది
ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము - ఖండవల్లి లక్ష్మీరంజనముగారు
ఆంధ్రవాఙ్మయసూచిక - కాశీనాథుని నాగేశ్వరరావుగారు
ఆంధ్రదర్శిని - విశాలాంధ్ర ప్రచురణ
ఆంధ్రాలంకారవాఙ్మయచరిత్రము - బులుసు వేంకటరమణయ్యగారు
ఆంధ్రులసాంఘికచరిత్రము - సురవరము ప్రతాపరెడ్డిగారు
Biographical sketches of deccan poets - కావలి వేంకటస్వామి గారు
ఆంధ్రవాగ్గేయకారులచరిత్రము - బాలాంత్రపు రజనీకాంతారావుగారు
శతకవాఙ్మయసర్వస్వము - వేదము వేంకటకృష్ణశర్మగారు
నా జీవితకథ - నవ్యాంధ్రము - అయ్యదేవర కాళేశ్వరరావుగారు

భారతి, కిన్నెర, పరిశోధన, స్రవంతి మున్నగుపత్రికలు,

కల్నల్ మెకంజీ కైఫీయతులు, బ్రౌనులేఖలు, కైఫీయతులు స్రవంతిలో డా, కొత్తపల్లి వీరభద్రరావుగారు పాశ్చాత్యులుచేసిన భాషాసేవయను రెండు వ్యాసములు.

భారతిలో కోరాడ రామకృష్ణయ్యగారి వ్యాసములు

స్రవంతిలో ప్రథమాంధ్రనాటక కర్తలు అనుపేరున శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు రచించిన నాలుగు వ్యాసములు

ఆంధ్రజానపదగేయవాఙ్మయము - డాక్టరు బి. రామరాజుగారు

తెలుగుభాషాసమితివారి సంస్కృతిసంపుటమున పలువురు ప్రముఖుల వ్యాసములు.

కవిత్వతత్త్వవిచారము : కట్టమంచి రామలింగారెడ్డిగారు
ముసలమ్మమరణము : కట్టమంచి రామలింగారెడ్డిగారు
నవ్యాంధ్రసాహిత్యవీధులు - కురుగంటి సీతారామయ్యగారు
గౌతమవ్యాసములు - పింగళి లక్ష్మీకాంతముగారు
గోలకొండకవులసంచిక - సురవరము ప్రతాపరెడ్డిగారు
ఆంధ్రసర్వస్వము - మాగంటి బాపినీడు, డా, గిడుగు సీతాపతిగారు సంపాదించినది

ఈ గ్రంథకర్తలకును, వ్యాసకర్తలకును, ఇంకను పలువురు సాహిత్యసమీక్షకులకును నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

# మ న వి

ఈ గ్రంథరచనలో వాడినభాష శిష్టవ్యావహారికమైన [illegible]కము. అయినను అరసున్నలు, శకటరేఫలు, పరుషసరళాదేశములు, ద్రుతసంధులు మొదలయినవి పాటించినట్లు తోచదు. కొన్నిచోట్ల విసంధులు, మరికొన్నిచోటుల యడాగమములు ఎంత జాగ్రత్తగా చూచినను కొన్ని అచ్చుతప్పులును లేఖనాప్రమాదములును, చ్యుత సంస్కృతులును మిగిలిపోక తప్పలేదు. అవి గ్రంథకర్త బుద్ధిపూర్వక ముగా విడిచిపెట్టిన ప్రమాదములు కావనియును, ఒప్పుతప్పరయు రసజ్ఞులయిన పాఠకులు సహృదయతతో స్వీకరింతురనియును మా విశ్వాసము.

పరికాశకులు

శ్రీ చింతలపాటి వెంకటసుబ్బయ్య గారిచే
బహూకరింప బడినది.